ఆంధ్రపత్రిక - [illegible] సంవత్సరాది సంచిక

ఈ పత్రికలో మీకు ఆనందము ఇచ్చేది

# మరికొళుందు

## సెంటుయొక్క రమ్యమైన సువాసన!

నేడే మనియార్డర్ ద్వారా రు. **1-50** పంపిస్తే **4** రకాల
కునేగా సాంపిల్ సెంటు పంపిస్తాం. (పోస్టేజి వేరే లేదు)

| | | 1 ఔ॥ | ½ ఔ॥ | ¼ ఔ॥ |
|---|---|---|---|---|
| కునేగా — | మరికొళుంగు | 10 00 | 5-25 | 2 75 |
| ,, | మిగత రకాలు | 9 00 | 4-75 | 2 50 |
| ,, | అత్తర్ | 21-00 | 11-00 | 6-00 |
| ,, | మొగిలి | 21-00 | 11-00 | 6-00 |
| ,, | స్వీటు | 15-00 | 8-00 | 4-50 |

*తపాలు ఖర్చు రు. 1-00 న్ను, 7% సేల్సుటాక్సును మనియార్డరుతోపాటు పంపాలి.*
*వి. పి. పి. పంపడము లేదు.*

[illegible]

53, LATTICE BRIDGE ROAD
ADYAR — MADRAS-20.


శ్రీ
శ్రీనివాస్
వాయిల్స్
లాన్స్
పింట్స్
పాప్లిన్స్
కర్షణ కలిగించు వస్త్రాలు
SN/C/23

# ఆంధ్రపత్రిక

## శుభకృన్నామ సంవత్సరాదిసంచిక

[ఏబదిమూడవ సంచిక]

**[1962 - 63]**

★

సంపాదకులు :

శివలెంక శంభుప్రసాద్



★

వెల రూ. 2

ఆంధ్రపత్రికా కార్యాలయమున ముద్రితము.

| సంచిక 53 | # శుభకృన్నామ సంవత్సరాది సంచిక | సంవత్సరము 1962-63 |
|---|---|---|

## విషయానుక్రమణిక



౮౦

### త్రివర్ణచిత్రాలు

తుంపికోట - శ్రీ [illegible] రావు; కపోతకుటుంబము - శ్రీ మాధవపెద్ది గోఖలే

ఏడవల రేవు - యం. కృష్ణనాయుడు; [illegible]

# ADVERTISER'S INDEX

# ప్రస్తావన

అనంతమైన కాలములో ఒక్క సంవత్సరమన్నది అత్యల్పమైనట్టిది. కాని కొన్ని అట్టి అల్పములైన సంవత్సరములు గడిచినచో శతాబ్దమగుచున్నది. అనగా అల్పములైన విషయములతో అనంతములైన విషయములు సందర్భపడుచున్నవి. ఆంధ్రపత్రిక ఉగాది సంచిక ఇప్పటికి ఏబదిరెండు ఏండ్ల క్రిందట నెలకొల్పబడి ఏ యేటి కా యేడుగా ఏబదిమూడవ సంవత్సరమున ప్రవేశించినది. ఈ అర్థశతాబ్దమునకుపైగా ఈ సంచిక ఆంధ్ర సాహిత్యాభివృద్ధియం దేమి, సమాజాభ్యుదయమందేమి, రాజకీయరంగములోనేమి ఆంధ్రుల మేధా సంపత్తికి అభివ్యక్తిని చేకూర్చుటలో వేదికగా సమకూడి యుండుటయందు నిర్వహించిన భూమికను మాకు మేమై చెప్పుకొనరాదు. ఆ విషయ మాంధ్రుల కందరికిని తెలియును.

దశమున కవిత్వమేమి, శిల్పమేమి, కాలమునకు వ్యాఖ్యానములవంటివని వేరుగా చెప్పవలసిన యవసరము లేదు. గతసంచిక అనంతరము అట్టి కాలములో పండ్రెండు నెలలు గడిచిపోయినవి. ఈ కాలములో సాహిత్యముననేమి, చరిత్రలోనేమి, ఇంకను ఇతర రంగములలోనేమి ఎన్నియో మార్పులు జరిగినవి. సాహిత్యములో నూతనకృషి జరుగుచున్నదిగాని దాని కింకను ఒక స్పష్టమైనరూప మేర్పడలేదు. పరివర్తనము చెందిన పరిస్థితులలో వ్యక్తి తన్నుతాను వెదికికొనుచున్నట్లే, సాహిత్యముగూడా తన్నుతాను వెదికికొనుచున్నది. సాంకేతికయుగము మన దేశమున గూడ ప్రారంభమైన కారణమువలన దానితోడికల్గు సత్ఫలితములు, దుష్ఫలితములు గూడ పొటమరించుచున్నవి. అవి ఇంకను ప్రస్ఫుటమగు పరిపక్వస్థితి ఏర్పడని కారణమున యుగసంధిలోవలె వ్యక్తి, అతనితోపాటు కాలమును, తమ ఉనికియొక్క ఆవరణమునుగూర్చి, అర్థమునుగూర్చి పునఃపర్యాలోచనము చేసికొనుట జరుగుచున్నది. విచిత్రమేమనగా ఈ సాంకేతికయుగావతరణము తెచ్చిన, తెచ్చుచున్న మార్పులు నిగూఢములై, జనుల జీవితముపై తమ ప్రభావమును చూపుచు, అందువలనకల్గు అనుభవమును మాత్రము వ్యక్తికి, కాలమునకు అందని పరిస్థితిని కల్పించుచున్నవి. అందువల్లనే కొందరు దానిని పరామర్శించక వ్యతిరేకించుటయు, కొందరు ఆ మార్పే అభివృద్ధియనుట జరుగుచున్నది. వారు అనభిజ్ఞులు. అభిజ్ఞులైన పండితులు, ప్రతిభావంతులయిన సాహితీపరులు ఈ సంధికాలపు రహస్యములను అవగతము చేసుకొని, వానిని సాహిత్యరూపమున వ్యక్తముచేయ కల్గుచో తెల్గుసాహిత్యము విధిగా మారాకుపాత్రగల్గు ననుటకు అభ్యంతర ముండవలసిన అగత్యము కన్పించుటలేదు.

రాజకీయముగాగూడ దేశములో మార్పులు వచ్చుచున్నవి. ఈ సంవత్సరమున జరిగిన ఎన్నికలలో కాంగ్రెసుపక్షము నెగ్గినను ప్రతిపక్షులుకూడ పూర్వముకన్న అధికముగా నెగ్గుట తటస్థించినది. ఇందులోగూడా కాలములోవచ్చిన మార్పు ద్యోతకమగుచున్నది. అది యేమనగా ఇది ఇట్లుజరుగునని చెప్పుటకు ఎవ్వరికి సాధ్యముకాకుండ నుండుటయే. ప్రజల మనస్సులలో వారికి తెలిసిగాని, తెలియకగాని సాంకేతికయుగావతరణమువలన కల్గిన పరివర్తనమునకు, తోచిన మార్పునకు ఇది చిహ్నము. రాజకీయవేత్తలలో కొందరు భవిష్యమున సుఖముననుభవించువారికొరకు త్యాగము చేయమనుచున్నారు. కొందరు భవిష్యసుఖమును సద్యఃసుఖముతో ననుసంధింపవలయుననుచున్నారు. సాంకేతికయుగావిర్భావమువలన దేశములో ఏర్పడిన భావఘర్షణముయొక్క స్వరూప మిట్లున్నది. ఇది పైకి కన్పించునట్టిది. దీనికి అంతరమున బహురహస్యములు, బహు చిత్తవృత్తులు, బహు మానసిక విపరిణామములు, పరిణామములు విద్యమానముకానిస్థితిలో నున్నవి.

వాని నావిష్కరించుటయు సాహిత్యవేత్తలయు, ఇతర మేధావులయు కర్తవ్యము. అట్లుచేయుట జాతికి, దేశమునకు ఆత్మావబోధమును కల్గించుటయగును. అందుకు కవి శబ్దవాచ్యులగుటకు సమర్థులైన ప్రతిభావంతులు పూనుకొందురుగాతమని, ఆంధ్రజాతీయ జీవనరంగమున మరియొక నూతనశకమునకు అంకురార్పణము చేతురుగాతమని ఆశించుచున్నాము.

తక్కిన పత్రికలకును, ఉగాది సంచికకును ఎన్నియో భేదము లున్నవి.

చాలపత్రికలు రస్కిన్ చెప్పిన Books of the hour వంటివి. సంవత్సరాది సంచిక ఆయనయే చెప్పిన Books of all Time వంటిది. తెలుగునాట ఏ రంగమున ఏమిపని జరిగినను, జరుగుచున్నను దాని కింగాలో సాహిత్యరూపమున స్థానము లభించుచున్నది. మరి తెలుగు చిత్రకళను పోషించుటయందు నిరంతరకృషిని చేయుటయు ఈ సంచిక చేయుచున్నది.

ఈ సంచికకు రాష్ట్రమునందలి ప్రసిద్ధ రచయితలు తమ రచనలను పంపి మాయందు తమకుగల అవ్యాజానురాగమును ప్రకటించిరి. అట్లే కొందరు నూతన రచయితలు గూడ తమ రచనలతో ఈ సంచిక నలంకరించిరి. వీరందరకు మేము ఈ సందర్భమున మా కృతజ్ఞతను తెలియజేయుచు, ముందుగూడ ఈ అాదరును మాయం దిట్టి ఆదరమునే చూపగలందులకు కోరుచున్నాము.

---

# పూచిన ముండ్లు

శ్రీ దాశరథి

(గజల్)

తోటలో, ఎలమావి పూవుల కోటలో
కంటికే కనరాని కోకిల పాటలో
నవవసంతము పొంగి వచ్చెను చూడవే!
పాడవే, మైమరచి నాతో ఆడవే!

వలపు కల వలె వచ్చినది నవవత్సరం
వయసు మనసుల హెచ్చినదిలే మత్సరం
మోదుగులు పూచినవి దీపజ్వాలలై
విరహిజనముల హృదయ తోరణ మాలలై

వెలదివలె మలయానిలమ్మదె వచ్చెను
గుండెలో క్రొవ్వాడి బాకులు గ్రుచ్చెను
పరిమళమ్ములు చిమ్మ నీ నిట్టూర్పులు
నాకు కలిగించినవి కన్నీర్ గార్పులు

ఎందుకే దూరాలలో నివసింతువు?
కానుపించిన యంతనే తలవంతువు?
సిగ్గుపరదా చుట్టివేసె వసంతుడు
బుగ్గపై ఒకచిటిక వేసెను కంతుడు

ముసలిలోకము యౌవనముతో పొంగెను
శిశిరరాక్షసుగుండె సాంతము క్రుంగెను
ముండ్లు కూడా పూలలాగా విచ్చెను
బాధలోనూ తీయదనమూ హెచ్చెను

నీవు విసరిన ఓరచూపుల బాణము
తీయనున్నది క్షణములో నా ప్రాణము
కండ్లలో మిన్నాగులెందుకు దాచువే?
విషముకురిసే చూపులేలా చూచువే?

నీవు నడచిన దారిలోనే నందనం
నీ పదమ్ముల క్రింది మన్నే చందనం
నీదు మేను పదారు వన్నెల కుందనం
నీకు లోకము సేయుచున్నది వందనం

నడచిరా ముంగ్గైన పూవులు పూయగా
కదిలిరా రాత్రైన రాగములీయగా
సాగిరా చీకట్లు వెన్నెల కురియగా
వేగిరా దుఃఖాల నవ్వులు విరియగా

ఎడదలో ముత్యాలమూటలు దేనికే!
కనులలో రత్నాలరాసులు దేనికే!
ప్రణయ భిక్షుకుదోసిటను పడవేయవే
మోముపై సౌభాగ్య రేఖలు వ్రాయవే

నాకు దొరికితివా కుబేరుడ నౌదును
నన్ను విడిచితివా కుచేలుడ నౌదును
నీవు మెచ్చిన నేను పెద్ద నవాబును
నీవు మెచ్చని నాడు పట్టి గరీబును

తెలుగు జగతికి నేడు కొత్త ఉగాదిలే
వలపుపూవులమేడ కిదియె పునాదిలే
కురియవే కరుణాకటాక్షము దండిగా
'దాశరథి' సుమనః కటాహము నిండగా

# కర్ణాటక సంగీతము: దాని భవిష్యత్తు

★ శ్రీ సంధ్యావందనం శ్రీనివాసరావు

కర్ణాటక సంగీతము అనుమాట వాడుకలో వచ్చినది. దక్షిణ భారత దేశములో వాడుకలోనుండి హిందూస్థానీ సంగీతానికి భిన్నంగా ఉంటూవచ్చిన పద్ధతికి కర్ణాటక సంగీతము అనవచ్చును. బ్రిటీషురాజ్య పరిపాలన, మొఘలు సామ్రాజ్యము ఆదిగా వెలసిన మహమ్మదీయ పరిపాలన భారతీయ సంగీతముపై పెద్ద మార్పుల తీసుకొని వచ్చినవి. కొన్ని వందల సంవత్సరములకు పూర్వమే కాళిదాస మహాకవి, వాల్మీకి, భాసుడు, శూద్రకుడు తమ కావ్యాలలో సంగీతవిద్య యొక్క ఉత్తమస్థితిని తెలుపు సందర్భాలను రమ్యముగా వర్ణించియున్నారు. భారతీయ సంస్కృతి ఎంత పురాతనమయినదో, ఈ సంగీత విద్య కూడా అంత పురాతనమయినది. భగవద్గీత, ఉపనిషత్తులు పురాణములు ఆసేతుహిమాచల పర్యంతము ఒక రీతిగా వర్తించుచున్నట్లు, సామవేదమునుండి సముద్ధరింపబడిన సంగీతము కూడా భారతదేశమున కంతకును వర్తించియుండెను. భరతముని నాట్య శాస్త్రము, శార్ఙ్గదేవుని సంగీతరత్నాకరము నేటికిని భారతదేశములో రెండు సంప్రదాయములకూ లక్షణములన్న సంగతి గమనింపతగినది. మహమ్మదీయులు తెచ్చిన అరబ్బీ, పారశీక దేశముల సంగీత రీతులను కలుపుకొని, ప్రత్యేకముగా, క్రొత్త క్రొత్త రచనలను, మార్గములను అనుసరించి కాలక్రమముగా ఉత్తర భారతదేశపు సంగీతము నేటి హిందూస్థానీ సంగీతముగా రూపొందినది:

దక్షిణదేశములో విజయనగర సంస్థానములో విద్యారణ్యులు, రామామాత్యులు, సంగీత విద్యకు ఒక లక్షణ వ్యాకరణమును ప్రసాదింప యత్నించిరి. విజయనగర సామ్రాజ్యము అత్యున్నతస్థితిలోనున్నప్పుడు వ్యాసరాయలు, వారి దాసకూటమునకు చెందిన కర్ణాటక హరిదాసులు సంగీత విద్యను ప్రజలలో బాగా వ్యాపింపజేసిరి. వీరిలో ప్రముఖులు పురందరదాసులవారు. వీరిని గురించి సుబ్బరామ దీక్షితులవారు, తాము ప్రచురించిన సంగీత సంప్రదాయ ప్రదర్శిని అను గ్రంథములో ఇట్లు వ్రాసియున్నారు :

"..●....సంగీత సాహిత్యములలో మిక్కిలి ప్రజ్ఞగలవాడై యొక్కొక్క సందర్భమందును చేసిన కీర్తనములచే శ్రీపాండురంగ విఠ్ఠలుని ప్రసన్నతను పొందినవాడై యుండెను. ఇతని యద్భుత చరిత్రములు నెవరికిని వ్రాయ నలవిగాదు. ఇప్పటికిని వాడుకలోగల సరళి (సర్వావళి) వరుసలు, అలంకారములు, పిళ్లారి గీతములు – ఇవి ఈ మహానుభావునివలన నేర్పడినవిగానున్నవి......ఇతనివలన జాడబడిన (వేయబడిన) సూళాదులు పెక్కులు గలవు." మాయామాళవగౌళ రాగమును మొదట స్వరముల పాఠమునకు ఏర్పరచిన మహిమ పురందరదాసులకు దక్కినది. సూళాదులు ఏడు తాళములందున్న లక్షణగీతములను బోలిన సంగీత రచనలు. సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో ప్రచురించబడిన రెండు మూడు తప్ప, ఇతర సూళాదులు సాహిత్యావశిష్టములై యుండుట ఎంతయు తీరని నష్టము! సంగీతము వేదవిద్యవలె కర్ణాకర్ణిగా శిష్యపారంపర్యముల దీక్షతో కాపాడవలసిన అమూల్య ధనము. సాహిత్యమును మాత్రము వ్రాసియుంచి, ప్రచురించినందువలన మనకు సంగీతము దక్కదుకదా. దాసులవారు ప్రసాదించిన వేలకొలది కీర్తనలు సులభశైలిలో ప్రసిద్ధ రాగముల మూల స్వరూపములుగా ప్రజలలో సంగీత జ్ఞానమును వ్యాపింప జేసినవి. రాగ తాన స్వర విస్తారములకు పునాదిగా ఏర్పడినవి పురందరదాసులవారి స్వరావళులు, అలంకారములు, గీతములు.

శార్ఙ్గదేవుల కాలమునకు భరతముని నిర్వచించిన లక్షణ లక్ష్యములు పాతబడి శిథిలములయి అలభ్యములయినవి. అట్లే శార్ఙ్గదేవుల కాలమునాటి ప్రబంధములు రాగ రచనలు వెంకటముఖి కాలమునకు ప్రాచీనములయిపోయినవి.

శార్ఙ్గదేవుల కాలమునకు భరతముని నిర్వచించిన లక్షణ లక్ష్యములు పాతబడి శిథిలములయి అలభ్యములయినవి. అట్లే శార్ఙ్గదేవుల కాలమునాటి ప్రబంధాములు, రాగరచనలు, వెంకటముఖి కాలమునకు ప్రాచీనములయిపోయినవి. కాని, నేటి కర్ణాటక సంగీతమునకు లక్షణ రూపముగా నిలచినది వెంకటముఖి రచించిన చతుర్దండి ప్రకాశిక. అట్లే, లక్ష్యములుగా దక్కినవి పురందరదాసుల పదములు, అరంభ పాఠావళి, క్షేత్రయ్య పదములు, భక్తిగానములో సామాన్య స్థితియందు లభించు రామదాసు కీర్తనలు, తరంగములు, తదితరములు. లక్షణ గీతములు సుమారు యేబది సంవత్సరములకుముందువరకూ విద్యాభ్యాసమున ముఖ్యముగా నుండెడివి. ముత్తయ్య భాగవతులు, టైగర్ వరదాచార్యులవారి తరువాత లక్షణ గీతముల ప్రాముఖ్యము క్రమముగా తగ్గిపోయినది. ప్రబంధములు ఇంకా అరుదు. కొన్ని ప్రబంధములు రాగమును పరిపూర్ణముగా చిత్రించు పెద్ద గానరచనలు; సుమారు అర్ధ చెప్పుటకే అరగంట పట్టెడిది. 'ఇవి మునుపు ఆంధ్రులు తమ సర్వస్వము అని కాపాడుకొని రాజులయెదుట పాడుచుండిన ముఖ్యమయిన సంగీత రచన' అని సుప్రసిద్ధ ఆంధ్ర గాయకులు చెప్పగా వినినాము.

సంగీత విద్యయొక్క చరిత్రమును మూడు భాగములుగా విభజింపవచ్చును. భరతుని కాలమునుండి వెలువడిన సంగీత శాస్త్ర గ్రంథములు. సంగీత రత్నాకరము, దానిపై చతురకల్లినాథుని వ్యాఖ్యానము—వీనియందు మన సంగీతములోని మూల సూత్రములు, రాగముల మూలాధారములగు జాతులు, గాయక లక్షణములు, వాగ్గేయకారుల లక్షణములు, గ్రామ మూర్ఛనముల వివరణ—లభించును. ఈరోజు మనకు లభ్యమయిన సంగీతము ఎట్లు ఏ రూపాంతరములనుజెంది నేటి స్థితికి రాగల్గినది అన్న ప్రశ్నకు ఏదో కొంత సమాధానము దొరికిన దొరకవచ్చును. నేటి సంగీత వాద్యములను గురించిన పుట్టుపూర్వోత్తరములు లభించవచ్చును. శ్రుతుల నిర్ణయము, స్వరముల భేదములు, తాళముల అధ్యాయములు, గమకముల వైవిధ్యములు నాటికీ, నేటికీ మారకుండుట ఆశ్చర్యకరమయిన సంగతే. పురాతన సంస్కృతగ్రంథములను పరిశోధకులు చదివి, వాటిని వడపోసినట్లయితే మనకు లభించునది సంగీత చరిత్రము యొక్క పూర్వ రంగము మాత్రమే. ఇప్పుడు, అమలులోనుండు సంగీత లక్షణముల వివరణకూ పనికిరాక, లక్ష్యముల కనతే ప్రయోజనపడని చెత్త గ్రంథములను ప్రచురించినందువల్ల ఏమియూ లాభములేదు. సంగీత రత్నాకరములోని లక్ష్య లక్షణములు, వాడుకను విడిపోయినవని వెంకటముఖి నిర్వచించినాడు.

ఇక రెండవభాగమనదగునది సంగీత త్రిమూర్తులకు పూర్వము, వెంకటముఖి పురందరదాసుల తరువాతి యుగము. విద్యారణ్యులు ఏర్పరచిన విజయనగర సామ్రాజ్యము రాయల ఏలికలో అత్యున్నత స్థితినందుకొన్నది. కర్ణాటక సంగీత పితామహులు పురందరదాసులవారు మాయా మాళవ గౌళ స్వరములను ధ్వనించు రాతిస్తంభములను విఠ్ఠలరాయని దేవాలయమందు నిర్మించిరి. చిన్న రాతితో కొట్టినను ఇంగువుని మ్రోగి పామరులకుగూడ ఆ స్వరస్థానములు బోధపడగలవు. నాదమును ధ్వనచిన ఇట్టి స్తంభములు శిథిలమయిన విఠ్ఠలరాయల దేవాలయములో కొల్లలుగా మున్నవి. శారీరసాధనకు, స్వరజ్ఞానమును, తాళజ్ఞానమును అలవరుచుకొనుటకు స్వరావళులు అమూల్య సాధనములు. ఇట్టిది హిందుస్థానీ పద్ధతిలోలేదు. సర్వసామాన్యులు అందుకొని, పాడగల చిన్నచిన్న పాటలు, పెద్ద విద్వాంసులు గూడ తెలుసుకొని పాడదగిన పదములు కొన్ని వందలుగా పురందర దాసులు, ఇంకా ఇతర హరిదాసులును ప్రసాదించిరి. ఆంధ్ర కవితా

పితామహులు ఇంకా వచ్చి యుండలేదు. భజనపద్ధతికి మూలపురుషులగు అన్నమాచార్యులు—పద కవితా పితామహులయి, అప్పటికి అర్ధ శతాబ్దమయినది.

"తాళ్లపాక చిన్నయ—ఇతడు తెలుగు బ్రాహ్మణుడు. వెంకటాచలపతి భక్తుడు. తిరుపతిలో నుండినవాడు. వెంకటరమణుని విషయమై సంప్రదాయముగా వాడుకలోగల ఉత్సవ పద్ధతి నేర్పరచిన పుణ్య పురుషుడు. దానిలో తోడయము, మంగళము, శరణు, హెచ్చరిక, కీర్తనములు, వసంతోత్సవ కీర్తనములు, స్వామిని మేలుకొలుపుటకయి కీర్తనములు, ఇవి మొదలయినవియూ ఉన్నవి. ఇవిగాక, విడి కీర్తనములునూ గలవు. ఇతని భక్త్యతిశయమువలన మాటి మాటికి వెంకటరమణుడు ఇతనికి సాక్షాద్దర్శనమిచ్చి, మాట్లాడినట్లు పెద్దలు చెప్పుచున్నారు. భజన పద్ధతికి ఇతడే మూల పురుషుడు. ఇతడు రామామాత్యులకు ముందటివాడని జెప్పుచున్నారు"—అని సంప్రదాయ ప్రదర్శినిలో వ్రాయబడియున్నది. వీరి భజన కీర్తనలను పాడు తీరు మన కబ్బలేదు. కర్ణ పరంపరగా దాసులవారి పదములు పాడుటను పరిశీలించి, కొద్దిగా సంస్కరించి పాడిన మంచి వర్ణమట్లు లభింపగలవు. ప్రసిద్ధరాగములందు ఈ పదముల మట్లు కొన్ని శతాబ్దముల తరువాత త్యాగయ్యగారి చేతులలోను, ముత్తుస్వామి దీక్షితులవారి కీర్తనములందును, అత్యుత్తమ దశనుపొందినవి. ప్రజాసామాన్యమునకు ఉపనిషత్సారములను, ఇతిహాస పురాణముల సారాంశములను, సంఘసంస్కరణకు పనికివచ్చు నీతి నియమములను సులభముగా అర్థమగు శైలిలో వారి వారి మాతృ భాషలలో వందలు వేలుగా లభింపజేసి, ప్రజల సంస్కారమును ఉద్దీపింపజేసినవి. రామదాసు కీర్తనలు, తరంగములు, దాసుల పదములు, ఇంటింటను, దేవాలయములందును పాడుచుండిన రోజులవి. ప్రజలకు మన సంగీతములోని జీవనదీసదృశములగు రాగములు గుర్తుపట్టు శక్తి యుండెడిది. మృదంగపు వరసలను అనుకరించు ఛందస్సు, పదజాలము ప్రజల హృదయములను ఆకర్షించినవి. అట్టి ఉత్తమ సంస్కారమును క్రమముగా మత, భాషా వ్యామోహములో కృశింపచేసిరి. ఇప్పుడవి అందరాని పండ్లు. క్షేత్రయ్య పదములు ఏహో కొన్ని పాటి సంగీతముతో దక్కినవి.

ఆ శతాబ్దమునందే విజయనగరము పతనము చెందినది. అప్పటికే "రహిబుట్ట రాల్గరగించు విమలగాంధర్వంబు విద్య మాకు" అన్న అల్లసాని పెద్దన, సంగీత కళా రహస్యనిధి రామరాజ భూషణుడు సంగీత పరిభాషను తమ ప్రబంధములలో స్వతంత్రముగా ధారాళముగా వాడుకొన్నారు. మను చరిత్రలో 'వాలారుం గొనగోళ్ల" అను పద్యములో నాటకుమేళంబై నవిపంచి దేశాక్షి రాగమును వాయించవలసిన ప్రాతఃకాలమున గాలిలో 'ఆవేళను' ధ్వనించుచున్నది. ఆ వీణను దేశాక్షికి మేళవింపగదవే అని వరూధినిసఖి అన్నది. పెద్దనామాత్యుని కాలమందు వీణ మేరువులను ఆ యా మేళములకు వీలుగా మార్చెడి వారన్నమాట, నేటి సితార్ వాద్యమువలె.

అటు తరువాత విజయనగరమునుండి మన హిందూ సంస్కృతికి రక్షణ దొరకడము తంజావూరులో. హిందూస్థాని, కర్ణాట సంగీతములు రెండును బాగుగా తెలిసిన పురందరదాసులవారి క్రమశిక్షణా పద్ధతి, పదములు మన సంగీతపు వైశిష్ట్యతను తురుష్క సంప్రదాయముల ధాటినుండి సంరక్షించినవి.

తంజావూరిలో రాయలు ఏలుబడిలోనున్న 'నాయక' సంస్థానాధిపతులు కళలను, హిందూ సంస్కారమును కాపాడ జొచ్చిరి. గోవింద దీక్షితులు, వారి పుత్రులు వెంకటమఖి వీణావాదనమునకుపద్ధతులను ఏర్పరచిరి. వీణమేరువులను నేటి పద్ధతిగా ధ్రువముగానుంచు పద్ధతినివారు ఏర్పాటుచేసియుందురని ఊహింపవచ్చును. అట్లు తరువాతనే స్వరస్థానముల రుచులు పెరిగి, రాగ రూపము నేటి వైవిధ్యమునందుకొగల్గినది. అనుస్వరము అను క్రొత్త అందమును వీణ స్వర స్థానమును క్రిందిస్వరమునుండి ఈడ్చినట్టి వాయించు నిపుణత అబ్బినది. మన సంగీతమునకు ఇది గొప్ప మార్పును అందచందములను సమకూర్చి పెట్టినది. ఈ కాలమందు ప్రసిద్ధముగా వాడుకలోనున్న రాగములను, ఇంకను వ్యూహింపగల రాగములను, క్రొత్త రాగములను అన్నింటినీ చేర్చి అర్థము చేసికొనుటకు వీలగు డెబ్బది రెండు మేళకర్తలను వెంకటమఖి ప్రసాదించిరి. మన సంగీతమునకు నిర్దుష్టమైన ఒక వ్యాకరణప్రాయమగు ప్రాతిపదిక ఆ నాడే ఏర్పడినది. అట్టి దానిని కొద్దిగా మార్చి దిద్ది కొన్ని దశాబ్దములకు మునుపు భాత్ఖండే హిందూస్తాని సంగీతములో ప్రవేశపెట్టిరి. మేళములకు 'థాట్' అను నామాంతరము నుంచిరి. నేటికినీ హిందూస్థానీ రాగములు లక్ష్య ప్రధానములయి కొన్ని సందర్భములందు లక్షణములకు అంతగా సరిపడని రూపములను పొందుచున్నవి. లక్షణ ప్రధానముగా మారిన మన రాగములు, లక్ష్యములవల్ల మాత్రమే ఊహింపదగు రాగములు, తమ స్వరూపమును పోగొట్టుకొని, వట్టి స్వరవిస్తారపు గడబిడలకు గురియయి, రస రహితమయి పోవుచున్నవి. అట్లు మన కన్నెదుట అదృశ్యమగుచున్న రాగములు మాంజి, నారాయణగౌళ, గౌరి, పాలంగనాట మొదలగునవి. పాడుటకు వీలుగానున్న పాటలు, రాగ ఆలాపనలు, తరచుగా గాయకుల చెవిలో పడకున్న, రాగములు స్వరూపమును గోల్పోవుట కద్దు. స్వరములను, ఆరోహణ అవరోహణ క్రమములను, ఇతర లక్షణములను సహాయముగాగొని ఎంతటి ప్రతిభావంతుడయినను రాగ స్వరూపములు ఊహించి నిర్మించుట కల్ల. పూర్వి, గౌళిపంతు, సైంధవి ఇంకా ఎన్నో రాగము లట్టివి. 'ఏమే భామా వాకిటి తీయవు' అన్న పాటను వినివుండనివారు, ఉన్న లక్షణమంతా విడమరిచి చెప్పినా, మంగళకైశికిని పాడజాలరు. లక్ష్యమునకు మనము ఇవ్వవలసిన ప్రధాన్యత ఇవ్వడము లేదు.

కర్ణాటక సంగీతమునకు అత్యున్నత స్థితిని దెచ్చినది సంగీత త్రిమూర్తుల కీర్తనలు. రాగ ప్రధానము సంగీతమన్న ఉక్తికి వీరి కీర్తనలు ఆధారము లయినవి. పురాతనపు ప్రబంధ రచనలను తగురీతిగా తీర్చి,దిద్ది, రాగ రచనలందు క్రొత్త క్రొత్త మార్గములను కనుపింపచేయు కీర్తనలు—దేవుని వరముగానుండి పాడుటకు అనువయిన శైలిలో—త్రిమూర్తులని విఖ్యాతిగాంచిన శ్యామశాస్త్రి, ముత్తుస్వామి దీక్షితులు, త్యాగరాజస్వాములు, వందలాదిగా సృష్టించిరి. సాహిత్యమును అసలు సరకుచేయక రాగమును విస్తరించు భాండీర భాషలోని లక్షణ గీతములు, ప్రబంధములు, ఈ కీర్తనల సృష్టితో ప్రాచీనము లయినవి. లక్షణ గీతములలోని రాగ సంపదను, పదములలోని సాహిత్యపుష్టిని, ప్రబంధములలోని రాగ విస్తరణను, మీదు మిక్కిలి అంద చందములతో, లయ సొగసులతో అత్యద్భుతమయిన రక్తిని పుట్టించు త్రిమూర్తుల కీర్తనలు అంతకు మునుపున్న రచనలను వెనుకకు త్రోసివుచ్చినవి. భావ ప్రధానములయిన త్యాగయ్యగారి భక్త్యతిశయమున కల్గు అనుభవములు వారి కీర్తనలందు ప్రతిబింబించినవి.నాదోపాసన ముక్తికి మార్గమని త్యాగయ్య చాటెను. నాదము సంగీతమునకు మూలవస్తువు. నాద శిల్పము సంగీతము. రాగతాళములందుగల చిత్ర విచిత్ర కల్పనలే సంగీత రచనలకు ఉత్తమ కళా సృష్టిని కల్పించును. సంగీతముతో సాహిత్యార్థమును విశదీకరించుట ఒక ప్రయోజనము—నాటకములందు, పదములను పాడునప్పుడు, శ్లోకములను పాడునప్పుడు, భక్తి గీతములను పాడునప్పుడు సాహిత్యమునగల భావమును పెంపొందించి, వివరించుటకు సంగీత ముపకరించును. అట్టి సందర్భములందు మనకుగల ఆనందము సాహిత్యము, సంగీతము రెండును పంచుకొనగలవు. అట్టివిగాక, రాగమునే ముఖ్య వస్తువుగాగొని సంగతులతో రాగ విస్తరణనుచేసి నవీనములగు కల్పనలతో రాగ సౌధములను నిర్మింపచేసిన ప్రయత్నములు త్రిమూర్తుల కీర్తనలు. సంగీత విద్యకు ఇప్పుడు లభించిన ప్రశస్తి ఇంకెప్పుడూ లభింపలేదు.

వెంకటమఖి కలలు పండినవి. ఆయన సూచించిన రాగముల మేళము లన్నిటియందును, ముత్తుస్వామి దీక్షితులవారు, త్యాగయ్యగారు కీర్తనలు రచించిరి. ప్రసిద్ధ రాగములందు అనేక కీర్తనలు రచించిరి. అదివరకు వాడుకలో మన్న అనేక రాగములయందు రచించిరి. భజన సాంప్రదాయపు కీర్తనలు, జావ పదగేయ ఫణతులు—అన్నియు వీరి రచనా శిల్పమునందు అత్యద్భుతమయిన రూపమును పొందినవి. తోడి, శంకరాభరణము, కాంభోజి, భైరవి, కళ్యాణి జీవనదులై ప్రవహించు రాగ వాహినులు. చక్కని రూపమును హృదయాకర్షకముగా ప్రతిధ్వనించు నాద మహిమముగల రాగములు ఆనందభైరవి, అఠాణా, బిలహరి, సురటి, ధన్యాశి, సావేరి—వంటివి. వీటియందును వారు అనేక కీర్తనములను చేసిరి. లయ సొగసులు, మృదంగపు వర్స లను సౌందర్యములు, సాహిత్య శైలియందును, స్వర విస్తారమందును ఉట్టిపడునట్లు, త్యాగయ్య పంచరత్నములు, శ్యామ శాస్త్రులవారి స్వరజతులూ వెలువడినవి. 'సంగతులు' అను అపూర్వ

ఆధారమును సంపాదనముచేసి, త్యాగయ్యగారు తమ ప్రతిభవలన సంగీత రీతులకు నూతన వైభవమును కల్పించిరి. సాహిత్యపు అర్థమును అనేక రీతులు అధికరింపచేసి, రాగ భావములను వివిధ రీతుల విస్తరించుటచే త్యాగయ్యగారి కీర్తనలు వీనులకు విందయి, బుద్ధికి మోదాకుపాత్రి, ఆత్మకే వికాసమును కల్గించినవి. సౌందర్యముతో ఆధ్యాత్మికమైన ఆత్మానందమును కల్గించుటలో త్యాగయ్యగారి కీర్తనములు నిరుపమానములు. తాళ మాధుర్యపు పటిమను శ్యామశాస్త్రులవారి 'చాపు తాళ' కీర్తనలయందు విరివిగా అనుభవింపవచ్చును. నాదరూపుడగు పరమేశ్వరుడే త్రిమూర్తుల రూపమున అవతరించి నాద విద్యను అంత ఉత్కృష్ట దశకు దెచ్చెనేమో! త్రిమూర్తుల కీర్తనలతో సరితూగు నాదసృష్టి అంతకుపూర్వముగాని, అటు తరువాతగాని లభించుట అరుదైనది.

దశవిధ గమకములతో వాది సంవాది స్వరముల స్పష్టీకరించు విస్తరణతో విలంబకాలపు మహిమను చాటుచూ, ప్రౌఢమయిన పద జాలముతో, అద్వైత మతసారమును వెదజల్లు ప్రబంధ రీతుల నమరిన కీర్తనలు దీక్షితులవారివి. మన సంగీతమునకు పద్ధతి ఎట్లు ఉండవలయునో, అట్లు నిదర్శనములుగా నుండు రీతిని దీక్షితులవారు రాగభావ పూరితములయి, నాదపుష్టియందు మీను లను శ్రుతియందు నిమగ్నముచేయురీతిని కీర్తనలను నడిపించిరి. హిందూస్థానీరాగములయందు 'ధ్రుపద్' శైలితో దక్షిణాత్యులకు పాడుటకు వీలగు కీర్తనలు రచించి, భారతీయ సంగీతము ఎంతవరకు అందరకీ సామ్యముగా నుండగలదో చాటిరి. వీణశైలిపై ఆధారపడియున్న దీక్షితుల పద్ధతి, సంప్రదాయజ్ఞులు అత్యుత్కృష్టమయినదని చెప్పుదురు. దీక్షితుల కీర్తనలను కర్ణాకర్ణిగాపాడి, ఆ కీర్తనలయందున్న 'పట్టము' గమక శుద్ధముగా పలుకునట్లు గొంతును బాగుగా మర్దించి, విలంబలయ—గొంతులోనూ, చేతిలోనూ బాగుగా నిలచునట్లు సాధనచేసి పాడినచో, హిందుస్తానీ సంగీతములోని మేల్మియయిన అంశములు మనము దక్కించుకున్నవారము కాగలము. అందులకై మన దాక్షిణాత్య రాగ స్వరూపములను అనుస్వరములను వదలుట పొరబాటనెడి సత్యమును గూడ నిరూపించుచూ కల్యాణి, సావేరి, ఆనంద భైరవివంటి రాగములలో దీక్షితులవారి కీర్తనలు దక్షిణాత్య పద్ధతికి అచ్చమయిన పెన్నిధులయి అలరారుచున్నవి. ఈ కీర్తనలను కర్ణాకర్ణిగా పాఠముచేసి, గళ పారిశుద్ధ్యముతో, సంస్కారమును సూచించు ఉచ్చారణతో, రాగము, స్వరము, నెరవు, విస్తారములయందు గంభీరమయిన మనోధర్మముతో పాడి నన్నిరోజులు కర్ణాటక సంగీతము అత్యున్నతశ్రేణియందే నిలిచియుండును. త్రిమూర్తుల కీర్తనలు, వర్ణములు, పదములు, జావళీలు, తిలానలు—మన సంగీత సంపద; ఈ సంపదను కాపాడుటకు గాయకులును, రసికులును కలసి ప్రయత్నించవలసియున్నది.

దీనికయి గాయకులు నెరవేర్పవలసిన విధులేవి? రసికుల విధులేమిటి? అని కొంత విచారణ చేయవలసియున్నది. కేవలము ప్రజాదరణపొంది ధనమును గడించి 'కచ్చేరి'లు చేయుటమే పరమావధిగాగొన్న అసంఖ్యాక గాయకులు సంగీత విద్యకు తీరని నష్టము చేకూర్చుడము జరుగుచున్నది. విద్యను అభ్యసించునప్పుడు విద్యార్జనయే ఏకైక లక్ష్యముగా నుండవలయును. కొంత సాహిత్య సంస్కారమును గడించుకొని, అనుక్షణమును చదివి, పాడునదేమో తెలుసుకొని, పాడవలయును. పండిత పామర రంజనముగా నుండుటకు ఎన్ని అంశములను అలవరుచుకోవలయునో అన్నిటినీ అలవరుచుకొనుటకు ప్రయత్నము యావజ్జీవము కొనసాగించుచుండవలయును. పండితులకు నచ్చనిపాట బహుకాలము నిలువదు. పామరులను అసలు సరకు జేయని సంగీతము అందములేని వ్యర్థమయిన గడబిడ.

మన సంగీత సంపద ఎంత గొప్పది! దానిని కాపాడి, దాని మహిమను ప్రజలకు అందజేయు శక్తి సామర్థ్యములను గాయకులు అలవర్చుకోవలయును. కచ్చేరికి పనికివచ్చు మధ్యమకాల కీర్తనలు మాత్రము సాధన చేసిన క్రమముగా పుష్టిగల మనోధర్మము అరుదయి, సినిమా సంగీతమునకు చేరువయయి, తన గాంభీర్యమును గోల్పోవును. ఇది తీరని నష్టము. కీర్తనలను వ్రాసి, స్వరపరచి, ప్రచురించి, మహనీయులతో పాడించి, రికార్డులు భద్రపరచియుంచుట ఒక ఎత్తు. అనుదినానుష్ఠానముగా శారీరమును త్రిస్థాయిలందు సహజ గంభీరముగా, నిండుగా, శ్రుతిశుద్ధముగా నుండునట్లు తయారుగా నుంచుకొని,



ఎక్కువ కాలము సర్వ జనులకు తృప్తినిచ్చు మధ్యమకాలపు సులభమయిన నడక అందుగల కీర్తనలు పాడినను, అప్పుడప్పుడు 'శ్రీరంగశాయి', 'గిరిపై నెలకొన్న', 'రామబాణ', 'త్యాగరాజాయ నమస్తే'—మొదలగు పెద్ద కీర్తనలు గొప్ప మనోధర్మముతో ప్రౌఢమయిన స్వర కల్పనంతో పాడి పండితులను మెప్పించుచూ, పామరులకు గూడ సంగీత మహిమను దెల్పు ప్రయత్నము ఎడతెగక, కొనసాగవలయును. దీనికి పారమార్థికదృష్టిగల్గి, త్రిమూర్తుల కీర్తనలను, ఆ కీర్తనల కున్న మహిమను తగ్గించక, మార్చక, పాఠముచేసి సంసిద్ధులయి యుండుటకు గాయకులు పెద్ద ప్రయత్నమును చేయవలయును. పదములను పాడువారు అరుదయి పోవడము ఎంత నష్టము! తానము అంతకంతకు నామమాత్రావశిష్టమగుచున్నది. "స్వర విస్తారములందు, నెరవలు రాగ ఆలాపనలు చేయునప్పుడు తప్పనిసరిగా, మనోధర్మము బాగుగా అగుపడవలయును. పాడెడి కీర్తనలు యథా మాతృకముగా నుండవలయును. కాని ఇదేమి విపరీతము! కీర్తనలందు మనోధర్మము మితిమీరిపోవుచున్నది. ఎవరికివారు వారి వారి గొంతులకు, బుద్ధికి సరియగునట్లు పెద్ద కీర్తనలను మార్చి పాడుచున్నారు. కానిరాగాలాపన, తానము—స్వర విస్తారము బాగుగా 'చిట్టి' చేసుకొని అప్పజెప్పుచున్నారు. ఇది పెద్ద లోపము" అన్నారు ముసిరి సుబ్రహ్మణ్యఅయ్యరు. పెద్ద సభలలో కృత్రిమ కల్పనలతో శారీరమును ప్రదర్శించు వింత రాగముల విస్తరణతో మన సంగీతమునకు జీవనాడులనదగు ప్రసిద్ధ రాగముల స్వరూపమును గూడ ప్రజలకు తెలియ నివ్వుటలేదు. ఏదే ఏదే ప్రజలు మన రాగములను విని, పెద్దల కీర్తన అందలి గొప్పదనమును విని గుర్తించవలయును. సంగీతము విన్నప్పుడు త్యాగరాజ కీర్తనల సాహిత్య మేమని తర్కించుట పొరబాటు అందలి సంగీతమును ముఖ్యముగా విని, ఆనందించుటకు కొంత ప్రయత్నించవలయును. ఉత్కృష్టమయిన సంగీత ప్రదర్శనలకు నేటికంటెను ప్రజాదరణ ఎక్కువగా లభించవలయును. సామాన్య ప్రజలు కుటుంబమునకు కొంత ఇట్టి విషయములకు డబ్బును పొదుపు చేసుకొని, గాయకులకు మంచి దోహదమివ్వకున్న, త్వరలో మన సంగీత సంపదను అందుకొని, కాపాడు శక్తిగల విద్వాంసులే అరుదయిపోగలరు.

మన కర్ణాటక సంగీతమునకు ఎట్టి భవిష్య మున్నదో చెప్పుట ఊహాతీతముగా నున్నది. కాని, లలిత సంగీతము, పాశ్చాత్య సంగీతము, జానపద గేయ రీతులు, హిందుస్థానీ సంగీతముతోటి పరిచయము ఇప్పుడు ఏర్పడినట్లు ఇంతెప్పుడూ ఏర్పడియుండలేదు. వీటి సంపర్కమువలన బాగోగులు ఏర్పడకతీరదు. మంచిని గ్రహించుశక్తి మన సంప్రదాయజ్ఞులపై నున్నది. అట్టి శక్తినలవరుచుకొనునట్లు చేయు భారము రసికులకుపై నున్నది. లలిత సంగీతమునకయి ప్రత్యేకించిన గోష్ఠి ఏర్పడవలయును. తాత్కాలికముగా ప్రజల నాకర్షించి, రెండు, మూడు నెలలలో మారిపోవు సంగీతమును విను సన్నివేశములు చాల అవసరము. శాస్త్ర సంగీతమును పాడువారట్టి ప్రయత్నమునకు పూనుకొన్న ప్రయోజనము సున్న. లలిత సంగీతము బరువయి, కర్ణాటకము నాటకమయి, రెండును చెడి క్షీణించును. కర్ణాటక సంగీతము ప్రజలలో బాగుగా ప్రాకవలయును. దీని చరిత్ర, దీని విశేషములు ప్రజలు గుర్తించునంతటి బాగైన రచనలు, సంగీత ప్రదర్శనలు జరుగవలయును. తమ బుద్ధి దౌర్బల్యమునో, సంస్కారవిహీనతవల్లనో మొదట రెండు మూడు పర్యాయములు వలదు అని అసహ్యపడిన వారు కూడ—క్రమముగా శాస్త్రీయ సంగీతమునందు అభిరుచిని పొందుట లోక విదితము. ఇందుకు ప్రభుత్వమువారు, దేవాలయములందలి ధర్మకర్తలు అప్పుడప్పుడు ఉత్తమ రకపు సంగీతపు కచ్చేరీలను ఏర్పాటు చేయించిన—దేశమందలి గాయకులకు పోషణ లభించును. ప్రజలలో ఇట్టి ఉత్తమ రకపు రసాస్వాదనకు తగిన అభిరుచియూ ఏర్పడును. ఇది ప్రజాదరణకై దీక్ష బూనిన మన ప్రభుత్వము కొన్ని రోజులు రుచిని కల్పించినచో తరువాత ప్రజలే సంగీతమును విని ఆనందించి, కాపాడగలరు. దీనికి వలయు వాతావరణము సంప్రదాయ సంగీతమును బాగుగా అలవరుచుకొన్న విద్వాంసుల కృషి ఫలితముగా ఏర్పడవలయును. నాదలోలురై మన ప్రజలు బ్రహ్మానంద మొందుదురు గాక!

# తడిమంటకి పొడినీళ్లు

**శ్రీ బుచ్చిబాబు**

నీళ్లకోసం నదిఒడ్డు కొచ్చింది అలిమేలు. ఆకాశ మంతా మబ్బుతో కమ్ము కున్నా పశ్చిమాన్ని తెరతీసినట్టు నిర్మలమైన ఆకాశం ఎర్రటితామరాకులా కొండవెనుక దిగిపోతున్న సూర్యబింబం కిరణాలవెలుగులో గర్భాలయంలో ఒంటి దీపంలా మెరుస్తోంది. ఆ కిరణాల ఎరుపు అలిమేలు మొహాన్ని కప్పింది, జడలో దాక్కుంది. లేత మబ్బురంగుఛాయ, స్ఫుటంగా ముందుకు సాగారి ఒంపుతిరిగిన కనుబొమ్మల కింద తెల్లచేప పిల్లలల్లే సంధ్యలో చిట్లించి కదిలిమెరిసే కళ్ళు, సన్నటి, పొట్టిముక్కు, తీర్చిదిద్దిన సన్నటిపెదవులు, పల్చటి చెక్కిళ్ళు, క్రమంలేకుండా దువ్వినజడ—ఇవన్నీ అమాయకంగా కనబడేటట్టు చేసినా, మొత్తం శరీరంచూస్తే అనుభవంగల వ్యవహర్తలా కనిపిస్తుంది, అలిమేలు. ఎత్తైన విగ్రహం, గుండ్రంగా, బలంగా కనబడేభుజాలు, స్తనాలు, పిరుదలు,—ఆ పాత తెల్లచీర మడతల్లో ఇమడక, వాటిచునికిని ప్రతికదలికలోనూ బుజావుచేస్తున్నట్టుంటుంది.

కొండకింద దిగే సూర్యుడంటే అలిమేలుకిష్టం. బిందెకిందపెట్టి, సంధ్య వెలుగుకి ఎర్రబడిన చేతులు చూసుకుని సంతోషపడింది. ఇంకా ఎరుపుగావుంటే ఎంతబావుండును, తను. కర్మ, అమ్మనలుపు. అయ్యకూడా నలుపేనట, అమ్మ చెబుతుంది.

ఊరికే ఆ పొద్దంతా, ఆ ఎంకడు జొరపడుతూండాడు ఆలోచనలోకి, ఆ సైకిలు కొట్టు వెంకటేశ్వర్లు. ఈమధ్య మరీ గర్వంగా, హుషారుగా వున్నాడు. వాళ్లివాళ్లతోనో తిరుపతివెళ్లి, వెంకటేశ్వరస్వామిని చూసి వచ్చాడంట. అందుకు ఆ మిడిసిపాటు. మాబాగా అయింది! సైకిల్ పోటీలోపడి కాలుకి గాయం తగిలింది. కట్టు కట్టి కుంటుకుంటూ తిరుగుతూండా డా ఎంకన్న. మిడిసిపడే వాళ్లకి తగిన శాస్తి చేస్తాడు ఆ ఏడుకొండలవాడు. కాని పాపం మంచోడు—వెంకటేశ్వర్లు—వెంకన్న, తనికి ఒక చందనం బొమ్మ—స్వామిది—తెచ్చి ఇచ్చాడు. వెంకన్న బాగుంటాడు; భలేనవ్విస్తాడు; నవ్వుతాడు—నవ్వితే మరీ బాగుంటాడు—మాంచి మనుషైన ధాటి—

ఈ ఆలోచన కూడదు. దాన్ని తొలగించడం కోసం అమ్మనిగురించి అనుకోవల్సి వస్తోంది. అమ్మ మంచిది. తనంటే పంచ ప్రాణాలూను. పొద్దు ననగా వెళ్లింది సంతకని—ఆ ఎంకడితో—మళ్లా వెంకడి ఆలోచనా? ఇంకా రాలేదేం చెప్మా. తనని తిరుపతి తీసుకెడతానంది— పెండ్లయినాక. పెళ్లేంటి తనకి? కనపడ్డవాడి నల్లా అడుగుతుంది వెర్రిది—'కాని పుచ్చుకో కుండా కట్టుకుంటావా' అని.

తలెత్తి దూరంగా చూసి అదిరిపడింది అలిమేలు. అదేమిటి అంత లావుగా పొంగిపోతుండే నది—ప్రొద్దుటాళ అంత లేదే. 'అమ్మో'—గుండెల మీద చెయ్యి పెట్టుగుని నిర్ఘాంతపోయి చూస్తోంది. నీళ్ళు ఎర్రగా, ఎత్తు అలలగా లేచి రొదిస్తూ విరిగిపడుతున్నాయి. భలే జోరు—సైకిల్ పోటీలా. నురుగు గుండ్రంగా గాలిలో పత్తిలా తిరిగిపోతూంది. చలిగా ఉంది. సూర్యుడు లేడు. కొండెనక దిగి, రోతతో వూసినట్టు విప్పిన తాడిపండల్లే ఉండాడు ఆ మూల ఆకాశరామన్న.

నీళ్ల కెట్లా దిగేది? చీరకొంగు మట్టా లొక్కుని బిగించి, సిద్ధపడింది. నీళ్లెట్లా తాగేది? రోతనీరు. అంతా కంకరమన్ను రంగు. ఓ యబ్బ, అవన్నీ కంప, కొమ్మలు, ఆకులు, దూలాలు, ఎక్కడనించో కొట్టుకుపోతూన్నాయి. భయంలేదు. మనుషు లున్నారు. లెక్కపెట్టింది. ఏడుగురు మనుషులు—పిడ్డీల్లాంటి వాళ్ళు, నల్లదూలాలల్లే. ఒడ్డుకెళ్లి నీళ్లల్లో కొట్టుకొచ్చే గంప, పేమవార, దూలాలు పట్టుకుని ఒడ్డుకి చేరవేస్తున్నారు, ఎందుకో. ఇంకెందుకు పొయ్యిలోకి కట్టెలకోసం, అల్లా బందబడ్డ భయం లేదేం—లోపలికి పోతూ ఉన్నారు.

ఆ నల్లటి కర్రిశరీరంమనుషులు దూలాలు ఒడ్డుకి చేరెయ్యడంలో, కూడబలుక్కున్నట్టు, కొంత లయతో కలిసి పనిచెయ్యడం చూసి, అలిమేలు నదిగొడవ మరిచిపోయింది. బలమైన జబ్బలు, పిక్కలు, కండలు తిరిగి, కదలడంలో లయక్రమం చూసి విస్తుపోయింది. చూడ్డానికి బాగుంది. వాళ్ల మొహాలు ఎల్లాగుంటేనేం. శరీరం అంతా బాగుంటుందా—అవన్నీ ఎముకలా, కండలా — కార్చి పోంచిన గునపాలా; బిందె, ఎత్తి, దించి, తన చేతుల కండలకేసి చూసుకుంది. తన వల్లా లేవు. ఆళ్ళ మొగాళ్ళ—మోటగా ఉంటారు. మోటతనం తనకు లేదుగా, అందుకని అదంటే యిష్టం. మరి వెంకన్న అల్లా లేడేం! ఏమో, అడు ఇష్టపడి పనిచేస్తుంటే తను చూడలేదు. ఈమారు చూడాలి. చ, ఛ—ఆడి గొడవొద్దు. ఇంకా అమ్మ రాలేదేం చెప్మా. వెనక్కి తిరిగి చూసింది. దూరంగా జనం పరుగులెడుతున్నారు; కందిరీగలల్లే—కందిరీగ కుట్టినవాళ్లకి మల్లే—

మరో రెండడుగులు ముందుకేసింది అలిమేలు. "ఆ టెళ్లమోక, చస్తావు— కొంపకెళ్ళు" అని అరిచాడు, నల్లశరీరమనుషులలో వొకడు.

"ఏం?"

"కళ్ళులా—కబోదివా? నీ రొస్తావుంది. ఎగెత్తు. పోవేం."

కసిరాడు నల్లటయ్య. తనకి భయంగా లేదు. అక్కడ కూర్చుని, ఆ నది రొదవింటూ, నురుగు విరిగే గమ్మత్తు చూస్తూ, ఆ నల్లటోళ్ల పిక్కల చమత్కారం చూస్తూవుండాలనిపిస్తుంది.

వాళ్ళ మళ్లా కసిరారు.

ఇంటికేసి కాళ్లు దేరింది అలిమేలు, వొక్కసారి గంగమ్మతల్లికి నమస్కరించి. ఆ త్రోవమ్మట రోజూ అంత రద్దీ ఉండదు— ఊరికి మూడు మైళ్ల దూరంగా ఉండటం మూలాన. ఆ సాయంత్రం అందరు జనం, బళ్ళు, సైకిళ్ళు, కార్లు పోవడం చూస్తూ, తనూ వేగంగా నడవడం సాగించింది. దోవ తొలిగి, అడ్డగాళ్లల్లో పడి గంటలు మోగుతూ ఎడ్ల బండ్లు పోటీలమీద పోతున్నాయి. అడిగిన ప్రశ్నకి సమాధానం చెప్పడానికి ఎవరూ నిలబడరు. ఏమిటి చెప్మా! ఇదంతా నదిలో నీటికి భయపడే. వెనక్కి తిరిగిచూసింది. ఎన్నడూ చూడని దృశ్యం చూసింది,—నీళ్ళు నది పొడ్డు మట్టంకి సమంగా, అక్కడక్కడ పొడ్లు పొర్లిపోవడం—తనెప్పుడూ చూడలేదు.

"ఇదిగో—ఏమిటబ్బాయ్—ఎక్కడికి పోతావున్నారు?" అని కేక పెట్టింది.

ఆ కుర్రాడు పరుగెడుతున్నాడు.

"నది గండి పడిందంట—అంతా కొట్టుకు పోతుందట ...."

ఒక్కసారి వూపిరి నిల్చినట్లయింది. అంతా కొట్టుకు పోవడమే. అలిమేలకి నవ్వొచ్చింది. అరుగో ఆ ముసల్టోళ్ళు—నిదానంగా చెట్టుకింద చిదగులు పొగువేసుకుంటున్నారు. వాళ్లకి లేని భయం, నీళ్లందరికీ ఎందుకో. ఇంతకీ అమ్మేది? పొద్దుపోయినా రాదేం? నది పొంగుతూండని ఆటకాయించారా? వెంకటేశ్వర్లు ఎంటుండంగా అమ్మకేం భయం? అళ్లని ఈళ్లని అడుగుతుంది కాని, వెంకటేశ్వర్లుని అడగదేం—అదే, తన పెళ్లి విషయం? అడికి—వెంకటేశ్వర్లుకి వొమారు పెండ్లయిందంట, మరి మెచ్చిందో దాన్ని ఇడిచేసినాడుట. ఆ ఇడిచేసిన దాన్ని చూడాలనుంది తనకి. తనకంటే ఎరుపా? బావుంటుందా? చూసి బుగ్గన వెయ్యేసి 'అయ్యో పాపం' అని, తర్వాత, గట్టిగా లెంప వగలెయ్యాలనుంది ఎందుకో. తన కెందుకో, ఇష్టం ఉన్నవాళ్లని సముదాయించి, బుజ్జగించి, ఆపైన లెంప

నగలెయ్యాలనంటుంది, అదేం చిత్రమో. తనని చేసుకుంటే, మరొకతి వస్తే తనని ఇడిచేస్తాడు వెంకటేశ్వర్లు—అదీ అమ్మ భయం. మరే, తనంత లోక్వా ? తాను చేసుకోకేం. 'చేసుకోను' అన్నాడంటే, అడి చెంప పగలదూ ! చేసుకుని ఇడిచేస్తే, చంపెయ్యనూ ? తన మనస్సు ఎలాంటిదో అమ్మకి తెలియదు. ఆ మధ్య మూవరెంటు మూరయ్యగారింట్లో పనికి కుదుర్చుకోమని, ఆరే కబురంపితే, అమ్మ వొల్లకాదంది. మూరయ్యగా రబ్బాయి—శివుడంట—పోకిరబ్బాయంట. అవునే—తనకి ఆరింట్లో పని కుదరాలనుంది, ఆ పోకిరితనం ఏమిటో చూద్దామని. శివయ్య భలే ఆయన. భలే బట్ట లేసుకుంటాడు. ఎగదువ్వ క్రాపింగు, పాపి, కళ్లజోడు, ముస్తాబుగా ఉంటాడు. ఏమన్నా చేస్తే చెంప పగలేసి సర్దా తీర్చుకోవాలనుంది. కాని అమ్మ వొప్పదు.

కారు హారన్ మోతకి అదిరిపడింది అలిమేలు. నిలబడి తేరబారి చూసింది. కార్లోంచి దిగింది శివయ్య—ఆయనే—మూవరెంటు మూరయ్యగా రబ్బాయి. అదేమిటి తమ్మని చెయ్యి వూపుతున్నాడు ! అలుముకుంటూన్న చీకటిలో తనకి ఆశ్చర్యంగా ఉంది. ఏం చేస్తే దేమిటి. వెళ్లింది.

"ఇదుగో—కారు తోస్తా ?"

తలవంకించింది.

"ఏమిటి తోస్తావా తొయ్యనా ?"

"ఎందుకు ?"

"చెడిపోయింది."

"ఏన్నే."

దగ్గరగా వొచ్చాడు సదాశివరావు— జేబు రుమాలుతో మొహం తుడుచుకుంటూ. గుప్పున పరిమళం కమ్మేసింది.

ఏంత వాసన.

"ఎక్కడికి ?"

"అదుగో మా యింటికి—ఎరగవు? ఆ కొండమీద. రెండు ఫర్లాంగులు."

"నాచేత కాదు."

"ఇంతేనా—అంత ఎత్తుగా లావుగా ఉన్నావు."

కారు వెనక మరో ఇద్దరు మనుషు లున్నారు.

"రా, రా—వో చెయ్యి వెయ్యి" అని వాళ్ళు తొందర చేస్తున్నారు. "ఊ" అని సదాశివరావు, ఆమె చెయ్యి పట్టుకు లాగాడు. అతని అరిచేతి చెమట తన చేతికి తగిలి చీకాకు పడింది. చేతినిండా మట్టి— తనూ వెనక్కి వెళ్ళి, కారుని తొయ్యడం సాగించింది. శివయ్య లోపలి కెక్కాడు.

"అక్కడ కాదు, ఇక్కడ"

తనని పక్కకి వచ్చి తొయ్యమంటున్నాడు.

వందగజా లొచ్చేశారు. అక్కడ నుండి ఎత్తు ప్రారంభం.

"ఇక్కడ" అని ఆమె చెయ్యి పుచ్చుకుని, ముందుకి లాగాడు శివయ్య. తన బుజాన పడింది చెయ్యి. ఎల్లాగో ఉంది. లేకుంటే యీపాటికి చెంప పగలెయ్యదూ ?

ముందు తలుపు ప్రక్కన తోస్తోంది. కాళ్లకింద మట్టి, అక్కడక్కడ కంకరరాళ్ళు, పాదాలను కోసేస్తున్నాయి. ఆయాసంతో ఒగర్పు పైకి వినపడకుండా బిగబెడుతోంది కాని ప్రయోజనం లేదు—బిగబెట్టిన వూపిరి విడిచేసినప్పుడు, ఏదో ధ్వని కూడా వస్తోంది కంఠంలోంచి. 'అంత ఎత్తుగా, లావుగా ఉన్నావు' అని వెక్కిరించాడు. తను లావా ? ఆ మాట పీకుతోంది. ఎంత సన్నటి నడుం తనది—నాజూకైన వక్షం, నునుపైన బుజాలు—తను లావా—చీరలో లావుగా ఉంటాను కాబోలు—ముతకచీర, పాతది—చుట్టి చుట్టి బొడ్డుకాడ బిగించింది——మరి బొడ్డుకింద కాస్తంత ఎత్తుగా ఉంది నిజమే. అదంతే—అమ్మకీ అంతే. అందరికీ అంతే. అవలీ మొగాళ్లకి తెలవదు. ఇంటికెళ్లి చూసుకోవాలి—లావో కాదో. ఆయాసంతో రొప్పుతోంది—పీటిమీద నూదంటిగాలి పీడుస్తున్నా, చెమట్లు పట్టేస్తున్నాయి. చెమటంటే తనకి గిట్టదు. ఎండపోటల కూడా, స్నానం చేస్తుంది. ఏసంగిలో నాలుగు దఫాలు—చెమటంటే రోత. కాని ఈ అలుపు చెమటకి వాసన లేదు అదేంటో; విరివి చెమటతో మొహం, మో చేతులు తుడుచుకుంది.

"ఇంతేనా—అయిపోయింది ?" అన్నాడు సదాశివరావు. పళ్లికిలించి నవ్వుతున్నాడు. తెల్లగా ఉన్నాయి పళ్ళు—కండ్లజోడు బాగుండలేదు. అదేదో దయ్యంలా గుండాడు. చెయ్యి వెయ్యబోతుంటే తొలిగినట్లు మరో అడుగు వెనక్కి వేసింది.

"ఇంకెంత, మరో వంద గజాలు."

అలిమేలు నిలబడింది. ఆమెతోబాటు, వెనక తోస్తున్న మనుషులు కూడా నిలిచిపోయ్యారు. రాళ్ళమీద కూర్చున్నారు. తనూ దూరంగా వెళ్ళి కూర్చుంది. తలని మోకాళ్లమీద ఆనించింది. నక్షత్రాలు మెరుస్తున్నాయి. కీచురాళ్ళ ధ్వని పైన నక్షత్రాలదగ్గర నుండి వస్తున్నట్లుగా ఉంది. జనం అలజడి లేదు. నిశ్శబ్దంగా ఉంది. అలసట తీర్చుకోడంలో అలిమేలు పంచ ప్రాణాలు కుదుటపడి మనస్సు నిర్మలంగా ఉన్న ట్లనిపించింది. ఆ క్షణంలో—ఎవ్వరి ప్రమేయమూ పట్టు లేదు—తనూ తానుగా ఎరుగున్నట్లు, తనలో 'తన తనం' గుప్పిట్లో బిగించి చూసుకుని, వోదార్చి, బుజ్జగించి, చివరికి పెడలున తలమీద కొట్టిన ట్లయింది. శివయ్య సిగరెట్టు ముట్టించాడు. పొరవేశాడు. ఇద్దరు మనుషులు లేచి తొయ్యడం మొదలెట్టారు.

"ఊఁ—కానీండి—ఒచ్చేశాం" అన్నాడు శివయ్య.

తనూ లేచింది. తొయ్యడం మొదలెట్టింది. పాదాలకింద గులకరాళ్ళ చక్కిలిగింతలు పెడుతూ ధ్వనిస్తున్నాయి. గాలి జోరైంది—చిరు ముంగ్రుకలు, జడ కొప్పులోంచి విడి, మొహాన్ని కప్పుతుంటే ఒకచేత్తో తొలగిస్తూ, మరొకదానితో తోస్తోంది.

"ఇంతేనా—? అలుపొచ్చిందేం"

అంటున్నాడు శివయ్య. ఆమెలో ఒక ఆవేశం వొచ్చింది. ఎందుకు తొయ్యలేదు—తనొక్కత్తే తొయ్యగలదు, పట్టింపుకొస్తే. బలాన్ని పూరించుగుని ఒక ఉద్వేగంతో అవయవాలకి వేరే ప్రత్యేకంగా రోషమొచ్చి తిరగబడినట్లు తన శక్తంతా ఋయి కాస్త పనికోసమూ ధారపోసినట్లు, ఏదో పూనకం ఒచ్చినట్లు తోసుకుంటూ పోతోంది. జడ వూడిపోయింది. బొడ్డు కింద కుచ్చెళ్ళ విడిపోతున్నాయి. కొంగు రొమ్ముని విడిచేసి తెరచాపలా లేచి వెనక్కి తోసేస్తున్నది ఆమె గమనించలేదు. తన రక్తం, మాంసం, ఎముకలు పరాయి సొమ్మైనట్లు—తనకి చెందనట్లు, తనొక యంత్రంగా దేన్నో, ఎందుకో, ఎక్కడకో తొక్కేళ్ళడమే లక్ష్యం కానట్లు తోసేస్తోంది.

"ఒచ్చేశాం—మరో ఇరవై గజాలు కూడా లేదు. నేనూ వస్తున్నా."

అని సదాశివరావు, సిగరెట్టు పారేసి, కార్లోంచి దిగి, ఆమె వెనకగా నిలబడి తొయ్యడం మొదలెట్టాడు. అతను తగలకుండా, తాను కొంచెం ముందుగా వెళ్ళి తోస్తోంది. తన ఆయాసం, ఒగర్పు అంతా బాగా వింటాడు, ఎట్లా ?

'అమ్మో' మని పెద్ద కేకతో కింద పడింది అలిమేలు. కాలు మడత పడింది. రెండు జబ్బలూ పుచ్చుగుని ఆమెని లేవదీశాడు శివయ్య. జబ్బలు దులుపుకొని, రెండోవైపుకి వెళ్ళింది. సిగ్గేసింది. తను వోడిపోయింది.

"దెబ్బ తగిలిందా ?"

లేదన్నట్లు, వినిపించుకోనట్లు కారు తోస్తోంది అలిమేలు. ఆమె తోస్తున్నవేపు కొచ్చాడు శివయ్య. అదేమిటి అట్లా మీదిమీది కొస్తాడు· అట్లా రావడం ఇష్టమే నని అనిలిమేలు వొప్పుకోలేక పోవడం, నవ్వుగా ఉంటుంది. కానప్పుడు నవ్వే వోపిగ లేదు.—ఏడ్చేటందుకూ వోపిగలేదు.

"ఇంద"

శివయ్య ఒకనోటు పైకి తీశాడు.

ఏరకం నోటో ఆమెకి కనబడ్డంలేదు.

"తీసుకో."

తీసుకుంది. తీసుకుంటే తప్పేమిటి—కష్టానికి కూలి. ఏమనాలో తెలీదు. నవ్వితే అతనికి చీకట్లో కనబడదు. ఆకాశాన ఇంకా మబ్బులే—కాస్త తెరిపియ్య కూడదు ? దగ్గరగా తన నవ్వు చూసునుగా.

వెనకాల తోస్తున్నవాళ్లకి కూడా చెరో నోటూ యిచ్చాడు. వాళ్ళూ తీసుకున్నారు, తనలాగే. తప్పులేదు. అమ్మ కిస్తుంది. అమ్మేది ? ఇంటికాడ కూడొండాలి—వెళ్ళాలి— వెళ్ళింది అలిమేలు.

"ఇదిగో విన్నే"

వెనక నుండి శివయ్య కేకేస్తున్నాడు.

వినిపించుకోకుండా తనింటికేసి పరుగెట్టడం మొదలెట్టింది అలిమేలు. పరుగు నిల్చింది. బలం అంతా అయిపోయింది. ఒక్కొక్క అడుగే మెల్లగా వేస్తూ ఇంటికేసి నడుస్తోంది. ఎవ్వరూ జనం లేరు. కారు గెంటిన వాళ్ళు కొండ అవతలవైపు నుండి వెళ్ళినారు కాబోలు. అక్కడ ఆ రాళ్ళ మధ్య పడిపోయి, నక్షత్రాల కేసి చూస్తూ ప్రాణం విడిచెయ్యాలనుంది అలిమేలుకి. కాని అమ్మో, ప్రాణం ఇడిచెయ్యడమే. తనంటే తనకి అంత ఇష్టం. ఇష్టం గలదాన్ని చెంప పగలెయ్యాలిగా మరి—అందుకని తన బుజాన్ని ఎడం చేత్తో గట్టిగా చరుచుకుని, నడవడం సాగించి, పది నిమిషాల్లో ఇంటికి చేరుకుంది అలిమేలు.

మబ్బు పెద్దదై అంతవరకు మినుకు మినుకు మంటున్న పది పన్నెండు నక్షత్రాలు కూడా కనపడడం లేదు. చీకటివలలో చిక్కుకున్న చేపలా, నలుదిక్కులా భయంతో చూస్తూ యింటికి చేరుకుంది. నోటు విషయం అమ్మకి చెప్పకూడదు.—కూకలేస్తుంది. చెప్తే మాత్రం ఏం ? తనేం తప్పుచేసింది ? పనిచేసి కూలి సంపాదించింది. అమ్మ మాత్రం అవని చెయ్యడంలా—ధాన్యం దంపుళ్ళ కెడుతుంది, మిషను కుట్లు కుడుతుంది. ఊళ్ళోవాళ్ల ఊరగాయలకి అమ్మ చెయ్యి చేసుకోవాలి. ఎవ్వరూ జనం కనబడరేం ? దూరంగా చెట్లకింద ముష్టివాళ్ళ వెలిగించిన మంట ఆరిపోతూంది—పిలిచింది ఎవరన్నా పలుకుతారేమోనని. అమ్మని కేకేసింది. ఇల్లుదాటి ఫర్లాంగు ముందుకెళ్ళి అమ్మని కేకేసింది. నది హోరు వెక్కిరించినట్లు, వెన్నుమీద చరిచినట్లు వినబడుతోంది.

ఇంట్లో కొచ్చింది. తనకి ఆయాసంగా ఉంది. ఆకలేస్తోంది. అగ్గిపుల్ల కోసం తడుముతోంది. బియ్యం పడెయ్యాలి. రొయ్యి పాడుండబ్బా చేతికి తగిలింది. దాని ప్రక్కనే అగ్గిపెట్టె పుల్లగీసి ఇలాయి బుడ్డి వెలిగించింది. అది అప్పుడే ఆరిపోయింది. మరో పుల్ల గీసి, లాంతరు ముట్టించింది. ఊపి చూసింది. కాస్త మిగిలిన కిరసనాయిలుతో లొకలొక లాడింది. తన కాకలేస్తోంది. ఉండబట్టలేక, రొయ్యి పాము తింది, పూగిసలాడే మంచం పట్టెమీద కూర్చుని. కిందినుంచి పరిగెత్తిన ఎలుకని చూసి ఉలిక్కిపడింది. ఇలాయిబుడ్డి తగిలించే చోట, గోడమీద నల్ల డాగులో కదుల్తున్న బల్లి నల్లగా ఉంది.

కళ్ళు మూసింది అలిమేలు. తనొక్కత్తె ఉండడం వింతగా ఉంది. ఇంకెవరూ లేరు—తను, ఆ ఏడుకొండలవాడు—అంతే. తనమీద తనకి జాలి, భక్తి, విశ్వాసము కుదరడం వొక అనుభవం. పెట్టెమీది అద్దంముక్క చీరతో తుడిచి, లాంతరు దగ్గరగా లాక్కుని, అద్దంలో తన మొహం చూసుకుంది. ఎంత బాగుంది తాను. తను మొగాడైతే, అద్దంలో మనిషిని గట్టిగా ముద్దు పెట్టుకుని మరి వొదలదు. నిరుడు తిరణాల కెళ్ళినప్పుడు, ఆ మొగాళ్ళ మంద తనవెంట బడటం అమ్మ కూడా చూసింది. ఆలయంకాడ జనం వొత్తిడిలో ఆడెవడో పోకిరీ వోడు. ఎదురంగా పరుగున వొచ్చి రొమ్ముమీద ఢీకొన్నాడు. తనకి జ్ఞాపకం. ఆ నరయ్యొకడు. అమ్మ అందుకనే వాళ్ళింటికి పోవొద్దంటుంది. ఆ నరయ్య వోపాలి, దూడలపాక దగ్గర, ముల్లు గుచ్చుకుని కింద పడబోయినట్లు తూలి నడుం గట్టిగా పట్టుకుని—ఓయబ్బ—ఇక్కడ గిల్లేకాడు—మోటు పచ్చివాడు. పమిట తొలిగించి తన స్తనాలు చూసుకుంది. నిండుగా, గుండ్రంగా మధ్య సూది పట్టేటంత యెడం కూడా లేకుండా—తనని తాకంటాడా—శివయ్య. శివయ్య పీల, రొయ్యిలా గుంటాడు—నవ్వుతో అద్దంలో నోరు వొంకరైంది.

పెద్ద చప్పుడుతో నదిలో నీళ్ళు పొంగి, ఇంట్లో కొచ్చేశాయి. గేద్దూడ మాయలా భ్రమించింది. కాదు—ఆ రొదేమిటి. అమ్మో తడి—ఇంట్లోకే నీళ్ళు—దూరంగా గుమ్మంలోంచి చూసింది అంతా నీరే—మెల్లగా, వలలా, మొసలి నోరు తెరుచుకున్నట్లుగా, కాళ్ళని చుట్టేసింది. డబ్బాలు, గిన్నెలు, కుండలు, డిక్కిడిక్కిమని కొట్టుకుని ఎగురుతున్నాయి, తేలుతున్నాయి. తన పాదాలు మునిగి పోయినాయి. ఎలుకలు కీచకీచ మంటూ మంచంమీద పరుగులెడుతున్నాయి. మంచం పట్టెమీదకి పాకుతున్నాయి నీళ్ళు. అమ్మో, కొంచె మునిగింది. కెవ్వున కేక పెట్టి, గుమ్మం కేసి గెంతి, కింద పడింది. లేచింది. లాంతరు బుజాన తగుల్చుకుని దొడ్డివైపు వైపు కొచ్చింది. అక్కడికీ వొచ్చేశాయి నీళ్ళు. కొంప మునిగిందిరో అని పెద్దగా అరిచింది. అమ్మని పిలిచింది. ఇరుగు పొరుగు వారి పేర్లు పిలిచింది. ఎవ్వరూ పలకరు., ఇదేమిటి యీ ఆపద—ఇంత ఉపద్రవమా—ఎక్కడికి పోవడం ? ఎటూ. "ఇటు", 'ఇక్కడికి' అన్నట్లుగా నీళ్ళు, తుక్కు, దూగర, ఆకులలము, కట్టెలు, బొగ్గులు, గుడ్డపీలికలు—అన్నీ నీళ్లలో కలిసి, తన మోకాళ్లని పీకేస్తున్నాయి. చలిగాలేదు. కాళ్ళు కాల్తున్నట్లయింది. నీటి వడిని ఎదుర్కొని ఇంటిలోపలి కెళ్లింది. ఉట్టి తాడుకి వేళ్లాడుతూన్న రవికని తీసుకుంది. అది పాతది—చినుగుది. ఉతుక్కొ తీసి, తనకి పట్టడంలా. గట్టిగా బిగించి తొడుక్కుంది. జడలో పిన్ను తీసి, గుచ్చి, తడిసిన గుడ్డపీలికను పిండి, మెడ వెనక జారిన జడని బిగించి కట్టింది. నీరు నడుం దాక వొచ్చేసింది. ఇది తమాషాలాగుందే. మంచం పక్కన నీటిమీద వెంకటేశ్వరస్వామిది—క్రబొమ్మ ఆడుతోంది. దాన్ని తీసుకొని, పళ్లల్లో బిగించి, దొడ్డివైపు కొచ్చింది. చచ్చిపోతానా ? ఇంక ఆఖరే—వెంకటేశ్వరస్వామికి దయలేదా. తనని చంపేస్తాడా ? ఏం పాపం చేశానని అంత కోపం. చచ్చిపోవడం అంటే ఇదా—ఇంతేనా— కాసిని నీళ్ళు తాగి గుటుక్కు మనడమేనా ! తను చావదు. చావంటే అంత సులువా—అంత ఎత్తయిన, లావైన శరీరం,—అంత జోరుగా కొట్టుగునే గుండెలు—గుండెమీద చెయ్యి వేసి చూసుకుంది. చేతి వేళ్ళు ఆ వేగానికి అదిరిపోతున్నాయి. చప్పుడు వినవొస్తోంది—గుండెకాయ కంఠంలోకి చొరపడ్డట్లు. దొడ్డివైపు కొచ్చి నలుమూలలా చూసింది. అంతా నీరే,— మోకాళ్లదాకా వొచ్చేసింది. చీర పైకి లాగి, గోచీలా బిగించి వెనక్కి మడిచి కట్టింది. దొడ్లో రాక్షసిలా ఎదిగిపోయిన చింతచెట్టుంది. దానిమీద కెక్కితే తనకి బెంగలేదు. కాని ఎక్కడం ఎట్లా ? దాని మొదలు తనకంటే రెండింతలు ఎత్తునుంది. ఆపైకి వెడితే. పెద్ద కొమ్మలుగా చీలింది. ఆ కొమ్మలు కుర్చీ బల్లలా, ఏటవాలుగా ఉన్నాయి. ఇంటి చూరుకింద గోడలో, అక్కడక్కడ ఇటికలు వూడగా కంత లేర్పడి పాదానికి పట్టుగా ఏర్పడ్డం, యిల్నించి చూసింది. నోట్లో చందనం బొమ్మ, భుజాన లాంతరు, రెండు చేతులతో పై ఇటుకలు పట్టుగుని, పాదాన్ని కంతలో అనించి, వొకడుగు పైకి వేసింది. కింద నీటి ప్రవాహం.

పైని నెత్తికి తగిలే చూరు. ఎట్లా పైకెళ్లడం? చూరుతో పాడుంగా విడిపోతున్న రెల్లు, లెపలెపమని చిరిగిపోతూన్న తాటాకులు, ఆ మట్టలు చేతికి చిక్కాయి. కుడికాలు పైకి మడిచి, ఒక్క వూపుతో, చూరు పైకి చేరుకుంది. ఆయాసంతో, భయంతో చెమట్లు పోసేస్తున్నాయి. ఆ తాటాకులమీద, ఆ రెల్లు గడ్డిలో మొహం దాచుకుని, ఏడ్చేసింది అలిమేలు. తను బ్రతుకుతుంది—చావకూడదు. దేవుడు కటాక్షించాడు. కాని ఆ తాంత రొకటి. జారి పడితే గడ్డి అంటుకుంటుంది. అంటుకుంటే అంటుకోనీ—ఇంత నీళ్ళుండంగా—కొంప తగులడితేనేం, మునిగితే నేం,—'అమ్మో' అని మరో పెద్ద కేక వేసింది—తను కిందికి జారిపోతోంది. ఆ తాటాకులలో, రెల్లులో పట్టు లేదు—ఏటవాలుగా, కిందికి జారిపోతోంది. మరో క్షణంలో కింద నీళ్లల్లో పడిపోను. లేచి కూర్చుని మోకాళ్లని, తాటాకులలోనికి జొనిపి, మెల్లగా లేచి నిలబడి, చేతికి అందీఅందకుండా అడుగు దూరంలో ఉన్న చింతచెట్టు కొమ్మని బలంగా పట్టుకుని, రెండు కాళ్లూ ఒక్కసారి పైకి ఎగరేసి, చెట్టు మ్రాను మధ్యలోకి గెంతివడింది. కళ్ళు గట్టిగా మూసుకుంది. చచ్చానా, బ్రతికానా ? పొట్టకింద గోకి చూసుకుంది. 'అమ్మో' మని మరో పెద్ద కేక వేసింది. వెన్నుమీద లాంతరు చిమ్మ్రుమంది. చిత్రం ఆరిపోలేదు. చేతులు తనవే. కాళ్ళు తనవే. చేతులకి ఒక్క గాజు లేదు—ఉన్న నాలుగూ గోడకి తగిలి విరిగిపొయ్యాయి కాబోసు. మెళ్లో గొలుసు లేదు. ఆ పెట్టెలో ఉండిపోయింది. నెత్తికి కట్టిన గుడ్డ తీసేసింది. జుట్టు విడిపోయి, గుబురుగా మెడవెనక్కిపడేసి, సరిచేసి, తడిని ఆరబెట్టేటట్టు, చేతులతో చప్పుడు చేస్తూ, జడని పొయకింద లాగి, మ్రానుకింద పచ్చగా లేచిన చిరుకొమ్మకి తాడులా బిగించి కట్టేసింది,

# మృదువైన చర్మమునకు మృదుత్వ మిచ్చునది

# మెరొలిన్

దుర్వాసనపోగొట్టు ఓషధీకృతమైన టాయ్‌లెట్ సబ్బు



చర్మసౌందర్యము ఇప్పుడు అతిసులభముగా పొందవచ్చు. మాలిన్యము తొలగించు సాధనమేగాక మెరొలిన్ శరీర దుర్వాసనల పోగొట్టి, ఆరోగ్యవంతమైన చర్మము నిచ్చి, ప్రతియొక్కరి అందమునకు మెరుగుపెట్టును. ఇందులోని ఓషధులు, దుర్వాసనతొలగించే గుణము ఈ రెండు సౌందర్యపోషణకు మిక్కిలి సహాకరించును.




తయారుచేయువారు:

## ది వెజిటబుల్ సోప్ వర్క్సు,
## కాలికట్

డిస్ట్రిబ్యూటర్లు: మెసర్సు ఏ. జి. పొదువాల్ & కో,
334, తంబుచెట్టి వీధి, మద్రాసు-1.

మెసర్సు ఓమ్ ఏజన్సీస్,
44, మహాత్మాగాంధీ రోడ్, సికిందరాబాద్,

మరో పాయిని లాంతరుకి ముడేసింది. వెన్ను మ్రాను మధ్యగా ఆనించి, కాళ్ళు మరో కొమ్మకి తగిల్చి, ఆకాశంలోకి చూసింది అలిమేలు. అది ఆకాశం కాదు—తను పడిపోకుండా పైన కాసుకొని చూస్తున్న ఒక శక్తి, ఒక వింత—తనెన్నడూ ఎరగని అనుభవం. తన పేరు, ఊరు, అమ్మ, కొంప, వెనక, ముందు, డబ్బు దసకం, తిండి తిప్పలు—ఇవన్నీ మరిచిపోయి, కేవలం కండలో ఎముకలో సజీవంగా, ఊపిరి పీల్చి, ఉండడమే, ఆ వింత అనుభవం. నరాలు, గుండెలు, రక్తం, శరీరంలో ప్రతి అణువు, నోరిప్పి పలకరించినట్లు, కన్ను లాగై తనలోనికి చూస్తున్నట్లు, నోళ్లయి తనని తాకి, ముద్దెట్టుకొన్నట్లు—తను తనలా కాక, మరొకరిలాగ, ఆ మరొకరు తనుగా అయిపోయి, తన్ను తాను కౌగలించుకొని, ఆనందంతో ఒక్క పెట్టున ఏడవడం ఆ వింత.

కొమ్మమీద వార్లబడి కళ్ళు మూసుకుంది అలిమేలు. కళ్ళు మూసుకున్నా, తెరుచుకొన్నా ఒకలాగే ఉంది. రెప్పలకింద కెరటాలు, రంగురంగులవి ఇసుకని కోసినట్లు కన్పించి, చక్రాల కింద ఒకదాని వెనక ఒకటి పెద్ద వక్రంగా మారుతూ చంద్రుడుగా, సూర్యుడుగా, కోటి రంగుల సముద్రంగా పైకి లేచి ఆకాశంలో అంతర్ధానమైపోతున్నట్లు. ఆలోచన లేదు—అమ్మని గురించి ఊహ లేదు. ఆకలి లేదు—సజీవమై ఉండి కూడా నిర్జీవంగా మిగిలిపోవడంలాగుంది.

అది కల కాదు—కింద నీళ్ళు, కాలు జాచితే అందేటంత పైకొచ్చాయి. చెట్టు మొదలు కనబడడం లేదు. ఇంకా పైకొస్తే, ఎక్కడి కెక్కడం—ఆ కొమ్మ చదునుగా, తిన్నగా ఉంది—పైకి ఎక్కేటందుకు పట్టు దొరకదు. కిందంతా నీరు—పైన మబ్బు మూసినదుప్పటిలా ముడతలు పడి, ఆకాశాన్ని చీకటిమయంగా చేసేసినట్టుంది. కింద, పైనా అంతా ఒకటే—తేడా లేదు. నిశ్శబ్దంగా ఉన్నా, ప్రాణానికి ముందు రోదించినట్లు ఆపగలేని మేఘాలు ఢీకొని అయిష్టంగా ఉరిమినట్లు, నది నీళ్ళు పల్లంలోకి జారిపోతూ సిగ్గుతో మొహాన గుడ్డ కప్పుకుని కింద రత్నాలని, మణిమాణిక్యాలని చీపురుతో తుడిచేసినట్లు — తనకోసం, తనపైకి — కడసారి త్యాగాన్ని నోరు విప్పి అడిగినట్లు ధ్వనిస్తూ పొంగి, పొరలి విచ్చలవిడిగా విర్రవీగి పొంగారిపోతావుంది.

గుండె దడ తగ్గింది—తనకి తెలివి మార్పుతో శరీరం స్థిమితపడుతోంది. చావడానికి తగినంత ధైర్యం చిక్కింది. అమ్మ లేనిది తను బ్రతికి ఏం ప్రయోజనం. ఒక్క క్షణం, ఊపిరి బిగపెట్టి, రెండడుగులు దిగితే, అయిపోతుంది.

అమ్మో—ఎందుకు చావాలి ? అమ్మకేం—ఏ లోగిలిలోనో నిక్షేపల్లా ఉంటుంది. చిన్నప్పటినుండి తనెరుగున్న శరీరాన్ని—పాపం గంగపాలు చెయ్యడమా. అదేం చేసిందని ?

కెవ్వున కేక పెడుతున్నా రెవరో—అదిరిపోయింది అలిమేలు. మళ్ళా గుండెదడ ప్రారంభమైంది. అదిరిపాటులో లాంతరు కొమ్మకి తగిలి, అలో లక్షణా అన్న చప్పుడుతో టప్పుమంది. చిమ్మ చీకటేసింది—

ఎవరిదో కేక పెద్దదైంది. మూలుగు, రోద. కాపాడమని—అయ్యో, బాబోమని—అరుపు. అది మొగాడి కంఠం. నిలబడి నాలుగు దిక్కులా చూసింది. ఒక కంప తన చెట్టు వెంపుకు కొట్టుకొని వస్తోంది. అందులోంచి ఎవరో చేతులు పైకెత్తి మొరెట్టుకుంటున్నారు. దగ్గర కొచ్చేసింది. రెండు చేతులతో కొమ్మని గట్టిగా పట్టుకొని, కాళ్ళు కిందికి నీళ్ళు తాకేటట్లు చాచింది. కొట్టుకుపోతోన్న కంపలోంచి పైకి కనబడుతోన్న ఆ చెయ్యి ఆమె పాదాలని గట్టిగా పట్టుకుంది. చాలా బరువు. కొమ్మని తన పట్టు నిలవడంలేదు—జారిపోతోంది.

ఆమె మోకాళ్ళు పట్టుగుని మ్రానుమీద ఒక కాలుంచి, ఆ వ్యక్తి కొమ్మ మొగలో ఆమె ప్రక్కనే కూలబడిపొయ్యాడు.

“గట్టిగా పట్టుకో .... వొదలకు ....” అని వొగరుస్తూ సదాశివరావు. ఆమె నడుం గట్టిగా పట్టుగున్నాడు. నీళ్ళ పొట్లోంచి బైటికి వొచ్చేస్తున్నాయి.

“కాపేవుంటే చచ్చేవాడినే ....”

‘హయ్యో’ అని ఆయాసంతో హైరాణ పడుతున్నాడు.

“మీరా ?” అంది అలిమేలు తెల్లబోయి.

“నేనేమిటి, నువ్వేమిటి చస్తూంటే ....”

“మెదలకుండా వుండండి—ఇదుగో ఈ కొమ్మకి కాలు ఆనించండి—ఆ—అల్లాగ—అవైపు కొమ్మని నడుం ఆనించి. పట్టుకోండి—మాట్లాడకండి” అంది అలిమేలు, నడుం పైనుండి అతని చేతులు తొలిగిస్తూ. అతని దవడలు, అంకెళ్లు తడికి, చలికి నొక్కుకుపోయి మాట్లాడలేక పోతున్నా, ఏదో చెప్పాలని, బిగ్గరగా ధ్వనులు చేస్తూ, యత్నం చేస్తున్నాడు.

“ఆఖరికి నువ్వే దిక్కయ్యావు ...”

డ్రైవర్ ఉడాయించాడు—నౌకర్లు లగెత్తారు—చివరికి—అది—సువర్ణ కూడా—ముందే తెలుసుకుంది కాబోలు,—ఈ నది గండి పడి ఉపద్రవం జరుగుతుందని—ఎప్పు డెళ్లిపోయిందో—ఐపులేదు. నేను—నేను ....”

అలిమేలు ఆశ్చర్యంతో చూస్తోంది. కళ్ళు పూర్తిగా తెరుచుకుని—మొహం అంతా ఒక కన్నైనట్లు.

“మాట్లాడకండి ....”

“మాట్లాడకపోతే చచ్చిపోను, భయంతో. మాట్లాడి తీరాలి—ఇంకా బిగ్గరగా మాట్లాడతాను .... నేను, .... నాలుగింటికి క్లబ్బు కెళ్లాను. చీట్లాట .... అంటే పేకాట .... రమ్మి అంటారులే—నీకు తెలీదు. ఇరవై కాజేశారు. మరో గంటుంటే అదంతా రాబడుదును. ఈ లోగా టెలిఫోన్లు మోగాయి,—నీళ్లొచ్చేస్తున్నాయని .... కార్లో ఇంటికి బైలుదేరాను. కాస్త దూరంలో కారు చెడింది—వాళ్లనీ, వీళ్లనీ పోగుచేసి కారుని కొండ పైకి జేరేశాను. ఇంట్లో ఎవ్వరూ లేరు. అవి ఇవి సర్ది, డబ్బు పర్సులో వేసి కారు రిపేరు పూర్తిచేసి బైట కొచ్చేటప్పటికి, అప్పుడే నీళ్ళు కిటికీ దాకా వొచ్చేశాయి. కార్లో కూర్చున్నా—గరాజ్ తలుపు లూడి తేల్తున్నాయి. గట్టి కర్ర—మందంగా ఉన్నాయి. తాళ్లతో రెండు తలుపులనీ ఒకటిగా కట్టి—వాటిమీదకు గెంతాను...... నువ్వేకదూ—కారు తోసింది—అట్లా చూస్తావేం ?”

ఎవర్నో అన్నట్లు, వెనక్కితిరిగి చూసింది అలిమేలు. తననే అంటూంట. ఏమనాలి ? ఏమీ మాట్లాడలేదు. కండ్లకి జోడు లేదు. కళ్ళు చిన్నవిగా, లోపలగా ఉన్నట్లున్నాయి. క్రాపింగు నుదుటిమీద పడింది—చొక్కా తడిసింది. నెత్తిన కప్పిన తువ్వాలు తీసి నడుంకి బిగించాడు. ఆ తువ్వాలు తన కిమ్మని సంజ్ఞ చేసింది. ఇచ్చాడు. బాగా పిండింది. నీళ్ళ వొదిలేటట్లు కొమ్మంకేసికొట్టి అతనిచేతి కందిచ్చింది.

“ఏం—అప్పుడు—చూస్తూ చూస్తుండగా, నీళ్లల్లో తేలిపోతూ, కిందికి పడవలా జారుతూ వొచ్చేశాయి. ఏదో కంపకో, రుప్పకో తగులుకుని నిలిచిపోయింది. ఇరుక్కుపోయింది. అప్పుడు మొదలెట్టింది భయం.

...అన్నీ ముళ్ళు కదుపుదామంటే. ఆ కంపనే పట్టుకు కూర్చోవాలి. కేకలెట్టాను. అందులో ఏ పామో కరిస్తే—చస్తాను. అరుపులు, ఏడుపులు”

“నాలాగ భగమంతుణ్ణి తల్చుకోలేక పొయ్యారా ?”

“చావు రానుంటే భగవంతుడు కూడా తప్పించలేడుగా. ప్రాణం రక్షించుకొనే సమయంలో నా కెవ్వరూ జ్ఞాపకం రాలేదు—ఆవిడ, నాన్న, అమ్మ, నౌకర్లు—నాకు నేనే—ఆలోచన లేదు—బుర్ర లేదు— ఈ భయం, ఏడుపు, అనుకో .... అమ్మో—చచ్చాను.”

అని మోచెయ్యి పట్టుగుని బాధపడుతున్నాడు సదాశివం.

“ఏమిటది ?”

“ముళ్ళు—అన్నీ ముళ్లే—చస్తాను ....” అలిమేలు రవికకి బిగించిన పిన్ను—కాస్త పక్కగా తిరిగి, బైటకి తీసి అతని మోచెయ్యి దగ్గరగా లొక్కుని, ముల్లుని కెలుకుతోంది. ‘బాబోయ్’, ‘అమ్మోయ్’ అంటూనే ఉన్నాడు అతను. మెల్లగా బైటకి లాగింది. చీకిపోయిన ముల్లుని.

“వొద్దు—ఆ బాధ కంటె ఈ బాధ ఎక్కువగా ఉంది—వొద్దు.”

“పరవాలేదు.”

“ఇదుగో.” భుజం చూపించాడు— చొక్కా మెడ కిందికి తోసి, భుజాన ఉన్న ముల్లు కోసం వేళ్లతో తడుముతోంది అలిమేలు. దొరికింది

పిస్సుతో కెలికుతోంది. అతను పెద్ద కేకపెట్టి ఆమెమీద వొరిగిపోయి గట్టిగా నడుం బిగించి పట్టుకున్నాడు. ఆమె స్తనాలు అతని వక్షం ఎడమ భాగానికి తగుల్తున్నాయి—తడిగా, వేడిగా... అల్లాగే ఉండిపొయ్యాడు.

కదలదేమిటి ? బుజం పట్టుకుని వూపి దూరంగా కూర్చోపెట్టింది.

"వొదలకు—నన్నొదలకు—వొదిలావంటే చస్తాను. భయంగా ఉంది." అని మళ్లా ఆమెని గట్టిగా పట్టుకుని, చేతులతో ఆమె శరీరాన్ని నిమురుతూ, దేనికోసమో వెదుకుతున్నట్లు ప్రతి అవయవాన్నీ స్పర్శిస్తున్నాడు. ఆమె కిదంతా వింతగా ఉంది; ఎల్లాగో ఉందబ్బా. చక్కిలిగింతగా ఉంది—ఇదేమిటీ, పొయ్యేకాలం—ఇట్లా చేస్తాడు ?

అతని క్రాపింగ్‌కి, బట్టలకి ఏదో బురద—మడ్డి— తనకి రాసేస్తున్నాడు. నుదురు స్తనాల మధ్యగా ఆనించి పొడుస్తాడేమిటి ? పెదవులతో చర్మం పట్టుకుంటున్నాడు—ఇదేం మనిషి—రోతగా ఉంది. తనకి తెలీకుండా అతని తలలో వేళ్లుపెట్టి తడుముతూ, మడ్డిని తొలగిస్తోంది. ఇంకా గట్టిగా నడుం బిగించివేస్తున్నాడు—అబ్బ—ఎంత బరువో మొగాడు! తోసేస్తే కింద నీళ్లలో పడతాడు. ఇద్దరూ పడతారు. ఎట్లా. జుట్టు వేళ్లల్లో బిగించి, తల పైకెత్తింది. అమ్మో అంటూ లేచాడు—కళ్లు తెరడు—మైకంలో ఉన్నాడా ? తాగాడా ? చస్తాడా ఏమిటి ? తను చంపేసిందంటారా ఏమిటి కర్మ—ఏమిటి చెయ్యడం ? చుట్టూ చూసింది. అన్నివైపులా గుడగుడమని ప్రవహిస్తూ నీళ్లు. ఆకాశంలో శవంపై కప్పిన గుడ్డలా మబ్బులు. అమ్మో, బొడ్డుపైన వళ్లు తగుల్తున్నాయి. జుట్టట్టుగుని తలపైకి లేవదీసి గట్టిగా లెంపకాయ కొట్టింది—పూనకంవోళ్లని కొట్టడం తను చూసింది.

కళ్లు తెరిచాడు. తేరిబారి చూశాడు.

"నువ్వు, నువ్వా కొట్టింది ? నువ్వే ?"

"తెలివిగా వున్నారో లేరో నని."

నవ్వింది అలిమేలు.

"నాకేం తెలీదు. భయంగా ఉంది. మనిషి కావాలి. నువ్వు కావాలి. నీవొళ్లు భలే వేడి—నిప్పులా—చలిమంటలా—మెత్తగా, గట్టిగా గబ్బరగింటిలా...."

ఇంకా చెబుతూండగానే రెండో లెంపమీద మరో దెబ్బ వేసింది.

'అబ్బ !' అని అదిరిపడ్డాడు.

అతనికి కోపం వచ్చేసింది.

"ఎందు కట్లా కొట్టావు—"

"మెలుకువగా ఉన్నారేమోనని."

"ఛ, ఛ—కొడతావూ—తోసేస్తే నీళ్లలో పడి చస్తావు."

"నాకేం భయంలేదు—మీకే భయం. నే నీళ్లలో పడితే, మీరు ఒంటరిగా ఉండగలరూ—నా వెనకే దూకుతారు."

"నిజమే—వొంటిగా ఉండలేను—"

అని మళ్లా ఆమె వక్షంలో మొహం దాచి, శరీరం స్పర్శిస్తూ, గట్టిగా కౌగలించుకున్నాడు.

"వొదలద్దు—నీ కేది కావాలంటే అదిస్తా—మేడ—కారా—నగలా—నీ వొళ్లు ఎంత బాగుందో నువ్వెరగవులే—వొక పెద్ద శిధిలమైన కోట మధ్యలో తలదాచుకున్నట్లుంది. నీ చేతులు, కాళ్లు పారావాళ్లు. నీ రొమ్ములు కత్తులు—నీ జుట్టు వల. నీ కళ్లు, శత్రువుల జాడ తెలుసుకునేందుకు కోట గోడలో కంతలు—"

"ఇయ్యేం వనులు—మంచి బుద్ధులే."

అని దూరంగా జరిగి పట్టు వొదిలించుకోవాలని పెనుగులాడుతూంది అలిమేలు.

జుట్టు పీకింది. మొట్టికాయలు మొట్టింది—

'బాబోయ్' అని లేచాడు—

చేతికి తగిలిన చందనపు బొమ్మ పైకి లాగాడు.

"బుగ్గకి పొడుచుకుంది—నీ మొల్లోది—ఇదేమిటి ?"

"ఎంకటేశ్వరసామి బొమ్మ—మొల్లో దాదా—బాగా అయింది—మరి లేకుంటే అయ్యేం పోకడలు ?"

బొమ్మ లాక్కుంది.

"ఎందుకా బొమ్మ ?"

"ఉండాలి. దేవుడు."

సదాశివరావు బిగ్గరగా నవ్వుతున్నాడు. మూఢభక్తి కాబోలు. కాని నవ్వు క్షణంలో విర్చిపోయింది. నీళ్లు 'కసకస' మంటూ పాదాలకి తగిలేటంత పైగా వొచ్చేశాయి. పెద్ద కేకతో ఆమెను గట్టిగా పట్టుకున్నాడు.

"అమ్మో" అంది అలిమేలు.

"ఇంక చావడమే. నీళ్లు పైకొచ్చేస్తున్నాయి. ఎట్లా ?"

బిక్కమొగం పెట్టి ఏడుస్తోంది. చెట్టుపైకి చూశారు. పైకొమ్మ అయిదా రడుగుల దాకా, సాఫీగా, తిన్నగా—ఎక్కడా పట్టు లేకుండా పైకి లేచి ఆపైన వొంకర తిరిగి సన్నగా ఒంగిపోయింది. ఆ ఐదా రడుగులూ పైకి వెళ్లడం ఎట్లా ?

ఒకరి మొహాలు వొకరు చూసుకున్నారు. మేఘాలు కూడా తలలు కొట్టుకుని ఏడుస్తున్నట్లు, ఒకసారి గర్జించి—బురద కన్నీటి ధార వర్షంగా వారి నెత్తిన అవతరిస్తున్నాయి.

అతని కళ్లల్లో మృత్యువంటే భయం ఎట్లాంటిదో చూసింది. కాసేపు మూసుకుపోయి, ఆ మూతలో కాస్త తెరుచుకుని నల్లకొలికలో తెల్లపాప, నల్లటడివి మధ్యలో సెలయేరులో ఎగిరిపడిన చేపలా తళుక్కుమని, మళ్లీ చీకటిలో కరిగిపోయిన, 'భయం' అనే గుడ్డుని చూసి యిదివరకెన్నడూ ఎరగని జాలితో అతని తల లాక్కుని, తన వక్షంమీద ఆనించుకొని ఏడ్చేస్తోంది అలిమేలు. అంతటా తడి—నీరు—చెమ్మ—ఒకరిలో ఒకరు దాక్కుని, కలిసి పొడి చేసుకున్న ఆ కాస్త చోటు తప్ప—అక్కడే జీవం లంగరు వేసుకున్నట్లు, కాసేపు వూపిరి సలుపుతోంది—తడిలోంచి, నీటిలోంచి, అగ్ని పుట్టించినట్లు—రెండు ప్రాణులు ఒక్క శరీరాన్ని నిలబెట్టినట్లు—ఆమె మోకాళ్లమీద అతని పాదాలు—ఆమె రొమ్ములమీద అతని మోకాళ్లు—ఆమె భుజాలపైన అతని తొడలు—ఎక్కడికో పైకి పాకిపోతున్నాయి, బలగల్లా పట్టుకుని, ఆకాశంలో తొర్రని వెదుకుతూ—చేతులు ఆమె నెత్తిన పెట్టాడు—పాదాలు భుజాలపైన,—నిలబడ్డాడు—ఆ వొంగిన కొమ్మ మొదలు చేతికి చిక్కింది. పట్టుకున్నాడు—కాళ్లు పైకి లాక్కుని, ఆపై కొమ్మమధ్య కూలబడి, గట్టిగా పట్టుకుని, మూల్గుతూ, మూల్గుతూ సజీవంగా ఉన్నాడు సదాశివరావు.

అలమేలు ఏడ్పు మానేసింది. ఏడవడం సాధ్యం కావడంలేదు. పైకి చూసింది. పీడ విరగడైనాడు, చక్కంగా—మారాజు. బ్రదికాడు. అమ్మయ్య వూపిరి వొస్తోంది. తొక్కి, నలిపేసేసి చంపేశాడు—నీళ్లు పైకి రానీ, ఎంత వర కొస్తాయ్యో చూస్తాను. చస్తాను, అంతేగందా—ఆడి చేతుల్లో, కాళ్ల కింద పడి చావడం కంటె, గంగపాలవడం మంచిది. ధీమాగా కూర్చుంది.

"రా, రా, పైకి, రా" అంటున్నాడు పైనుంచి.

రానన్నట్లు కిందికి చూస్తూ తల వూపడం అతనికి కనపడ్డంలేదు.

"భయమేస్తోంది. ఇదిగో—నా కాలట్టుగో."

"నే రాను."

"కోపమా ?"

"ఏడుపు."

నవ్వాడు సదాశివరావు ఏమిటో అర్థంలేని సంభాషణ. తను అడ్డంగా ఉండడం మూలాన వర్షం ఆమెమీద పడుతున్నట్లు లేదు. జుట్టు విడదీసి దులుపుకుంటోంది.

"ఇదిగో—తీసుకో."

పైకి చూసింది. చేతులో ఏదో ఉంది కనబడ్డంలేదు.

"నువ్వో—రాకపోతే, నేనే దిగుతాను—"

"వొద్దు. ఇద్దరం పడి చస్తాం."

"''ఇద్దరం చస్తే భయంలేదు."

కాళ్లు ఆమె బుజాలకి తగుల్తున్నాయి.

"తీసుకో."

కాళ్ల వేళ్లలో ఏదో ఉంది. తీసింది. తడిసిన రూపాయల నోట్లు. తనకెంత కోపం ఉన్నట్లు తెలుసుకుని ఆశ్చర్యపడింది అలిమేలు. ఆ నోట్లు తీసుకుని ముక్కలు ముక్కలుగా చించి నీళ్లల్లో పారేసింది.

"చాలా—ఇవిగో—ఇంకా ఉన్నాయి. దిగుతున్నా." అంటూనే కిందికి దిగాడు సదాశివరావు. ఆమె పక్కగా తొలిగి కొమ్మని పట్టుగుని నుంచుంది. వర్షం నిలిచింది. కింద నది రొద ఎక్కువైంది. నీళ్లు వేగంగా కదిలి పోతున్నాయి. హెచ్చిన వేగంతో రొద పెరిగింది. ఏవేవో చప్పుళ్ళు. తాటాకులు కాలినట్లు, డబ్బాలు ఢీకొన్నట్లు, దూలాలు విరిగి పడ్డట్లు. తన ఇంటి కప్పు కూలిపోవడం చూసింది అలిమేలు. గోడ విరిగి, కరిగి జారిపోయింది. ఇంటి భాగాలు నీళ్లల్లో పోతున్నాయి—అటుకేసి, నదికేసి, దూరంగా, ఇంకా దూరంగా చీకట్లోకి. భయంతో వొణికిపోతూ కూలబడి ఆమె తొడలు పట్టుకుని కూర్చున్నాడు. ఆమె వొంటిమీద మిగిలిన చీర చాలా భాగం వూడి పోయింది. ఒక చేత్తో ఆమె స్తనాలు కప్పుకుంది, రెండోదానితో అతని పట్టు విదిలిస్తోంది. మరికొన్ని నోట్లిచ్చాడు. తీసుకొని చించి, నోట్లో నమిలి, నీళ్లల్లోకి వూసింది.

"అదేమిటి—?"

"ఉమ్ము."

"ఛీ, ఛీ—డబ్బు పారేశావా—ఏం ఇదిగా ఉంది. ఏమనుకున్నావు ?"

"చచ్చినదా న్ననుకున్నాను."

"డబ్బు చేదా ?"

"విషం."

అతని భుజంపైన పాదా లానించి, లేచి నిలబడి పై కొమ్మలోకి ఎగ బాకి, మధ్య తొర్రలో కూలబడింది.

"నన్నొదిలేసి పోతావా ?"

"నువ్వొదిలెయ్యలా ?"

ఆశ్చర్యపడ్డాడు. భయంవల్ల కోపం ప్రకటించలేక పోతున్నాడు. అది కోపం కూడా కాదు—అదొక ఉన్మాదం—ప్రాణి మరో ప్రాణిని వెదుక్కుని, నిలబడేందుకు చేస్తున్న ఆరాటం అని కూడా అతనికి తెలియదు. ఆమె కావాలి—ఆక్షణాన అతను పొందిన అనుభవం—అదొక ప్రశాంతత, ప్రకృతి గుండెల్లో దూరబడి తను వాడ్లై కొట్టుకుంటున్నట్లు—ఇదివర కెన్నడూ ఎరగడు. దానికి స్వరూపం లేదు—అది కామం కాదు, వాంఛ కాదు. సృష్టి రహస్యం తనలో వుంచుకొని దానిలో ఐక్యత పొంది నశించిపోయినట్లు—ఏమో—కావాలి. ఇంకా కావాలి—లేకపోతే చచ్చిపోతాడు—ఆ కౌగలింపుతో చావడం ఎంతో అవసరంగా తోచింది. అతని వొళ్ళు తడిమంటలాగుంది. ఆమె పాడిసీరుగా—ఏమో—అర్థంలేని ఆలోచనలు.

"వొస్తున్నా—పైకి." అన్నాడు.

అతని కంఠమే మారిపోయింది. నది రొదలా వినిపించింది. ఏవో అరుపులు, ధ్వనులు—భ్రమా, నిజంగానా ? మేఘాలు విడిపోతున్నాయి. తొందరగా కదిలి మధ్యలో నిర్మలమైన ఆకాశం వచ్చటి గాజుపెంకులా, మధ్యం వుచ్చుగున్న చందమామ వెలుగులో మెరుస్తోంది. నీరసమైన చెట్టునీడలు నల్లగా నీళ్లల్లో పడి కొట్టుకు పోతున్నాయి. ఆ చందమామ చప్పగా ఉంది—కాని అదొక వెలుగులా, శరీరానికి వెచ్చగా తగిలినట్లనిపించింది అతనికి. ఇంక దిగిపోతోంది చందమామ—వెలుగు పిలుపు వినిపించుకోని నల్ల మేఘాలు, వొంటిమీద కాల్చి వాతపెట్టినట్లు అంచులమీద వెలుగునీడ మోసుగుపోతున్నాయి. పైకి చూశాడు. ఆ వెలుగులో ఆమె మొహంమీద నీడలు పడుతున్నాయి. అది నోరు, అది ముక్కు రంధ్రం, వొంపు కాబోలు—స్తనాలపైన సన్నటి కాంతికి, కింద వికృతంగా నీడలు సాగుతున్నాయి. జుట్టు భుజాలమీద పడేసుకుంది. అది నడుం వొంపు—నునుపుతో, గుండ్రంగా మెరిసిపోతున్నాయి తొడలు—లేచి నిలబడ్డాడు— ఆమె రెండు పాదాలు తన మొహంమీదికి లాక్కుని, తల ఆమె వొడిలో దాస్తున్నాడు.

ఏదో చప్పుడు. ఉలిక్కిపడ్డాడు. దూలాల మోత. మనిషి అరుపు—పెద్దపెద్ద కేకలు—దూరంగా—నలుదిక్కులా పరకాయించి చూశాడు.

"ఏమిటది—అరుపు—వినబడుతోందా ?"

సమాధానం లేదు.

"విన్నే."

ఆమె మిగిలిన చీరని నడుం చుటూ బిగించుకుంటోంది. ఆమెకి అతన్ని చూస్తే జాలి పుడుతోంది. పాపం—బతికాడు—భలే కౌగిలించుకుంటాడు. తనకీ అదో లాగుంది. మనిషి తాకిడి కావాలి. చలి, భయం, బాధ. మొగాడి వొళ్ళు భలే ఉంటుంది—ఆ బుజాలు, కండలు— ఆ కంఠం, చేతులు, వెచ్చగా, తడిగా, వేడి రక్తం—నది వొడ్డున నల్లటి మనుషుల కండలు కదలిక జ్ఞప్తి కొస్తోంది. చెయ్యిపెట్టి తాకాలనుంది. మోటగా ఉంటుంది. మోటతనం తనకి గిట్టదు—కాని అదే కావాలనుంటుంది ఎందుకో. ఆయనంటే రోత—గిట్టదు. కాని ఆ శరీరం అల్లా తాకితే హాయిగా ఉంటుంది. ఆ తలలో వేళ్ళుపెట్టి, వెంట్రుకలని పీడించి, లెంప పగలెయ్యాలనుంటుంది——ఇదంతా ఏమిటో. వెంకటేశ్వర్లు జ్ఞప్తికొచ్చాడు—పెద్దోడే—ఆడి వొళ్లు ఈసారి బాగా తాకి చూడాలి. ఇంతైనాక, తనకేం భయం ? ఇదంతా బతికి బైట పడింతర్వాత గదా—ఈ లోగా, ఈయ నెట్లా—ఏదో చేసేలాగున్నాడు—ఇదేం కర్మ—అప్పుడు, అక్కడ, ఎవరు ఎవర్ని ఏంచేస్తే ఏంగాను—ఎవరి క్కావాలి...ఎవళ్ల బతుకులు వాళ్లవి.

ఎవళ్లకీ తెలియదు. అమ్మకి తెలియదు, వెంకటేశ్వర్లుకి తెలి ....

"అలిమేలూ" అంటూవున్న కేక విని నిలిచిపోయింది. మళ్లా మళ్లా 'అలిమేలూ' అని పిలుస్తున్నా రెవరో. అవును. తనపేరే. ఎటు ? ఎక్కడ నుంచి ? అటూ ఇటూ చూస్తోంది. నీళ్ళు కిందికి దిగిపోతున్నాయి. బాగా బాగ కిందికి—మరీ వేగంతో నదివైపు పల్లంలోకి.

ఎవళ్లో గంగమ్మతల్లి పీక నులిమినట్లు, ఏడుస్తూ, రోదిస్తూ, బాధనుండి తప్పించుకు పారిపోతున్నట్లు, ఏమీ చేతకాక కసితో అన్నింటినీ పాడుచేసి పోవడం మంచి దన్నట్లు, నీళ్ళు అందినదాన్నల్లా తోసి, త్రవ్వి, తన్ని, తన వెన్ను మీదికి లాక్కుని ఉడాయిస్తోంది. ఆ కేక అటు నుంచి— అన్నీ రుప్పలు, పుంతలు, చెట్లు చేమ, డబ్బాలు, పెట్టె, దూడ, మేక, కర్ర కంప, వేగంతో తను కూర్చున్న చెట్టు మొదలు చుట్టూ ప్రదక్షిణం చేసి, బలికెళ్లే మేకపిల్లలా, పీకతెగిన కోడిలా తిరిగి తిరిగి, కొట్టుకుపోతున్నాయి. తన పేరు స్పష్టంగా వినబడుతోంది. సందేహంలేదు.

"ఎవరది ?" అని కింద నుంచి సదాశివరావు.

మళ్లా పిలుపు 'అలిమేలూ' అని.

'ఆ' అని బిగ్గరగా పలికింది. పలికింది కాని కంఠంలోంచి మాట పైకి రాలేదు. నొక్కుకుపోయి గాలి మాత్రం బైటకొచ్చింది. గొంతుకు సవరించుకుని, మరోసారి 'ఆ' అన్నది. కంఠంలో జీర—కత్తితో ధ్వనిని చీల్చినట్లు, దుప్పటి కప్పి పీకని నులిమినట్లు—'ఆ' అంటే లాభంలేదు. ఏదో అనాలి.

'ఆ. నేనే—ఇక్కడ' అన్నది అలిమేలు. కొన్నిధ్వనులు, బైటపడ్డాయి. ఇంక ఫరవాలేదు. అదుగో ఆ కొండవైపునుండి ఏదో ఆకారం, తను చెట్టు వైపుకి వొస్తున్నట్లుంది. మళ్లా 'అలిమేలూ' అని కేకలు.

"ఆ, ఇక్కడ—ఇక్కడే' అని బిగ్గరగా పలికింది.

"నోరు మూసుకో. అరవకు" అంటున్నాడు శివయ్య.

మళా, మళ్లా 'అలిమేలూ' అన్న కేక పెద్ద దవుతోంది. ఆ ఆకారం—దేనిమీదో నిలబడి—పిలుస్తున్నట్లుంది. దూలాలు కాబోలు—ఏదో పడవలాగుంది. అతనే—వెంకటేశ్వర్లు పిలుపు. తన వెంకటేశ్వర్లు. తబ్బిబ్బుగా లేచింది—బొడ్డుకింద చీర కొంగు బిగించింది. అమ్మయ్య. వెంకటేశ్వర స్వామి బొమ్మ భద్రంగా ఉంది.

"ఇక్కడ—ఇటు" కేకలేస్తోంది.

అది పడవలాగుంది. ఇటొస్తున్నాడు.

"ఇక్కడ—నేనే—రా, రా, ఇటు"

అంటోంది. దిగాలి—కింది కొమ్మలోకి దిగాలి. ఈ సదాశివయ్య లేచి నిలబడితే బాగుండును. భుజంమీద కాలుపెట్టి దిగొచ్చు. దిగాలి.

"ఇదిగో .... చూడు .... "

అతను తనకేసి చూడ్డంలేదు. ఎట్లా ?

"...ప్పు, వొచ్చే" అని అరుస్తున్నాడు వెంకటేశ్వర్లు. దగ్గర కొచ్చేశాడు.

"ఇటు, ఈ చెట్టుమీద" అన్నది అలివేలు.

చెట్టు మొదట్లో దూలం పడవ తగులుకుని చప్పుడైంది. లేచి నిలబడ్డాడు వెంకటేశ్వర్లు.

నెత్తికి ఏదో తువాలు లాంటిది కట్టుకున్నాడు. చొక్కా లేదు. పొట్టి లాగు—వాడే—

"ఇక్కడ" అంది.

చెట్టు మొదట్లో తడుముతున్నాడు—పట్టుకోసం.

"అమ్మేది—నువ్వు బాగుండావా ?"

"అమ్మ బాగుందిలే .... "

ఏవో ధ్వనులు చేస్తున్నాడు. ముక్కుతూ, రొప్పుతూ. పట్టు చిక్కినట్టుంది. పాదం ఆనించాడు, ఒక చేత్తో కొమ్మ మొదలు పట్టుగుంటున్నాడు. ఒకచేత్తో కర్రబొమ్మ గట్టిగా పట్టుగుని, రెండోదానితో కొమ్మని కౌగలించుకుని, మెల్లగా కింది కొమ్మలోకి జారింది అలివేలు. శివయ్య వెన్నుమీద పాదం ఆనింది. ఏదో పెద్ద చప్పుడైంది. అదిరి కిందికి చూసింది—ఏడీ ? వెంకటేశ్వర్లు లేడు. 'దబ్బు' మని చప్పుడు—పడవేది ? అటుటు మంటూ దూలంపడవ కొట్టుకుపోతూంది—మనిషి లేడు—ఏడీ ?

"తోసేశావా ?"

అంది, సదాశివరావుకేసి కోరగా చూస్తూ.

అతని చెయ్యి ఆమె నోటిమీద పడింది. రెండో చెయ్యి రొమ్ముమీద పెనవేస్తోంది. చేతిని కొరికింది. 'అమ్మో' అన్నాడు సదాశివరావు. తేరుకుని చూసేసరికి ఆమె లేదు. నీళ్లల్లో చప్పుడైంది. దూకేసింది. పడిపోయింది—నీళ్లల్లో కొట్టుకుపోతూంది. తన్నుకులాడుతోంది. జలజల కొట్టుకుంటూంది—'అమ్మో!' 'వెంకటేశ్వర్లూ'—'అయ్యో' అని కేకలు పెడుతోంది. అదేదో రుప్పలాగుంది. అందులో ఇరుక్కుంది. తను దూకితే—? దూకగలడా ? దూకి ఏం ప్రయోజనం ? మొహం మోకాలుమధ్య దాచుకొని, అస్పష్టంగా, కళ్లు సగం తెరిచి ఆమె కొట్టుకుపోతూన్న దృశ్యం, తనెరగనట్టు, తనకి తెలీనట్టు చూస్తూ, గజగజ వొణికిపోతూ కూర్చున్నాడు సదాశివరావు.

ఇంక మరి కేకలు లేవు. అరుపులు లేవు. వెనక్కి మళ్లుతున్న నీటి రొద తప్ప అంతా ప్రశాంతంగా ఉంది.

గుండెలు కొట్టుకోడం లెక్కపెడుతూ కాలం తెలుసుకోలేకపోతున్నాడు.

నీళ్లు గబగబా జారిపోతున్నాయి. వొస్తువుల, కళేబరాలు శిల్పాలల్లే బురదలో ఇరుక్కుని నిల్చిపొయ్యాయి—పల్చటి పొరలా నీరు అక్కడక్కడ పారుతోంది—పాము కూసంలా—ఆ చెట్ల మధ్య, ఈ రాళ్ల మధ్య, దూరంగా కొండ కనబడుతోంది. దానిమీద మిగిలిన తన బంగళా—నుదుటిమీద చుట్ట కాల్చి మచ్చలాగు. అక్కడక్కడ బురద మరకలు. చందమామ లేడు—గాలి స్తంభించింది. ఆకాశం, పసివాడి వొంటిమీదనుంచి కప్పు తీసేసినట్టు ముడుచుకొని తన్నుకునేటందుకు వోపిక లేనట్టు, నిశ్చలంగా ఉంది. అది కాకి రెక్క—ఇది కుక్క కాలు, అది కంప, ఇవి గుడ్డపీలికలు. నాగరికత ముసుగు లోంచి బైట పడగా మిగిలిన ప్రకృతి—తనొక్కడే సజీవుడై ఉన్నాడు.—ఉన్నాడా? కళ్లు విప్పి చూశాడు—వొంటిని గిల్లి చూసుకున్నాడు. ఊపిరాడుతోంది. ధ్వనులు వినబడుతున్నాయి. కనబడుతున్నాయి. దూరంగా ఆ కొండపక్క ఒకదీపం. మనుషుల అలజడి—అస్పష్టమైన కేకలు, ఏడ్పులు. తెప్పలమీద జనం అటూ యిటూ పదిన్నైపున వొస్తున్నారు. అక్కడ నీరు పల్చబడింది. అటు

ఎత్తు. పడవలు విరిచిపొయ్యాయి. తను కూర్చున్న చెట్టు కింద నీరు అంత లోతు లేదు. దిగి చూడొచ్చు. ఆ మడ్డిలోకి, రొంపిలోకి ఎట్లా దిగడం ? తనకింకా ధైర్యం లేదు. ఆ పిల్ల ఏమైందో ? ఎక్కడో ఇరుక్కుని ఉంటుంది. వాడు ? వాడేవిటి మధ్యలో—ఎందు కొచ్చినట్టు. భలే సాహసం—రక్షించాలని వచ్చినట్టున్నాడు. ఏమైంది ? కాలుజారి పడిపొయ్యాడా ? 'నువ్వు తోశేసావా ?' అన్న అలిమేలు ప్రశ్న వినబడుతోంది. తనెందుకు తోస్తాడు ? తన కాలుకి వాడి చెయ్యి తగిలి పట్టు వదలి పడిపొయ్యాడా ? అంతేనా ? తొయ్యలేదు. ఏమో. తనకేం జ్ఞాపకంలేదు. అసలు ఆ పిల్ల చెప్పేవరకూ వాడు వచ్చట్టే తెలియదు.

"తోశేసావా ?" అని ఆమె ప్రశ్న కంటె, ఆ ప్రశ్న అడిగినప్పుడు ఆమె కళ్లల్లో చూపు అతన్ని మరింత బాధిస్తోంది.—నిజంగా తను తోసేసి నట్టు, నమ్మేటట్టు చూసింది. కోరగా, నల్లపాప ఒక మూలగా లాగి, తన బలాన్నంతా ఆ తెల్లపాప మధ్యలోకి పూరించి, నల్లటి ఆకాశం మధ్యలో విరిగిన మెరుపులా, ఆ క్షణం పొక జ్వాలగా ప్రజ్వరిల్లి దహించినట్టు—అబ్బ !—ఆ అబలకి, అమాయకపు పసిపిల్లకి,—అంతటి శక్తి, బలం ఉండడం తను తట్టుకోలేకపోతున్నాడు. శరీరానికి, తెలివికి ఏం సంబంధం ఉన్నట్టు ? ఆ చూపులో ఆమె నిజస్వరూపాన్ని దర్శించినట్టు సిగ్గుతో తల వొంచుకున్నాడు. కొన్ని కోట్ల కన్యలు అతనికేసి వేలు చూపి, పొక్కసారి కసరి చూసి, పురుషజాతికి ఆ క్షణాన ఏకైక ప్రతినిధిగా ఉన్న తనని, నేరమ్మవిగా తీర్పుచేసి, శిక్ష విధించి అంతర్థానమైన అశరీర శక్తిలా—అతనది మరచిపోలేడు. కళ్ళు గట్టిగా మూసుగున్నాడు సదాశివరావు.

వెన్ను విరుచుకుని లేవడానికి సిద్ధంగా ఉన్న సూర్యుడి వయసం తెలుపుతూ, బాకాలతో సాటింపుకి బైలుదేరినట్లు కిరణాల కొనలు ఆకాశాన్ని తాకి, మైల పడుతున్నట్టు, వెలవెల బోయి, నీరసించి, క్షీణించి మంచాన పడిన ప్రకృతిని బలాత్కారంగా లేపి కూచోబెడుతున్నట్టు—అలిమేలు ఆఖరిచూపు, అతన్ని తనలోకి నెట్టి, మరిలేవక అణగార మన్నట్టు వ్రబ్బుగా కూర్చుండిపొయ్యా డతను—ఆ తీక్షణమైన చూపులో. ఆమె రొమ్ములపోటు, బుజాల వొత్తిడి, పొత్తి కడుపులో—మృదువైన బింకం, ఆ తొడల తొక్కిడిలో మెత్తదనం—అతన్ని ఆ చూపులోంచి పరకాయించి చూసి, తనలో తనని బంధించి, ఆ చీకటి కూపంలోంచి, కోటి సూర్యుల కిరణాల ఫహరాగానం లేవనెత్తలేవేమో.

ప్రపంచంలో మనుషులు రెండే తెగలు—చంపేవారు, చంపలేనివారు. తాను రెండో తెగవాడు. కాని, కాని .... అలిమేలు ఫిర్యాదు ? ఇంతకీ ఎవరూ చావందే తన కెందుకా భయం ? వాడు—వా డెవడో వొచ్చాడు—ఆమెని తీసుకెడదామని—ఏమవును ? చస్తే మాట. ఇద్దరు చద్దురు. ఆ అవాంతరం తను తప్పించాడా ? చోటుకోసం తన్నుకులాడుకుని, ముగ్గురూ నీళ్లల్లో పడి చస్తే, ఎవరు ఎవర్ని చంపినట్టు !

కళ్ళు మూతలు పడవు—కాని చూపు ఆనదు. ఇంక ఆలోచన లేదు. వత్తగుల్లలో పురుగులా మనస్సు మడతలు పడి, వొంటి అవయవాల మధ్య ముడుచుకుంది. ఎక్కడో మరో లోకంలో ధ్వనులు—మరో యుగంలోదృశ్యాలు—మనిషి రాకపూర్వం భూమిపై తిరుగాడిన ప్రాచీన జంతుజాలంక ళేబరాలు, కొండ రాళ్ళ మధ్య ఇరుక్కుని, కోటి సంవత్సరాలకి కొండ పగిలిమధ్య జాడ మిగిల్చినట్టు—ఏవేవో కనబడతాయి—దూరంగా దీపాలు—మనుషుల గుంపులు—బృందాల ఏడ్పులు—స్మశానంలో మంటలు—నమ్మపులు, పుట్టనీరు, తడిమంటలో తెల్లగా మెరిసిన ఎముకలు ఆర్పుతూ పొడిపిళ్ళపడుతున్నాయి ఆకాశంలోంచి.

పక్షుల అరుపు కాదు—మనుషులు—

"దిగండి."

తల పైకెత్తి చూశాడు మిగిలిన కంటితో. మనుషులు. మనుషులు—తనకోసం—డ్రైవరు—తనెరుగున్న పోలీసు—వొకర్ను—ఇంకా ఎవరో—పంచులు, కర్రలు, తాళ్ళు. "దిగండి..." దింపుతున్నారు—దేనిమీదో పడుకో బెట్టారు. ఎటో లాక్కుపోతున్నారు. వెలుగు వెంటాడి, పెరిగి మూలల్లో విరిగిపోతోంది. కింద నీరు, బురద, ఆకులు, వెమ్మ—బంక—వడ్డి—పెట్ట, కుక్కతోక, మేక కాలు, గంపకింద కోళ్ళు—అది సూర్య కిరణం, కంటి రెప్ప కింద—రెప్పకింద తారట్లాడు తున్నది—ఆమె కంటిలో చివరి చూపు—వేళ్లతో రెప్పని పైకి నెట్టి, క్షణం చూశాడు—అదిగో ఒక గుంపు—మధ్యలో ఎవరివో కాళ్ళు—ఎవరివో వేళ్ళు—చుట్టూ మనుషులు—

"చచ్చింది పాపం—"

ఎవరో అంటున్నారు. ఎవరో.

వేళులో కర్రబొమ్మ—

వెంకటేశ్వరస్వామి కర్రబొమ్మ—వేలిలో

ఉండిపోయింది. ఎవరో అంటున్నారు.

'అదే—అలిమేలు.'

'అడికేం—అడుగో ఆ సైకిల్ కొట్టువాడు—వెంకన్న' 'అమ్మ కొంపలో లేదుగా. సంత కెళ్లింది.' 'దానికేం' 'ఇది' 'ఒకర్తె' 'పాపం—చచ్చింది.'

మరి .... తనకేం—ఆమె ముందుగానే .... "సువర్ణమ్మగారు పదిలంగానే ఉన్నారు. ఇంటికి వొచ్చేశారు.

లేచి కూర్చున్నాడు సదాశివరావు. గుంపు దూరమై పోయింది. ఆ విక్కరేసుకున్నవాడేనా వెంకటేశ్వర్లు ! బాగానే ఉన్నాడే.

సముద్రంపై ఒక ఆవిరి తెర ఆకాశంలోకి లేచినట్టు, అతని మనస్సులో ఒక భాగం ఎక్కడికో లేచిపోయింది. ఊపిరి సాఫీగా రావడం లేదు—కాలిపోతున్న ఎడారి ఇసుకలో, ఎక్కడ పడినా కరిగిపోతానని భయపడి కిందికి పడని మంచుకణంలాగు, గుండె తటపటాయిస్తోంది.

ఆకలేస్తోంది కర్మ. ఇంటికి వొచ్చేశారు—

నీటి మేడ, తడి మంటలో కాలిపోతోంది—

వర్షం పీకం తర్వాత ఎర్రటి మటూచి మచ్చ—కిరణం తాకిడితో కొన వూపిరితో నిలబడిన తనిల్లు—ఏకాంత మహా సంగ్రామంలో చావగా మిగిలిన తను—కంటి నీరు పొడిగా కారుతోంది. పొడి పీటితో ఆతడి మంటని చల్లార్చగలడా ?—చల్లార్చగలగడం వింతలలో వింత.



# అశ్వఘోషుని చరిత్ర

**శ్రీ కొడాలి లక్ష్మీనారాయణ**

భారతవర్షము చరిత్రకు తెలిసిన కాలమునుండి మత, వేదాంత భావపూరితదేశమై విలసిల్లినది. ఇది గ్రీసు, ఇంగ్లాండులవలె చారిత్రక భావసంపదలో (Historically Conscious) విలసిల్లిన దేశము కాదు. మహాయాన మతప్రచారకుడగు అశ్వఘోషుని వంటి మహాత్ముని చరిత్ర మనకు నామమాత్రముగా మాత్రమే లభ్యమగుట విచారకరము. దేవ, కుమారలబ్ధ, అశ్వఘోష, నాగార్జునులు ప్రపంచములోని నాల్గు జ్యోతులని 'హేనుత్సాంగు' వ్రాసెను. కుమారలబ్ధకుని బదులు 'వసుబంధుని' పేరు 'తారానాథు' డుదాహరించెను. మహాయానశాఖను ప్రబోధించిన ఆరుగురు గురువులలో నశ్వఘోషుడు, నాగార్జునుడు, ఆర్యదేవుడు మున్నగువారి పేర్లున్నవి. నాగార్జునుని గురువు అశ్వఘోషుడని కొందరు వ్రాసిరి. అతి ముఖ్యమైన ప్రజ్ఞాపారమితసూత్రములపైన నాగార్జునుడు 'మహాప్రజ్ఞా పారమిత శాస్త్రము' అను వ్యాఖ్య వ్రాసెనని ఇందులో 'శూన్యత' గలదని, దీనికి ఆరంభకుడు అశ్వఘోషుడని, తర్వాత నాగార్జునుడని, ఐరోపీయ విద్వాంసులు వ్రాసిరి. 'వాటర్సు' అను విద్వాంసుడు 'ఈ గొప్ప బౌద్ధుడు,పార్శ్వ శిష్యుడని, క్రీస్తుశకము రెండవశతాబ్దములో నివసించెనని, కవి, సంగీత పాఠకుడు, విద్వాంసుడు, తీవ్రమైన బౌద్ధ భిక్షువు, మతములో ప్రాచీన శాఖకు జెందినవాడు క్రమశిక్షణను జక్కగా భావించినవాడు' అని ప్రశంసించెను. [1] ఇంకను ఈయన, 'అశ్వఘోషుడు 'పార్శ్వ' అనువాని శిష్యుడని, కనిష్కసభలో నీయన ప్రముఖ పాత్ర వహించెనని' వ్రాసెను. నాగార్జున రచిత గ్రంథములలో గూడ 'కనిష్క, [2] కిలిక, అశ్వఘోషుల పేర్లున్నవి. ఆధునిక విద్వాంసుడైన 'ఘోషు' కూడ 'ఈయన కవి, గాన విశారదుడు, నైతిక విద్యావంతుడు, తత్వవేత్త, నాటకకర్త, కథాకారుడు— ఈ కళలన్నీ కనిపెట్టినవాడు, అన్నిటిని మించినవాడు, 'మిల్టను, గేటి, కాంట్, వాల్టైయరుల స్మృతిపథమునకు దెచ్చువాడు' అని పలువిధముల నుతించెను. 'జాన్‌సన్' అను విద్వాంసుడు అధికమైన వక్తృత్వము [3] గల లేక ఆశుధారగల కవియని, యోగియని, అధ్యాపకుడని' ప్రశంసించెను. ఇట్టి మహనీయుని చరిత్ర నాగార్జున, దేవులయొక్క [4] చరిత్రలతోబాటు చైనీయభాషలో లభ్యమగుచున్నవి. వీని ఆంగ్లానువాదము అందందు కొలది మాత్రమే లభ్యమగుచున్నవి. ఐరోపీయవిద్వాంసులు పలు శ్రమలు చేసి, 'మంగోలియా, చైనా, టిబెట్టు'లలో లభ్యమైన బౌద్ధ వాఙ్మయమును పరిశోధించి నిరంతర కృషి సల్పి, ఈయన జీవితమును గూర్చి కొన్ని చారిత్రక సత్యముల ప్రసాదించిరి. అశ్వఘోషరచిత గ్రంథములనుబట్టి, కనిష్కుని శాసనములను బట్టి కొన్ని చారిత్రక సత్యములు బయల్పడినవి. ఒక చారిత్రక సత్యము ఒక జాతి సంపద యని (National asset) అది విశ్వసత్యమని గుర్తెరుంగుడు. ఈ చారిత్రక సత్యముల ప్రసాదించు విద్వాంసులు, జాతికి, జగతికి, ఎంత ఉపయోగకారులో తెలుసుకోవలయును. కుమారజీవరచితమైన అశ్వఘోష, నాగార్జున, ఆర్యదేవుల చరిత్రలు, చైనీయ భాషలోనికి క్రీ. శ. 387—418 మధ్య మార్చబడెను. వీనిని ఆంధ్రభాషలోనికి మార్పించి, తెలుగు పత్రికాధిపతులు ప్రచురించెదరని నమ్ముచున్నాను. సాహిత్యసేవ చేయు 'భారతి' పత్రికాధిపతి ఈ కార్యమునకు బూనుకొన్న మేలు చేసినవా రగుదురు.

## అశ్వఘోషు లెందరు?

కనిష్కుని ఆస్థానవిద్వాంసుడైన 'అశ్వఘోషుని' తలిదండ్రులు, విద్యాభ్యాసము, గురువులు జన్మస్థలము, స్థిరనివాసము, అంత్యకాలము, శిష్యులు—వీనిని గూర్చి సమగ్రముగా దెలియకున్నది. నిస్వార్థపరులైన ఈ మ్మహనీయులు తమ ఆత్మచరిత్రనైన వ్రాసికొనరైరి. చరిత్రలను వ్రాయగల్గిన యుమ్మహనీయులు ఐహికవాసనల వదలి పరమునందే దృష్టి బరపినట్లు కన్పించుచున్నది. సమకాలీనుడైన నాగార్జును డిట్లు ప్రశ్నించుచున్నాడు. "కళలు, చేతివృత్తులను బోధించుశాస్త్రము జీవనోపాధి కుపయోగించు శాస్త్రమై యున్నది. కాని ప్రపంచము నుండి విముక్తిని బొందు మార్గమును బోధించు శాస్త్రము, నిజమైన శాస్త్రము కాదా?" 'సుజకి' అను విద్వాంసుడు 'మహాయాన శ్రద్ధోత్పాద' [5] యను గ్రంథమును బట్టి భిన్నకాలములలోని ఆరుగురు అశ్వఘోషులను పేర్కొనెను. "బుద్ధుడు చనిపోవుముందు ఒక అశ్వఘోషునితో మాటాడెను. బుద్ధుడు చనిపోయిన 300 ఏండ్ల తర్వాత ఒక అశ్వఘోషుడు జన్మించును. బుద్ధ నిర్యాణానంతరము 600 ఏండ్లకు, అశ్వఘోషుడు 96 శాఖలు గల బౌద్ధమును బోధించును. బుద్ధ నిర్యాణము తర్వాత 100 ఏండ్లకు అశ్వఘోషుడను మహాసత్వుడు వచ్చి, ధర్మ సంస్థాపన చేసి, బౌద్ధ ధ్వజమును ప్రతిష్ఠ చేయును. బుద్ధుని తర్వాత 800 ఏండ్లకు ఒక అశ్వఘోషుడు గల్గి ధర్మమేర్పరచును. తీర్థకుడు కాలనక్షత్రకుడనువాడు, బుద్ధుని 86000 ప్రశ్నల నడుగును. ఈయనను 'తథాగతుడు', 'ఓ అశ్వఘోష శ్రమణా'యని సంబోధించెను. ఈవిధముగా నారుగురు అశ్వఘోషులు కన్పించుచున్నారు." [6] అని సుజకి వ్రాతల సారాంశము.

---

1. Watters – Hiuen Tsiang's travels Vol. 1- p 104 "This great Buddhist, who apparently lived in the second century of our era, was a poet, musician scholar, religious controversialist and zealous Buddhist monk, orthodox in creed, and a strict observer of discipline."

2. Ibid-p 209– "Aswaghosha was a pupil of Parswa, who took a leading part in Kanishka's council."

3. K. N. Ghosh – Early History of India p. 209 – "He was a poet, musician, preacher, moralist philosopher, playright, tale-teller; he was an inventor of all these arts and excelled in all; In his richness and variety, he recalls Milton, Goethe, Kant and Vol taire."

4. E. H. Johnson– "Great eloquent poet, the mendicant, and teacher."

5. Nagarjuna's Pragna Danda-M. S. Folio 15.
"The science which teacheth arts and handicrafts
Is merely science for the gaining of a living
But the science which teacheth
Deliverance from worldly existence
Is not that the true science?"

6' Suzuki – Awakening of Faith.

మన అశ్వఘోషుడు క్రీ. శ. 125—152 కాలము వరకు పాలించిన కనిష్క మహారాజ ఆస్థానకవి. కనుక తథాగతునికి దాదాపు 800 ఏండ్ల తర్వాతివాడు. ఈయనయే ఆరవ అశ్వఘోషుడు.

## జన్మస్థలము-తలిదండ్రులు-గురువు

ఈయన జన్మస్థలమును గూర్చి సరిగా తెలియదు. ఈయన తర్వాత 1300 ఏండ్లకున్న 'తారానాథుడు' అశ్వఘోషుని జననము కాశ్మీర మనెను. కాని తూర్పు హిందూదేశములోని 'సాకేత పురము' ఈయన జన్మభూమి యని చెప్పవచ్చును. ఈయన వ్రాసిన తొమ్మిది అంకముల నాటకము 'సారిపుత్ర ప్రకరణము' ( శారద్వతీ పుత్ర ప్రకరణము ) "సారిపుత్ర, మౌద్గల్యాయనులను శిష్యులను తథాగతుడు బౌద్ధమతములో నెట్లు జేర్చినది యిందు వర్ణించబడినది. ఈ వ్రాతప్రతి 'మధ్య టర్కీ స్థానములోని 'టర్ఫాను' ( Turfan ) లో మరి రెండు వ్రాతప్రతులతో బాటు సమగ్రముగా లభ్యమైనది. ఇది భూర్జ పత్రములపైన వ్రాయబడినది. ఆచార్యవర్యుడు 'లూడర్సు' ( Professor Luders ) కృషివలన ఈ మూడు నాటకములు బయల్పడినవి. పై నాటకముయొక్క అంతిమపత్రము సురక్షితముగా నున్నది. ప్రాచీన నాటకము బౌద్ధులదే యని బయల్పడినది. 'సువర్ణాక్షి పుత్రుడు' 'అశ్వఘోషుడు' అని యిందుల్లేఖించబడుటచేత, ఈయన తండ్రిపేరు "సువర్ణాక్షి" యని తెలిసికోవచ్చును. తల్లిపేరు ఏ గ్రంథములోను లేదు. పారమార్థికచింత గల 7 యిమ్మహనీయునకు జననీ జనకులతోను, గురువులతోను నిమిత్తములేదు కాబోలు. ఈయన గురువుపేరు 'పార్శ్వ' యని ఈయన కూడ కనిష్కుని మహా సంగములో ప్రముఖ పాత్ర వహించెనని తెలియుచున్నది. 9 వ వాడు పార్శ్వ, 10 పుణ్య యశస్సు, 11 అశ్వఘోషుడని బౌద్ధ గురువుల జాబితా తెల్పుచున్నది. కొందరు 'పుణ్య యశస్సు' గురువని వ్రాసిరి. ఆర్యదేవుడు అను నాగార్జునుని శిష్యుడు మంత్రశాస్త్ర సంబంధమగు కళాసైపుణ్యమున అశ్వఘోషుని ఓడించెనని 'తారానాథుడు' వ్రాయుచున్నాడు. సత్యమైనచో ఇది పాటలీపుత్ర రాజు ఆస్థానములో జరిగియుండవలెను. మహాయాన బౌద్ధులైన వీ రిరువురి కేల వాదన జరిగెనో తెలియకున్నది. దీనిని ధ్రువపరచుట కితర చారిత్రకాధారములు లభ్యము కాలేదు. ఆర్యదేవుడు బ్రాహ్మణమత బద్ధవిరోధి యని, భిన్న మతావలంబకులకు వ్యతిరేకి యని విద్వాంసులు వ్రాయుచున్నారు. కొన్ని గ్రంథములలో 'అశ్వఘోషుని శిష్యుడు నాగార్జునుడు8' అని కలదు కాని ఆయన ప్రభావ మితనిపైన ప్రసరించినట్లు కాన్పించుచున్నది కాని మాటిగా శిష్యుడు కాడు. పార్శ్వకు అశ్వఘోషునికి గల సంబంధము మాత్రము కొన్ని 9 చోట్ల కాన్పించుచున్నది. అశ్వఘోషుని, గురువగు పార్శ్వ యిట్లు ప్రశ్నించెను. "విశ్వములో శాంతి గల్గుటకు, దీర్ఘాయుర్దాయము గల్గుటకు, విస్తారముగా లభ్య మగుటకు, మానవులకు దుఃఖనివారణ గల్గుటకు నేమి కోరవలెను ?"

## పాటలీపుత్రరాజు ఆస్థాన విద్వాంసుడు

అజాతశత్రునిచే నిర్మించబడిన 'కుసుమ పురము' తర్వాత కాలములో పాటలీపుత్ర మైనది. క్రీ. శ. 130 ప్రాంతములోని పాటలీపుత్ర ప్రభువు ఒక బౌద్ధుడు. ఈయన అశ్వఘోషుని ఆదరించి, అభిమానించి ఆయన వాగమృతధారల గ్రోలుచు, బౌద్ధ ధర్మ శ్రవణాసక్తుడై నిరంతరము కాంక్షవము చేయుచు, ఆస్థానమున రత్నమువలె నున్న అశ్వఘోషుని మర్యాద చేయుచు ప్రకాశించు చుండెను. సర్వ శాస్త్రముల కూలంకషముగా జదివి సకల శాస్త్రపారంగతుడని పేర్గాంచిన, ఈయన ప్రతిభా సంపత్తిని గూర్చి, ఈయన ధీశక్తిని గూర్చి, కుషాను రాజగు 'కనిష్కుడు' కర్ణాకర్ణిగా విని యుండెను. బౌద్ధ ధర్మాభిమాని, రెండవ అశోకుడని పేర్గాంచిన ఆ నృపతి అశ్వఘోషుని ఆహ్వానించుచు, స్నేహపూర్వకముగా నొక జాబు వ్రాసెను. అప్పటికే జరాభారముచేత కృశించిన 'అశ్వఘోషుడు' ఈ యాహ్వానము నంగీకరించజాలక తన శిష్యుడైన జ్ఞానయశుడను వానిని తనకు బదులుగా బంపెను. కాని కనిష్కుడు దీనికి తృప్తి జెందినట్లు కాన్పించలేదు 10 ఈ విషయముపైననే కాబోలు కనిష్కునికి పాటలీపుత్ర రాజుకు సంకుల సమరము జరిగెను. ఈ యుద్ధములో పాటలీపుత్ర రాజు పరాజితు డాయెను. యుద్ధ పరిహారముగా, కనిష్కునికి పాటలీపుత్ర రాజు అశ్వఘోషుని సమర్పించెనని, ఆయన సంతుష్టాంతరంగుడై గెల్చిన రాజ్యమును వదలివేసి, స్వదేశమున కేగి, అశ్వఘోషుని నిండు ప్రేమతోను, గౌరవ మర్యాదలతోను జూచుచుండెనని, అశ్వఘోషుడు కాశ్మీరములోని తన నూత్న నివాసములో దన పరిశోధనల సాగించుచుండెనని, తారానాథుడు, వాటర్సు మున్నగు వారి వ్రాతలు తెల్పుచున్నవి.11 ఇత్సింగు అను చైనీయ లేఖకుడు కూడ, ఉత్తర హిందూస్థానములోని బౌద్ధమత శాఖా స్థాపకులలో నీయన అందరికంటె ముందరి ప్రధాన గురువని, ఈయన 12 వ గురువని, నాగార్జున, కణ్వదేవులు 14, 15 వ వారని వ్రాసెను.

'బీల్'12 (Beal) అను విద్వాంసుడు, 'కండన కనిష్క' యను 'తుఖార రాజు' లేక గాంధార రాజు' ముగ్గురు విజ్ఞానవేత్తలతో నెయ్యమొనర్చెనని, వారు వరుసగా 1. 'బోధిసత్వ అశ్వఘోష' యని 2. మంత్రి మోచలో (మాతర) యని, 3. వైద్యుడు 'చే—లో—చి—యో' (చరక) యని ( Jurka his chief physician ) వ్రాసియున్నాడు. ఈ విషయము Fu-Fat - Sang - Yin - Yuan - Chuan - అను గ్రంథమును బట్టి కూడ తెలియును. కనిష్కుని సైన్యములు పాటలీపుత్రము వైపుకు బోయెను. కనిష్కుడు ధైర్యసాహసోపేతుడు. ఆయన 90 కోట్ల బంగారు నాణెముల గోరెను. పాటలీపుత్ర ప్రభువు అశ్వఘోషుని, బుద్ధుని భిక్షాపాత్రను, ఒక సుందరమైన కోడిని, 90 కోట్ల బంగారు నాణెములతో సమర్పించుకొనెను. వీనిని గైకొని 'కనిష్కుడు' ఆనందా నందమున స్వదేశమున కేగెను. ఈ కథ 'కుమార జీవుని' అశ్వఘోష చరిత్రలోను గలదని వ్రాయుచు సంయుక్త రత్న పిటకములో 93, 94 కథలలో గూడ కలదని 'బీల్' వ్రాసెను. పాటలీపుత్ర రాజు నుండి కనిష్కుడు, అశ్వఘోషుని కాన్కగా13 నంగీకరించెనని పలువురు విద్వాంసులు వ్రాసిరి.

---

7. వేదవ్యాస్—సంస్కృత సాహిత్యకా ఇతిహాస్. (హిందీ) పుట 96. Also see Maedonall-India's past-p. 102. "Manuscript Manuscripts of this drama have been found at Turfan in Central Asia."

8. E. J. Eitel-A handbook of Chinese Buddhism. p. 42 "Aryadeva a famous antagonist of Brahmanism and a great opponent of heretics"

9. Suzuki-Awaking of Faith p. 43 'It is very doubtful when Nagarjuna as told in a Chinese tradition, was a personal disciple of Aswagosha-Probably he was influenced by him."

10. V. A. Smith—Early History of India-p 243.

11. Ibib-" That the saint was given to Kanita (Kaniska perhaps) king of the yueti, as part of the wer indemnity. This king treated the Bhikshu with much kindness and esteem and Aswaghosba continued his labours in his new place of abode in Kashmir."

12. Takakusu-A record of the Buddhist Religion (Itsing) p. 181. "As a patriarch of the Northern Buddhism, however Aswagosha has an earlier place than the rest; he is the 12th patriarch while Nagarjuna and Deva 14th and 15th respectively."

13. S. Beal-Indian antsquery-IX p. 353.

మహాయాన మత ప్రచారకులైన దార్శనికుల పేర్ల[14]లో అశ్వఘోషుని తర్వాత, నాగార్జున, ఆర్యదేవ, వసుబంధుల పేర్లు ప్రఖ్యాతి గాంచి యున్నవి. భారతీయ బౌద్ధమత సంక్షిప్త గ్రంధములో (Manual of Indian Buddhism) 'కెరన్' (Kern) వీరిని విశేషముగా ప్రశంసించెను.

## కనిష్కుడు బౌద్ధధర్మ దీక్షగైకొనుట

కనిష్కుడు ప్రథమములో హిందువుగా నుండెనని, తర్వాత బౌద్ధుడాయెనని ఈ విషయము అతని జీవితములోని చివరభాగములో జరిగెనని, నాణెములపై నున్న సూర్యచంద్ర శాక్యముని ముద్రల బట్టి విదిత మగుచున్నదని విద్వాంసులు వ్రాసినారు. శాక్యముని పేరు గ్రీకు అక్షరములలో నుండుటచేత భారతీయ వాఙ్మయములో గ్రీకు భాషా ప్రభావము కన్పించుచున్నది. ఒకమారు పార్థియను రాజు కనిష్కు నెదుర్కొనెను. కాని దీర్ఘ కాలము పోరాటము, రక్తపాతము జరిగిన తర్వాత, అశ్వఘోషు డీయనకు బౌద్ధధర్మ ప్రబోధము చేసెను. ఈ విధముగా కనిష్కుడు బౌద్ధుడాయెను. మరియొక ప్రమాణమును[15] బట్టి పార్శ్వ లేక పార్శ్వక అను బౌద్ధుని వలన కనిష్కుడు బౌద్ధుడాయెనని, నిత్యము బౌద్ధధర్మ బోధల నాయన వద్ద వినుచుండెనని బౌద్ధ ధర్మములు పరస్పర విరుద్ధములుగా నుండెనని, వీని నన్నిటిని సరిచేసి సంహితం వలె కూర్చుటకు, సభ నేర్పాటు చేసిరని, సభానంతరము, సభవారు తేల్చిన అంశములను వ్యాఖ్యలలో గీర్వాణ భాషలో సాహిత్య నైపుణ్యముతో వ్రాయుటకు, శ్రావస్తిలోని సాకేత పురము నుండి అశ్వఘోష నాహ్వానించ బడెనని 'టాకాకుసు' అను విద్వాంసుడు వ్రాయుచున్నాడు. 'పార్శ్వ' వలన బౌద్ధ ధర్మ బోధలను గ్రోలి, బౌద్ధ గ్రంధములలోని 16 విభిన్న శాఖలను క్రోడీకరించి పరిశుద్ధ ప్రతిని తయారు చేయుటకు ఆ కాలములో పేర్గాంచిన అశ్వఘోషుని సాయమును గోరియుండుట ఖాయము.

## బౌద్ధులసభకు అశ్వఘోషుడు ఉపాధ్యక్షుడు

కనిష్కుడు బౌద్ధమతములోని విభిన్న శాఖల బరిశీలించి, క్రోడీకరించుట కొక సభ లేక 'మహా సంగము' నేర్పాటు చేసెను. ఈ సభకు 500 మంది బౌద్ధ విద్వాంసులు హాజరైరి. ఈ సభాధ్యక్షుడు 'వసుమిత్రుడు', ఉపాధ్యకుడు 'అశ్వఘోషుడు'. హీనాయాన మతమునకు జెందిన 'సర్వాస్తివాదులు' ఈ సభకు హాజరైరి. 'పార్శ్వ లేక పార్శ్వక' యొక్క సలహా మీదనే ఈ 'సంగము' జరుగుచుండెను. వైద్యశాస్త్ర పారంగతుడు చరకుడు కూడ ఈ కాలపువాడే.

సభాస్థలమును గూర్చి మొదట వాదవివాదములు చెలరేగెను. ఈ సభ 'కాశ్మీరము' లోని జలంధరులో జరిగెనని 'శాస్త్ర చింగోం కెరిన్లిచి',

14. Sreenevasachary-History of Inadia-"According to a Chinese work, he accepted Aswagosha as a gift from the defeated king of Pataliputra."

15. K. Sreenivasachary — Ancient History of India — 'Later on, the Parthian King attacked Kanishka but was defeated after a bloody struggle and then Aswagosha expounded the Bouddha Dharma to him."

N. N. Ghosh—Aswargosha, who evidently impressed him with his character and scholarship"

16. V. A. Smith-Early History of India--p. 250- "According to him, Aswaghosha was invited from Saketa in the Sravasti province for the purpose of applying his well-known literary skill to the redaction of the commentaries. drafted by the council. (Takakusu—J. R. A. S, 1905,)

'పెవంగ పత్సేన్' అను గ్రంథమును బట్టి 'గట్సేన్ కునళన' యనుచోట జరిగెనని తెలియుచున్నది. తారానాథుని వ్రాతల ప్రకారము, ఈ సభ కాశ్మీరులోని[17] కుండలవనవిహారములో జరిగెనని తెలియుచున్నది. కొందఱు జలంధరులోని 'కువన సంఘారామము' లో జరిగెనని వ్రాసిరి. హుయాన్‌సాంగు, జలంధరును దర్శించెను కాని, ఈ విషయమును పేర్కొనలేదు. మంగోలియా, చైనా, టిబెట్టు గ్రంథములీ సభా వృత్తాంతమును పేర్కొనెను. కాని సింహళద్వీపచరిత్రలు వీనిని పేర్కొనలేదు.

టిబెట్టులోని 'కాగ్యర్' అను గ్రంథము బుద్ధుని బోధనలను గూర్చుట కేర్పడిన 'మూడవ సంగము' అని పేర్కొనెను. 'టాంగ యూరు' అను గ్రంథము వత్సిపుత్రుని ప్రోత్సాహమున నీ సభ బౌద్ధ ధర్మముల క్రోడీకరించుట కేర్పడిన దనెను. చైనీయ భాషలోని 'కంతహోర్' కూడ దీనిని పేర్కొన్నది. ఈ సభలో, బౌద్ధ మతములోని 17 శాఖలలో గల భేదాభిప్రాయములను పరిష్కరించి, వానిని పూర్వాచార సాంప్రదాయము లని చెప్పి, త్రిపిటకములను పరిశుద్ధము చేసి, వ్యాఖ్యలతో రాగిరేకులపైన వ్రాసి, కనిష్కుని ఆజ్ఞ ప్రకారము ఒక స్తూపములో నుంచిరి. భారతీయ రాజ్యాంగముపైన సంతకము లున్నట్లు, ఈ రేకులపైన అశ్వఘోషాది విద్వాంసుల సంతకము లుండవచ్చును. మన జాతీయ సంపదయైన ఈ రాగి రేకులు, శ్రీనగరు ప్రాంతములో నెచటనైన వెదకినచో లభ్యము కావచ్చునని ఆశ గల్గుచున్నది. అట్టి ఆశ 'స్మిత్' అను విద్వాంసునికి కూడ గల్గెను.[18]

ఈ 'మహాసంగము' లో వృద్ధుడైన 'అశ్వఘోషుడు' పాల్గొని వ్యాఖ్యల నన్నిటిని విభాగముచేసి ఆయా శాఖల క్రింద విభజించి, సభవారి ఆజ్ఞ ప్రకారము బుద్ధుని బోధల నన్నిటిని లిఖితరూపములోనికి గైకొని వచ్చెను.[19] 'వసుమిత్రు' డను మరియొక విద్వాంసుడు బౌద్ధ తత్వశాస్త్రమునకు విజ్ఞాన సర్వస్వము అని పేర్గాంచిన, 'మహావిభాష'ను రచించెను. ఇది నేటికిని 'చైనా దేశములో' నున్నది. క్రీ. పూ. 2 లో ఒక 'యూచి రాజ' అనేక బౌద్ధ గ్రంథములను ఒక చైనీయ ఉద్యోగి కొసంగెను. 'శ్రావస్తవాది' శాఖకు జెందిన మూలగ్రంథమగు 'జ్ఞాన ప్రస్థాన సూత్రము' పీద వ్యాఖ్యయే వసుమిత్ర గ్రంథము అగు 'మహా విభాష సూత్రము' అని విద్వాంసులు వ్రాసిరి. అశ్వఘోషుడు సంస్కృతము లోనే వ్యాఖ్యలను రచించెను.

మహాసంగము జరిగిన తర్వాత, త్రిపిటకములకు వ్యాఖ్యలతో సహా రాగిరేకులపైన వ్రాయించి ఒక స్తూపములో బెట్టించి, అశోకు డిచ్చినట్లు కాశ్మీరును దిరిగి బౌద్ధ సంఘమున కొసంగి, కనిష్కుడు బారమూల కనుమగుండ ప్రదేశమున కేగినట్లు 'స్మిత్' వ్రాయుచున్నారు.[20]

'శివి' వ్రాత ప్రకారము, బౌద్ధ ధర్మ పోషకుడైన 'కనిష్కుని మరణము 'మాతర' యను మంత్రి కుట్రవలన జరిగినట్లు తెలియుచున్నది. 'శ్రీ ధర్మపిటక' మను గ్రంథమును బట్టి, కనిష్కునికి జబ్బు చేసినప్పుడు పైనికు లాయనను మంత్రి దుర్బోధలలో, నొక దూది బొంతలో బెట్టిరని, దానిపైన ఒక వ్యక్తి పైభాగమున నిల్చుండెనని, రాజు ఊపిరాడక వెంటనే చనిపోయెనని తెలియుచున్నది.

## అశ్వఘోష రచితగ్రంథములు

అశ్వఘోషుడు రచించిన గ్రంథములు (1) కావ్యములు, (2) చరిత్రలు, (3) సాంఘికములు, (4) తత్వశాస్త్రములు, (5) రూపకములు—మున్నగు వివిధ శీర్షికల క్రిందికి వచ్చును. కనిష్కుని కాలమునాటికి (క్రీ. శ. 125—52) 'బుద్ధ చరిత్ర' కు సంబంధించినవి 'మహావస్తు', 'లలిత విస్తర' అను గ్రంథములు గలవు. 'అశ్వఘోషుడు' గీర్వాణభాషలో బుద్ధ చరిత్రను మహాకావ్యముగా రచించెను. ఇందలి ఉత్కృష్ట శైలిని, చక్కని వర్ణనలను పండితులు శ్లాఘించినారు. తిరుపతి వేంకటకవులు దీని ననుసరించియే బుద్ధచరిత్ర వ్రాసిరి. క్రీ. శ. 414—421 మధ్య కాలములో దీనిని చైనీయ భాషలోనికి మార్చిరి. దీనిని 'మూలరామాయణము' తో పోల్చుచుందురు. రామాయణమును నమూనాగా గైకొని ఇది వ్రాయబడెనని 'వింటర్ నిడ్జ్' అను విద్వాంసుడు వ్రాసెను.[21] దురదృష్టవశాత్తు నేడు కొందరు పండితులు వర్తమాన రామాయణ మంతయూ జదివి అది అంత సత్యమైన చరిత్రగా వాల్మీకి రచితముగా భావించి దాని నుండి మన సంస్కృతిని రాబట్టుచున్నారు. వర్తమాన రామాయణమునుండి ప్రక్షిప్త భాగములు విడగొట్టి వాల్మీకి రచయిత 'మూల రామాయణమును' గూర్చినచో నది చరిత్ర, కావ్యము గూడ నగును. బుద్ధచరిత్రవలె నది ప్రామాణిక గ్రంథమగును. లేనిచో చారిత్రక ప్రామాణము కాజాలదు. బుద్ధచరిత్రకు గొప్ప ప్రఖ్యాతి గలదు. దీనిని 'రఘువంశము' తోగూడ పోల్చెదరు.

(2) సౌందరానందము :—ఇక్ష్వాకు కుమారులు కపిల గౌతముని వద్దకు వచ్చిరని, శాకవృక్షముల క్రింద నివాసము లేర్పరచుకొనిరని అందువలన శాక్యులను పేరు వచ్చినదని, కపిలుని ఆశ్రమమున్న చోట వీరు నగర నిర్మాణ మొనర్చిరని అందువలన కపిలవాస్తు అను పేరు గల్గినదని వీరు వ్రాసిరి. ఇది చారిత్రక సత్యముగనే కన్పించుచున్నది. ఈయన కావ్యములలో రసజ్ఞానసంబంధమగు వాసనలు, సౌందర్యము, భావము, చిత్తవృత్తి కాన్పించునని పండిత వేదవ్యాస్ వ్రాసెను.

(3) సూత్రాలంకారము :—ఇది టిబెటీయభాషలో నున్నది. ఈ గ్రంథము అశ్వఘోష రచితమని పలువురు వ్రాసిరి. కాని ఇది కుమారలత రచితమని ఆచార్యవర్యుడు లూడర్సు వ్రాయుచున్నాడు.

(4) వజ్రసూచి :—('వీరసూచి) :—దీనిలో వర్ణవ్యవస్థను ఘోరముగ ఖండించబడెను.

(5) మహాయాన శ్రద్ధోత్పాద శాస్త్రము :— (విజ్ఞానవాదము):— దీనికి తత్వశాస్త్రములలో గొప్ప పేరు గలదు. అద్భుతమగు వాదములతో నిండియున్నది. ఈ గ్రంథమును బట్టి అశ్వఘోషుడు గొప్ప దార్శనికుడని తెలుచున్నది. ఇది 'భూత, తథతా దర్శనమని' పేరు గాంచినది. 'నాగార్జునుడు' దీనిపైన గొప్ప వ్యాఖ్యానమును రచించెను. దీనినిబట్టి నాగార్జునుడు అశ్వఘోషుని శిష్యుడని కొంద రూహించుచున్నారు.

(6) సారిపుత్ర ప్రకరణము :—దీనితోబాటు మరి రెండు నాటకములు లభ్యమైనవి. ఇవి కృష్ణమిశ్రుని ప్రబోధచంద్రోదయము, మృచ్ఛకటికమువలె ఉన్నవని వ్రాసిరి. బుద్ధచరిత్రలో మొదట 28 అధ్యాయములు గలవని చైనీయ, టిబెటీయగ్రంథములను బట్టి తెలియుచున్నదని, అది సంపూర్ణమైన బుద్ధుని జీవితచరిత్ర యని, ఇందులో మనకు నేడు 13 అధ్యాయములే లభ్యమగుచున్నవని, 19 వ శతాబ్దములోని యొక కవి మరి నాల్గు అధ్యాయములు చేర్చెనని 'కీత్' అను విద్వాంసుడు వ్రాయుచున్నాడు.[22] నగర వర్ణన, రాజు, రాణి, ప్రపంచము—వీని వర్ణనలు ఆశ్చర్యము గొల్పుచున్నవని పాశ్చాత్యులు వ్రాసిరి. సౌందరనందములో స్త్రీలను గూర్చి వ్రాసిన శ్లోకము పాశ్చాత్యులకు నవ్వు గల్గించినది. "There is honey on their lips but deadly poison dwells in their hearts." వీరు పయోముఖవిషకుంభములని నిర్దాక్షిణ్యముగా వ్రాసెను. విమర్శనలో గూడఁ కరుణార్ద్ర హృదయమవసరము (sympathy).

---

17. V. A. Smith-Oxford History of India—p. 250

18. V. A. Smith-Early History of India p 250- "It is possible that these precious records may still exist buried under some mound near Srinagar, and that a lucky chance may reveal them."

19. C. S. Srinivasachary—"Aswaghosha arranged and systematized the commentaries on the canon drafted by the council."

20. V. A. Smith—Early History of India,

21. Winternitz—History of Indian Literature Vol. I—p. 513 "Ramayana served as a model."

22. A. B. Keith—Classical Sanskrit Literature, p. 21.

నైతిక భావములకు విరుద్ధముగా నెవరు వ్రాసిన, వది జీవితము పైననే దాడి యగుచున్నది. బౌద్ధధర్మ అనుయాయి యైన ఈ కవి నైతిక ధర్మముల చక్కగా బోషించెను. గొప్ప దార్శనికు డగుటచేత ఆ భావములనే తన కవితలో ప్రయోగించి గొప్ప కవియాయెను. 23 అవదాన శతకమును బట్టి, ఒకమారు 'శోభావతి రాజు' ఎదుట దక్షిణ హిందూస్థాన నాటక సమాజమువారు ఒక బౌద్ధ నాటకమును ప్రదర్శించిరని తెలియు చున్నది. ఈ నాటకము ప్రాయశః అశ్వఘోషుని నాటకమే కావచ్చును. ప్రథమ నాటకకర్తయైన 'అశ్వఘోషుడు' పుక్కిటికథ కాకుండ బుద్ధుని శిష్యుల సత్యమైనచరిత్రను గ్రహించి హేతుబద్ధమైన వడకతో (Rational) పాత్రాపోషణ చేయుచు, సంభాషణను చక్కగా వర్ణించుచు, తన రూపక, కవితా చమత్కృతిని ప్రదర్శించెను. ఈ విధముగా అశ్వఘోషుడు రంగస్థల ప్రదర్శనార్హమగు నాటకముగా జేసి, నటుని కళా నైపుణ్యమును చక్కగా పోషించెనని విద్వాంసులు వ్రాసినారు. 'అరిష్టాటిలు' వ్రాసినట్లు ఒకసారి వినుటతోడనే (Asingle reading) భావములు చిత్తంబున హత్తుకొనును. అశ్వఘోషుని ధీశక్తి, (Genius) ధర్మ ప్రచారము ద్వారానే కాకుండా, నాటకములు, రంగస్థలములు, పాత్రాభినయముల ద్వారా బౌద్ధ ధర్మము ప్రచారము గావచ్చునని, భిన్నమార్గముల ద్రొక్కెను.

## అశ్వఘోషుడు విమర్శకుడు, చరిత్రకారుడు, భావవిప్లవకారుడు

క్రీ. శ. 2 వ శతాబ్దములోని 'అశ్వఘోషుడు' ఆ కాలపు సమాజము నధిగమించి, ముందుకు నడచెను. అప్పటి బ్రాహ్మణ మతములో వర్ణాధిక్యత, కర్మ సిద్ధాంతము, నమ్మకము మున్నగు లక్షణము లున్నవి. విమర్శకుని లక్షణము 'ఇది ఎన్నటికిని కాదు' అని పలుకుటయే. 24 ఆ కాలమును, అప్పటి భాష ననుసరించి అశ్వఘోషుడు నూత్న యుగమునకు పనికివచ్చు నూత్న గ్రంథరచన చేయసాగెను. (New works of new days). 260 గ్రంథముల రచించిన వాల్టెయిరును గూర్చి వ్రాయుచు హడ్సను యిట్లు ప్రశ్నించుచున్నాడు. "ఆయన ఏపని కొరకు నిలబడెను ? ఆయన లక్ష్యములేవి ? పద్ధతు లేమి ? సాధించిన కార్యము లేమి ? చరిత్రరీత్యా మాత్రమే ఆయన కార్య మెంతవరకు ముఖ్యమైనది ? దానిలో శాశ్వతమైన విలువ గలదా ? ఎంతవరకు ?". దాని కిచ్చిన జవాబు, అశ్వఘోషుని విషయములో గూడ సరిపోవు చున్నది. 'వాల్టెయిరు' వలె, అశ్వఘోషుడు సాంఘిక, చారిత్రక, కావ్యములు, నాటకములు, చరిత్ర, జీవితచరిత్ర, తత్వశాస్త్రము, దార్శనిక సిద్ధాంతములు రచించి శాశ్వత యశఃకాయు డాయెను. 'శూన్యత' పదము వీయన, తర్వాత నాగార్జునుడు ప్రయోగించిరి. పరిశోధన కందని గాని క్షేత్రములలో (Unexplored territory) నాయన విహరించెను. ఉభయులు ధీశక్తి సంపన్నులు. 'ఆర్నాల్డు' వచించినట్లు వీరు ధీశక్తిగల యథార్థమైన వ్యక్తులు' (Real men of genius). 'వాల్టరయిజము' పారిసు నుండి లండనుకు పలాయనమై పోయినట్లు, అశ్వఘోషుని శక్తి, బౌద్ధమత దార్శనికశాస్త్రము, అది పుట్టిన భారతదేశము నుండి చైనా, టిబెట్, మంగోలియాలకు పలాయనమై పోయెను. 25 'వజ్రసూచికోపనిషత్తు' లోని ఈయన విమర్శన, ప్రసిద్ధ సంఘసంస్కర్తల బోధన వలె నున్నది. మౌల్టన్ చెప్పినట్లు, "విమర్శన విజ్ఞాన శాస్త్రములోని శాఖ యగుచున్నది కాని సారస్వత సంబంధమగు శాఖ కాదు. 26

ఈ విమర్శనలో ఖచ్చితమైన శాస్త్రీయదృష్టి శాస్త్రీయమగు నిష్పక్షపాత బుద్ధి అవసరము. వర్ణభేదమును ఖండించిన ఈ ఉపనిషత్తును 'వెబరు' అను విద్వాంసుడు 1860 లో ఆంగ్లేయ భాషలోనికి మార్చి యిట్లు వ్రాసెను. "దీనిలో ఈయన బ్రాహ్మణమతసంబంధమగు వర్ణభేదమును, బ్రాహ్మణమతవాఙ్మయమునుండి అనేక ప్రమాణములను గైకొని ఖండించెను." 27. 'ఋష్య శృంగో మృగ్యాః, కౌశికః కుశాత్, జాంబుకో జంబుకాత్, వాల్మీకో వల్మీకాత్, వ్యాసః కైవర్త కన్యకాయాం, శశపృష్ఠాత్ గౌతమః, వశిష్ఠ ఊర్వశ్యాం, అగస్త్యః కలశోజాత ఇతిశ్రుతత్వాత్." 28. బుద్ధదేవునివలె ఆ కాలపు సమాజమునకు ఎదురుతిరిగి బ్రాహ్మణత్వము పుట్టుకచేత రాదని పైఋషులందరూ బ్రహ్మజ్ఞానమువలన బ్రాహ్మణులైరని వాదించి తన సిద్ధాంతమును శాశ్వతముగా నుండుటకు ఉపనిషత్తులోని కెక్కించెను. ఈ విధముగా భావవిప్లవకారుడై వర్ధిల్లెను. బౌద్ధమతమును పామర జనమునకు ఆకర్షకముగానుండుటకు ప్రజల కందుబాటులో నుండునట్లు సంస్కృతములో వ్రాసి మొదటినాటక కర్త యాయెను. లౌకిక సాహిత్యమునకీయన సంస్కృతము నుపయోగించెను. బౌద్ధధర్మమును సాహిత్య రూపములో రచించుటకీయనయే ఆరంభకుడు. కాళిదాసుకూడా ఈయన ననుకరించెనని ఈయన వర్ణనల, సమాసముల, కథావిధానముల, ఊహలగైకొనెనని అందుచే అశ్వఘోషునకు చాలాఋణపడెనని బహువిద్వాంసులు అభిప్రాయము. ఎంతవరకు అనుకరించెనో విద్వాంసులు పరిశీలించవలెను. అపుడు కాళిదాసు గొప్పతనమంతయూ అశ్వఘోషునిదేయని చెప్పవలసివచ్చును. బుద్ధచరిత్రవలన సారిపుత్రప్రకరణవలన అనేకచారిత్రక సంఘటనలు బయల్పడుచున్నవి. "చరిత్ర సత్యమైనది. కాన నది అమూల్యమైనది" అని రస్సెల్ వ్రాయుచున్నాడు. 29 చాలామంది కవుల కావ్యములు ప్రామాణికత్వములేక (Lack of authenticity) రాణించకున్నవి, కాని అశ్వఘోషుని మనస్సు చారిత్రక దృష్టికోణముతో (Historically conscious) సత్యాంశములతో నైతికధర్మ బోధతో నిండియున్నది. చారిత్రకదృష్టితో కావ్యము, నాటకము వ్రాయడమే ఒక విప్లవము. ఈయన వ్రాసిన బుద్ధచరిత్ర చారిత్రక సత్యములతో నిండి యుండుటచేత 'ఇత్సింగు' కాలమున (క్రీ. శ. 672—688) బౌద్ధవిద్యాలయములలో పఠనీయ గ్రంథమై విలసిల్లెను.

---

23. Coleridge—"No man was ever yet a great poet without being at the same time a prefound philosopher."

24. W. H. Hudson — An Introduction to the study of Literature-p. 293, critic "This will never do."

25. Ibid p. 47 — "Voltairism may be said to have begun from the flight of its founder from Paris to London.

26. Moulten — "Criticism not as a branch of literature but as a branch of science.'

27. Weber—Indian Wisdom p. 161—"It is not Jati (Birth) Varna (colour) Panditya (Learing) but the Brahmavid (He Who knows Brahman) is alone a Brahmana. "This portion has been used by a Buddhist (Aswaghosha) almost literally against the system of caste in general.

28. ఈశాద్యుపనిషద్ — p. 222 — వజ్రసూచికోపనిషద్. published by Nirnaya Sagara press,

29. Russell—"History is valuable to begin with because it is true."



# అద్వైత శేఖరము

## శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

**పాత్రలు:**

| | | |
|---|---|---|
| పోతన్న | — | నారయ్య |
| తిప్పయ్య | — | సింగన్న |
| కేతన | — | సదానందకవి |

ఆమె (గంగయ్య తాత కూతురు)

ఇది పోతన్నగారిని గూర్చిన నాటకము. ఆయనను గూర్చి పలుకథ లున్నవి. భాగవతము నలుగురిచేత వ్రాయబడుటకు పలుకథలున్నవి. చరిత్ర దృష్టితో జూచినచో హేతుదృష్టితో జూచినచో నే కథలునునిలువవు. అందు చేత నీ నాటకమునందు వేరొక కల్పన చేయబడినది. ఈ కల్పనలోని విష యము మాత్రము నిల్చునా యన్నచో నిలుచును; నిలువక పోవచ్చును. కాని వెలిగిందల నారయ, వేర్పూరి సింగన్న, గంగన్న, పోతన్నగారల కవితా లక్షణమును మాత్రము నిస్సంశయముగ ప్రకాశింప జేయును.

పోతన్న : శ్రీ కైవల్యపదంబు చేరుటకునై చింతించెదన్ లోకర
క్షైకారంభకు భక్తపాలనకళా సంరంభకున్ దానవో
ద్రేకస్తంభకు కేళిలోలవిలసద్దృగ్జాలసంభూత నా
నాకంజాతభవాండకుంభకు మహానందాంగనా డింభకున్.....

అన్నగారూ, ఎందుకీ పద్యము చదువుచుంటిరి.......?

తిప్పయ్య : ఏదీ, నీవు గోదావరి యొడ్డున జపముచేసి కొనుచుండగా......

పోత : ఎప్పుడు......?

తిప్ప : సోమోపరాగమునాడు.....శ్రీరామచంద్రుడు భాగవతము వ్రాసి తన కంకిత మిమ్మని నిన్నడిగిన నాడు....

పోత : అప్పుడేమి?

తిప్ప : నీ కొక రాజముఖ్యుడు గన్పించెను.....

పోత : ఆయన తానే రామభద్రుండనని చెప్పినాడు. చెప్పి మ న్నామాంకితంబుగా శ్రీ మహా భాగవతమ్ము తెనుగు సేయుమన్నాడు.

తిప్ప : మఱి నీ యీ భాగవతపు మొదటి పద్యము నందాగానాడింభకు పరముగా నున్నదేమి ?

పోత : రామునకు కృష్ణునకు భేదమేమి?

తిప్ప : అయినచో రాముడు వచ్చి యడుగుట యెందులకు? మఱియు నీ షష్ఠ్యంతములు చదువుము......

పోత : అవియు కృష్ణపరముగానే యున్నవి......

తిప్ప : చదువవయ్యా.....

పోత : అన్నగారి యాజ్ఞ.......

హారికి నందగోకులవిహారికి చక్రసమీరదైత్య సం
హారికి భక్తదుఃఖపరిహారికి గోపవితంబినీ మనో
హారికి దుష్టసంపదపహారికి ఘోషకుటీపయో
హారికి బాలకగ్రహమహాసురదుర్వనితాప్రహారికిన్.....

తిప్ప : నాయనగారేదో చెప్పనెంచినట్లున్నారు....

కేతన్న : అన్నాదమ్ములు మీరిద్దరు మాటాడికొనుచున్నారు. తిప్పయ్యా, తమ్ముని విరకటములో బెట్టుచున్నావు. పోతన్నా, నంద డింభకుని కైవల్యపదమ్ము గోరి చింతించినాడోయి. గీతోపదేష్టయైన కృష్ణుడు కైవల్యనాథుడు. బ్రహ్మసదార్థము వాసుదేవమైన మహస్సు. దాని రహస్యమది......

పోత : నాయనగారి చరణములకు ప్రణామములు.....

తిప్ప : పోతన్నా! బంధువులు వచ్చినట్లున్నారు. నీ భాగవతము, నీశిష్యులు, నీదొక గోల; సంసారపు గొడవను నేను చూచుకొనవలయును. ఎవరు వచ్చినది, ఓహో, గంగయ్య తాతకూతురా...... ఏమమ్మా, యిట్లున్నావు?

ఆమె : మామయ్యా......నాకర్మ యిట్లు కాలినది. వారు చనిపోయినారు. నేను తిండిలేక వారి పంచలబడి తిరుగుచున్నాను.

తిప్ప : మంచి తిండిగల కొంపకు వచ్చినావు.....

కేతన్న : నీ భర్త పరమదుర్మార్గుడు. వానికి దీర్ఘాయుర్దాయ మెట్లుండునే...

పోతన్న : శ్రీమద్భక్తచకోరక
సోమ వివేకాభిరామ సురవినుతగుణ
స్తోమ విరలంకృతాసుర
రామాసీమంత్రసీమ రఘువర రామా....

ఆమె : మీరు తిండి పెట్టుదురని రాలేదు. చిన్న మామ మహాభక్తుడు మహాకవి భాగవతము వ్రాయుచున్నాడని విన్నాను. అందుకని వచ్చినాను. నేను వచ్చినదానికి చారితార్థ్యము గలిగినది. పోతన్న మామా! నీ దయవలన నా భర్తను శ్రీరామచంద్రుడు సంహరించినట్లయినది. ఖరాదులవలె నాభర్తకూడా మోక్షమునకు పోవునుగదా......

కేత : ఓసి పతివ్రతా....ఇచ్చటనే యుండుము. మాతోపాటు కలో గంజో త్రాగుదువుగాని...

తిప్ప : పోతన్నా! ఒక్కొక్క పద్యమున కొక్కనూఘర్షిగా నీవు భాగవతము ఎన్ని ఏండ్లు వ్రాసెదవు.......

కేత : తిప్పయ్యా......నీవు దేశద్రిమ్మరివి.......

తిప్ప : యీ సంసారము గడువుటకు నేనట్లు కావసి వచ్చినది. మే మిద్దరము నీకు గొడుకులమే. పోతన్న రామనామము చేయుచు గూర్చుండును. నేను బహుగ్రామధామముగా దిరుగుచుండును.

కేత : పోతన్నా, ఉన్న రెండెరకముల కొండయుద్రొక్కించుచున్నాడుగదవయ్యా!

తిప్ప : అతడు రాముని ధ్యానించుచున్నాడు. అతనికి రాముడు గన్పించుచున్నాడు. అతడు కృష్ణుని కీర్తించుచున్నాడు. నాయనగారూ! నేను సంపాదించి పోషించుచున్నాను. మీకు పోతన్నమీద నెక్కువప్రేమ.

కేత : భాగవతమంతయు పోతన్న వ్రాయుటలేదు. సింగన్న షష్ఠస్కంథము వ్రాయుచున్నాడు. గంగన్న పంచమస్కంథము వ్రాయుచున్నాడు.

తిప్ప : వెలిగిందల నారయ్య ఏమి వ్రాయుచున్నాడు?

కేత : ఏకాదశ ద్వాదశ స్కంథములు వ్రాయుచున్నాడు.

తిప్ప : అతడు దశమస్కంథమును వ్రాయవలయును.

పోత : దానిని నేనే వ్రాయవలయును.

కేత : నారయ్య సోమరి.....అతడు దశమస్కంథమును వ్రాయునా?

తిప్ప : యోగి సోమరి గాక కార్యశీలి యగునా ?

కేత : నారయ్య యోగియా ?

తిప్ప : నేను వెలిగందల వెళ్లి వచ్చితిని. వెలిగందలలో పూర్వము గణపతిదేవ చక్రవర్తి కట్టిన కోట నేడు తురకల అధీనములో నున్నది. అది చాల గొప్పదుర్గము. శత్రులకు అనిర్భేద్యమైన దుర్గము. ఆ దుర్గాధిపతి యున్నాడు. అతని పేరు హసనలీ.

కేత : ఈ తురుష్క ప్రస్తావన ఎందులకు ?

తిప్ప : అతడు గాయకుడు. గొప్ప గవాయి గాయకులైన తురుష్కులు తురుష్కులు కారు. అతడు గొప్ప శివభక్తుడు. పాల్కురికి సోమనాథుడు రచించిన బసవ పురాణ మతడెప్పుడును పఠించుచుండును.

కేత : ఆ గ్రంథము మహాగ్రంథమని వినుటయే గాని నే నెన్నడును చూడ లేదు.

తిప్ప : నా కందులో కొన్ని పంక్తులు వచ్చును.

క్షీరాబ్ధిలోపల క్రీడించు హంస
గోరునే పడియల నీరు త్రావంగ?
జాత ఫలంబులు జాంబించు చిలుక
భాతి బూరుగుమ్రానివండ్లు గన్గొను నె
రాకామలజ్యోత్స్న త్రావు చకోర
మాకాంక్ష చేయునే చీకటి త్రావ
విరిదమ్మి వానన విహరించు తేటి
పరిగొని సురియునే బబ్బురితరుల

పోతన్న : మందార మకరంద మాధుర్యమున దేలు
మధుపంబు పోవునే మదనములకు
నిర్మల మందాకినీ వీచికల దోగు
రాయంచ సనునె తరంగిణులకు
లలితరసాలపల్లవఖాదియై చొక్కు
కోయిల చేరునే కుటజములకు
పూర్ణేందుచంద్రికాస్ఫురిత చకోరకం
బరుగునే సాంద్ర నీహారములకు
అంబుజోదరదివ్యపాదారవింద
చింతనామృతపాన విశేషమత్త
చిత్త మేరీతి నితరంబు చేరనేర్చు
వినుత గుణశీల మాటలు వేయునేల.

తిప్ప : ఇది యెవ రన్నారు ?

పోత : ప్రహ్లాదు డన్నాడు.

తిప్ప : అప్పుడే సప్తమస్కంధముదాక వెళ్లితివా ?

కేత : నాయనా ! అతడు సర్వ స్కంధములందు, సర్వ కాలములందు సమానముగా విహరించుచున్నాడు. ఇంతకును నారయ్య యోగియన్నమాట చెప్పలేదు.

తిప్ప : వెలిగందలలో నత డొక బైరాగుల మఠమును స్థాపించినాడు. వారందరు నిత్య యోగాభ్యాస రతులు. నారయ్య యా మఠములోనివాడు.

కేత : దొరకక దొరకక మంచి శిష్యుడు దొరికినాడు.

తిప్ప : ఇప్పట భాగవతము పూర్తియే కాదు.... అత డేకాదశ ద్వాదశ స్కంధముల వ్రాసి తీసికొని వచ్చును.

పోత : అయినచో భాగవతము పూర్తి యైనట్లే కదా.

తిప్ప : అడుగో నారయ్య .... మీ తిప్పలు మీరు పడుడు. నే బోవుచున్నాను. యీ పతివ్రత యొక్కర్తుక వచ్చినది. ఇది ఇంకొక్క పోరు ...,

కేత : మరియొక కడుపు నాయనా.

తిప్ప : నాయనగారూ .... ఆమె పతివ్రత, అట్లనకుడు.

పోత : అన్నగారు పరమ పరిహాసశీలి.

ఆమె : యోగు లట్లే యుందురు.

నార : గురుసత్తమా! పరమ భక్తాగ్రేసరా! ... పోతన మనిషి! నా కప్పజెప్పిన రెండు స్కంధములు వ్రాసి తెచ్చితిని.

ఆమె : తిప్పయ్య మామా .... మీ రిద్దరు వెళ్లలేదు.

తిప్ప : భాగవతమును పూర్తిగా వినిపోదుము.

కేత : అప్పుడే పూర్తి చేసితివా ? నీ కిచ్చిన భాగము చాల గడ్డయిన భాగము. అందులో రాజ వంశము లున్నవి. అది జ్యోతిశ్శాస్త్రముతో గూడిన పని. ఖగోళ విజ్ఞానముతో గూడిన పని.

నార : నే నంతయు నెక్కువ వచనములోననే వ్రాసితిని.

నార : ఏను మృతుండ నౌదునని యింత భయంబు మనంబులోపలన్
మానుము సంభవంబు గల మానవకోట్లకు చావు నిత్యమౌ
గాన హరిం దలంపు మిక గల్గదు జన్మము నీకు ధాత్రిపై
మానవనాథ చెందెదవు మాధవలోక నివాస సౌఖ్యముల్.

పోత : ఓయి నారయ్యా! యీ పద్యము నేను ప్రథమస్కంధములో వ్రాసితిని గదా!

నార : గురుసత్తమా .... పేరు నాది గాని భాగవత మంతయు తమరు వ్రాసినట్లే గదా.

తిప్ప : భాగవతమును జపమాల వలె చేసినా డన్నమాట. ఆద్యంతములు గలిపినాడు. భాగవత మందలి తత్త్వ మిదియే గదా .... నారయ్య యీ పద్యమును భాగవత మహామాలారత్నమును చేసినాడు.

కేత : నారయ్యా! నీవు వ్రాసిన రెండు స్కంధములలోని వైలక్షణ్యమేమో చెప్పుము.

నార : పరమగురూ! చెప్పుమందురా ? నేను చెప్పుట న్యాయముగాదు.

తిప్ప : నారయ్యా! వ్రాసిన వాడవు నీవు చెప్పవూ. చదివెడివారము మాకు దెలియదు; యీ ముడి యెట్లు వదలును ?

నార : నే నహంకారి యనిపించుకొనుటతో వదలును.

తిప్ప : నీవు యోగివి. నీ వనిపించుకొనుట ఏమి లెక్క ? అనిపించుకొనుము.

ఆమె : నేను చెప్పెదను.

పోత : నీకెట్లు తెలియును.

ఆమె : నేను తిప్పయ్యమామకును నారయ్యయోగికిని శిష్యురాలను చెప్పుచున్నాను. నారయ్యగారి కవిత్వములో నాంధ్రభాషయందలి వచన రచనకు పరవడి కలదు. పోతన్నమామ పద్యరచన యెట్టిదో, నారయ్యగారి వచన రచన యట్టిది.

కేత : నారయ్యా! నీవుగా వ్రాసిన పద్య మొకటి చదువుము.

నార : నారాయణుని తపోవిఘ్నము చేయుటకు దివిజకామినులను, బలభేది పంపించెను. నారాయణుడు చలింపలేదు. భగవంతుడైన యచ్యుతుడు వృషభునకు నాత్మయోగము చెప్పెను.

వచనం: అట్టి పరమేశ్వరుని లీలాగృహీతంబులగు మత్స్య కూర్మ వరాహ నారసింహ వామన రామ రఘురామ బుద్ధ కల్క్యాద్యవతారంబు లనేకంబులు గలవు. వాని నెరిగి నుతియింప శేష భాషాపతులకైన వలవి గాదు.

సర్వ లఘుసీసం :

నవవికచ సరసిరుహ నయనయుగ నిజచరణ
గగనచర నదిజనిత నిగమవినుత
జలధిసుతకుచకలశ లలితమృగమదరుచిర
పరిమలిత నిజహృదయ ధరణిభరణ
ద్రుహిణముఖసురనికరవిహితమతికలిత గుణ
కటి ఘటిత రుచిరతర కనకవసన
భుజగరిపువరగమన రజతగిరిపతివినుత

సతతజపరత నియమపరతిచరిత
తిమి కమఠ కిటి నృహరి ముదితబలినిహ
తపద పరశుధర దశవదనదళన
మురదమన కలికలుష మముదపహరణ
కరివరద ముని వర మర గరుడ వినుత.

వచనం : ఇవ్విధంబునన్ ప్రవర్తిల్లిన శ్రీమన్నారాయణమూర్తి విలాసంబు లనేకంబులు గలవు.

కేత : ఏమి? యీ పద్యము నీ రచనయంతలో గొప్పది యందువా ?

నార : స్వామీ! పూర్వాపరములు కలిపి చూడవలయును.

కేత : నా కర్థ మగుటలేదు.

ఆమె : తాతగారూ, అచ్చట నేమియును లేదు. శబ్దముచేత భావము ధ్వనించు శిల్పమందున్నది. ఆ సీసపద్యము సర్వ లఘువు. అందు భగవంతుని యనేక లీలావిలాసము లున్నవని నారయ్యగారు చెప్పుచున్నారు. ఇది యొక శిల్పము. భగవంతుడైన నారాయణున కీ సర్వ ప్రపంచము లఘువని యర్థము. ఈ సృష్టి యర్థరహితమని తాత్పర్యము. ఆ పద్యములో నేమియును లేదు. భగవంతుని గూర్చిన స్తోత్ర మున్నది. యీ సృష్టిలో భగవంతుని స్తుతించుట తప్ప యింకొక ప్రయోజనము లేదని దాని తాత్పర్యము.

కేత : నీ వింతటి తెలివిగలదాన వెట్లయినావు ?

తిప్ప : నాయనగారూ, దాని కొక హేతు వున్నది. ఈమె భర్త బ్రతికి యున్నప్పుడు వారి తగులము పట్టరానిదిగ నున్నది. వా రిద్దరు సంతకాముకులు. అంతటి లిప్సతో వర్తించినారు. అందుచేత నిప్పు డంత వైరాగ్య మామెకు గలిగినది. అంతటి తెలివి గలిగినది.

పోత : రాజా రాజముఖిని రతిదేల్చి బంగారు
మేడలందు తరుణ పీడలందు
కోటలందు రత్న కూటమ్ములందును
కొలకులందు గిరుల కెలకులందు.

వచనం : అంత నయ్యుద్దరకు తగులంబు నెంకొని, ....
ఒకదిక్కే గాని తన లో
లోకపోటన గాని నిలిచియుండరు దమ లో
నొకటేయగాని తలంపరు
నొక నిమిషము పాయలేరు నుదిదయు లేడున్ ....
దయ్య మెరుంగున్ వారల
నెయ్యంబులు మక్కువలును నిజమరితనముల్
తియ్యములును నెదసందిని
బయ్యెద కొంగట్లమైన ప్రాణము లిడలున్.

వచన : ఇట్లూర్వశియున్ బురూరవుండు నొండొరులవలన మక్కువలు మెక్కి లోత్తన్ పగలు రేలు ఎల్లెడల విహరింప.

తిప్ప : ఇది నవమస్కంధములోని వృత్తాంతమా?

పోత : చిత్తము ....

(అయ్యో, అయ్యో అని కేకలు)

కేత : తిప్పయ్యా, ఆ విలాప మేదియో చూచిరమ్ము ....

తిప్ప : మన యూరి గ్రామాధికారి కుమారుడు బావిలో పడినాడు.

ఆమె : అయ్యో పాపము.

తిప్ప : భయములేదు. .... గొల్ల కుర్రవాడు సింహమువలె నూతిలోనికి దూకి పిల్లవానిని పైకి తీసెను.

పోత : వచనం : కృతనిశ్చయుడై పూర్వజన్మ భాగ్యంబులన్ తన చరణ స్పర్శంబు నకు యోగ్యంబై తత్సమీపమున విశాల విటపశాఖా కదంబంబుతో నున్న కదంబ భూజంబునెక్కి,
కటిచేలంబు బిగించి పింఛమున జక్కం గొప్పు బంధించి దో
స్తట సంస్ఫాలన మాచరించి చరణద్వంద్వంబు కీలించి త
త్కట శాఖాగ్రము మీదనుండి యురికెన్ గోపాల సింహంబు దీ
క్తటముల్ మ్రోయ హ్రదమ్ములో గుభగుభధ్వాన మ్మనూనంబుగన్.

తిప్ప : ఇది కాళియమర్దన ఘట్టమా ...

పోత : చిత్తము.

తిప్ప : ఓసి యోగినీ, నీ వింటిలో నుండుము. నేను వెళ్లుచున్నాను.

ఆమె : అరుగో ఏర్చూరి సింగయ్యగారు వచ్చుచున్నారు.

కేత : ఏమయ్యా సింగయ్యా .... షష్ఠస్కంధము పూర్తి చేసితివా ?

సింగ : చిత్తము స్వామీ.

పోత : ఎట్లు ప్రారంభించితివి .... ?

సింగ : వచనం. శ్రీ మహా భాగవత పురాణమ్మునందు షష్ఠస్కంధం బాంధ్ర భాషన్ రచియించం బూని యీ కృతికిం పతిగా నెవ్వేవుండు గలండని వితర్కించి కవిత్వ మహత్వంబు సంప్రాప్తంబగు కాలంబు దలచి, నారాయణుండు దైవంబని యెఱింగితిని .... ఒకనాడు నిద్రపోవు చుండగా
ఉరువడి ప్రాగ్దిశ నుదయించు మార్తాండ
కోటి బింబచ్ఛాయ కూడినట్లు
హరిహర బ్రహ్మ లయాత్మలలోమబ్బి
కరుణ యొక్కట మూర్తి బెరసినట్లు
శరకర కరతిప్రగతిని గరంగుచు
హేమాద్రి చెంత బె ల్లెగసినట్లు
ఫణిరాజ ఫణరాజి మణిగణ విస్ఫూర్తి
నుషిరంపు వెలి తలచూపినట్లు
ఉట్టిపడినట్లు కట్టెత్తి మాదినట్లు
తేజ మెసగంగ నా ప్రోల దివ్యవాణి
భూని సాక్షాత్కరించి సంపూర్ణదృష్టి
జూచి యిట్లని పలికె మంజులముగాను ....

కేత: ఆమె ఏమన్నది ?

సింగ : ఆటలు పాటలున్ జదువు లద్భుతముల్ విన నొప్పు వాద్యముల్
పాటి దలంపరాని బలు పాములు మున్నగు విద్యలెల్ల నీ
కాటలు బాటలయ్యె నిను మున్నిటికిన్ మెఱుగిడ్డ భంగి నా
బాటున చాటుకార పద పాధు కవిత్వము జెప్పు మింపుగన్.
అప్పుడు నే నొక్క శ్లోకమ్మున నామెను స్తుతించితిని.

పోత : ఏదీ, ఆ శ్లోకమును చదువుము.

సింగ : హంసాయ సత్యనిలయాయ సదాశ్రయాయ
నారాయణాయ నిఖిలాయ నిరాశ్రయాయ
సత్యంగ్రహాయ సగుణాయ సదీశ్వరాయ
సంపూర్ణ పుణ్య సతయే హరయే నమస్తే ....

కేత : ఇది యేమయ్యా, కనిపించినది సరస్వతీదేవి, నీవు స్తోత్రము చేసినది నారాయణుడైన భగవంతుని ....

సింగ : ఈ శ్లోకం బద్దేవి యంగీకరించె .... (వచనం)

కేత : బాగుగా నున్నది .... మీ రందరూ నొక్కటియే జాతి.

పోత : ఆ నారాయణుడును సరస్వతియు నొక్కటియే జాతి. సింగయ్యా! నారాయణ కవచము యీ భాగములో నున్నది. దాని నెట్లు వ్రాసితివి ?

సింగ : గురూత్తమా .... కోటి కృష్ణ మంత్రమును జపించి వ్రాసితిని.

పోత : అట్లనా ? ఆంధ్రజాతి తరించునట్లు చేసితివి. ఆంధ్రులు సర్వమైన యాపత్కాలములయందు భవ్రదవితమైన నారాయణ కవచమును జదివి భూతప్రేతపిశాచాది బాధల నుండి విముక్తు లగుదురుగాక.

సింగ : అడవుల సంకటస్థలుల నాజిముఖంబుల వహ్ని కీలలం
డెడరులనెల్ల నాకు నతి కెక్కుగ దిక్కగు గాక శ్రీ నృసిం
హుడు సురశత్రుయూథప నఖోగ్రుడు విస్ఫురితాట్టహాస వ
క్త్రుడు నిజదంష్ట్ర పావక విధూత దిగంతరుడు ద్రపమేయుడై.

పోత : సింగయా, మీరు వ్రాసిన భాగములు మీరు వ్రాయుటయే బాగున్నది.

సింగ : అడుగో గంగన్న వచ్చుచున్నాడు.

కేత : గంగన్నా .... నీవు పంచమస్కంథమును పూర్తిచేసి వచ్చితివా ?

గంగ : చిత్తము పరమగురూ.

కేత : నీవు పంచమస్కంథ మేల తీసికొంటివి ?

గంగ : స్వామీ, అందులో భరతోపాఖ్యాన మున్నది. భగణ విషయము మున్నది. అది యంతయు నద్వైతవిషయము, ఖగోళ విషయము. గుర్వులు భక్తిచేత నొడలు మరచిపోయి వ్రాయుదురు. ఆ తత్వమును తత్వముగా భాసింప జేయవలయును. భగవంతుడైన వేదవ్యాసుడు భాగవతమునందు భిన్న స్థలముల జ్ఞానమునుజ్ఞానముగా భక్తిని భక్తిగా దీర్చినాడు.

కేత : ఆ యెవరో వచ్చినారు చూడుము.

సింగ : పరతత్వరహస్యమ్ము వ్రాసిన ఉద్దండ కవీశ్వరులు శ్రీ సదానంద కవి యోగీశ్వరులు వచ్చినారు. సింహాసన ద్వాత్రింశిక వ్రాసిన కొఱవి గోపరాజుగారు వచ్చినారు. మరియు వెంటలో శిష్యులు వచ్చినారు.

పోత : మహాకవులారా! దయచేయుడు. దయచేయుడు. నా గృహము పవిత్రమైనది.

సదానంద : భక్తసత్తమా! నీవును నీ శిష్యులును గలసి యాంధ్రమున మహాభాగవతము రచించినారు. మీ దర్శనార్థము మే మందఱము వచ్చి నారము.

పోత : మహాప్రసాదము. తమ ముందు నే నెంతవాడను.

సదా : మే మందఱము మి మ్మొకటి యర్థింప వచ్చినారము.

పోత : దయచేసి తెలుపుడు.

సదా : సర్వజ్ఞసింగ భూపాలుడు తమ భాగవతము నంకితము గ్రహింపగోరుచున్నాడు.

పోత : మహాయోగీ, తమరు కూడ నిట్లు వాక్రుచ్చుచున్నారా ? నేను భాగవతము మొదట నిట్లు వ్రాసితిని.

ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములు గొన్ని పుచ్చుకొని చొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెటపేటులంబడక సమ్మతితో హరికిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరా జొకడు భాగవతంబు జగద్ధితంబుగన్.

అయ్యో నాకీ యూహ వచ్చినప్పుడెల్ల సరస్వతిదేవి కన్నీటితో గన్పించుచున్నది..

కాటుక కంటినీరు చనుకట్టు పయింబడ నేల యేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాదిలికోడల ఓ మదంబ ఓ
హాటకగర్భురాణి నిను నాకటికిం గొనిపోయి యల్ల క
ర్ణాట కిరాట కీచకుల కమ్మ త్రిశుద్ధిగ నమ్ము భారతీ.



# తిక్కన తెనుఁగు తెన్నులు

శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి

మహాకవి తిక్కనవాడిన లోకోక్తులను, జాతీయములను, ఆయన రచనలోని ప్రయోగ విశేషములను ఏర్చి కూర్చి 'తిక్కన తెనుగు తెన్నులు' అనుపేర నొక గ్రంథముగా ప్రకటింపవలెనన్న కుతూహలముతో, నేను కొంతకాలముగా కృషిచేయుచున్నాను. అందుకు నేను సంతరించుచున్న సామగ్రి యెట్టిదో, నా వివరణ విధాన మెట్టిదో విజ్ఞుల కెరుకపరచి, వారివలన నా రచనా ప్రణాళికకు సంయు సదుపదేశములను పొందవలెనన్న యభిలాషముతో మచ్చుకు కొన్ని యంశము లీ వ్యాసమున నిచ్చుచున్నాను.

తిక్కన పాఠములు అచ్చు ప్రతులలో ఎడ నెడ మారియున్నవి. ఆయన ఉపయోగించిన సామెతలు—పలుకుబడులు నిఘంటువులకు సరిగా నెక్కలేదు. టీకాకారులు చెప్పిన అర్థములు కొన్ని పట్టులలో అసమంజసములుగా నున్నవి. మరియు తిక్కన తెనిగింపులో మెఱుగులతోపాటు, క్వాచిత్కముగా తఱుగులును దొరలి యున్నవి. ఈ యెల్ల విషయములును, సత్య నిర్ణయ తాత్పర్యముతో ఇందు పరామృష్టము లగుచున్నవి. పండితులు సహృదయతతో పరిశీలింతురుగాక.

## లోకోక్తులు ; జాతీయములు

వక్త తన భావమును విస్పష్టముగా వెలార్చుటకును, ఎదుటివారి హృదయమున కెక్కించుటకును లోకోక్తులు, జాతీయములు జీవగఱ్ఱలు. తెనుగువారి నిత్యవ్యవహారమునను సామెతలు స్వాభావికముగానే దొరలుచుండును. అవి లేక వ్యవహారము సాగదన్నను అతిశయోక్తి కాదు. జాతీయము కాని వాక్కులో రుచి తక్కువ. భావ స్ఫూర్తియు వెలితియే. ఈ తత్త్వము నెరిగినవాడు గావున తిక్కన తన కవిత్వమున సామెతలను, పలుకుబళ్లను సందర్భోచితముగా—విరివిగా నుపయోగించినాడు. అందువల్లనే ఆయన రచన చొక్కమగు తెనుగుదనముతో నిండారి మూలము కంటెను మనోరంజకమై, ఆంధ్రులకి మోదముం బొరయించుచు, భాషకు పట్టుగొమ్మయై విరాజిల్లుచున్నది.

తిక్కన తన కృతిలో మూడు పాళ్లు తెనుగు నుడులనే వాడి, 'తెనిగింపు' అను మాటను సార్థకము చేసినాడు. ఆ మహాకవి శాస్త్ర విషయములను గూడ తేటతెనుగు మాటలతోనే సూటిగా వివరించును. అది అనితర సాధారణమైన ప్రజ్ఞ. మరియు నా మనీషి కవనములోని నుడికారము లనేకము ఆయన సొంత సృష్టియే. భాషా సృష్టికర్త కావుననే 'కవిబ్రహ్మ' యనిపించుకొన్నాడు.

తిక్కన లోకమునుండి సంతరించి, గ్రంథమున పొందుపరచిన లోకోక్తులే, ఆయన నుడికారములే పిమ్మట కవులకు ఆధారములును—మార్గదర్శకములును అయినవి. సామెతలతోను, జాతీయములతోను ఆమెతలు పెట్టు పద్యములు కొన్ని మూదలించి, వాటిని గూర్చిన విశేషములు యథామతి మనవి చేసెదను.

### 1. 'సాదురేఁగిన తలపోలమున గాని నిలువదు'

"అనుజులకు వశ్యపడి యు
మినిఁ జేయఁగ నేమిఁ జూచి మెచ్చితిగా కీ
పును సాదు రేఁగెనే నిన్
నిను తల పోలమునన కాని నిలువదు సుమ్మీ."
(ఉద్యో. 2—13)

ఇది సంజయుడు ధృతరాష్ట్రునితో అన్నమాట—

'ధర్మరాజు తాలిమితో నున్నాడు గావున మీ దుండగములు సాగిపోవుచున్నవి. ఆయనకే ఆగ్రహము వచ్చెనా—కౌరవుల నందరిని తుద ముట్టించిగాని శాంతింపడు' అని భావము.

మూలమున సంజయుని సంభాషణములో ఈ వాక్యము లేదు. సందర్భానుగుణముగా తిక్కన చేర్చినాడు.

"యావ త్పరః కామయతేఽతి వేలం, తావ త్పరోఽయం లభతే ప్రశంసామ్" (31.14) అని మూలము.

'బలవంతుడైన శత్రువు ఉపేక్షించియుండు నంతవరకే, ఎవడైనను (దుర్బలుడు) మొనగా డనిపించుకొనుట' అని యర్థము—'బలవంతుడు చేయి చేసి కొననేని, బలహీనుడు నశించి తీరు'నని అందలి భావము.

తిక్కన ఆ భావమునే గ్రహించి, "సాదు రేఁగెనేని తల పోలమునగాని నిలువదు' అన్న లోకోక్తితో చెప్పినాడు.

'సాధువైన పశువు చెలరేగి పరుగిడ సాగెనేని, తా నుద్దేశించినచోటికి చేరిగాని, ఆగ'దని లోకోక్తి కర్థము. సాధు స్వభావముగలవానికి కోపము వచ్చెనేని, ఎంత చేయవలెనో అంత చేసిగాని మాన డని భావము.

సూర్యరాయ నిఘంటువు 'తలపోలము' క్రింద, ఈ సామెతను తెలిపి, అర్థమును వివరించినది.

ఉద్యోగ పర్వమునకు టీకా తాత్పర్యములు వ్రాసిన వే. పార్థసారథి అయ్యంగారు,—"సాధు రేఁగెనేనిన్=మెత్తనిది రేఁగినచో, తలపోలమునన కాని=తుద నెడలఁ దఱిమికాని, నిలువదు సుమ్మీ=నిలువదుసుమా" అని యర్థముచెప్పి, "తమ్ముల కధ్యపడి యూతం డేమియు నపకారము చేయకుండుటచే నీ వాతనిం గొని యాడితివి కాని, సాధువుగనుండునది రేఁగినచోఁ దుదముట్టఁ దఱుమక నిలువదుసుమా" అని తాత్పర్యము వ్రాసినారు.

'సాధు' అనుట తప్పు. 'సాదు' అనుట ఒప్పు. కావున వారి పాఠము, అర్థ తాత్పర్యములును సరియైనవి కావు.

### 2. మెత్తనిపులి

"వశీకృతచిత్తుఁడు ధర్మసూతి, మెత్తనిపులి యెల్లవారలు నధర్మము సేయుఁ బెట్టునంతకున్, వినఁడును గానఁడుం దిదప నీకును నాకు మరల్ప వచ్చునే?"
(ఉద్యో. 2—14.)

'మెత్తని పులి' యనుమాటకు 'మెత్తదనము వహించియున్న పులి' యని యర్థము. 'శౌర్యవంతుడయ్యును శాంతుడై యున్నవా'డని భావము.

సూ. ని. "మెత్తని పులి—పైకి సాధువుగా గనఁబడుచు తీక్ష్ణభావము గలవాడు" అని యర్థము చెప్పినది. ('పులి' క్రింద)

ధర్మజుడు సాధువుగా కనబడుటయే కాదు; నిజముగా సాధువే. పరాక్రమము ముండియు, 'వశీకృత చిత్తుడు' గావున కోపము నణచుకొని యున్నవాడు. అదే సాధు లక్షణము. శక్తిహీనుడును కోపము నణచుకొనును. కాని, వానిని సాధు వనరు. అసమర్థుండందురు. అసమర్థుని 'మెత్తని పులి' యను వారుండరు.

కాబట్టి, 'మెత్తని పులి' యను జాతీయమునకు, 'శౌర్యవంతుడయ్యును శాంతుడై యున్నవా'డని చెప్పుట యుచితము గాని, 'పైకి సాధువుగా కనబడుచు తీక్ష్ణభావము గలవా'డనిచెప్పుట యుచితము కాదని నా యభిప్రాయము.

## 3. 'చెవులు చీములుగట్టు'

"పుడమి జనంబు లెల్ల నినుఁ బ్రువ్వఁగఁదిట్టఁగ వింటు నుక్కి వా
చ్చెడు మది యెప్పుడున్ జెవులు చీములు గట్టెడుఁ గౌరవేశ్వర"
(ఉద్యో 2—10)

'చెవులు చీములు గట్టెడు' అనగా 'ప్రజలు నిన్ను తిట్టు తిట్లు విని విని, మా చెవులు పుండ్లుపడి, చీము పట్టినట్లు బాధపడుచున్న'వని యర్థము. 'మేమా తిట్లు విని సహింప లేకున్నా'మని భావము.

"చీములు గట్టు=(చెవులు) చీము పట్టినట్లు బాధపడు" అని మా. ని. పట్టి చెవులు చీము పట్టుట ఉండదు గావున, ఈ యర్థ ముచితము కాదు.

"చెవులు, చీములుగట్టెడున్=పుండ్లై చీము కూడినట్లు నొచ్చెడును" అని టీక. ఇదే సరియైన అర్థము.

## 4. 'మాకు కుడుము-మీకుఁ బ్రక్క'

"ఎదిరిం దన యట్లుఁ గా
మది దలఁచినఁ బోనగుఁ గాక మాకుం గుడు మిం
ఓఁదె మీరు ప్రక్కఁ గొనుఁడని
చదు రడిచిన మనముపొందు చక్కంబడునే?" (ఉద్యో. 1—312)

ఇది ధర్మరాజు సంజయునితో అన్నమాట. దీనికి—

"య ఆత్మనః పశ్యతి వృత్త మేవ
తథా పరేషా మపి సోఽభ్యుపైతు" (25—9)

అని మూలము. 'అతడు (ధృతరాష్ట్రుడు) తన విషయము నెట్లో అట్లే యితరుల విషయమును గూడ నాలోచింపవలె'నని యర్థము. అట్లాలోచింపక, స్వార్థపరుడై ప్రవర్తించిన పొందు కుదురదని భావము.

ఆ భావమును తిక్కన 'మాకు కుడుము—మీకు ప్రక్క' అను సామెతతో విశదము చేసినాడు. 'మాకు కుడు మిచ్చి, మీరు ముక్క తీసికొను'డని, చదురడిచినన్=ఏమో తెలివిగా మాటలాడిన, మనముపొందు చక్కఁబడునే=మనము కలిసి పొత్తు కుదురునా? అని పద్యార్థము.

'మాకు కుడుము—మీకు ముక్క' అనునది స్వార్థపరత్వమును దెల్పు లోకోక్తి. మాకు పెద్ద భాగము, మీకు కీసపాలు—అని దాని భావము.

మా. ని. వా. ని. కూడ 'కుడుము—మోదకము, భక్ష్య విశేషము' అని యర్థము చెప్పి, ఆ యర్థమున కీ పద్యము నుదాహరించినవి. నిఘంటువులు తెలుపవలసినది లోకోక్తిని గాని, దానిలోని ఒక పదమున కర్థము గాదు. 'కుడుము'న కర్థము తెలిసినంత మాత్రమున లోకోక్తి భావము తెలియదు. అది తెలియక పద్య మర్థముకాదు.

## 5. 'చూపి చెప్పు'

"మాకుం గుడు మిం ఓఁదె మీరు ప్రక్క గొను డని, చదురడిచిన మనముపొందు చక్కంబడునే?"—"అని చూపి చెప్పి వెండియు" అన్నచోట, టీకాకర్తలు—"చూపి చెప్పి—పోడిచి పలికి" అని అర్థము వ్రాసినారు.

ఆ యర్థము సరియైనదిగా నాకు తోచలేదు. 'చూపించి చెప్పి' అను అర్థమును అక్కడ సరిపడదు. నిఘంటువులు 'చూపు' 'చెప్పు' అను పదముల కర్థము చెప్పినవేగాని, 'చూపి చెప్పు' ఒక పదముగా తీసికొని అర్థము చెప్పలేదు.

కాని, నిజానికి అది ఒక పదమే. అది ఒక విధమైన పలుకుబడి. 'పట్టియిచ్చు' వంటిది. తిక్కన మరియొకమారును ప్రయోగించియున్నాడు.

"ఏ వట్లు చూపిచెప్పితిఁ
గాని యది రణంబు పాడి గామి యెఱుఁగుదున్
గానిను నీదువయి ను
శ్రీనికులమ నెఱిన కాయితము గమ్ము నృపా"
(శల్య. 2—105)

ఇది మడుగు వెడలి వచ్చిన దుర్యోధనునితో ధర్మరా జన్నమాట.

దుర్యోధనుడు—"మీరు పలువురు నేనొక్కడను. మీ రందరును ఒక్కుమ్మడిగా నామీద కవియుట ధర్మమా?" అన్నాడు.

ధర్మజుడు—"ఈ ధర్మమును అభిమన్యుని వధించుటలో నీవు పాటించితివటోయి?" అని యెత్తి పొడిచినాడు.

దుర్యోధనుడు నిరుత్తరు డైనాడు. అతని దీనస్థితిని చూచి, మరల ధర్మరాజు, "ఓయీ, నీ రణ ధర్మ మే పాటితో తెలియుటకు—అభిమన్యుని వృత్తాంతము చూపి చెప్పితిని—తార్కాణించితిని. కాని, అది ధర్మముకాదని యెరుగుదును. నేను ధర్మమునే పాటింతును. నీవు భయపడవలదు. యుద్ధమునకు సిద్ధముక"మ్మన్నాడు.

కాబట్టి, "చూపి చెప్పు" అనునది—'తార్కాణించు' దృష్టాంతీకరించు' అను నర్థము నిచ్చు పదబంధముగాని, 'చూపు—చెప్పు' అను నర్థముల నిచ్చు రెండు క్రియలు కావు.

తిక్కన పద్యము ఆయన సొంత రచన. మూలములో ధర్మరాజు ఆవిధముగా అన్నట్లు లేదు.

"య ద్యేకస్తు త్వ హంతవ్యో బహుభి ర్ధర్మ ఏవ తు
త దాభిమన్యుం బహవో నిజఘ్ను స్త్వ న్మతే కథమ్"
అన్నంత వరకే యున్నది. (33—58)

కాబట్టి 'చూపి చెప్పుట' తిక్కన పాంతము.

మొదటి పద్యమునను,—'చూపి చెప్పి=(ధృత రాష్ట్రుని వర్తనము 'మాకు కుడు మిచ్చి—మీరు ముక్క తీసికొను' డన్న ట్లున్నదని) దృష్టాంతీకరించి' అనియే అర్థము.

ఇది భాషాభిజ్ఞులు పరిశీలించి పరిష్కరింపవలసిన క్రొత్త విషయము.

## 6. 'పిల్లిపట్టిన యీలువు'

విదురుడు ధృతరాష్ట్రునితో నన్న మాట—

"నీవుఁ గొడుకు వారి నెఱిలేక పఱిచితి
రదియు చాలు, నుచితమైన పాలు
పంచి యిండు; పిల్లి పట్టిన యీలువు
సేసియున్న నేల చెల్ల సేర్చు." (ఉద్యో 2—25)

పెక్కు ప్రతులలో పాఠ మిట్లే యున్నది. 1917—వావిళ్ల ప్రతిలోను, 1925 నే పార్థసారథి అయ్యంగారి టీకాసహితప్రతిలోను 'యీరువు' అను పాఠమున్నది. 'ఈలువు' అను పాఠముకంటెను, 'ఈరువు' అను పాఠమే సాధువన దగియున్నది. ఎట్లనగా:—

ఈలువు అనగా పాతివ్రత్యము:—

"ఎత్తికోలు ప్రయత్న; మీలువు మానంబు" (ఆంధ్రనామశేషము—53). పాతివ్రత్యమునకును, పిల్లికిని సంబంధములేదు. మరియు, భాషలో 'నోము పట్టుట' 'వ్రతము పట్టుట' కలదుగాని 'పాతివ్రత్యము పట్టుట'లేదు. కనుక 'పిల్లి పట్టిన యీలువు' అను పాఠమున అర్థము సరిపడదు.

'ఈరువు' అనగా మాంసము—

"పల యీరు వెఱచి నంజుడు
పల నస నివి వరఁగు మాంసమునకు"
(ఆం. సం. తిర్యగ్వర్గ—19)

మాంసమునకును, పిల్లికిని సంబంధము సహజము. కనుక 'ఈరువు' పాఠమే పద్యార్థమునకు సరిపడునది.

ఈ 'పిల్లి పట్టిన యీరువు' నే, గౌరన తన 'హరిశ్చంద్ర'లో 'పిల్లి పట్టిన దొబ్బ' అని వాడినాడు.

'కడుబండ ధూర్త నక్షత్రకు నోరు
దొడుకుట పాపంబు; దుర్మార్గుఁ డితఁడు
బల్లిదు చేతిలోఁ బడిన ధనంబు
పిల్లి పట్టిన దొబ్బ, ప్రిదులక పోయె
నింకఁ గౌశికు ఋణ మేమిటఁ దీర్తు" (హ. భా. 1310)

'దొబ్బ' యన్నను మాంసమే—

"తారసించినచోట దారునఁ జొరఁబాఱి
యొకటి రెంటిని దొబ్బ లురల నడుచు"
(మను. 4—42)

'పిల్లి పట్టిన దొబ్బ' అన్న గౌరన రచనను బట్టియు 'ఈరువు' పాఠమే సరియైనదని యేర్పడుచున్నది. ఈ పాఠమున, కౌరవుల వశమైయున్న పాండవ రాజ్యభాగము, పిల్లిపట్టుకొన్న మాంసపు ముక్కవంటిదని అర్థము.

మాంసపు ముక్కను పట్టుకొనిపోయిన పిల్లి, మూలను చేరి మూలుగు చుండునే గాని, అదలించినను, ముక్కను వదలిపోదు. అట్లే కౌరవులును, పాండవుల భాగము వాక్రమించుకొని, ఇమ్మన్న నియ్యక పేచీలు పెట్టుచున్నారని భావము.

మీ రీ విధముగా పేచీలు పెట్టుట, 'ఈరువుఁ బట్టిన పిల్లి' కథగానున్నదనియు, ఇది చెల్లదనియు పద్యమున విదురుడు ధృతరాష్ట్రునితో నన్న యమునవాక్యము.

ఒక విశేషము—గట్టిగా రెండు అదిలించితే, పిల్లి మాంసపు ముక్కను వదలి పారిపోవును. ఆ విధముగానే కౌరవులును దండోపాయముచేత, పాండవు, భాగమును వదలుదురేగాని, మంచి మాటలతో ఇయ్యరన్న వ్యంగ్యము కూడా ఈ లోకోక్తిని ప్రయోగించుటలో ఉన్నది.

ఈ లోకోక్తియొక్క సరియైన రూపము, సరియైన అర్థము ఇంత కాలముగా పండితుల దృష్టికి రాక మరుగువడియున్నది. 'ఈరువు జేసి' అని టీకా కర్త పాఠము. అది సరికాదు. 'ఈరువుసేసి' (ఈరువుగా చేసి) అని సరియైన పాఠము. ఈ పాఠమే అన్ని ప్రతులలోను ఉన్నది.

"పిల్లికిఁ బట్టిన గజ్జిపలెఁ జేసి యున్నచో" అని వారి టీక.

"పిల్లికిఁబట్టిన గజ్జివలె గట్టిపట్టు పట్టరేని పని యెట్లుపోగును" అని వారు వ్రాసిన తాత్పర్యము.

'ఈరువు—గజ్జి' యనుట సరికాదు. కావున వారి అర్థము తాత్పర్యము గూడా సరియైనవి కావు.

లోకోక్తితో గూడిన యీ భారతపద్యమును సూ. ని. వా. ని. 'పిల్లి'ల 'ఈలువు'; 'ఈరువు'; అను పదములలో దేని క్రిందనైనను ఇచ్చియుండవలసినది. కాని ఇయ్యలేదు.

పదబంధ పారిజాతము—"పిల్లి పట్టిన యీలువు—విడదీయరానిది" అని అర్థము చెప్పి, ఈ భారత పద్యమునే ఉదాహరించినది.

## 7. 'తిండికాఁడు'

సూ. ని. వా. ని. కూడా "తిండికాఁడు" = 1. తిండిపోతు. మిక్కిలి తిను వాడు. (శ. ర.) 2. దురాశావంతుఁడు, లోభి" అని యర్థముచెప్పి, ఈ క్రింది రెండు పద్యములను ఉదాహరించినవి.

"విను కొడుకుగొన్న వేడుకఁ
గొని కొట్టిన తిండికాఁడు కుటిలుం డతఁ డా
జనపతి చందము ధర్మజ
నినుసమశీలంబు నెఱుఁగు దది యట్లుండెన్"
ఉద్యో. (1—56)

"జన్ను డప్పరంపుఁ జొట్టైన చట్టి మున్నఁ
జూచి విఱుగఁబడుట చూడ కార్మఁ
దీవుఁ గోరి యుఱుకు తిండికాఁడును బోలె
నయిలి వగను టెంక ననుచితంబు"
(స్త్రీ 1—19)

'తిండిపోతు' అను నర్థము ఈ రెండు పద్యములలోను సరిపడదు. కనుక ఆ యర్థమునకీ పద్యములను చూపుట యుచితముకాదు. 'దురాశావంతుఁడు' అన్న అర్థము సరిపడి యున్నది. కాని, 'కొట్టిన తిండికాఁడు' అనగా అర్థమేమో యేర్పడుట లేదు.

1917 వావిళ్ల ప్రతిలో 'క్రొవ్విన తిండికాఁడు' అను పాఠాంతర మున్నది. 'రాజ్య సంపదచేత మదించిన దురాశావంతుడు' అని యర్థము చెప్పవచ్చునేమో! కాని, అదియును సరియైన పాఠముగా తోచుటలేదు. ఏమైనను 'కొట్టిన' అనుట కంటెను 'క్రొవ్విన' అనుటే కొంత మేలేమో నని నా యభిప్రాయము.

'కొట్టిన, క్రొవ్విన' అను విశేషణముల మాట అట్లుండగా, 'తిండికాఁడు' (దురాశావంతుడు) అను పదమును ప్రయోగించుటకును మూలములో ఆధారములేదు.

అందు, 'కౌరవులు ధృతరాష్ట్రుని యెఱుకమీదనే పాండవులను వంచించినారు. విదురు డెంతగా బోధించినను వినక ధృతరాష్ట్రుడు కొడుకునే అనుసరించుచున్నాడు' అని మాత్రమే యున్నది.

"ధృతరాష్ట్రస్య విదితే వంచితాః పాండవాఃపరైః
విదురే ణామునీతోఽపి పుత్రమే వానువర్తతే"
(ఉద్యో. 5—6)

అని మూలము. దురాశాపరుడైన కుమారు ననుసరించుటవలన్, ధృతరాష్ట్రుడును దురాశాపరుడే నన్న భావముతో తిక్కన 'తిండికాడు' అను పదమును ప్రయోగించి నట్లున్నది.

రెండవ పద్యమునకు మూల మిది:—

"మధు యః కేవలం దృష్ట్వా ప్రపాతం నానుపశ్యతి
స భ్రష్ట్వా మధులోభేన శోచ త్యేవం యథా భవాన్"
(స్త్రీ. 1—38)

'తేనెమీది యాశచేత, తాను పడిపోవుట నాలోచించుకొనక పై కెక్కి పడిపోయిన వాడు నీ వలెనే విలపించును' అని యర్థము.

ఇందులో, తేనె నాశించు భ్రష్టుడైనవాడు ఉపమేయముగను, పాండవ భాగము నాశించి, చెడి, పశ్చాత్తప్తుడై యున్నధృతరాష్ట్రుడు ఉపమానముగను చెప్పబడినది. తిక్కన సందర్భోచితముగా మార్చివేసినాడు.

మూలములోని మధులోభినే తిక్కన 'తీపిఁ గోరి యుఱుకు తిండికాడు' అన్నాడు. కనుక పద్యములోని 'తిండికాడు' అను పదానికి 'దురాశావంతుడు, లోభి' అని సూ. ని. చెప్పిన యర్థమే సరియైనది. తిక్కన ప్రయోగించు పదములకు—ఆయన హృదయము ననుసరించి అర్థము చెప్పవలెనేగాని, మన మామూలు అర్థములు చెప్పిన కుదురదు. ఈ తత్త్వమును సూ. ని. కనిపెట్టినది. శ. ర. కనిపెట్టలేదు.

తిక్కన 'తిండిపోతు'ను, 'తిండిపో'తనియే అన్నాడు.

"తిండిపోత నీకు భండనం బేటికిఁ
గడవఁ జేరి మనము కాంక్ష దీఱ
నోపు కొలఁది మ్రింగి యూరక నీ వింటఁ
గడన యుండు మింక నడచి పడక"
(ద్రోణ 4—239)

ఇది కర్ణుడు భీము నెత్తి పొడుచుచు నన్నమాట.

'తిండిపో'తని భీము ననుట యుచితమేగాని, ధృతరాష్ట్రు ననుట యుచితముకాదు. కావున, అతని విషయమున తిక్కన వాడిన 'తిండికాడు' అను మాటకు 'తిండిపో'తను యర్థము వ్రాయరాదు.

## 8. 'డెందానం జేయివెట్టుకొని నిద్రించును'

"కాన యవశ్యముఁ జెనకువ
గాని యుపాయమున *బగను గడతేర్చు ధృతిం
బూని నడచు నెవ్వఁడు డెం
దానం జెయి వెట్టుకొని యతఁడు నిద్రించున్"
(ఉద్యో. 3—19)

'రొమ్మున చెయ్యిపెట్టుకొని నిద్ర పోవును' అనుట నాడుక. 'హాయిగా నిద్ర పోవును' అని యర్థము. 'ఎట్టి విచారము లేక సుఖముగా నున్నా'డని భావము.

"సుఖం ప్రశాంతః స్వపితి హిత్వా జయ పరాజయౌ
జాతవైర శ్చ పురుషో దుఃఖం స్వపితి నిత్య దా"
(71—59)

'ప్రశాంతుడు జయ పరాజయముల మాట పెట్టుకొనక సుఖముగా నిద్రించును. వైరచింతగలవానికి సుఖ నిద్ర ఉండనే ఉండదు' అని యర్థము.

'డెందానం జెయి వెట్టుకొని నిద్రపోవును' అను లోకోక్తిలోనున్న రుచి 'సుఖముగా నిద్రించును' అనుటలోలేదు. అందుకే తిక్కన లోకోక్తిని వాడినాడు. తిక్కనకుముందే నన్నయభట్టు వాడినాడు.

"వినుత ధనుర్విద్యా విదు
షుఁ గర్ణుఁ సహాయుఁ బడసి కౌరవ విభుఁ డ
ర్జును వలని భయముఁబాసి రొ
మ్మునఁ జేయిడి నిద్రపోయె ముదితాత్ముండై"
(ఆది 6—63)

ఈ పద్యమునకు మూల శ్లోక మిది—

"దుర్యోధన శ్చాపి తదా కర్ణ మాసాద్య పార్థివ
భయ మర్జున సంజాతం క్షిప్ర మంతరధీయత."
(138—24)

'కర్ణుడు సహాయుడు కావడముతోనే దుర్యోధనునకు అర్జునునివలని భయము తొలగిపోయినది' అని యర్థము.

'భయముపోయి దుర్యోధనుడు సుఖ పడ్డాడు' అను నర్థము వచ్చుటకు నన్నయ లోకోక్తిని వాడినాడు.

సూ. ని. యీ లోకోక్తిని గుర్తించి, నన్నయ తిక్కనల పద్యములవేగాక, యీ క్రింది పద్యమును గూడా ఇచ్చినది.

"తాఁ బ్రజయు నొవ్వ, శయు నగఱిగాత్రమునవె చికాకు పఱుచు, వ్యసని డెందానఁ జేయిడి నిద్ర వోవు" (అను. 4—261)

## 9. 'ముక్కుఁద్రాటఁ గాలు గ్రుచ్చుట'

రాయబారిగా వచ్చిన కృష్ణుని, దుర్యోధనుడు తన ఇంట భుజింపవలసి నదిగా కోరినాడు. కృష్ణుడు, "దుర్యోధనా! దూతలు తాము వచ్చిన పని అనుకూలముగా నెరవేరిన తరువాత, విందు లారగించుటయు, పూజలందుటయు నుచితము. కావున నేను వచ్చినపని అనుకూలము కానిమ్ము; పిమ్మట నీవును—నీ మంత్రులును చేయు మర్యాదలను నేను గ్రహింతును" అన్నాడు.

అప్పుడు దుర్యోధనుడు, "కృష్ణా! నీ వన్నమాట యుక్తముకాదు. నీవు వచ్చినపని అనుకూలము కావచ్చును; కాకపోవచ్చును. అది యెట్లైనను నిన్నర్చించుట మాకు ధర్మము" అన్నాడు.

"కృతార్థా భుంజతే దూతాః పూజాం గృహ్ణంతి చైవ హి
కృతార్థం మాం సహామాత్యం సమర్చిష్యసి భారత" (90—19)
"న యుక్తం భవ తాస్మాసు ప్రతిపత్తు మసాంప్రతమ్
కృతార్థం చాకృతార్థం చ త్వాం వయం మధుసూదన (,,—20)
యతామహే పూజయితుం దాశార్హం న చ శక్నుమః" (,,—21)

అని మూలము. ఈ మూలములోని దుర్యోధన వాక్యమును తిక్కన యీ క్రింది విధముగా చెప్పినాడు.

"వేగపడుట మేలె! నీమము కార్యము దీఱు
దీఱకుండు దాని తెఱఁగు దగిన
యప్పు డాడరాదె! యిప్పుడు ముక్కుఁద్రాటఁ
గాలు గ్రువ్వనేల కమలనాభ!" (ఉద్యో. 3—220)

ఈ పద్యములోని 'ముక్కుఁద్రాటఁ గాలుఁగ్రుచ్చు' అను లోకోక్తిని అన్వయించుటలో పండితుల యభిప్రాయములు భిన్నముగా నున్నవి.

(1) టీకాకారులు — "ముక్కుఁద్రాటన్ = ముక్కునం గుట్టియుండు త్రాటిలో, కాలు, గ్రువ్వంగన్—దూర్చుట, అగునె = సరిపడునా!—పని కావచ్చును, గాకయుం బోవచ్చును. దాని విషయము సమయము వచ్చినప్పుడు మాటలాడరాదా? ఇప్పుడే ముక్కుత్రాటిలోఁ గాలుంగూడ దూర్చినట్లు త్వరపడవచ్చునా" అని చెప్పినారు.

(2) పదబంధ పారిజాతము—"ముక్కుఁద్రాట గాలుఁగ్రుచ్చు. అదేపనిగా తగాదాకు—పిలుచు అని అర్థము చెప్పి, ఈ క్రింది ప్రయోగమును ఇచ్చినది.

---

* 'బగఱ' అని అచ్చుప్రతుల పాఠము. సరికాదు. ఈవిషయమునుగూర్చి 'తిక్కన అనువాదములో అనుమానములు' అను వ్యాసములో నేను వివరించి యున్నాను. (చూ, 1962—జనవరి 'సాహితి')

"లేదు చిక్కులు పెట్ట లేదని చెప్పఁ
గాదని ముకుఁ(దాటఁ గాలు దుయ్యకుము"
(హరి. ద్వి. భా. 1482)

(హరి. ద్వి. భా. ఏ గ్రంథమో సంకేత సూచికలో తెలుపబడలేదు.)

ఇక నా మాట—

కృష్ణా! నీవు పెట్టుకొని వచ్చినపని పెద్దది. కావున నేరపడుట మేలు గాదు. అపని తీరవచ్చు. తీరకపోవచ్చు. దాని సమయము వచ్చినప్పుడు దానిమాట లాడుదువుగాక. ఇప్పుడు నా ప్రార్థనమును తిరస్కరించి, ముకుఁ(దాటఁ గాలు ద్రుప్పనేల—నా మనసు నొప్పింపనేల?—అని యర్థము చెప్పుట ఉచితమని నా యభిప్రాయము.

ముక్కుత్రాడు పశువునకు బాధ కలిగించునది. ఆ త్రాటిలో కాలిని దూర్చుట, ఆ పశువును మరింత బాధించుట యగును. కాబట్టి, ముకుఁ(దాటఁ గాలు దూర్చుట—యనగాఁ బాధ కలిగించుట యనియే భావము.

మరియు, దుర్యోధనుని పశువుగను, రాజ్యవ్యవహారమును ముక్కు త్రాడుగను, కృష్ణుని తిరస్కారము ఆ త్రాటిలో కాలుదూర్చుటగను భావింప వచ్చును.

నాకు తోచినమాట మనవి చేసినాను. పెద్ద లింకను విచారింతురుగాక.

సూ. ని. "ముకుఁ(దాడు=నాథము, ఎడ్లకు ముక్కునఁ గుచ్చెడు దారము" అని అర్థము చెప్పి, ఆ యర్థమునకే పద్యమును చూపినది. ఏమి ప్రయోజనము?

"ముక్కుత్రాట కాలుదూర్చుకొన్నట్లు" అనుటయును గలదు. అది స్వయంకృతాపరాధమును తెలుపుమాట.

పశువు ముక్కుత్రాటిలో కా లిరికించుకొనుటయు, చూచినవారు తప్పించుటయు అప్పుడప్పుడు తటస్థించుచుండును.

## 10. 'మడుఁగు చీరయందు మసిదాఁకినట్లు'

"మడుఁగుఁ జీరయందు మసిదాఁకినట్లు మీ
వత్కులమునఁ గల్మషంబు కౌర
వేంద్రు కతనఁ బొందె వింతయుఁ బాపంగ
నీవ నేర్తు కార్యనిపుణ హృదయ!"
(ఉద్యో. 1—295)

ఇది సంజయుని వాక్యము—'కార్యనిపుణ హృదయా! ధర్మరాజా! దుర్యోధనుని దుర్వర్తనము వలన, మడుగు చీరకు మైలపోకినట్లు, పవిత్రమైన మీ కులము కలుషితమైనది. ఆ కాలుష్యమును పాపుటకు నీవే సమర్థుడవు' అని యర్థము. యుద్ధము పాపహేతువు గావున, నీ వా పనికి పూనుకొనవలదని—యుందలి భావము.

సంజయు డీ విధముగా నున్నట్లు తిక్కన చెప్పినాడు గాని, మూలములో నిట్లు లేదు.

"ధర్మరాజా! మీరు మంచి కులమున జన్మించినవారు. 'మృదు హృదయులు. వదాన్యులు. హ్రీమంతులు. కార్యనిశ్చయజ్ఞులు' అని పేరు పడినవారు. మరియు మీ పరాక్రమము సాటిలేనిది. ఇట్టి మీరు నీచ కార్యమునకు పాలుపడుట భావ్యముకాదు. మీ వర్తనమున ఏ మాత్రపు లోపము పొటమరించినను, అది శుభ్ర వస్త్రమున కంటిన కాటుక చుక్కవలె నెల్లరికిని తెల్లమై, మీ చరిత్రమునే కలుషితము కావించును. యుద్ధము పాపకృత్యము. నరక మూలము. అదియును గాక, యుద్ధమున జయపరాజయములు నిర్ణయింపరానివి. కాబట్టి నీవు యుద్ధము మాట తలపెట్టవద్దు" అని యున్నది.

"కులే జాతా హ్యనృశంసా వదాన్యా
హ్రీనిషేవాః కర్మణాం నిశ్చయజ్ఞాః" (24.5)
"న యుజ్యతే కర్మ యుష్మాసు హీనం
న త్వం హి న స్త్వాదృశం భీమసేనాః
ఉద్భాసతే హ్యంజన బిందు వత్త
చ్ఛుభ్రే వస్త్రే యాద్భవే త్కిల్బిషం వః" (24.6)
"సర్వ క్షయో దృశ్యతే యత్ర కృత్స్నః
పాపోదయో నిరయో భావ సంస్థః
క స్తత్ర కుర్యా జ్జాతు కర్మ ప్రజానన్
పరాజయో యత్ర సమో జయశ్చ" (24.7)

నా బుద్ధికి సంస్కృత సంజయుడు చెప్పినదే సముచితముగా తోచినది. తెనుగు సంజయుని ప్రసంగము ఆక్షేపమున కవకాశ మిచ్చుచున్నది. కారణములు మనవి చేసెదను.

దుర్యోధనుని దుశ్చేష్టితములవలన కళంకితమైనది అతని చరిత్రమే గాని, కౌరవ వంశ మంతయును గాదు. నిష్కళంక చరిత్రుడు ధర్మజు డుండగా, వంశ మంతయు కళంకితమైన దనుట పొసగనిమాట.

ఎవరికి వచ్చిన చెడ్డపేరును వారే పాపుకొనవలెగాని, ఇతరులు పాపజాలరు. అది అసంభవము. కాబట్టి, "కౌరవేంద్రు కతన గలిగిన కల్మషంబు బాపంగ నీవ నేర్తు" వనుట యుక్తి యుక్తముకాదు.

దుర్యోధనుడు మంచి మనసు చేసికొని, సమర సన్నాహము మాని, పాండవుల భాగము పాండవుల కిచ్చివేయవలె. అప్పటికిగాని, అతనికి వచ్చిన చెడ్డపేరు పోదు. అది పోయినవేగాని, కౌరవ వంశమునకు గలిగిన కల్మషము పోదు. కనుక యుద్ధ ప్రయత్నము తగదని బోధింపవలసినది దుర్యోధనునకుగాని, ధర్మజునకు కాదు.

ధర్మరాజు తాను ఎడ్డబస్సములు మిరచియు, రాజ్యాశ వదలుకొనియు, త్యాగమూర్తి యనిపించుకొన నెంచియు, సంజయుని యుపదేశము ప్రకారము, చేతులు ముడుచుకొని యుండును గాక. దుర్యోధనునివలన కులమునకు వచ్చిన అవఖ్యాతి పోవునా? ధర్మజుని సహనము, త్యాగము ప్రకటము అగునేగాని, ఆ యవఖ్యాతి పోదు. పైపెచ్చు మరింత హెచ్చి, శాశ్వతముగా నిలిచిపోవును.

కాబట్టి, దుర్యోధనునివలని దుష్కీర్తి పోవుటకు—నీవు యుద్ధము మానుకొమ్మని ధర్మజునకు బోధించుటలో ప్రయోజనము లేదు. ఔచిత్యమును లేదు. యుద్ధమునకు దిగినచో, మీ మంచి పేరుకు మచ్చువచ్చును గావున, నీ వా పనికి దిగవలదని బోధించుటలోనే ప్రయోజనము—ఔచిత్యమును ఉన్నవి.

ఇది నా యభిప్రాయము. పెద్దలే మందురో!

## 11. 'నేలఁబెట్టి కాలఁజమరు'

"విజఘటకు వెఁగిరి యుత్తరు
గజ మమ్మ్రదేశు రథముఁ గదిసి తురంగ
వ్రజము పయి కదరి కడు న
క్కజముగ నెస నేలఁబెట్టి కాలం జమరెన్"
(భీష్మ 1—282)

'నేలఁబెట్టి కాలఁజమరు' అనునది, 'హింసించు, బాధించు' అను నర్థము లను దెల్పు జాతీయము. ఈ పద్యమున కర్త ఏనుగు గావున, 'గుఱ్ఱములను కాలి క్రిందవేసి త్రొక్కివది' అన్న వాచ్యార్థము గూడా పరిపడుచున్నది.

సూ. ని. 'చమరు' అను పదముక్రింద, ఈ జాతీయమును తెల్పినది. కాని భావమును తెలుపలేదు. అక్కడ ఈ పద్యమును గూడా చూపలేదు.

'నేలబెట్టి కాలరాచు' అని యీనాటి వాడుక. సూ. ని. ఈ వాడుకను తెల్పి 'మిక్కిలి పీడించు' అని అర్థము చెప్పి, ఈ క్రింది పద్యము నిచ్చినది.

"నేలయు పారసములు దమ్ము నేలఁబెట్టి
కాల రాచుచు నున్నాఁడు కలువల చెలిఁ

వెతలఁ బడఁజాల మిది రాహువేళ యనుచు
నతివ వదములఁ బడెనన నడుగు లమరు."

(బిల్హ. 2—117)

'చంద్రుడు కమలములను వేల బెట్టి కాల రాచుచున్నాడు'— అనుటలో గల శ్లేష చమత్కారమును పాఠకులు గుర్తింపగలరు.

## 12. 'గుండ్లు తేలి బెండ్లు మునిగినట్లు'

"పాదిమిన యగ్గురు ప్రావున భవదీయ సైనికులు గొందఱో కృష్ణులం జేరి పరాక్రమించుట గుండ్లు దేలి బెండ్లు మునింగినట్లయ్యె" (ద్రోణ. 3.67)

ఈ సంగతి మూలములో లేదు. తిక్కన సొంత రచన.

కృష్ణార్జునులకు వెరచి వరుగెత్తవలసిన కౌరవ సైనికులు పరాక్రమించి, కృష్ణార్జునులపై గదిసి రనియు, అది గుండ్లు తేలి బెండ్లు మునిగినట్లు—అపూర్వముగా కనుపట్టిన దనియు నర్థము.

'గుండ్లుతేలి బెండ్లు మునిగిన' దనునది విపరీత సంఘటనను దెల్పు జాతీయము. ఈ జాతీయమును నాచనసోముడును వాడినాడు.

"మనుజాంగనలం బట్టుట
దనుజాలకుం జెల్లుగాక దనుజాంగనలన్
మనుజులు పట్టుటకును దొర
కొనిరే! బెండులు మునింగి గుండులు దేలెన్"

(ఉ. హరి. 5.218)

సూ. ని. 'గుండు' అను పదముక్రింద 'గుండ్లు తేలి బెండ్లు మునిగినట్లు' అను జాతీయమును తెలిపి, భారత వచనమును చూపి యుండవలసినది. చూపలేదు.

'బెండు' క్రిందనైనను 'బెండులు మునిగి గుండలు తేలు' జాతీయ మని తెలుపలేదు. 'బెండు=జీలుగు' అని అర్థము చెప్పి, 'ఉ. హరి'. పద్యము నుదాహరించినది. ఆ యర్థము, పద్య భావము తెలియగోరువారి కుపకరింపదు.

'బెండు=జీలుగు'' అనుటయును సరికాదు.

'జీలుగు' చెట్టుగాని, 'బెండు' కాదు. ఆ చెట్టు, ఎండిన పిమ్మట బెండగును. అప్పుడే నీటిపై తేలునది. లోకములో జీలుగు బెండే కాదు. జొన్న బెండు, పత్తి బెండు మొదలగునవియు నున్నవి. కాబట్టి 'బెండు=జీలుగు. జీలుగు బెండు' అని చెప్పుట సరికాదు.

సూ. ని. 'జీలుగు' క్రింద ఈ పద్యముల నుదాహరించినది.

"ప్రేలకు జీలుగు పెరిఁగిన
మాలెకుఁ గంబంబు గాదు" (ఉ. హరి. 3.50)

"జీలువు పెరిఁగిన మాలెకంబము గాదు
గొడ్డుఁ బెంచినఁ బాడిఁ గోవు గాదు" (సిత. 70)

పెరుగుట చెట్టుగా నున్నప్పుడేగాని, ఎండి బెండైన పిమ్మట పెరుగదు. కనుక 'జీలుగు=ఒక జాతి చెట్టు' అని చెప్పనగును. జీలుగు చెట్టున కల్లువచ్చును. 'జీలుగు'నే—నన్నెచోడుడు 'జీలిక' యని వాడినాడు.

"జీలిక కల్లు ద్రావి......వన్నెకాంతలు రమింతురు తద్విపినాంతరంబులన్" (కు. సం. 6.45)

"జీలిక కల్లు=జీలుగు చెట్టు కల్లు" అని టీక. ("వన్య కాంతలు" అని సూ. ని. సవరణ.)

## 13. 'కప్పయెలుఁగు పాము'

"విను నవలీల దాటి ప్రజ నేలకుఁ గోలకుఁ దెచ్చుచున్న య
ర్జును దలయెత్తియైన నటు చూడవు పాండవ పక్షపాతి! నీ
మన మటుగాన యెప్పుడును మాదెసఁ గప్ప యెలుంగుఁ బామవై
యునికి యెఱుంగవచ్చె; నటు లూఱటగా వర మిచ్చినాఁడవో!"

(ద్రోణ 3.107)

"అతిక్రాంతే హి కౌంతేయే భిత్వా సైన్యం పరంతప
జయద్రథస్య గోప్తార స్సంశయం పరమం గతాః" (94. 8.)

"జానామి త్వాం మహాభాగ పాండవానాం హితే రతం
తథా ముహ్యామి చ బ్రహ్మన్ కార్యవత్తాం విచింతయన్"

(,,—11)

"అస్మా న్న త్వం సదా భక్తా న్నిచ్ఛ స్యమితవిక్రయ
పాండవాన్ సతతం ప్రీణా స్యస్మాకం విప్రియే రతాన్" (,,—13)

అని మూలము. 'ఏమయ్యా! అర్జునుడు మన సైన్యమును ఛేదించుకొనియే పోయినాడా? ఎవరైననూ నమ్మెదురా? నీవు పాండవప్రియుడవు. నే నెరుగుదును. ఎరిగియు కార్యార్థినై నిన్ను నమ్ముచున్నాను. మేము నీకు భక్తులమై యున్నను, నీవు మ మ్మిచ్ఛగింపవు. మాకు విరోధులైన పాండవులను ప్రేమింతువు'—అని యర్థము.

ఈ యర్థమే తిక్కన పద్యములో,—'పాండవ పక్షపాతి' అను సంబోధనమువల్లను, 'అర్జునుడు మన సేనను నేలకు కోలకు తెచ్చుచున్నను తల యెత్తియైనను అటుచూడవు'; 'నీ మనస్సెప్పుడును అటే'; 'నీవు కప్ప యెలుగు పామువు'; 'మాకు ఊఱటగా వరమిచ్చినావటయ్యా?' అను జానుతెనుగు పలుకుబళ్ల వల్లను—ఎంతో మనోహరముగా రూపొందినది.

నేలకు—కోలకు తెచ్చుట' యనగా ఛిన్నాభిన్నము చేయుట.

'కప్ప యెలుగుపాము' అనగా, కప్పవలె అరచుచు, దగ్గరకు వచ్చువారిని కాటువేయు పామువలె, మంచి మాటలతో నమ్మించి, ద్రోహము చేయువా డని భావము.

ద్రోణుడు సైంధవుని రక్షింతునని చెప్పి, అర్జునునిచేత చంపించినాడని దుర్యోధనుని దెప్పుడు మాట.

'కప్ప యెలుఁగుపాము' జాతీయము. సూ. ని.; పద. పారి. చెప్పినవి. ఇట్లే 'మేక వన్నె పులి' అనుటయును కలదు.

"తెలియ నిది మేక వన్నియపులి యటంచు" (రాధికా. 3—19)

'పయోముఖ విషకుంభము'; 'గోముఖ వ్యాఘ్రము' అను సంస్కృత లోకోక్తులును ఈ భావమును తెల్పునవే.

"తనకు నేల యమృతధామాఖ్య గోముఖ
వ్యాఘ్ర మనఁగ నిట్టివాడ నువ్వు" (కళా. 6.268)

## 14. 'తేనె పూసిన కత్తి'

"విను నమ్మి యొండు వలికిఁ
జనక జయద్రథుఁడు నిలిచె సైన్యములో నా
తనిఁ జంపెడు దేనియ పూ
సిన కత్తిగాక మానిసిగ నూహింపన్"

(ద్రోణ. 3—108)

ఈ పద్యమును మూలమునకు భావానువాదమే. మూలములోని భావమిందు సంగ్రహింపబడినది. 'తేనెపూసిన కత్తి' యనునది మాత్రము మూలములోని మాట.

"న హ్యహం త్వాం విజానామి మధు దిగ్ధ మివ క్షురమ్" (94.14)

"న దాస్యశ్చే ద్వరం మహ్యం భవాన్ పాండవ నిగ్రహే
వావారయిష్యం గచ్ఛంత మహం సింధుపతిం గృహాన్" (,,—15)

"మయా త్వాశంసమానేన త్వత్త స్త్రాణ మబుద్ధినా
ఆశ్వాసిత స్సింధుపతి ర్మోహా ద్దత్తశ్చ మృత్యవే" (,,—16)

తేనె పూసిన కత్తి, తేనెను చూపి, ఆశ కల్పించి, నాకివంతనే నాలుకను తెగగోయును. దానిని బట్టి, అనుకూలమగు మాటలు చెప్పి, అటుపై మోస గించువానిని 'తేనె పూసిన కత్తి' యనుట లోకోక్తియైనది.

"సైంధవుని రక్షింతునని మాట యిచ్చి నమ్మించి మోసగించిన వాడవు. "నీవు తేనె పూసిన కత్తివి" అని ద్రోణుని నిందించుచు దుర్యోధనుడన్నమాట.

పై లోకోక్తిని తెనాలి రామకృష్ణుడును, అట్టి భావములోనే ప్రయోగించినాడు.

"తేనె పూసిన కత్తి ధాత్రీసురుండు" (పాండు. 3—46) సూ. ని.; పద. పారి. ఈ లోకోక్తిని గ్రహించినవి.

## 15. 'నేలకుఁ గోలకుఁ దెచ్చు'

'నేలకు గోలకుఁ దెచ్చు' అనునది రూఢ్యర్థముగల ఒక పలుకుబడి. 'చిందర వందరచేసి చెండాడు, చంపు' అని యర్థము. ఈ పలుకుబడిని తిక్కన పలుమారు వాడినాడు.

"బాలుఁడవైన నీ వరిది బంటు తనంబునఁ బ్రౌఢ వీర భూ
పాలురఁ గుంభజ ప్రభృతి బాహుబలాఢ్యులఁ గిట్టి నేలకుం
గోలకుఁదెచ్చి యి ట్లగుటకున్ వెఱఁగందుచు వంతఁ బొందుచున్
లోలతఁ జూడకున్నె జన లోకము నీదగు రూపురేఖయున్"
(ద్రోణ. 2—333)

"నిను నవలీలఁ దాటి ప్రజ నేలకుఁ గోలకుఁ దెచ్చుచున్న య
ర్జును దలయెత్తియైన నటు చూడవు" (ద్రోణ. 3—107)

శ. ర. "నేలకుఁ గోలకుఁ దెచ్చు—క్రిందు మీఁదుచేయు" అని చెప్పినది. సూ. ని. లో ఈ క్రియయే లేదు.

వా. ని. ఈ క్రియను చెప్పి, భారతపద్యముల నుదాహరించినది.

పద. పారి. "నేలకు కోలకు తెచ్చు=1. నానా బీభత్సము చేయు. 2. చంపు" అని అర్థము చెప్పి, ఈ క్రింది పద్యముల నిచ్చినది.

"నీ యవలోకనం బొదవ నేలకుఁ గోలకుఁ దెచ్చినట్టి వాఁ
డా యెలనాగబోఁట్లు తెలియ న్వినిపింతురు నాకు నెంతయున్"
(కళా. 7—35)

"అరాతి బలము నేలకుఁ గోలకుఁ దెత్తురు" (కర్ణ. 2—88)

## 16. 'పువ్వుల కోలసాఁచు'

మూలములో, అభిమన్యు మరణమునకు దుఃఖించు ధర్మరాజును వ్యాసు డిట్లూరడించినాడు.

"యుధిష్ఠిర మహాప్రాజ్ఞ సర్వ శాస్త్ర విశారద
వ్యసనేషు నముహ్యంతి త్వాదృశా భరతర్షభ (52.9)
స్వర్గ మేష గత శ్శూర శ్శత్రూన్ హత్వా బహూన్ రణే
అబాల సదృశం కర్మ కృత్వా వై పురుషోత్తమః
(,,—10)
అనతిక్రమణీయో వై విధి రేష యుధిష్ఠిర
దేవ దానవ గంధర్వాన్ మృత్యు ర్హరతి భారత" (,,—11)

"యుధిష్ఠిరా! నీవు శాస్త్రములు చక్కగా చదివినప్రాజ్ఞుడవు. ఆపదలందు నీవంటివారు ధైర్యమును కోల్పోరు. కుమారుడు శూరులైన శత్రువులను పలువురను పరిమార్చి స్వర్గమున కేగినాడు. అతడు చేసిన పని మహావీరుడు చేయదగినదిగాని, బాలుడు చేయజాలినదికాదు. మృత్యువు దేవ దానవ గంధర్వులనైనను హరింపక మానదు'—అని యర్థము.

ఈ యర్థమును తిక్కన, ఈ క్రింది పద్యములో మరియొక ధోరణిలో చెప్పినాడు.

"పలువురు రాజులం దునిమె బల్విడిఁ డాతఁడు పిన్న వాఁడె
యలుఁగుల వాలుసేయు కధియాతులు పువ్వులకోల సాఁతురే
కలఁగుదురే విపద్దశల కాఁటియ నార్యులు? చావు లింత విం
తలె? గరుడోరగద్యుచరదానవకోటుల చావుఁ జూడమే!
(ద్రోణ. 2—149)

"అభిమన్యు డెంతోమందిని అంత మొందించి పోయినాడుగాని, అనామకముగా—దీనవు చావు చావలేదు. అతడు బల్విదుడుగాని, పసివాడుకాడు. రణమున పగవారు బాణములతో పడగొట్టక, పూలతో పూజింతురా? చా వొక వింతా? గరుడ గంధర్వాదులును చచ్చుట మన మెరుగమా! ఎరిగియును మీవంటి ఆర్యులు దుఃఖించుట యొప్పదు" దీని పద్య భావము.

'పువ్వులకోల సాఁతురే'—జాతీయము. తిక్కన ఈ క్రింది పద్యములోను వాడినాడు.

"జనపతి పంపఁ గేశవుఁడు సంధికిఁ బోయెడు నప్డు నీవు చె
ప్పిన గరువంపు రాజసపు బెట్టిదపుం దగు మాట లెల్ల నె
మ్మనమున నెక్కొనన్ నిలుపుమా నగవం బనియేమి? సంగరం
బునఁ బగవారు పేర్చి పొరిపుచ్చక పువ్వుల కోలసాఁతురే!"
(సౌప్తి. 2—90)

భీముడు అశ్వత్థామ శిరోమణిని తీసికొని ద్రౌపది కడకు వచ్చినాడు. ఆమె పుత్రులను తలచుకొని, దుఃఖించుచున్నది. అప్పుడు ఆమె మనసుకు దిటవు కలిగించుటకై, భీము డన్నమాట యిది.

దీనికి మూల మిట్లున్నది—

"ఉత్తిష్ఠ శోక ముత్సృజ్య క్షత్ర ధర్మ మనుస్మర" (16—28)
"ప్రయాణే వాసుదేవస్య శమార్థ మసితేక్షణే
యా న్యుక్తాని త్వయా భీరు వాక్యాని మధుఘాతిని" (,,—29)
"ఉక్తవ త్యసి తీవ్రాణి వాక్యాని పురుషోత్తమం
క్షత్రధర్మానురూపాణి తాని సంస్మర్తు మర్హసి" (,,—31)

'శోకముమాని లెమ్ము. క్షత్రధర్మమును స్మరించు. సంధికి పోవునపుడు శ్రీ కృష్ణునితో క్షత్ర ధర్మాను రూపముగా నీ వాడిన తీవ్ర వాక్యములు జ్ఞప్తికి తెచ్చుకో' అని యర్థము.

తిక్కన పద్యములోనున్న అర్థమును ఇదే. అయినను—'ఆనాడు నీవు కృష్ణునకు చెప్పిన గరువంపు—రాజసపు—బెట్టిదపు మాటలు మనమున నెక్కొన నిలుపుమా' అను రచన, మూలము కంటెను జిగియు బిగియు గలిగి, సంభాషణ సమయోచితమై, శోకమయమై యున్న ద్రౌపది హృదయమున నరల వీరమును మొలకెత్తింప జాలియున్నది. దానికి 'సంగరమున పగవారు పొరిపుచ్చక పువ్వుల కోలసాఁతురే' అన్న అర్థాంతర న్యాసము మరింత వన్నె పెట్టినది.

'పువ్వుల కోలసాఁతురే' అనునది 'పూజింతురా!' అను నర్థము నిచ్చు జాతీయము. 'పువ్వుల కోల్సాఁచు' శబ్ద పల్లవక్రియ. కావున, 'పువ్వుకోల—పూల బాణమును, చాఁతురే—చాపుదురా' అని ప్రతిపదార్థము చేయగూడదు. 'పూల కోల యేమి? చాచుటయేమి?' అని వితర్కించుటయును కూడదు.

సూ. ని. ఈ జాతీయములో గూడిన పై రెండుపద్యములను 'చాఁచు = చాఁపు' అను క్రియక్రింద ఇచ్చినది. పద్యములలో 'చాఁచు=చాఁపు'అను అర్థము పరివడదు. కావున, ఆ క్రియక్రింద ఇచ్చుట సరికాదు.

'పువ్వుల కోలసాఁచు' అను క్రియను మూలపదములలోనే చేర్చి, దాని క్రింద భారతప్రయోగములను చూపించవలె—పద. పారి. అట్లే చూపించినది.

## 17. 'పాలలోఁబడిన బల్లి'

సంధికొఱకు హస్తినకు పోవుచున్న కృష్ణునితో, ధర్మరాజు తన తల్లిని తలచుకొని యిట్లన్నాడు.

"అడవికి నేఁగునాఁడు మము నంపఁగ నెంతయు దవ్వు వచ్చిన
ప్పుడు దనమోము దైన్యమునఁ బొందెడు నశ్రులఁ జాచి చూచి యు
ట్లాడఁ బడి డించి పోవలసె నుమ్మలికమ్మున గొంతి యింతకున్
బడుగయి పాలలోఁ బడిన బల్లి విధంబున నుండకుండునే?"

(ఉద్యో. 3—135)

"ప్రవ్రజంతోఽభిధావంతీం కృపణాం పుత్రగర్ధినీం
రుదతీ మపహాయ్యైనా మగచ్ఛామ వయం వనమ్ (82—44)
న నూనం మ్రియతే దుఃఖైః సా చే జ్జీవతి కేశవ
తథా పుత్రాధిభి ర్గాఢ మార్తా హ్యనర్త సత్కృతా" (,,—45)
"అభివాద్యాచ సా కృష్ణ త్వయా మ ద్వచనాత్ విభో" (,,—46)

అని మూలము—ఇందులో, ధర్మరాజు—"కృష్ణ! మా తల్లి దుఃఖముల చేత మృతిపొందియే యుండును. జీవించి యున్నను మా కష్టములను తలచుకొని దుఃఖించుచుండును" అన్నట్లున్నది.

తిక్కన, ఈ యర్థమునే—'పాలలోఁ బడిన బల్లి విధంబున నుండకుండునే' అని జాతీయమైన భాషలో చెప్పినాడు.

"పాలలోఁ బడిన బల్లి' సంకట స్థితిని దెల్పు జాతీయము.

పాలకుండలో బడిన బల్లి బయటికి వచ్చుటకు వీలులేదు. పాల జిడ్డంటుకొని కాళ్ళు జారిపోవుచుండును. కనుక కుండ కెగ్రాక నమవు పడదు. అందువలన, ఆ పాలతోనే ప్రాణధారణ చేసికొనుచు, గతి గల్గు వరకును, అందులో పడి యుండవలసినదే. కనుకనే, సంకటస్థితి సూచకముగా 'పాలలోఁబడిన బల్లి' అను జాతీయము పుట్టినది.

ఈ జాతీయమును శ్రీనాథుడు వాడుకొన్నాడు.

"పడితిమి కుక్కలం బడవి పాటులు, దుర్భరమైన వృత్తి నెవ్
బడితిమి గర్భయాచకులభంగిదరిద్రత చుట్టుకొన్న, లో
బడితిమి పాలలోఁ బడిన బల్లుల కైవడి, వెల్ల వెంటలం
జెడితిమి యేమి చెప్ప నరసీరుహసంభవ! దుష్ట దైత్యుచేన్"

(హర. 3—15)

సూ.ని. "బల్లి=గృహ గోధిక, తఱచుగ విండ్ల గోడలపై ప్రాకుచుండెడి ఒక జాతి సరీసృపము. (ఇది శకునమును దెలుపును)" అని వివరించి,—"ఉమ్మలికంబున గొంతి" అను 'ఉద్యోగ' పద్యము నుదాహరించినది.

పద్యములో నున్నది పట్టి బల్లికాదు. 'పాలలోఁబడిన బల్లి'. కవి అట్టి బల్లిని ఉపమానముగా చెప్పుటలో భావమేమో, సూ. ని. వివరణము వలన తెలియదు. ఆ విషయమును అది జాతీయ మని గుర్తింపలేదు.

పద. పారి. జాతీయమును చెప్పి, అర్థభావములను చక్కగా వివరించినది.

## 18. 'ముల్లు ముంటఁబుచ్చుట'

"కలహంబులఁ దమలోనఁ జేసిన నుపేక్షా నైపుణం బొప్ప శ
త్రులఁ జాడందగు భూత దానవుల పోరుంజూచిన ట్లిమ్మెయిన్
ములు ముంటం దగఁ బుచ్చు భంగిగలుగున్ భూనాథ కిద్దైన మం
త్రుల యేపుఁ విభుఁ డిట్లు మాపునది నేర్పుం జెంపుఁ బొల్పారఁగన్."

(శాంతి. 2—418)

ఈ పద్యమున మూడు పంక్తులు తిక్కన సొంతము. 'కిద్దైన మంత్రుల యేపు మాపునది' అను వాక్యము మాత్రమే మూలము లోనిది.

"అధర్మదర్శీ యో రాజా బలా దేవ ప్రవర్తతే
క్షిప్రమే వాపయాతోస్య దుర్గో ప్రథమ మధ్యమౌ (92—8)
అస త్పాపిష్ఠ సచివో వధ్యో లోకస్య ధర్మహా
సహైవ పరివారేణ క్షిప్రమే వావసీదతి" (,,—9)

అని మూలము.

ముల్లు ముంటఁ బుచ్చుటయనగా దుర్మార్గుని దుర్మార్గుని చేతనే మడియించుట—తనకు గిట్టనివారు తమలో తాము కలహించుచున్నప్పుడు, ధార్మికుడైనవాడు అందులో జోక్యము కలిగించుకొనక, చూచీ, చూడనట్లుండవలె ననియు, అట్లున్నచో, శత్రువు శత్రువుచేతనే హతు డగుననియు, అది ముంటిని ముంటితోనే తీసివేసినట్లగుననియు పద్యభావము.

'ముల్లు ముల్లుతోనే తీసినట్లు' అని వాడుక. ఈ వాడుక సూ. ని. కెక్కలేదు. పద. పారి. ఈ వాడుకను చూపి, 'చెడుగును చెడుగుతోనే సాధించు' అని అర్థము చెప్పి, ఈ క్రింది పద్యమును గూడా ఇచ్చినది.

"అనవుడు వింతి యీయెడఁ బ్రయాస పడం బనియేమి యంచు వే
గన ములు ముంటఁ బుచ్చుటయు కార్యముగాఁ దలపోసి"

(విక్ర. 1—45)

## 19. 'ఎద్దక త్తెర—నాలుక బెల్లము'

"వికచముఖుఁ డగుచు శాత్రవు
లకు హితులగు నట్టి వారలం గని భూపా
లకుఁ డెడ్డ కత్తెరయు నా
లుక బెల్లము నై మనంబులుం గనవలయున్"

(శాంతి. 3—268)

ఎడ్డ=ఎడఁద, హృదయము—'నాలుక బెల్లము; ఎదకత్తెర' అని వాడుక. తియ్యగా మాటలాడుతూ, హృదయమున కఠినముగా నుండుట.

రాజు శత్రుపక్షమువారితో మంచిగా మాటలాడుచు, వారి మనసు మర్మములను కనిపెట్టుచుండవలెననియు, శత్రు వ్యవహారమున మాత్రము మనసున కఠినదనము కలిగియుండవలె ననియు పద్యమున భావము.

"వాఙ్మాత్రేణ వినీత స్యాత్ హృదయేన యథా క్షురః
శ్లక్ష్ణ పూర్వాభిభాషీ చ కామక్రోధౌ వర్జయేత్" (140.13)

అని మూలము.

సూ. ని. 'నాలుక' అనుపదముక్రింద—"నాలుక బెల్లము—వాఙ్మాధుర్యము, మాటల తీపి" అని చెప్పి, ఈ పద్యము నుదాహరించినది కాని, 'ఎడ్డ' అను పదముక్రింద' 'ఎడ్డ కత్తెర' యన నేమో చెప్పలేదు. "ఎడ్డ—ఎడఁద" అని మాత్రమే చెప్పినది.

నిఘంటువు ఎడ్డకత్తెర నాలుకబెల్లము' అను జాతీయమును 'ఎడ్డ' క్రిందనే చూపి, దాని భావమును తెలుపవలెగాని, ఆ జాతీయమును రెండు ముక్కలు చేయుటయు, అందు రెండవ ముక్కను 'నాలుక' క్రింద చూపి మొదటి ముక్కను వదలి వేయుటయు సరిగాదు.

పద. పారి. యీ పద్యమునే ఉదాహరించి—"ఎడ్డకత్తెర నాలుకబెల్లమగు—లోపల యేమున్నా పైకి ప్రియముగా మాట్లాడు. పయోముఖ విష కుంభము లాంటిది" అన్నది.

పయోముఖవిషకుంభము—'వంచకుడు' అను నర్థమునిచ్చునది. వంచనవానికి సహజలక్షణము.

పరపక్షమువారితో మంచిగా మాటలాడుచు, వారి మనస్తత్వము గమనించుచు, ఆత్మ రాజ్యరక్షణమున జాగరూకత గలిగి యుండుట రాజనీతిజ్ఞుడు నేర్చుకొనవలసిన లక్షణము. అందువలననే రాజ కాబోయే ధర్మజునకు భీష్ముడు బోధింపవలసి వచ్చినది. అది రాజనీతి.

ఆ నీతిని కృష్ణరాయలును అనువదించినాడు.

"గడినృపుల రాయబారుల యెడఁ గొలువున
పరస పల్లాపములు రాజు పలుకవలయుఁ

గార్య ఖడ్గము లమునఁబట్టి గాక యలుక
వలయు; నది మైత్రిఁ దాఁ దేలఁ బలుక వలయు"

(ఆము. 4.259)

వంచకుడు—అందరి విషయమునను 'పయోముఖ విషకుంభము' గానే వర్తించును. రాజు రాజనీతి ననుసరించి, పగవారి విషయమున మాత్రమే 'నాలుక బెల్లము—ఎద కత్తెర'గా వర్తించును. కాబట్టి, 'పయో........భము' అను మాట, రాజు నెడ వర్తింపదని నా యభిప్రాయము.

## 20. 'నిడుద్రాట పోవనిమ్ము'

"కుడువ నిమ్ము తతియుఁ గురవర క్రక్కించు
నవసరంబు నెఱిఁగి యరి నృపాలు
నీవు ధీరవృత్తి నిడుద్రాట బోనిమ్ము
క్రమ్మ కపిల యనఁగఁ గ్రమ్మ వెలవు." (అర. 1.72)

ఈ పద్యమున కర్థము నాకు సరిగా గోచరించలేదు. 'క్రమ్మ కపిల యనగ గ్రమ్మ వెలవు'—అను తుదిపాదము బొత్తిగా బోధపడలేదు. పాఠములో తప్పేమైన నుండునా? అన్న సందేహము వచ్చినది.

సూ. ని. లో 'నిడుద్రాడు' అను పదముక్రింద ఈ పద్యముదాహృతమై యుండదా! అక్కడ పాఠ సందేహము తీరదా? అనుకొని చూచితిని—"నిడుద్రాడు =పొడుగుత్రాడు" అని చెప్పి, ఈ పద్యమునే యిచ్చినది. కాని, తుదిపాదము నియ్యలేదు. 'నిడుద్రాట బోనిమ్ము' అన్నంతవరకే యిచ్చినది.

'కపిల' క్రింద ఇచ్చినదేమోనని చూచితిని. అక్కడను ఇయ్యలేదు. అర్థము దుర్బోధముగా నున్నందున, ఆ పాదము నుదాహరించుటే మాని నట్లున్నది. తిక్కన మూడు పాదములైనను అర్థమైనవా? అర్థమయ్యే యున్న యెడల 'నిడుద్రాట బోనిమ్ము' అను జాతియమును తెలిపి, దాని భావమును వివరించియుండునుగాని, 'నిడుద్రాడు' అను పదమునకు మాత్రమే అర్థ మేల వ్రాయును? 'నిడు'—'త్రాడు' అను మాటల కర్థ మా నిఘంటువులోనే యున్నది. కాబట్టి అది యొక పదముగా చూపుటయు, అర్థము వ్రాయుటయు ననవసరమే.

మొత్తముమీద తిక్కనపద్యము చిక్కుగానే యున్నది. మూలమును చూచినను అర్థమగుటలేదు. మూలమునకును—పద్యమునకును—పొత్తు లేదు.

"బుద్ధి పూర్వం బలి శ్శత్రు రాత్మవాన్ నీతి చ క్షరేత్" (7—2)
పర్యాపన కాలేతు వివరీతం విధీయతే
అమర్షకాలే రాజేంద్ర వ్యవసర్పే త్తతః పరమ్ (,,—3)
వ్యసనం ఖేదనం చైవ శత్రూణాం కారయే త్తతః" (,,—4)
అని మూలము.

పద్యమున కర్థము నా కొక విధముగా సాగకట్టినది. కాని, సమన్వయ మగుటలేదు. అర్థము తెలిసినచో పండితులు సమన్వయింతురన్న తలపులో తెలుపుచున్నాను.

'కపిల' అనగా, ఒక జాతి, జల జంతువు. ఈ యర్థము సూ. ని. లోనే యున్నది. 'నిడు త్రాట పోనిమ్ము' అను నానుడి జలజంతువుల వేట నట్టి పుట్టినదే. అది యెట్లనగా:—

వేటకాడు నిడుపైన త్రాటికి గాలము కట్టి, దానికి, 'ఎర'ను గ్రుచ్చి, నీటిపై వదలును. ఆ జంతువు మాంసాశచేత గాలమును మ్రింగి పట్టుపడును. అప్పుడది త్రాడు త్రెంపి తప్పించుకొని పారిపోవుటకు పెనగుచు, పరుగులు పెట్టును. వేటకాడు దానియిష్టము ప్రకారము కొంతదూరము పోనిచ్చి, మెల్లగా తన వంకకు లాగుకొనును. అది కొంతవరకు వచ్చి, మరల పరుగెత్తును. వేటకాడు మరల లాగును. ఈవిధముగా ఆ జంతువు అలసిపోవు వరకును బాధించి, తరువాత వాడు దానిని గట్టునకు లాగివేయును. ఇదే 'నిడుత్రాట పోనిచ్చుట' యనగా—బలవంతుడైన శత్రువునకు స్వేచ్ఛ యొసగుచునే—వశపరుచుకొనవలె నని తిక్కన పద్యమున భావము. ఈభావమును తెల్పునదే—Give him a long rope అను ఇంగ్లీషు జాతీయము.

మరియు, తిక్కన పద్యమునకు వ్యాఖ్యానమో అన్నట్లు, ఆముక్తమాల్యదలో ఈ క్రింది పద్యమున్నది.

"బెదరి చేరని బలియుని బిగియఁ బట్ట
కతని మైవడినే వచ్చి హత్తఁ జేత
క్రమము, పెనగెడు బలుమీను త్రాటఁ జేదు.
నొడ్డుగాలపు వేటకాఁ డుపమ గాఁడె?" (4—25)

ఇట్లు అన్వయమునకు రాక అణకలు వేయు పద్యము లింకను గలవు. తిక్కన వాడిన పదములు, పదబంధములు, వ్యవహారమునుండి జారిపోయినవి. అందువలన ఆయనగారి రచన సరిగా బోధపడుటలేదు. పండితులట్టి పట్టులను గుర్తించి, అర్థములు వివరించుట అవసరము. నే నిందు కొన్ని సూచించినాను. నా యీ వ్రాతలో—ప్రజ్ఞా లోపమువల్లను, ప్రమాదము మూలమునను పొరపులు పారలి యుండవచ్చును. సహృదయులు దయతో సవరింతురు గాక.

# ధాత్రీవందనము

శ్రీ టి. బి. యం. అయ్యవారు

యుగయుగమ్ములు-నీ పవిత్రోదరమున
విసుపకయె-నన్ను మోసిన విశ్వధాత్రి!
గిరివరకిరీటధారిణీ! తరళసింధు
హారిణీ! అందుకో మన్నమస్కారశతము

ఎన్నో జన్మలనెత్తియుండెదను త
ల్లీ! స్వచ్ఛశైతల్య సం
పన్నం బుజ్వల హేమరత్న నివహా
వ్యాలోల శోభాచ్ఛటా
చ్ఛన్నంబౌ-భవదీయగర్భమున-స్వే
చ్ఛావృత్తి క్రీడించుచున్-
వన్నెల్ చిన్నెలు సారెసారెకును సం
పాదించుకొంచున్ ధృతిన్.

సురభిళ లతాంతములు-గిరిఝరులు-బర్హ
భూషితమయూర నివహమ్ము-ముగ్ధశశ క
దంబకమ్మును-నేను సోదరుల మమ్మ!
ఇంతకంటె సౌభాగ్యమింకేమి వలయు!

కవినై పచ్చికబీళ్ల నీ యొడలి సిం
గారమ్ము మెచ్చఁ-పత
న్నవ నీహార ప్రప న్మనోజ్ఞ పదబం
ధ శ్రేణి నీనాడు-భూ
ధవమూర్తిన్-భవదీయవక్షమున మ
త్తారాతి రక్తమ్ముఁ బ్రా
గ్భవమందుం బ్రవహింప జేసినను-నన్
బాలింతు వేశాకృతిన్ -

పువుపుట్టమ్ములతోడ మెత్తనగు నీ
పొత్తిళ్ల బాంధవ్యమే
ను విడంజాలను-జన్మజన్మలకు న
న్నుం గన్న తల్లీ! వృథా
దివిషన్మార్గ విహారవల్గనములన్ -
దీవ్యద్గృహావాసభో
గ విలాసమ్ములఁగాని కోర-శిశుకే
ళిన్-నీ యొడిన్ దూగుచున్.

# కలలో మనిషి

శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్య

గోడ గడియారం 'టంగ్' మని ఒక్కసారి మ్రోగి దీక్షగా పని చూసుకుంటున్న చంద్రవమౌళి ఏకాగ్రతను భంగం చేసింది. ఆయన తలయెత్తి గడియారంవంక చూశాడు. అయిదున్నర అయింది. ఆఫీసులో మిగిలినవాళ్ళు కూడా వెళ్ళిపోయినట్టున్నారు. అంతా నిశ్శబ్దంగా ఉంది. ప్యూను రాఘవులు గుమ్మం ముందే కూర్చుని ఉన్నట్టున్నాడు. అతని నీడ గాజు తలుపుమీద పడుతున్నది.

చంద్రమౌళి తాను చూస్తున్న కాగితా లన్నింటిని ఎక్కడి వాటి నక్కడ సర్దివేసి పని ముగించుకుని నిట్టూర్చి, విశ్రాంతిగా రివాల్వింగ్ కుర్చీలో వెనక్కు వ్రాలి, ఒక్క క్షణం కళ్ళు మూసుకున్నాడు. ఇంతలోనే ఎన్నో దినాలుగా తనకు చిరపరిచితమైన 'టక్‌టక్' మనే ధ్వని వినిపించి ఆయన కళ్ళు తెరచి కిటికీలో నుంచి క్రిందికి చూసేవరికి మళ్ళీ ఆ కుర్రవాళ్ళిద్దరూ క్లబ్ కోర్టులో టెన్నిస్ ఆడుతూ కనిపించారు. ఆయన ప్రతి రోజూ వలెనే వారిని ఆసక్తితో గమనిస్తూ కూర్చున్నాడు.

ఆ ఆఫీసు పక్కనే ఒక క్లబ్బు ఉంది. చంద్రమౌళి ఆఫీసు గదిలో నుంచి చూస్తే ఆ క్లబ్బు ప్రక్కభాగంలోని టెన్నిస్‌కోర్టు కనిపిస్తూ ఉంటుంది. అసలా క్లబ్బులో టెన్నిస్ అంటే మోజు గాని, ఆసక్తి గాని ఉన్నవా రెవరూ లేరు. దాదాపు అందరూ అక్కడికి కేవలం పేకాట ఆడేందుకు వచ్చేవారే. మూడు నెలల క్రిందట ఆ క్లబ్బుకు ఒక ప్రఖ్యాత రాజకీయ నాయకుడు రావడం జరిగింది. ఆయనచేత అక్కడ ఏదో ఒక ప్రారంభోత్సవం చేయించుకుంటే ఆయనను బాగా గౌరవించిన ట్లవుతుందనీ, ఆ ప్రారంభించబడే విశేషమేదో ఆయన పేరుమీద చిరస్థాయిగా నిలబడి క్లబ్బుకు పేరు ప్రఖ్యాతులు తెస్తుందనీ ఎవరో సూచించారు. అంతా ఆ ఆలోచన బాగున్నదనే అన్నారు. కాని "దేనికి ప్రారంభోత్సవం చేయించాలి ?" అన్న మీమాంస వచ్చినప్పుడు ఎవరూ ఏమీ మాట్లాడలేదు. 'మన క్లబ్బులో ఏం తక్కువ ? పేకాటకు ఎంతమంది వస్తే అంతమందికి కావలసిన ఏర్పాట్లు యిప్పుడూ జరుగుతూనే ఉన్నాయి. ఇప్పుడు మనకు లేని దేమిటి?" అని కమిటీ మెంబర్లందరూ దీర్ఘంగా ఆలోచించారు. చివరకు ఇతర వూళ్ళలో రకరకాల క్లబ్బులను చూసిన ఒక మెంబరు "మన క్లబ్బులో లేని వేమిటో నేను చెబుతాను. ఎన్నాళ్ళనుంచో మీలో కొందరితో వ్యక్తిగతంగానూ, సమిష్టిగానూ కూడా యీ విషయం ప్రస్తావించాను. కాని మీ రెవ్వరూ దానిమీద ఆసక్తి చూపించనే లేదు. ఇప్పుడు మన క్లబ్బులో ముఖ్యంగా లోపించినవి 'ఔట్‌డోర్ గేమ్స్'. ఏ బాడ్మింటనో, టెన్నిసో, వాలీబాలో ఆడుకోవటం మన మెంబర్లలో చాలామందికి యిష్టంలేక పోవచ్చు. రాత్రింబవళ్ళు పేకాట తప్ప మరేమీ వారికి రుచించకపోవచ్చు. కాని నామ మాత్రానికైనా అవి చాలా అవసరం. ఇప్పుడు మన మెలాగూ ఈ రాజకీయ నాయకుణ్ణి పిలిచి సత్కరించి ఒక పార్టీ ఏర్పాటు చెయ్యా లనుకుంటున్నాం. ఒక టెన్నిస్ కోర్టు తయారుచేయించి ఆయనచేత ప్రారంభోత్సవం చేయిద్దాం. అది బాగుంటుంది" అన్నాడు. మిగిలినవా రందరూ దానికి తలలూపి "అవును. మీరు చెప్పింది బాగానే ఉంది" అన్నారు. వారిలో ఒకాయన సందేహిస్తూ "అవునండీ. ప్లాను బాగానే ఉంది. కాని యిక్కడ మన కెవరికీ టెన్నిస్ కోర్టు పొడవు, వెడల్పులే సరిగా తెలియవుకదా ? ఇప్పు డెలా ?" అని అడిగాడు. మిగిలినవారు "అదీ నిజమే" అన్నారు. అప్పు డా మొదటి మెంబరు "అది అసలు సమస్యేకాదు. మనకు ఆలోచన ఉండాలే కాని చిటికె వేస్తే పనులు జరుగుతాయి. మా యింట్లో అద్దెకున్నవారి అబ్బాయి యూనివర్శిటీలో చదువు పూర్తిచేసుకుని ఉద్యోగ ప్రయత్నాలు చేస్తూ యిప్పుడు యిక్కడే ఉన్నాడు. అతని దగ్గర టెన్నిస్ బ్యాటు ఉంది. ఏమీ తోచక చాలా బాధపడిపోతున్నాడు. నేను అతనితో మాట్లాడతాను. ఆ బాధ్యత అంతా నామీద ఉంచండి" అన్నాడు. అంతా "సరే" నన్నారు. తర్వాత త్వరత్వరగా పనులు జరిగిపోయాయి. ఆ రాజకీయ నాయకుడు వచ్చే వేళకు టెన్నిస్ బాగా ఆడగలిగిన వారి నిద్దరిని సమకూర్చగలిగారు. ఈ విధంగా ప్రారంభమైన ఆ టెన్నిస్‌కోర్టు తర్వాత తర్వాత చాలా నిర్లక్ష్యంపాలైంది. నిజానికి అక్కడివా రెవరికీ, పేకాటకు ఉపయోగించవలసిన అమూల్యమైన తమ కాలాన్ని యీ క్రొత్త ఆటకోసం వ్యర్థం చెయ్యటం యిష్టంలేదు. అందువల్ల ప్రారంభోత్సవంనాడు ఏ యిద్దరు యువకులు ఆడారో చివరకు వా రిద్దరే మిగిలారు. సాయంకాలం అయిదున్నర అయ్యేసరికి క్రిందినుంచి 'టక్ టక్' మని ఆ ధ్వని వినరావటమూ, చంద్రమౌళి కొద్దిసేపు వారి ఆటను గమనించటమూ చాలా రోజులుగా జరుగుతున్నది.

టెన్నిస్ ఆడుతున్న యిద్దరిలోనూ ఒక వ్యక్తికి యిరవైనాలుగు సంవత్సరాల వయస్సు ఉంటుంది. అతడు యూనివర్శిటీలో చదువు పూర్తిచేసుకుని ఉద్యోగప్రయత్నాలు చేస్తూ యింట్లో తల్లిదండ్రుల దగ్గరే ఉన్నాడు. బొద్దుగా ఆరోగ్యంగాఉండి ఎప్పుడూ నవ్వుతూ చలాకీగా ఉంటాడు.

రెండవవాడు చంద్రమౌళి ఆఫీసులోనే దాదాపు పదిహేను రోజుల క్రిందట ఉద్యోగంలో చేరాడు. అతడు అంతకుపూర్వం కూడా రోజూ సాయంకాలంవేళ టెన్నిస్ ఆడుతూ ఉండేవాడు. చంద్రమౌళి టెన్నిస్‌కోర్టు ప్రారంభం అయిన నాటినుంచి అతన్ని జాగ్రత్తగా గమనించాడు. అతనికి యిరవైయేళ్ళు ఉంటాయి. సన్నగా, పచ్చగా ఉంటాడు. అందమైన ముఖం జుట్టు చెదరంగా ఉండి ఎప్పుడూ నుదుటిమీదికి పడుతూ ఉంటుంది. అతడు పెద్దగా నవ్వటం ఎవరూ చూసి ఉండరు. చాలా గంభీరంగా ఉంటాడు. ప్రతి పనినీ ఎడమచేతితో చేస్తాడు. అతడు టెన్నిస్ బాగా ఆడగలడు. మెరుపువలె కోర్టంతా తానై విజృంభించి, ఎడమచేత్తో ఆడుతూ ప్రత్యర్థి కళ్ళు బైర్లు కమ్మించగల వేగం వుంది అతని దగ్గర.

టెన్నిస్‌కోర్టు ప్రారంభోత్సవం జరిగిన తర్వాత దాదాపు నెల రోజుల పాటు ఆఫీసుటైము కాగానే యిలా క్రిందికి చూస్తూ వారి ఆటను గమనించటం చంద్రమౌళికి బాగా అలవాటైంది. ఇంతలోనే తమ ఆఫీసులో మరో టైపిస్టు కావలసివచ్చి ప్రకటన చేయటమూ దానికి ఒక డజను అప్లికేషన్లు రావడమూ జరిగింది. చంద్రమౌళి ఆ పన్నెండు మందిలోనూ యోగ్యులైనవారిని ఆరుగురిని ఎన్నుకుని వారికి 'యింటర్వ్యూ' కార్డులు పంపించాడు. ఒక ఆదివారంనాడు ఉదయం 'యింటర్వ్యూ'లు ప్రారంభమైనాయి. ఒక్కొక్క అభ్యర్థితో దాదాపు యిరవై నిముషాలు మొదలుకొని అరగంట వరకు సంభాషించి మంచిచెడ్డలు తేల్చుకున్నాడు. వారిలో ఆరవవాడుగా చివరకు యీ ఎడమచేతి టెన్నిస్ ఆటగాడు లోపలికి వచ్చాడు. రాగానే చంద్రమౌళికి ఎదురుగా నిలబడి నమస్కారం చేశాడు. చంద్రమౌళికి రోజూ తాను చూస్తున్న యీ టెన్నిస్ ఆటగాణ్ణి

ఉద్యోగం కోసం వచ్చిన అభ్యర్థిగా చూడవలసి రావటం చిత్రంగా ఉంది. ఆయన అతనికి తన ఎదురుగా ముందున్న కుర్చీ చూపించి 'కూర్చోండి' అన్నాడు. అతడు బిడియపడుతూనే కూర్చున్నాడు. చంద్రమౌళి అతని అప్లికేషను తీసి చూసి "మీపేరు పార్థసారథి కదూ ?" అని అడిగాడు. అతడు 'అవును' అని తల వూపాడు. తర్వాత ఆయన అతని సర్టిఫికేట్లన్నీ చూశాడు. 'టైపూ, షార్టుహ్యాండు" లలో అతని యోగ్యతను పరీక్షించాడు. తాను మాట్లాడుతూ ఉంటే అతడు ముందు 'షార్ట్‌హ్యాండ్' లో వ్రాసుకోవలసిన అవసరం లేనివాడివలె టైపు మెషిను ముందు కూర్చుని, తాను చెబుతూవున్న దాన్ని వింటూనే టైపు చెయ్యటం ప్రారంభించాడు. తాను వేగం ఎంత హెచ్చినా అతడెక్కడా తడుముకున్న జాడ అయినా కానరాలేదు. అతని సన్నని వ్రేళ్ళు అద్భుతంగా, అతి వేగంగా 'టైపు మెషిను' మీద కదులుతూ ఉంటే చూడటం చాలా ఆసక్తి కలిగించింది. తాను చెప్పడం ఆపిన తర్వాత అతడు 'మెషిను' లో నుంచి కాయితాలు తీసి ఆయన కిచ్చాడు. చదివితే ఒక్క అక్షరం కూడా పొల్లుపోకుండా అంతా అలాగే ఉంది. చంద్రమౌళి తన ఆశ్చర్యం పైకి కనుపించకుండా జాగ్రత్తపడి ఆ కాయితాలను బల్లమీద ఉంచి 'బాగానే ఉంది' అంటూ తల పంకించాడు.. ఆయువకుడు చంద్రమౌళితో "మీరు అన్యథా భావించకపోతే ఒక్కవిషయం చెబుదా మనుకొంటున్నాను. నేను చాలా బాధలలో ఉన్నాను. 'ఇంటర్మీడియేట్' ప్యాసయి రెండు సంవత్సరా లయింది. అప్పటినుంచి టైపూ, షార్టుహ్యాండూ నేర్చుకుంటూ ఎన్నో ఉద్యోగాలకు అప్లయిచేశాను. కానీ, నాకే ఉద్యోగమూ దొరకలేదు. నే నందుకు బాధపడనూ లేదు. బహుశా ఆ ఉద్యోగాలు నాకన్నా అర్హులైన వారికే లభించి ఉంటాయని నన్ను నేను సమాధాన పరచుకున్నాను. కాని యిప్పుడు నా పరిస్థితులు మరింత విషమించాయి. నాకు ముసలి తల్లి దండ్రు లున్నారు. మా నాన్నగారికి కళ్ళుకనిపించవు. అరవైయేళ్ళు నిండాయి. మా అమ్మ జబ్బుమనిషి. ఎన్నో ఏళ్ళనుంచీ దగ్గుతో బాధపడుతున్నది. మనిషి చిక్కి శల్యమైపోయింది. ఇన్నాళ్ళూ ఆసరాగా ఉన్న కొద్ది భూమినీ పదిరోజుల క్రిందటనే అమ్మి బాకీలు తీర్చాము. ఇక ఇప్పుడు నాకు రెక్కలే ఆధారం. నా సొద అంతా అనవసరంగా చెప్పుకుని మిమ్మల్ని బాధపెడు తున్నానేమో ! నా పరిస్థితిని కాస్త సానుభూతితో చూడండి" అన్నాడు. చంద్రమౌళి అతనివంక విశ్వలంగా చూశాడు. తర్వాత బల్లమీదికి వంగి "నే నేమీ అనుకోను. మీ యోగ్యతలు చెప్పుకున్నారు. మీ బాధలు చెప్పు కోవడమూ మంచిదే. అయినా మిమ్మల్ని నేను రోజూ ఎక్కడో చూస్తు న్నాను" అంటూ ఏదో జ్ఞాపకం చేసుకుంటున్నట్లు నటించాడు. ఒక్క క్షణం ఆగి "అవును. జ్ఞాపకం వచ్చింది. ఈ కిటికీలో నుంచి క్రిందికి చూడండి. ఈ ప్రక్కనే ఉన్న క్లబ్బు టెన్నిస్ కోర్టు యిక్కడికి కని పిస్తూ ఉంటుంది. రోజూ సాయంకాలంపూట మీరు టెన్నిస్ ఆడుతూ ఉండగా నేను చూస్తున్నాను. టెన్నిస్ చాలా భాగ్యవంతుల వినోదం. ఖర్చుతో కూడిన వ్యవహారం. మీరేమో 'చాలా బీదవాళ్ళ' మని చెబుతున్నారు. నాకు చిత్రంగా ఉంది ...." అన్నాడు. ఆ యువకుడు నిట్టూర్చి "అవును. అదీ నిజమే. కాని నేను ధనవంతుణ్ణయి వుండి విలాసంకోసం ఆడటంలేదు. దాని కోసం నేను రాగి కానీ కూడా ఖర్చు చెయ్యటంలేదు. నిత్యమూ ఇంట్లో జరుగుబాటే కష్టంగా ఉన్న నాకు ఆట పాటల కోసం డబ్బు ఖర్చు పెడదా మనేది కలలోనైనా ఊహించరాని విషయం. ఆ టెన్నిస్ బ్యాటును నేను కొనలేదు. 'అది నా దగ్గరి కెలా వచ్చింది ?' అనేది చాలా బాధాకరమైన ఒక కథ. అది తలుచుకున్నప్పుడల్లా నాకు గుండెల్లో చేయి వేసి కెలికినట్లుగా ఉంటుంది. ఇప్పటికే కాలం వృధా చేస్తున్నానేమో నని నా కసలే బాధగా ఉంది ...." అంటూ ఆగిపోయాడు. చంద్రమౌళి చేతి గడియారం చూసుకుని "ఫరవాలేదు. మీరా విషయం కూడా చెప్పవచ్చు. కావలసినంత వ్యవధి ఉన్నది నాకు" అన్నాడు. ఆ యువకుడు బాధ ధ్వనించే గొంతుకతో, "నేను రెండు సంవత్సరాల క్రిందటనే 'ఇంటర్మీడియేట్' ప్యాసయినాను. నేను చదువుకునే రోజులలో ఎవరితోనూ కలవకుండా ఒంట రిగా ఉండేవాణ్ణి. ఎవరితోనూ స్నేహం చేసుకోవాలనీ, కలిసి తిరగాలని ఉండేది కాదు. 'నా చదువే లోకంగా' నాపాటికి నేను కాలం గడుపుతూ ఉండేవాణ్ణి. నేను రెండో సంవత్సరం చదువుతూ ఉండగా ఒక కొత్త కుర్రవాడు మా క్లాసులో చేరాడు. అతని పేరు మధు. చాలా చలాకీగా, హుషారుగా ఉండే వాడు. ఎక్కడో మొదటి సంవత్సరం చదివి వాళ్ళనాన్నగారికి ట్రాన్స్‌ఫర్ కావడంవల్ల వచ్చి రెండో సంవత్సరంలో చేరాడు. వచ్చిన రెండు, మూడు రోజులలోనే అందరి పరిచయమూ పొంది పలుగురి అభిమానము సంపా దించుకొన్నాడు. అతడు నన్ను మాట్లాడించి నాతో స్నేహం చేసుకోవాలని చూశాడు. కాని నేను బెరుకు బెరుగ్గా మాట్లాడటంలో నా తత్వం అతడు వెంటనే కనిపెట్టి మరీచనువుగా స్నేహంగా ప్రవర్తించటం ప్రారంభిం చాడు. అలా ఒక వారంరోజుల స్నేహంతోనే నన్ను పూర్తిగా మార్చి వేశాడు. అతని నవ్వు అంత అద్భుతమైనది. అతని మాట అంత శక్తి కలది. అతడు 'తన నవ్వుతో ప్రపంచా న్నంతటినీ జయించగలడ'నిపించేది. తర్వాత మా స్నేహం బాగా పెరిగింది. "ఒకరిని చూడకుండా మరొకరం ఉండలే మన్నంత" దూరం వచ్చింది. అతనికి టెన్నిస్ అంటే చాలా అభి మానం. సాయంకాలం అయ్యేసరికి పొట్ట లాగూ, బనియనూ వేసుకొని టెన్నిస్ బ్యాటు చేత్తో వూపుకుంటూ వచ్చేవాడు. నన్ను కూడా తనవెంట రమ్మని గొడవ చేసేవాడు. అతడు ఆడుతూఉంటే చూసేందుకు ఎంతో అద్భుతంగా ఉండేది. అంత వేగంగా, అంత నేర్పుగా టెన్నిస్ ఆడేవా రెవరినీ నేను చూడలేదు. అతడు నన్ను కూడా ఆడమని ప్రోత్సహించేవాడు. తనతో ఆడేవారు మరెవరూ లేని సమయంలో నాకు దాన్ని బోధపరిచేవాడు. తర్వాత తర్వాత నాకు తన బ్యాటు యిచ్చి నేను ఆడుతూ ఉండగా చూస్తూ నుంచునేవాడు. తనకేదైనా పనివున్న రోజులలో తన బ్యాటు నాకు యిచ్చి నన్ను 'ఆడుతూ ఉండమని' చెప్పి వెళ్ళేవాడు. ఈ విధంగా రెండు మూడు నెలలు గడిచేసరికి నాకు ఆట బాగా వచ్చింది. నేను ఎడమచేతితో ఆడటం అతని కెంతో ముచ్చటగా ఉండేది. నాతో ఆడుతూ తాను కావాలని ఓడి పోతూ, ఆ ఓటమిలోనే ఆనందిస్తూ ఉండేవాడు. తర్వాత పెద్ద పరీక్షలు దగ్గరికి రావటంవల్ల నేను నా దృష్టి నంతటినీ చదువుమీదనే కేంద్రీకరిం చాను. అతడు కూడా కష్టపడి చదువుతూ ఉండేవాడు. సాయంకాలంపూట టెన్నిస్ మాత్రం మానేవాడు కాదు. పరీక్షలైపోయి ఫలితాలు తెలిశాయి. నేను అన్ని సబ్జెక్టులలోనూ ప్యాసైనాను. మధు గ్రూపులో తప్పాడు. ఫలి తాలు తెలిసిననాటి సాయంకాలం టెన్నిస్ బ్యాటు తీసుకుని నా దగ్గరికి వచ్చాడు. ఇద్దరం నా గదిలో చాపమీద కూర్చున్నాము. నాకేం మాట్లా డాలో తెలియలేదు. అతడు ఒక్క క్షణం ఆగి గాద్గదికంగా, "ఈ బ్యాటు నువ్వు తీసుకో సారథీ ! నేను మళ్ళీ పరీక్షలకు వెళ్ళి గ్రూపులో ప్యాసయ్యే వరకూ టెన్నిస్‌కోర్టులో దిగను" అన్నాడు. నాకు ఆశ్చర్యం వేసింది. తర్వాత అతడే నెమ్మదిగా అన్ని విషయాలూ చెప్పాడు. ఇంట్లో వాళ్ళ నాన్నగారు పరీక్షా ఫలితాలు చూడగానే చాలా గొడవ చేశారుట. 'ఆటలలో పడి చదు వును నాశనం చేసుకున్నావ' ని చాలా విస్ఫారంగానూ, కఠినంగానూ మాట్లా డారుట. "ఆత్మాభిమానం లేనివైనా ఉంటే ఆట కట్టిపెట్టి యీసారి అయినా జాగ్రత్తగా చదివి ప్యాసయినా సనిపించుకో" అన్నారుట. మధు కాస్సేపు కూర్చుని తర్వాత వెళ్ళిపోయే సమయంలో "నేను మళ్ళీ కాలేజీలో చేరబోవడంలేదు. టైపు నేర్చుకుంటూ, ఏదైనా ఉద్యోగం చూసుకుందా మనుకుంటున్నాను. నువ్వు ఎప్పుడైనా సరే నా దగ్గరికి రావచ్చు" అని చెప్పాను. "అలాగే" అని తలవూపి వెళ్ళిపోయాడు. కాని ఆ తర్వాత అతడు నాకు చాలా అరుదుగా మాత్రమే కనుపించేవాడు. నేను రోజూ టెన్నిస్ ఆడుతూ ఉండేవాణ్ణి. ఆ ఆటలో బాగా నైపుణ్యం సంపాదించి ఆ వూళ్ళో క్లబ్బు నిర్వహించిన పోటీలలో నెగ్గాను కూడా. ఆ పోటీలు జరిగేటప్పుడు మాత్రం మధు వచ్చి నన్ను ప్రోత్సహిస్తూ ఉండేవాడు. బహుమతి తీసుకుని యివతలికి రాగానే నన్ను కౌగలించుకుని "నువ్వు పెద్ద ఛాంపియన్‌వోయ్ ! పరీక్షలైపోగానే నేను మరోబ్యాటు కొంటాను. మనిద్దరం ఆడాలి" అంటూ నన్ను అభినందించాడు. తర్వాత రెండు, మూడు సార్లు మాత్రమే నేను అతన్ని కలుసుకో గలిగాను. అతడు రాత్రింబవళ్ళు చదవటం ప్రారం

ఖించాడు. ఆ చదువు అతన్ని పీల్చి పిప్పిచేసింది.. బాగా చిక్కిపోయాడు.. కాని ఆ చిరునవ్వు మాత్రం అలాగే ఉండేది. నేను తర్వాత ఉద్యోగ ప్రయత్నాలలో ఏవో వూళ్లకు వెళ్లవలసి రావడంవల్ల అతన్ని కలుసుకోలేకపోయాను. నేను తిరిగి వచ్చేసరికి పరీక్షలైపోయాయి. టెన్నిస్ బ్యాటు తీసుకుని చివరి పరీక్ష రోజున సాయంకాలం వారి యింటికి వెళ్లాను. పరీక్ష ఎలా వ్రాశాడో కనుక్కొని బ్యాటు యిచ్చి మళ్లీ కులాసాగా కలిసి కాలక్షేపం చేద్దామని వెళ్లాను. నేను వెళ్లేసరికి యిల్లంతా బోసిగా దీనంగా ఉంది. పంచలో ఏభైయేళ్ల వ్యక్తి ఒకాయన వాలు కుర్చీలో కూర్చుని ఉన్నాడు. నేను ఆయనను పిలిచి "ఏమండీ మధు ఉన్నాడా యింట్లో ?" అని అడిగాను. ఆయన నన్ను 'గేటు దాటి లోపలికి రమ్మ'న్నాడు. వెళ్లగానే కుర్చీ చూపించి 'కూర్చోమన్నా'డు.. నేను కూర్చుని "మధు ...." అంటూ ఉండగా ఆయన దుఃఖం పొంగిపొరలిరాగా ముఖాన్ని చేతులలో కప్పుకున్నాడు. "ఏదో దారుణం జరిగిపోయింద"నుకున్నాను. ఆయన కాస్సేపటికి కళ్లు తుడుచుకుని విషయమంతా చెప్పాడు. నేను వింటూ రాతిబొమ్మ వలె కూర్చుండిపోయాను. నా చేతిలోని 'టెన్నిస్ బ్యాటు' చేతిలో ఉన్న పామువలె తోచింది. దాన్ని క్రింద పడేశాను. మధు పరీక్షలు రెండు రోజులలో ప్రారంభ మవుతాయనగా, ఒకనాడు చదువుకుంటున్న వాడల్లా లేచివచ్చి "నాన్నా ! నాకు గుండె నొప్పిగా ఉంది" అన్నాడట. ఆయన "యిక చదువు చాలించి పడుకో. ఏదైనా అతి పనికిరాదు" అన్నాడట. అతను వెళ్లి పుస్తకం మూసివేసి పడుకున్నాడట. తెల్లవారి ఎంతకూ లేచిరాకపోయేసరికి వెళ్లి చూస్తే చలనంలేని కట్టె పడి ఉంది. వెంటనే డాక్టరును తీసుకువచ్చారు. కాని, "అంతా మించిపోయింది. చేసేదేమీలేద"ని డాక్టరు వెళ్లిపోయాడు. ఆయన తర్వాత చేతులలో ముఖాన్ని దాచుకుని "నేనే నా బంగారు తండ్రిని చేతులారా చంపుకున్నాను" అంటూ దుఃఖించాడు. నేను చాలా కష్టంమీద తేరుకోగలిగాను., తర్వాత ఆ బ్యాటు ఆయన ముందు ఉంచి, "దీన్ని మీ మధు తన పరీక్షలైపోయేదాకా నా దగ్గర ఉంచమని యిచ్చాడు. 'పరీక్షలు కాగానే మళ్లీ యిద్దరం కలిసి ఆడుకుందామ'న్నాడు. దీన్ని మీ దగ్గరే ఉంచండి" అన్నాను. ఆయన దాన్ని చూచేందుకైనా యిష్టపడక "వద్దు నాయనా ! దీన్ని నువ్వే ఉంచుకో. వాణ్ణి జ్ఞాపకం చేసే వస్తువును దేన్నీ నేను భరించలేను. నిరంతరం దాన్ని చూస్తూ ప్రేగులు తోడివేసే యీ దుఃఖాన్ని భరించలేను. దీన్ని తీసుకుపో" అన్నాడు. నేను చేసేదేమీ లేక దాన్ని చేతుల్లోకి తీసుకుని వచ్చేశాను" అని చెప్పి ఆగాడు. చంద్రమౌళి అంతా విని కొద్ది క్షణాలు నిశ్శబ్దంగా కూర్చుని "సరే. ఏ విషయమూ నేను తర్వాత తెలియజేశాను. మీరిక వెళ్లవచ్చు" అన్నాడు. ఆ యువకుడు లేచి చంద్రమౌళికి నమస్కరించి వెళ్ళిపోయాడు. తర్వాత ఆ ఆరుగురు అభ్యర్థులలోను పార్థసారథి తనకు యోగ్యుడుగా కనిపించినందువల్ల అతనికే 'అపాయింట్మెంట్ ఆర్డరు' పంపించాడు. పార్థసారథి వెంటనే ఉద్యోగంలో చేరి, అప్పటినుంచీ చాలా శ్రద్ధగా పనిచేస్తూ చంద్రమౌళి అభిమానాన్ని యిట్టే సంపాదించాడు.

చంద్రమౌళి కిటికీలోనుంచి క్రిందికి చూస్తున్నవాడల్లా 'బాబుగారూ' అనే పిలుపు వినిపించి వెనుదిరిగి చూశాడు. ప్యూను రాఘవులు నిలబడివుండి "నాపని అంతా అయిపోయింది బాబుగారూ ! డ్రైవరు కారు తీసుకుని వచ్చి వాకిట్లో కూర్చుని ఉన్నాడు. మీ రిప్పుడు బయలుదేరరా ?" అని అడిగాడు. చంద్రమౌళి లేచి ఒక్క క్షణంసేపు నుంచుని, తర్వాత రాఘవులు అందించిన తాళాలు అందుకుని యివతలికి వచ్చాడు. ఆయన కూర్చుని తలుపు వేసుకోగానే కారు వేగం అందుకుని పరుగెత్తడం ప్రారంభించింది.

*   *   *   *

చంద్రమౌళి మొహమూ కాళ్లూ చేతులూ కడుక్కుని వాలు కుర్చీలో కూర్చుని దినపత్రిక చేతిలోకి తీసుకుంటూ ఉండగా ఒక చేతిలో కాఫీ కప్పుతో, మరొక చేతిలో ఒక పోస్టు కవరుతో అక్కడికి వచ్చింది శ్రీదేవి. చంద్రమౌళి కవరు విప్పకుండా దాన్ని బల్లమీద అలాగే ఉంచి కాఫీ కప్పు అందుకున్నాడు. శ్రీదేవి ఆయన కెదురుగా స్టూలుమీద కూర్చున్నది. ఆమెకు ముప్పయి రెండేళ్ల వయస్సుంటుంది. చాలా అందమైన మనిషి. ఆమె కాపురానికి వచ్చినప్పటినుంచి చంద్రమౌళి ఆ ఆనంద సముద్రంలో మునకలు వేస్తూ తన వెనుకటి జీవితాన్ని, వెనుకటి విషయాలనూ మరిచేపోయాడు.

శ్రీదేవి, భర్త కాఫీ త్రాగుతున్నంతసేపూ నిశ్శబ్దంగా కూర్చుని తర్వాత ఖాళీ కప్పు అందుకుంటూ 'మన మురళి ఉత్తరం వ్రాశాడు, చూడండి' అన్నది. చంద్రమౌళి అప్పుడు కొడుకు వ్రాసిన ఉత్తరాన్ని చదువుకుని "ఏమున్నదీ ? ఎప్పుడూ వ్రాసే సంగతులేగా ? హాస్టల్లో తిండి సరిగా లేదనీ, ఆ క్రమశిక్షణ తనకు చాలా బాధాకరంగా ఉందనీ, ఇష్టం వచ్చినట్టు వూరిమీద పడి తిరగనివ్వరనీ, గోల చేసేందుకు వీలులేదనీ .... యివి ఎప్పుడూ ఉన్న ఆరోపణలేగా ! అయినా అటువంటి కట్టుబాట్లకు లోబడి చదువుకోవటంలో ఉన్న లాభం యిప్పుడు తెలియదు. వాడలా వ్రాస్తున్నాడని నువ్వు దిగులుపడకు. చదువుకునే రోజులలో అలా గట్టి కట్టుబాట్లలో ఉండటం మంచిదే" అన్నాడు.

ఆమె నిట్టూర్చి "ఏమో ! ఆరు నెలలయింది పిచ్చి తండ్రిని చూసి" అన్నది. చంద్రమౌళి "మరొక రెండు నెల లాగితే ఎలాగూ వాడి పరీక్షలైపోయి యిక్కడికి రానే వస్తాడు. ఇంతలోనే ఆరాటం ఎందుకూ ? .... ఒక్క సంవత్సరం తల్లిదండ్రులనూ, వున్నవారినీ వొదిలి, చక్కని క్రమశిక్షణ క్రింద ఒక కాలేజీ హాస్టల్లో ఉండటం వాడికి అంత బాధగా ఉంది. నా విషయం చూడు. నాకు వూహ తెలియకముందే నా తల్లిదండ్రులు చచ్చిపోయారు. వారాలు చేసుకుని, వారినీ వీరినీ ప్రార్థించి చందాలు పోగుచేసి జీతాలు కట్టి చదువుకున్నాను. ఒక యిల్లనీ వాకిలి అనీ లేకుండా ఒక్కొక్కప్పుడు వీధి లాంతరు క్రింద కూర్చుని చదువుకున్నాను ...." అంటూ ఆలోచనలో పడిపోయాడు.

శ్రీదేవి మరేమీ మాట్లాడలేదు. మరొక నిముషంసేపు అలాగే కూర్చుని తర్వాత లేచి "నేను పేరంటానికి వెళ్లి వస్తాను. కాస్త పొద్దుపోతుందేమో ? మీరు ఇంట్లోనే ఉంటారా ? ఎక్కడికైనా వెళ్లదలుచుకున్నారా ?" అని అడిగింది. ఆయన తల వూపి "ఎక్కడికీ వెళ్లను" అన్నాడు. "అయితే నేను సిద్ధమై వస్తాను. ఒక్కసారి కిందికి వచ్చి, తలుపు వేసుకుని పైకి వొద్దురు గాని ...." అంటూ శ్రీదేవి క్రిందికి వెళ్లిపోయింది.

తూర్పున పూర్ణచంద్రబింబం వెన్నెలలను వెదజల్లుతూ ఉదయించింది. తెల్లని శరత్కాలపు మేఘాలు దూది పింజలవలె ఆకాశంలో అక్కడక్కడ కదులుతున్నాయి. ఇంటి ఆవరణలోని కొబ్బరిచెట్ల ఆకులు వెన్నెల పూతతో వెండి కత్తులను ఒకదానిప్రక్కన మరొకటిగా పేర్చినట్టు ప్రకాశిస్తున్నాయి. పక్క డాబామీద పండు వెన్నెలలో యిద్దరు పిల్లలు పరుగులెత్తుతూ ఆడుకుంటున్నారు.

చంద్రమౌళి కొద్ది నిముషాలపాటు దినపత్రికలో విశేషాలు చూసి తర్వాత తల ఎత్తగానే ఆకాశంలో ఆయనను ముగ్ధుణ్ణి చేసే అపురూపమైన దృశ్యం కనుపించింది. పెద్ద ప్రమిద ఆకారంలో ఉన్న పలుచని మబ్బు ముందు ఉజ్జ్వలంగా కాంతు లీనుతున్న ఖరీదైన మంచి ముత్యం వలె ఉన్నది చంద్రబింబం. పక్క డాబామీద ఆడుకుంటున్న యిద్దరు పిల్లలలో మగపిల్లవాడు "మల్లికా ఆ మబ్బు చూడవే. దీపపు ప్రమిదలా లేదూ ?" అంటున్నాడు.

చంద్రమౌళి ఆలోచనలో పడ్డాడు. ఆయన నలభై అయిదేళ్ల జీవితంలోనూ ఎన్నడూ గతాన్ని నెమరు వేసుకోవలసిన అవసరం కాని, సందర్భంకాని, లేకపోయింది. పుట్టగానే తల్లినీ, తండ్రినీ దూరం చేసుకుని ఎవరో బీద దూరపు బంధువులు దగ్గరికి తీసి పెంచగా బాల్యం గడిపాడు. తర్వాత ఫస్టుఫారం నుంచి బి. ఏ వరకూ వారాలు చేసుకుంటూ కాలం గడిపాడు. అదృష్టం బాగుండటం వల్లనూ, నోరు మంచిది కావడం వల్లనూ మంచి ఉద్యోగమే దొరికింది. వారూ వీరూ సంకల్పించి వివాహం చెయ్యగా నిక్షేపంగా మారు మాటాడకుండా బుద్ధిగా పెళ్లి చేసుకున్నాడు. అత్యంత అనుకూలవతి అయిన భార్యతో, చదువుకుంటూ పైకి

వస్తున్న కొడుకుతో, జీవితం ఆయనకు చక్కని సిమెంటు రోడ్డుమీద కారు ప్రయాణంవలె అన్ని విధాలా హాయిగా ఉన్నది. వివాహమైన తర్వాత ఎన్నడూ ఆయన తన పూర్వజీవితాన్ని గురించి ఆలోచించనే లేదు. ఎవరైనా బీద పిల్లలు ఏదైనా సహాయం కావాలని వస్తే వారిని ఎక్కువగా మాట్లాడించకుండా చేతనైన సహాయం చేసి వెంటనే పంపివేసేవాడు.

ఇప్పుడు తీరికగా కూర్చుని ఆకాశంలో ప్రమిద ఆకారంలో ఉన్న మబ్బును చూస్తూవుండగా, పక్క డాబామీద వెన్నెలలో యిద్దరు పిల్లలూ పరుగులెత్తుతూ ఆడకుంటూ ఉండగా, ఆయనకు ఎన్నడో జరిగిన విషయాలు జ్ఞాపకం రావడం ప్రారంభించాయి. తామూ యిలాగే శుభ్రజ్యోత్స్న ప్రపంచాన్ని ఆహ్లాదంలో ముంచెత్తుతూ ఉండగా ఆటలాడుకున్నాడు. ఇలాగే వింతవింత ఆకారాలలో ఉన్న మబ్బులను మరొకరికి చూపిస్తూ "ఆ మబ్బు మొసలిలా లేదూ ? ఈ మబ్బు గిన్నెలా లేదూ ? అక్కడ ఆ మబ్బు మొగలి పొదలా లేదూ ?" అంటూ ఉండేవాడు. తన పక్కన అప్పుడు తన మాటలు వింటూ పన్నెండేళ్ల పిల్ల ఉండేది. అవును పన్నెండేళ్ల బంగారు బొమ్మ .... సృష్టికర్త తన సర్వశక్తులనూ వినియోగించి ఎంతో దీక్షతో, విశ్వం బుద్ధితో మలచిన పుత్తడి బొమ్మ .... ఆ పిల్ల నవ్వుతూ ఉంటే ముత్యాలూ రత్నాలూ జలజల రాలుతున్నట్టుండేది.

చంద్రమౌళి భార్య పిలుపు విని వెనక్కు తిరిగి చూశాడు. శ్రీదేవి మెట్ల దగ్గర నిలబడి ఉండి "మీరు క్రిందికి వచ్చి తలుపు వేసుకోండి. నేను వెడుతున్నాను" అన్నది. ఆమె కనకాంబరం రంగు సిల్కు చీర కట్టుకుని పేరంటానికి పోయేందుకు సిద్ధమై ఉన్నది. ఆయనే లేచి క్రిందికి వెళ్లి ఆమె కారులో ఎక్కి వెళ్లిపోగానే, తలుపు గడియ వేసుకుని మళ్లీ పైకి వచ్చి వాలు కుర్చీలో కూర్చున్నాడు. ఆకాశం యిప్పుడు నిర్మేఘంగా ఉన్నది. ప్రక్క డాబామీద యింతవరకూ ఆడుకుంటున్న పిల్లలిద్దరూ క్రిందికి వెళ్లిపోయారు కాబోలు—చుట్టుప్రక్కల అంతా నిశ్శబ్దంగా ఉన్నది.

చంద్రమౌళి మళ్లీ ఆ విషయాన్నే మననం చేసుకోవడం ప్రారంభించాడు. ఆయన అప్పటికి పధ్నాలుగేళ్లవాడు. పట్నంలో ఉండి వారాలు చేసుకుని చదువుకుంటూ ఒకసారి వేసవి సెలవులో తన బీద బంధువుల వూరికి వెళ్లాడు. అది ఒక చిన్న పల్లెటూరు. ఆ వూరి చుట్టూ బంగారం పండే సారవంతమైన భూములుండేవి. ఊరికి కొద్ది దూరంలో నది ఉండేది. నది ఒడ్డునే ఒక పాడుబడిన ప్రాచీన కట్టడం ఉండేది. దాని చుట్టూ ఒక పెద్ద కొబ్బరితోట. చంద్రమౌళికా వూళ్లో ఏమీ తోచేదికాదు. ఇంత నిశ్శబ్దంగా 'మనుష్యు లెలా జీవించగలరా ?' అనిపించేది. ఆ వూళ్లో పగలే ఏమీ సందడి ఉండేది కాదు. పైగా తన యీడువా రందరూ తమ పనులమీద తాము ఉండేవారు. ఒకవేళ ఎవరైనా తనను కలుసుకోవటం తటస్థించినా వారి అభిరుచులూ, తన అభిరుచులూ వేరుగా ఉండేవి. వారు మాట్లాడే విషయాలు తనకు మొరటుగా ఉండేవి. తాను మాట్లాడితే వారికి వింతగా ఉండేది. అందువల్ల ఎవరి ప్రమేయమూ పెట్టుకోకుండా అతడు వూరికి దూరంగా నడిచి వెళ్లి నదిఒడ్డున ఉన్న మండపం దగ్గర ఏదో చదువుకుంటూ కూర్చునేవాడు. ఒకనా డతడు అక్కడ స్తంభాని కానుకుని కూర్చుని ఉండగా ఆ అమ్మాయి అటువైపు వచ్చింది. ఆమె వెంట అయిదేళ్ల పిల్లవా డొకడు చేతిలో కొయ్యబొమ్మతో నడిచి వచ్చాడు. వాళ్లిద్దరూ అక్కడ మరొక వైపున కూర్చుని ఆడుకోవటం ప్రారంభించారు. చంద్రమౌళి ఆ పిల్లను ఉద్దేశించి 'మీ యిల్లెక్కడ ?' అని ప్రశ్నించాడు. ఆ పిల్ల వెనుదిరిగి తన విశాల నయనాలను మరింత పెద్దవిగా చేసి అతనివంక చూసింది. తర్వాత వూరివైపు చూపిస్తూ 'అక్కడ' అని చెప్పింది. చంద్రమౌళి మళ్లీ "వీడు మీ తమ్ముడా ?" అని అడిగాడు. ఆ పిల్ల 'అవున' న్నట్టు తల వూపింది. అతడు ఒక్క క్షణం ఆగి మళ్లీ 'నీపే రేమిటి ?' అని అడిగాడు. 'ఉషాబాల' అని సమాధానం చెప్పిందా పిల్ల.

గాలి మంద మందంగా హాయిగా వీస్తున్నది. సూర్యుడు తన ప్రతాపం చాలించి పడమటి దిక్కున అస్తమిస్తున్నాడు. ఆకాశం రంగురంగుల మబ్బులతో నిండి చిత్రలేఖనంలో ప్రాథమిక మాత్రానైనా తెలియని పసివాడు తన చిత్తం వచ్చినట్టు రంగులు పూసి వ్రాసిన చిత్తరువు వలె ఉన్నది. కొద్ది నిముషాలలోనే సూర్యాస్తమయం అయి, దేవకన్యలు తమలో తాము ఆడుకుంటూ విసిరిన బంగారు బంతివలె చంద్రబింబం ఉదయించింది.

ఉషాబాల ఆట చాలించి తమ్ముణ్ణి వెంటబెట్టుకుని బయలుదేరింది. చంద్రమౌళి కూడా వెంట నడిచాడు. నడుస్తూ ఎన్నో విషయాలు కనుక్కున్నాడు. ఆ పిల్ల తల్లి అయిదేళ్ల క్రిందట చనిపోయింది. భార్య పోయి సంవత్సరం తిరగ్గానే ఆ పిల్ల తండ్రి మళ్లీ పెళ్లి చేసుకున్నాడు. వెంటనే భార్యను కాపురానికి కూడా తీసుకుని వచ్చారు. మొదట్లో సవతి తల్లి యీ పిల్లను బాగానే చూసేది. కాని కాలం గడిచేకొద్దీ ఆమెలో మార్పు వచ్చింది. ఆమెలో కోపమూ, అసహనమూ ఎక్కువయి ఆ పిల్లను కొద్దిగా బాధపెడుతూ ఉండేది. ఆ పిల్లకు శక్తికి మించిన పనులను చెప్పటమూ, సరిగా చెయ్యలేదని సాధిస్తూ ఉండటమూ సాగించింది. ఏ పని అయినా చెప్పేదాకా చెయ్యకపోతే "నేను చెబితేగాని చెయ్యవన్నమాట" అనేది. చెప్పకుండా చేసుకుపోతే "నేను చెప్పనిదే ఎందుకు చేశావు ?" అని సాధించేది. తర్వాత ఆమెకు కూడా ఒక మగపిల్లవాడు పుట్టాడు. అప్పటినుంచి ఆమె ఆ పిల్లను కొంచెం ప్రేమగానే చూడటం ప్రారంభించింది. అయినా సాధింపూ, కోపమూ, అసహనమూ మాత్రం పూర్తిగా పోలేదు. ఆ పిల్ల చాలా దీనంగా ఉండేది. ఎప్పుడో చచ్చిపోయిన తల్లి తనకు గుర్తులేదు. సవతి తల్లిలో మాతృప్రేమ కనిపించటంలేదు. తండ్రి తనవిషయం అసలు పట్టించుకోడు. అంతా విన్నతర్వాత చంద్రమౌళి గుండె ద్రవించింది. అతడు నిట్టూర్చి "నీకు నాన్న అయినా ఉన్నాడు. నా సంగతి మరీ అన్యాయం. మా నాన్నా, అమ్మా నేను పుట్టిన రెండు మూడేళ్లలోనే పోయారు. వాళ్ళ ముఖాలైనా నాకు గుర్తులేవు." అన్నాడు. ఈసారి జాలిపడటం ఆ పిల్లవంతు అయింది. దీనంగా ఉన్న అతని ముఖాన్ని ఆమె చాలా ఆర్ద్రమైన దృక్కులతో చూసింది. చంద్రమౌళి వారి యింటి వరకూ వెళ్లి వారిద్దరూ యింట్లోకి వెళ్లిన తర్వాత తన దారిన తాను వచ్చేశాడు.

ఆ నాటినుంచి వారిద్దరూ నది ఒడ్డున ఉన్న కొబ్బరితోటలో కలుసుకునేవారు. పశ్చిమాద్రిన క్రుంగిపోతూ సూర్యబింబం తన కిరణజాలంతో లోకానికి బంగారుపూత వేస్తూ ఉండే సమయంలో వారిద్దరూ కొబ్బరి చెట్ల మధ్య పరుగులెత్తుతూ ఆడుకునేవారు. దేవలోకంలోని అప్సర కన్యలు ఉపయోగించే నిర్మలమైన గుండ్రని అద్దం వంటి చంద్రబింబం తన చల్లని కిరణాలతో లోకానికి వెండిపూత వేసే సమయంలో మంటపంలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ ఉండేవారు. జలతారు వస్త్రం మడతలలో దాచి ఉంచబడిన మంచి ముత్యం వలె పలుచని తెలి మబ్బులలో చంద్రుడు చిక్కుబడినప్పుడు వారిద్దరూ అటే చూస్తూ కూర్చుని "అదుగో చంద్రుడు మబ్బుల్లోకి పోయాడు. ఇదు మళ్లీ యివతలికి వస్తున్నాడు. మళ్లీ ఆ మబ్బు చంద్రుణ్ణి మింగేందుకు వస్తున్నది" అనుకుంటూ ఉండేవారు.

ఒకనాడు వారు ఒకరి వెంట ఒకరు పరుగులెత్తుతూ ఆడుకుంటూ ఉండగా ఆకాశం ఉన్నట్టుండి మేఘాలతో నిండిపోయింది. అంతవరకూ నిరంకుశంగా ఆకాశ సామ్రాజ్యాన్ని పరిపాలించిన నేమి బలహీనమై పోయింది. ఏ చిన్న మబ్బుతునక విప్లవం ప్రారంభించిందో తెలియదు. ఉన్నట్టుండి చిన్న చిన్న మబ్బు లన్నీ కలిసి మహా శక్తిగా రూపొంది నేమిని గద్దె దింపి తమ పరిపాలన ప్రారంభించాయి. ఆకాశం నల్లగా నిండు కుండవలె ఉన్నది. అంతవరకూ మిలమిలలాడిన నక్షత్రాలు మాయమైపోయాయి. ఒక దిక్కున మేఘాలు తమ విజయచిహ్నంగా చేస్తున్న జయ ధ్వానాల వలె ఉరుమటం కూడా ప్రారంభించాయి.

ఉషాబాల ఆకాశం వంక చూసి "అమ్మో ! వర్షం వచ్చేట్టున్నది. మా పిన్ని వూరుకోదు. నేను వెళ్లిపోతాను బాబూ ?" మెట్లు దిగటం ప్రారంభించింది. చంద్రమౌళి, పదారు వన్నె పసిడి పాదాలు కనిపించేట్టు పరికిణీ కుచ్చెళ్లను పైకి పట్టుకుని త్వర త్వరగా క్రిందికి దిగిపోతున్న ఉషా

చూస్తూ కూర్చున్నాడు. అలా ఆ పిల్ల కొన్ని మెట్లు దిగేసరికే తన వెనరో తరుముకు వచ్చినట్లు వాన రానే వచ్చింది. మళ్లీ ఆ పిల్ల త్వర త్వరగా పైకి రాక తప్పలేదు. అక్కడి నుంచి వానజల్లు వారి నిద్దురిసీ మంటపం లోపలికి తరిమివేసింది. ముందు ఉషాబాలా, వెనక చంద్రమౌళీ వాన రొద వింటూ అలాగే నిలబడిపోయారు. ఉషాబాల పండుతమలపాకుల వంటి తన చేతులలో పైనుంచి పడుతున్న వాన నీటిని పట్టుకుని ఒక్కసారిగా చంద్ర మౌళి మొహాన చల్లింది. చంద్రమౌళి మొహం తుడుచుకుంటూ 'ఊరుకో ఉషా! మరీ అల్లరి వేషాలు వెయ్యకు. నేను రేపు పొద్దున్నే వెళ్లిపోతు న్నాను'' అన్నాడు. ఆ పిల్ల మళ్లీ నీళ్లు అతనిమీద చల్లబోతూ ఆగింది. ఒక్క క్షణం పూరుకుని చేతిలోని నీటిని నేలమీద చల్లింది. చేతులు పరికి ణీకి తుడుచుకున్నది. తర్వాత కళ్లలో అమాయకత్వం వొలుకుతూ ఉండగా ''మళ్లీ రావా?'' అని అడిగింది. అతడు ''రాకేం?' మళ్లీ సంవత్సరానికి .... ఉషా! నేను నీకు గుర్తుంటానా?'' అని అడిగాడు. ఆ పిల్ల ఏమీ మాట్లాడ లేదు. కొన్ని క్షణాలు విశ్శబ్దంగా కూర్చున్నది. అతడే మళ్లీ ''నేను అక్క డికి వెళ్లి మళ్లీ వారాలు ఏర్పాటు చేసుకోవాలి. ఈ సెలవులలో ఎవ రున్నారో .... ఎవరు వూరు వదలి పోయారో .... పోయిన సంవత్సరం నేను ప్రతి శుక్రవారం జిల్లా జడ్జిగారి యింట్లో భోజనం చేసేవాణ్ణి .... ఈ చొక్కా, లాగూ యిచ్చింది కూడా ఆయనే. అప్పటికే బదిలీ అవుతుందనే అను కునేవారు. ఇప్పు డున్నారో లేరో'' అన్నాడు. ఉషాబాల ఏమీ మాట్లాడలేదు. చంద్రమౌళి కూడా తర్వాత ఏమీ మాట్లాడకుండా మౌనంగా కూర్చు న్నాడు. వాన అలా కొంతసేపు, కుండపోతగా కురిసి తర్వాత కొద్దిగా తగ్గింది. చంద్రమౌళి చేయి బయటికి చాపి చూసి ''వాన తగ్గింది. యిక పోదాం పద'' అన్నాడు మెట్లు దిగుతూ. ఉషాబాల అతన్ని అనుసరించింది. ఇద్దరూ వూళ్లోకి వచ్చారు. ఉషాబాల యింటిముందాగి చంద్రమౌళి ''రేపు ప్రొద్దున్నే వెళ్లిపోతాను నేను. మళ్లీ కనిపిస్తావా?'' అని అడిగాడు. ఆ పిల్ల తల వూపి లోపలికి పోతూ ఒకసారి తన లేడి కళ్లను అతనివైపు తిప్పి చూసింది. తర్వాత యింట్లోకి వెళ్లిపోయింది. చంద్రమౌళి నెమ్మదిగా నడిచి తన యింటికి వచ్చాడు.

అతడా మర్నాడు బండ్లో ఎక్కి స్టేషనుకు వచ్చాడు. ఉషాబాల అత నికి మళ్లీ కనిపించనే లేదు. మళ్లీ సెలవులకు అతడా వూరికి వెళ్లేసరికి వాళ్లా వూళ్లో లేరు.

చంద్రమౌళి గాఢంగా నిట్టూర్చాడు. 'తర్వాత ఆమె ఏమయింది? ఎలా బ్రతికింది?'' అనే ప్రశ్నలకు సమాధానమే లేదు. ఇదంతా తన మన స్సులో ఎక్కడో అట్టడుగున పడిపోయిన విషయం. తన చదువూ, ఉద్యో గమూ, ప్రమోషన్లూ, పెళ్లి, అత్యంత సంతృప్తికరమైన వైవాహిక జీవి తమూ, వీటి అడుగున ఎక్కడో పడి యిన్నాళ్లకు యీ పిల్లల ఆట చూస్తూవుండగా యిది బయటికి వచ్చింది.

ఆ తర్వాత ఆయన కొన్ని నిముషాలపాటు అలా నిశ్చబ్దంగా కూర్చు న్నాడో లేదో క్రిందినుంచి శ్రీదేవి పిలుపు వినవచ్చింది. ఆయన వెంటనే క్రిందికి దిగి వచ్చేశాడు.

*　　*　　*　　*

ఉదయం చంద్రమౌళి ఆఫీసుకు వెళ్లి తన కుర్చీలో కూర్చోగానే రాఘవులు ఒక కాయితం తెచ్చి యిచ్చాడు. 'పార్థసారధిగారు యిమ్మని చెప్పా రండి' అన్నాడు.

పార్థసారధి 'తన తల్లికి అకస్మాత్తుగా ప్రాణంమీదికి వచ్చిందని, 'అర్ధరాత్రివేళ ఆసుపత్రికి తీసుకు వెళ్లవలసి వచ్చిందనీ, రెండు గంటలు ఆలస్యంగా ఆఫీసుకు వచ్చి అన్ని విషయాలూ మాట్లాడగలననీ', వ్రాశాడు. చంద్రమౌళి ఆ కాయితాన్ని ప్రక్కనే ఉంచుతూ రాఘవులతో ''సరే. నువ్వు వెళ్లవచ్చు'' అన్నాడు.

తర్వాత ఆయన తన పనిలో లీనమైపోయాడు. పన్నెండు గంటల వేళ రాఘవులు కాఫీ తెచ్చి యిచ్చాడు. చంద్రమౌళి విశ్రాంతిగా కూర్చుని కాఫీ త్రాగుతూ ఉండగా పార్థసారథి లోపలికి వచ్చాడు. అతని ముఖం చిన్నబోయి ఉంది.

చంద్రమౌళి ''కూర్చోండి. మీ కాగితం చూశాను. ఎలా ఉన్నది మీ అమ్మగారికి?'' అని అడిగాడు. పార్థసారధి దీనంగా ''ఎలా ఉన్నదని చెప్పను? డాక్టరు ఏ విషయమూ రెండు రోజులు గడిస్తేగాని చెప్పలే నంటున్నాడు. రాత్రి ఉన్నట్టుండి దగ్గు ఎక్కువై అపస్మారక స్థితి వచ్చింది. పలకడం మానివేసింది. మన స్పృహ లేదు. మేము అప్పటి కప్పుడే ఆసు పత్రికి తీసుకుపోయాము. డాక్టరు పరీక్షచేసి ఏవో యింజెక్షనులు యిచ్చాడు. కాని యింతవరకూ మన లోకంలోకి రాలేదు. అలాగే చలనం లేకుండా పడి ఉన్నది. మా నాన్నను చూస్తూ ఉంటే నా కడుపు తరుక్కు పోతున్నది... అక్కడే ఒక ప్రక్కగా మోకాళ్లమీద తల వాల్చుకుని కూర్చుని ఉన్నాడు. ఆయన పెద్దవాడు. పైగా కబోది .... '' అన్నాడు.

చంద్రమౌళి జాలిగా ''అయితే మీరు అక్కడ ఉండటం చాలా ముఖ్యం. వెంటనే వెళ్లి దగ్గరే ఉండండి. అన్నట్టు మీ అమ్మగారి వయ సెంత?'' అని అడిగాడు. పార్థసారధి ''ముప్పయి అయిదో నలభయ్యో ఉంటాయి. అయినా దాదాపు అయిదారేళ్ల నుంచీ ఉన్న దగ్గును నిర్లక్ష్యం చేసి యీ స్థితికి తీసుకువచ్చింది. నా చదువు కోసం 'ఎలా డబ్బు సమ కూర్చడమా' అన్న ప్రశ్న తప్ప నా తల్లిదండ్రులకు యిన్ని ఏళ్లుగా మరొక ఆలోచన లేదు. మా నాన్న తాలూకా ఆఫీసులో చీకటి గదిలో టైపు చేస్తూనే జీవితమంతా గడిపాడు. రిటైరయ్యే వయస్సు వచ్చేసరికి చూపు మందగించి పోయింది. ఇప్పుడు పరిస్థితు లిలా విషమించి పోయాయి'' అన్నాడు.

చంద్రమౌళి ''మీకే సహాయం కావలసి వచ్చినా సంకోచం అక్క ర్లేదు. ఇక్కడికి రండి. నాకు చేతనైన దంతా చేయగలను'' అన్నాడు. పార్థసారధి ఆర్ద్రమైన కళ్లతో, ''కృతజ్ఞుణ్ణి'' అని చెప్పి వెళ్లిపోయాడు. ఆ నాటి సాయంకాలం పని పూర్తి అయిన తర్వాత చంద్రమౌళి కిటికీలో నుంచి క్రిందికి చూస్తే క్లబ్బు టెన్నిస్‌కోర్టు నిర్మానుష్యంగా బోసిపోయి కనిపించింది.

*　　*　　*　　*

మర్నాడు సాయంకాలం ఆఫీసు మూసివేసే సమయంలో చంద్రమౌళి వాకిట్లో నిలబడి ఉండగా పార్థసారధి రిక్షా దిగివచ్చాడు. అతడు మరీ దీనంగా ఉన్నాడు. అతడు రిక్షావాడికి డబ్బులిస్తూ ఉండగా చంద్రమౌళి ''ఏమండీ! ఎలా ఉన్నది మీ అమ్మగారికి?'' అని అడిగాడు. పార్థసారధి కళ్లు చెమ్మగిలుతూ ఉండగా ''ఏం చెప్పను? ఈ రాత్రి గడవటం కష్టమే నంటున్నాడు డాక్టరు. ఆమె అప్పుడప్పుడు మాత్రం కళ్లు తెరచి చూస్తు న్నది. ఏవో కొత్త ఇంజెక్షనులు కావాలని వ్రాసి యిచ్చాడు డాక్టరు. మిమ్మల్ని అడుగుదామని వచ్చాను''అన్నాడు. చంద్రమౌళి వెనుదిరుగుతూ ''అలా అయితే లోపలికి రండి. డబ్బు యిస్తాను. తర్వాత నా కారులో ఎక్కితే మిమ్మల్ని దోవలో ఆసుపత్రి దగ్గర దించి నేను వెళ్లిపోతాను'' అంటూ లోపలికి నడిచాడు. పార్థసారధి ఆయన వెంటనే వెళ్లాడు.

చంద్రమౌళి నూరు రూపాయల నోటు నొకదాన్ని అతని చేతికిచ్చి ''ఇది సరిపోతుందా?'' అని అడిగాడు. పార్థసారధి తలవూపి, ఆ నోటు అందుకున్నాడు. ఇద్దరూ బయలుదేరి హాస్పిటల్ ముందుకు వచ్చేసరికి కారు ఆపి చంద్రమౌళి ''మీరు దిగండి'' అన్నాడు. అంతవరకూ దీనంగా మరో ప్రపంచంలో ఉన్నట్టున్న పార్థసారధి వెంటనే క్రిందికి దిగి ''నాకెందుకో భయంగా ఉన్నదండీ. దయచేసి మీరు కూడా రారాదూ?'' అన్నాడు.

చంద్రమౌళి ''వస్తాను. కాని మీరలా అధైర్య పడకూడదు. ఇటువంటి సమయాల్లో ధైర్యం చాలా అవసరం. మరీ అంత పిరికివారు కాకూడదు'' అంటూ దిగి అతని వెంటనే లోపలికి వెళ్లాడు.

అది పెద్ద ఆసుపత్రి. ముందు పెద్ద వరండాలో వరుసలుగా మంచాలు ఉన్నాయి. అక్కడొక్కటీ అక్కడొక్కటీ పడకలు ఖాళీగా ఉన్నప్పటికీ మిగిలిన అన్ని మంచాలలోనూ రోగులు పడుకుని కొందరూ, కూర్చుని కొందరూ ఉన్నారు. డ్యూటీలో ఉన్న నర్సు ఎవరి అవసరాలు ఏమిటో కనుక్కుంటూ అటూ యిటూ తిరుగుతున్నది. మిగిలినవి ప్రత్యేకమైన గదులు. వాటిలో రెండేసి మంచాలు ఉన్నాయి. ఒక గదిలో పెద్ద గొడవ జరుగుతున్నది. ఒక రోగిచేత మందు త్రాగించడం కోసం యిద్దరు నర్సులూ డాక్టర్లూ విశ్వ ప్రయత్నాలు చేస్తున్నారు. అతడు మాత్రం అందరినీ తోసివేస్తూ "మీరు నాకు విషం పోస్తున్నారు. నేను తాగను గాక తాగను" అని అరుస్తూ కేకలు పెడుతూ గందరగోళం చేస్తున్నాడు. చంద్రమౌళీ, పార్థసారధి ఆ గదిముందు ఓ క్షణం ఆగారు. పార్థసారధి నవ్వి "అతడొక లక్షాధికారి. తనను ఎవరో ఒకరు విషంపెట్టి చంపేసి తన ఆస్తిని కాజేస్తారని ఎప్పుడూ భయపడుతూ ఉండేవాడు. ఇంట్లో అందరిమీదా, చివరకు కట్టుకున్న పెళ్లాంమీద కూడా అనుమానమే. ఇప్పుడేమో జబ్బుచేసింది. ఇక్కడికి వచ్చినప్పటినుంచీ యింతే. నానా హంగామా చేస్తున్నాడు" అని చెప్పాడు. చంద్రమౌళికి నవ్వు వచ్చింది. ఆయనకీ ఆసుపత్రి వాతావరణమే కొత్తగా ఉంది. తనజీవితంలో ఎన్నడూ ఆయన యింతవరకూ ఆసుపత్రి ఎరుగడు. ఎప్పుడైనా అడపా దడపా చిన్నచిన్న జ్వరాలూ, జలుబులూ వస్తే శ్రీదేవి తన పరిచర్యతో, చిన్న చిన్న గృహవైద్యాలతో తనను సేదదీర్చేది. వారిద్దరూ అలా నడుస్తూ చివరి గదుల దగ్గరికి వచ్చారు. ఒక గది ముందు ఆగి పార్థసారధి "రండి లోపలికి" అంటూ తాను ముందు నడిచాడు. చంద్రమౌళి గుమ్మం దాటి లోపలికి వెళ్లి చుట్టూ చూశాడు.

ఆ గదిలో ఒకే మంచం ఉంది. మంచానికి దిగువగా చాపమీద ఒక ముదుసలి, పడుకుని నిద్రపోతున్నాడు. అతని గడ్డం పండి వుంది. గదిలో నేల అంతా తెల్లని నాపరాతితో శుభ్రంగా వుంది.

పార్థసారధి రోగి మంచానికి ప్రక్కగా ఉన్న కుర్చీని యివతలికి లాగి చంద్రమౌళి నుద్దేశించి "కూర్చోండి" అన్నాడు. చంద్రమౌళి కూర్చుని రోగి వైపు చూశాడు.

ఏళ్ల తరబడి దగ్గుతో, ఆయాసంతో, కృశించిపోయిన బలహీనమైన శరీర మామెది. చాలా నెమ్మదిగా, బరువుగా గాలి పీలుస్తున్నది. ఆరిపోతున్న దీపశిఖవలె చావూ బ్రతుకుల మధ్య ఊగులాడుతున్నది.

చంద్రమౌళి ఒక్క నిముషం ఆగి తర్వాత లేచి నుంచుని "మీరు ధైర్యంగా ఉండండి. మన మంతకన్నా చేయగలిగింది ఏమీ లేదు. మనం అలవరచుకోవలసినదల్లా ధైర్యంగా నిలబడటమే" అన్నాడు. పార్థసారధి దుఃఖిస్తూ "ఏం ధైర్యమో! ఎంతగా ప్రయత్నించినా యీ బాధ తన్నుకుని పైకి వస్తున్నది. ఉన్న ఆ ఒక్క దిక్కూపోతే యీ కరోడి తండ్రీ, నేనూ ఎన్ని అగచాట్లపాలు కావలసి వస్తుందో!" అన్నాడు. ఇంతలో చాపమీద పడుకునివున్న వృద్ధుడు లేచి మాటలు వినవస్తున్న వైపు మొహం తిప్పి దీనంగా కూర్చున్నాడు. చంద్రమౌళి యివతలకు వస్తూ మళ్లీ తల తిప్పి రోగివైపు ఒకసారి చూశాడు. ఆమె యిప్పుడు కళ్లు తెరుచుకుని మగతగా పడుకుని ఉన్నది.

చంద్రమౌళి నడవటం ప్రారంభించాడు. పార్థసారధి వెనకనుంచి 'నేను ఉండిపోతానండీ' అనటం వినిపించింది. బయట చీకట్లు అలుముకుంటున్నాయి. వరండాలో అక్కడొక మనిషి అక్కడొక మనిషి తప్ప సందడేమీ లేదు. చంద్రమౌళి బూట్లు చప్పుడు కూడా వినపడనంత నెమ్మదిగా నడుస్తున్నాడు. ఆమె ముఖమే ఆయనకు చిరపరిచితమైనదిగా మాటిమాటికీ జ్ఞప్తికి వస్తున్నది. ఒక అద్భుత శిల్పం చెయ్యి విరిగి, కాలు విరిగి వికృతమైపోయినట్లూ, పసి పిల్లవాడు ఎంతో అపేక్షగా చూసుకుంటున్న ఆటబొమ్మ పగిలి ముక్కలై పోయినట్లూ, చిత్రకారుడు తాను జీవితమంతా శ్రమచేసి, తన నైపుణ్యం అంతా ధారపోసి చిత్రించిన రమణీయ చిత్రం మీద ఒక మూర్ఖుడు రంగులు పులిమినట్లూ ఉన్నది. గాజు కొంపలో ఉండి బయటి ప్రపంచాన్ని మనుష్యులనూ చూసేవాడికి అన్నీ చాలా అస్పష్టంగా కనిపించినట్లు ఏదో అస్పష్టరూపం ఆయన మనస్సులో తెలిసీ తెలియకుండా యిబ్బంది పెడుతున్నది.

చంద్రమౌళి కారు దిగి యింట్లో ప్రవేశించగానే శ్రీదేవి ఎదురుగా వచ్చి "ఏమిటండీ అలా ఉన్నారు?" అని అడిగింది. ఆమె తన భర్త ఎన్నడూ పరధ్యానంగా ఉండటం చూసి ఎరుగదు. ఆయన "ఏమీ లేదు" అని చెప్పి దుస్తులు మార్చుకుని పైన వాలు కుర్చీలో కూర్చుని ఉండగా ఆమె కాఫీ తీసుకువచ్చి అందించింది.

చంద్రమౌళి కాఫీ త్రాగుతూ పక్క దాబా మీదికి చూశాడు. అప్పుడే ఉదయిస్తున్నది చంద్రబింబం. ఆ యిద్దరు పిల్లలూ రోజూ వలెనే మళ్లీ పరుగులెత్తుతూ ఆడుకుంటున్నారు. ఆ ఆడపిల్ల ఒక్కసారి ఆగి "అదుగో! ఆ మబ్బు చూడు రఘూ! చెట్టులాగా లేదూ?" అన్నది.

చంద్రమౌళి ఏదో స్ఫురించగా, చేతిలో ఉన్న కాఫీ కప్పు క్రింద ఉంచేసి వ్యాకులహృదయంతో "శ్రీదేవీ! ఆ తలుపు మూసి నువ్వు క్రిందికి వెళ్లిపో. నన్ను కాసేపు ఒంటరిగా ఉండనివ్వు" అన్నాడు.

ఆమె నివ్వెరపోతూ కాఫీ కప్పు చేతిలోకి తీసుకుని, తలుపు వేసి, నెమ్మదిగా క్రిందికి వెళ్లిపోయింది. ఆయన కళ్లు మూసుకుని వాలు కుర్చీలో విశ్రాంతిగా పడుకుని ఏమీ ఆలోచించకుండా ఉండేందుకు ప్రయత్నం చేశాడు.

* * * *

మరునాడు ఉదయం శ్రీదేవి, భర్త ముఖం చూసి ఆశ్చర్యంతో "అలాఉన్నా రేమిటి?" రాత్రి నిద్ర సరిగా పట్టలేదా?" అని అడిగింది. ఆయన నవ్వి "ఎలా ఉన్నానూ? రాత్రి వళ్లు మరచి నిద్రపోయానే" అన్నాడు. కాని అది అబద్ధం. శ్రీదేవి ఆయన మాటలను నమ్మనూ లేదు. ఆయన రాత్రిఅంతా జాగ్రదవస్థకూ సుషుప్త్యవస్థకూ మధ్య బాధ పడ్డాడు. కన్నుమూస్తే ఏవో అర్థంలేని పిచ్చి పిచ్చి కలలు వచ్చి నిద్రను ఎన్నడూ లేనంతగా పాడుచేశాయి. శ్రీదేవి "ఏమో! రాత్రి మీరు రోజూలాగా ఆదమరచి నిద్రపోలేదు. ఒకసారి కెవ్వున కేకవేసి లేచారు కూడా. నాకెంతో భయం వేసింది. అప్పుడు గడియారం చూస్తే సరిగ్గా రెండు గంటలైంది. రాత్రి అంతా భయంతోనే గడిపాను" అన్నది.

తర్వాత ఆయన ఆఫీసుకు వెళ్లగానే రాఘవులు ఒక కాయితం తెచ్చి అందించాడు. అందుకుని చూస్తే అది పార్థసారధి సెలవు దరఖాస్తు. తన తల్లి, రాత్రి రెండు గంటల వేళ మరణించిందనీ, తనకు ఒక పది రోజుల సెలవు అత్యవసరమనీ వ్రాశా డతడు.

చంద్రమౌళి ఆ పూట అంతా ఒక్క కాయితమైనా చూడకుండా ఆఫీసులో వాలు కుర్చీలో పడుకుని నిద్రపోయాడు, రాఘవులుతో, 'ఎవ్వరినీ లోపలికి రానివ్వవద్ద'ని చెప్పాడు.

ఆయనకు మెలకువ వచ్చేసరికి గాజు తలుపుమీద దీపపు వెలుగు పడుతున్నది. అవతల ఎవరున్నారో స్పష్టంగా తెలియడంలేదు. కాలింగ్‌బెల్ నొక్కగానే రాఘవులు త్వరత్వరగా వచ్చి "కారు వచ్చింది బాబుగారూ!" అన్నాడు. చంద్రమౌళి లేచి ఒళ్లు విరుచుకుని "త్వరగా తాళంచెవులు తెచ్చి యివ్వు" అంటూ బయటికి వెళ్లాడు.

రెండు నిముషాలతర్వాత వేగంగా పోతున్న కారులో కూర్చుని ఆయన "కలలలో ఎవరెవరినో చూస్తూ ఉంటాము. అలాగే యిదీనూ .... ఎప్పుడెవరిని కలుసుకుంటామో .... ఎప్పుడు విడిపోతామో తెలియదు" అనుకున్నాడు. తర్వాత కారులో ఉన్నంతసేపూ ఆయన ఆలోచనలన్నీ శ్రీదేవి మీదనే ఉన్నాయి. "రాత్రి ఎంతో బాధపడి ఉంటుంది. నా పిచ్చి శ్రీదేవి" అనుకున్నా డాయన. తర్వాత పెద్దగా "రాజా! మరి కాస్త త్వరగా పోనివ్వవోయ్" అన్నాడు. రాజు "అలాగేనండి" అంటూ కారు వేగం హెచ్చించాడు.

# అష్టగ్రహకూటపు దుమారము

శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

వీధినాటకములలో వీరపురుష పాత్రధారులు రంగస్థలమునకు రానుండగా, గొప్ప కోలాహలము బయలుదేరుట సామాన్యానుభవము. ఢోలు తప్పెట్ల ఫెళఫెళలు, సజ్జరసపు దివిటీల తళతళలు, కప్పుతాళముల ఘణఘణలు, బిరుసు బూరాల భుగభుగలు, వెనుకపాటగాండ్ర తోంత తబ్బిబలు, అన్నియు చేరి, అనిర్వాచ్యమయిన గొప్ప కలకలము బయలుదేరనిదే, నటుడు రంగస్థలమునకు కుప్పరించి వచ్చి నాట్యమాడడు. తరువాత కొన్ని నిముషములు కాళ్లతీట తీర్చుకొని, చల్లబడి, అతడు ఏమూలకో పోయి విశ్రమించుకొనును.

కడచిన ఫిబ్రవరి 5 వ తేదినాటి అష్టగ్రహకూటపు నాటకములో సయితము ఇట్లే జరిగినది. రానున్న గ్రహకూటపు ఫలితములను గూర్చి సిద్ధాంత రాద్ధాంతములు కొన్ని నెలలకు ముందే వార్తాపత్రికలలో ఆరంభమయినవి. అదో, ఇదో, ప్రపంచయుద్ధములో ఆటంబాంబులు ప్రేలునని, యుద్ధములలో రాజులు, రాజ్యములు నశించునని, భూమి రక్తమయమగునని, అగ్నిపర్వతములు, నదీప్రవాహములు, భూకంపములు మున్నగు మారణ యంత్రసామగ్రి చెలరేగి మానవులను అపారముగా కబళించునని, ఆర్తనాదములు బయలుదేరినవి. మూలమూలలనుండి జ్యోతిశ్శాస్త్ర విశారదులు పలువురు ప్రాచీనసంహితలనుండి సూత్రములను ఉదహరించి, ఘోరవిపత్తు రానున్నదని హెచ్చరించసాగినారు. ఖండాంతరములలో సయితము ఇట్టి గోలలు సమృద్ధిగా వినవచ్చినవి. యాగములు, హోమములు, పూజలు మొదలగు శాంతిక్రతువులు జరుపుట గ్రహకూట బాధా నివారణమునకు అత్యవసరములని లోకహితైషులు పలువురు సభలలో ఉపన్యసించినారు. లక్షలకొలది ద్రవ్యమును చందాలెత్తి ప్రోగుచేసి, దేశభక్తులనేకులు పుణ్యక్షేత్రములలో జపములు, అభిషేకములు మొదలగు శాంతికర్మలు చేయించినారు. ఫిబ్రవరి 3, 4, 5 తేదీలలో ఏ ప్రళయ వార్తలు వినబడునో, ఎట్టి ఘోర సంఘటనలు చూడవలసి వచ్చునో అని అనేకులు వణకసాగిరి. మరణ శాసనములు సయితము వ్రాసియుంచినవారు లేకపోలేదు. "ఇట్టి గ్రహకూటములు ఎన్నియో వచ్చినవి. ఎన్నియో పోయినవి. గొప్ప ప్రమాద మేమీ జరుగ" దని అనుభవశాలురు కొందరు అభయ మిచ్చినారు. ఏ నిముషమున ప్రపంచయుద్ధము పాటిమరించునో యని నానా దేశములు బాహాటముగనో, మారుపేర్లతోనో, సైనికసన్నాహములు చేయకపోలేదు.

"నేను గ్రహకూటమునకు ఏమీ భయపడను. అది నన్ను ఏమీ చేయదు. ఇది అంతా మూఢ విశ్వాసము!" అని భారత మహాప్రధాని శ్రీ నెహ్రూ పండితుడు ఎడపదడప ఎలుగెత్తి హెచ్చరించుచుండినా, ఈ కోలాహలములో అతని మాటలు అణగిపోయినవి. కాక, ఔరంగజేబు సంగీత శాస్త్రమును ద్వేషించినట్లు, శ్రీ నెహ్రూ పండితుడు జ్యోతిశ్శాస్త్రమును ద్వేషించుచున్నాడనుట సుప్రసిద్ధ విషయము. అగుటచే, అతని అభిప్రాయములు జనసామాన్యమునకు విలువలేనివి.

సావిత్తము. అష్టగ్రహకూటము మెల్లగా రానే వచ్చినది, చల్లగా పోనే పోయినది కూడా! కాని, ప్రళయము కాని, ప్రపంచయుద్ధము కాని రాలేదు. చెప్పుకోదగినట్టి ఘోరపరిణామ మేమియు కలుగలేదు. యథాపూర్వముగా ప్రపంచము తనపనులను జరుపుకొనుచునే యున్నది. గ్రహకూటమునుగురించి భయపడినవారిమూఢ భక్తిని ఆధునిక విజ్ఞానవేత్తలు కొందరు ఎగతాళిచేయసాగినారు.

"ఏకరాశౌ యదాయాంతి,
చత్వారః పంచఖేచరాః,
ప్లావయంతి మహీం సర్వాం,
రుధిరేణ, జలేనవా."

ఈ మొదలయిన సంహితావాక్యములు నాలుగయిదు గ్రహములకూటము వలననే భూమండలము రక్తప్రవాహమందో, జలప్రవాహమందో, మునుగు ననుచున్నవే! వాని ఫల మేమైనదని జ్యోతిష్కులు చిత్తరపోయి ఆకాశమును చూచుచున్నారు. "అప్పుడే ఏమైనది? ఆరు నెలలు చూడండి" అన్నారు కొందరు సమయస్ఫూర్తికల చతురులు. తాము సాధించిన శాంతిక్రతువుల ఫలముగా దైవానుగ్రహము కలిగి దుష్ఫలము తగ్గిపోయినదని కొందరు తృప్తిచెందు చున్నారు. ఎవరికి తోచినట్లు వారి వ్యాఖ్యానము!

ఏది ఎట్లయినా అష్టగ్రహకూటమేమో కడచిపోయినది. యుద్ధము కానీ, ప్రళయము కానీ రాలేదు. దినపత్రికలలో రైళ్ల ఉపద్రవములు, విమానపతనములు, పడవల ప్రమాదములు, బస్సుల ఢీకొనుట మొదలగు వానివలన ఏవో కొన్ని మరణములు సంభవించుచుండుటను గూర్చి ఇంచుమించుగా అనుదినమును చదువుచున్నాము. దినమునకు సరాసరి అరువది వేలకు పైగా హెచ్చుచున్న జనసంఖ్యగల ఇప్పటి ప్రపంచములో, ఈ మరణములు ఏమి లెక్క? గ్రహకూటములు లేని కాలములో సహా ఇట్టివి జరుగుచునే యున్నవి. ఇట్టి స్వల్ప విషయములను అష్టగ్రహకూటఫలమునకు చెల్లుగట్టుట నగుబాట్ల చేటు!

మరి, అష్టగ్రహకూటము కలుగనే లేదా? లేక, మహనీయుడు మన మహాప్రధాని సెలవిచ్చినట్లు, దానికి ఫలము శూన్యమేనా? ఇది అంతా మూఢ విశ్వాసమేనా? లోకకల్యాణ కాంక్షతో మహర్షులు చెప్పిన సంహితావాక్యములు నిష్ప్రయోజనములా? అను సందేహములు పుట్టుటకు సమృద్ధిగా అవకాశ మేర్పడినది.

కొన్ని గ్రహములు ఒకచోట చేరినచో గ్రహకూట మందురు. నెల కొక్కమారు భచక్రములో ఏదో ఒక రాశిలో రవి, చంద్రులు చేరుచుందురు కదా? దీనిని చిన్న గ్రహకూట మనవచ్చును. ఇదే అమావాస్య. ఆనాడు ఏక రేఖలో రవిచంద్రు లుండుటచేత, అతి ప్రబలమగు ఆకర్షణశక్తి బయలు వెడలి భూమండలమును లాగగలదు. కావుననే ఆ సమయమున సముద్రములు హల్లకల్లోలముగా ఘూర్ణించుట! ఆ రవిచంద్ర సంయోగస్థానము ఏ వ్యక్తియొక్క లగ్నముపైనో, చంద్రస్థానముపైనో నికరముగా పడినచో, త్వరలో ఆ వ్యక్తికి ఆరోగ్య భంగమో, క్లేశమో కలుగుచుండుట అనుభవసిద్ధము. అట్లు జన్మ చంద్రునిమీద రవి చంద్ర సంయోగము కలిగినప్పుడు, అది విషనాడీప్రదేశమే అయినచో, ప్రాణాపాయకరమని వశిష్ఠ మహర్షి చెప్పెను.

"యస్య జన్మర్క్షగశ్చంద్రో,
విషనాడ్యాం కుహూర్భవేత్,
అచిరేణ కిం తస్య,
స్వయమేవ మరిష్యతి." అని

ఇట్టి అమావాస్యలలో రాహువో, కేతువో రవిచంద్రులను చేరినచో, సూర్యగ్రహణ మగును.. దీనిని గ్రహత్రయకూట మనవచ్చును. అమావాస్యలలో ఇది అధికశక్తి కలది. జన్మనక్షత్రమందు ఇట్టి పర్వము వచ్చినచో, పీడాకరమగునని ప్రాచీనులు చెప్పిరి.

"గ్రహణం జన్మనక్షత్రే
జాయతే చంద్రసూర్యయోః
యశ్య, తస్య శుభంహానిః
వైరం, రోగో, పరాభవం."

గ్రహణముల ఆకర్షణశక్తి దుష్ఫలప్రదమయినచో అది మానవు లందరికి సమానముగా అన్వయించవలయు గదా ? అని కొందరి ఆక్షేపము. ఇది అవిచారరమణీయమగు ప్రశ్న. పిడుగు మహాభయంకరమైనదే. అయినా అది ఎచ్చట పడునో, అచటనే కదా దాని వేధాప్రభావము వ్యక్తము కాగలదు ? అట్లే, వ్యక్తి జాతకములలో దుస్థానములలో గ్రహణములు పడినపుడు మాత్రమే వారి జీవితములలో క్లేశము సంభవించగలదు. జాతకమందలి 1, 7, 8, 12 భావములలో పడినచో గ్రహణ ఫలము కష్టతర మని, 3, 6, 10, 11 భావములలోపడినచో శుభఫలము కలుగునని, ఇతర భావములలో మధ్యఫలమని, భృగుమహర్షి సూచించినాడు. అతని వాక్య మిది :—

"కష్టతరం జన్మభగం
గ్రహణం పుంసాం తథాష్ట సప్తాంత్యం
ఉపచయగం శుభదం స్యాత్
మధ్యఫలం ద్విత్రికోణబంధుగతం."

అది యట్లుండె.

రవికి సమీపమందే సంచరించువా రగుటచేత, బుధ, శుక్రులు ఒకొకప్పుడు రవిచంద్రసంయోగముతో చేరవచ్చును. అప్పుడు చతుర్గ్రహకూటమో పంచగ్రహకూటమో అగుచున్నది. ఇక కుజ గురు శనులు ఇట్లుగా పర్వములలో చేరుట అరుదు. ఎన్నియో సంవత్సరములకు కాని, వీరందరు ఒక రాశిలో చేరుట అసంభవము. గత 32 సంవత్సరములలో షడ్గ్రహ కూటములు మూడుమార్లు, సప్తగ్రహకూటములు రెండుమార్లు సంభవించినవని ఖగోళ శాస్త్రవేత్తలు చెప్పుచున్నారు. అన్నిగ్రహము లొక్కచోట చేరినచో, వాని నుండి బయలుదేరు ప్రచండ శక్తులు ఏకమై సమష్టిగా ఆకర్షించుట కారణముగా భూమండలమున గొప్ప సంచలనము జనించుట వింతకాదు. ఆ ఆకర్షణము ఏ భూభాగమునకు వ్యాపించునో, ఆ ప్రాంతములో అశాంతి, ఈతి బాధలు, భూకంపాదులుకలుగుట ప్రకృతిసిద్ధమగు సహజధర్మము. కనుకనే గ్రహకూటములకు ప్రాచీనులు దుష్ఫలములను సూచించినారు.

కడచిన ఫిబ్రవరి 5 వ తేదీనాడు వచ్చిన గ్రహకూట మెట్టిదో చూతము. 4 వ తేదీన అర్ధరాత్రి తరువాత 10 నిముషములకు (ఇది గ్రినిచ్ మధ్యమ కాలము) అనగా భారత కాలమానములో 5 వ తేదీ ఉదయము 5—40 A. M. (IST) గంటల సమయములో రవి చంద్ర సంయోగము కలిగినది. అప్పటి గ్రహస్థితి ఈ క్రింది చక్రము చూడ గలరు :—

| | | | |
|---|---|---|---|
| | | | |
| గు 18–37<br>కే 18–7<br>శు 17–47<br>బు 16–55(వ)<br>ర 15–43<br>చ 15–43<br>శ 3–48<br>కు 2–32 | (సాయనము)<br>—<br>గ్రహకూటపు పర్వము<br>—<br><br>(సాయనము)<br>—<br>గ్రహకూటపు పర్వము | | |
| | | | రా 18–7<br>వ 29–2 (వ |
| | | ఇ 13–28 | య 9–26(వ |

సాయన కుంభరాశిలో కుజ, శని, రవి, చంద్ర, బుధ, శుక్ర, కేతు, గురువులు చేరినారు. నిరయన సంప్రదాయముతో గమనించినచో, ఈ గ్రహము లన్నియు మకరములో ఉన్నట్లగును.

మన భారతదేశమునకు సంబంధించినది మకరరాశి అని పాశ్చాత్య శాస్త్రవేత్తల మతము. మనది కన్యారాశి అని భారత జ్యోతిర్వేత్తలు భావించుచున్నారు. ఈ రాసులు సాయనరాసులా, నిరాయనరాసులా అను విషయము అవ్యవస్థగా నున్నది. ఎంతో పరిశోధనము చేయవలసిన అంశ మిది. అపని చేయు శక్తిగల ప్రముఖులు పలువు రున్నారు. కాని, వారితో ఆ కార్యము చేయించు యోజకులు లేకున్నారు. పోనిండు.

ఈ గ్రహకూటమునుగురించి కొందరు ప్రముఖుల అభిప్రాయముల సంగ్రహ మిది :—

హిందూ దేశములో గొప్ప రాజకీయ సంక్షోభము, ఘోరమగు భూకంపము వలన ఉత్తరప్రదేశమందలి నగరములలో జననష్టము, చైనావారి దండయాత్ర, ఇంగ్లండు రాణిగారికి, భారత మహాప్రధానికి సహా క్లేశము సంభవించుట, అనునవి ఈ గ్రహకూటపు ఫలములని, శ. పి. నిక్సన్ అను ఆంగ్ల పండితుడు వ్రాసెను. దేశము నిర్మానుష్యమగునని సూచించు శాస్త్ర వాక్యములను కొందరు భారత పంచాంగ కర్తలు ఎత్తిచూపిరి. గొప్పగా ఉప్పెనలు పొంగి కొన్ని భూభాగములను ముంచివేయునని, అతివృష్టి, అనావృష్టి కారణముగా క్షోభ కలుగునని, ఏదో అంత నాడీ గ్రంథములో నున్నదట ! కాని, హిందూదేశము కర్మభూమి అగుటంబట్టి, ఈ గ్రహకూటమువలన దానికి గొప్ప దుష్ఫలము రాదని ఆ నాడిలో నున్నదట ! మన పుణ్యము !

సిరిల్ ఫ్యాగన్ అను ఆంగ్లేయుని దృష్టిలో, ఈ గ్రహకూటమువలన లండన్ నగరము చాలా అభివృద్ధికి రాగలదట ! సంగీత సాహిత్య కళల ప్రశస్తి హెచ్చునని, ప్రపంచ యుద్ధము వచ్చు భయము లేదని ఇతని జోస్యము. ఇండొనీషియా, వియత్నాం, ఫార్మోసాలకు ప్రబలముగా విషమ ఫలము తగులునవియు, మధ్యప్రాచ్యదేశములలో (ఈజిప్టు, జోర్డాన్, ఇస్రాయిల్, ఇరాన్) అశాంతి వాతావరణపు దుమారము రేగి అణ్వస్త్రములతో ప్రపంచ సంగ్రామము వచ్చునను భీతికి అవకాశ మున్నదనియు, భారత మహాప్రధానివంటి అంతర్జాతీయ రాజనీతి విశారదుల ప్రయత్నముల వలన అట్టివిపత్తు సంభవించదనియు, రఘువీర కృష్ణ దైవజ్ఞుని అభిప్రాయము (ఇందలి లౌకికము మెచ్చదగినది). అంతః కలహములు, విప్లవములు, కారణముగా క్లిష్ట పరిస్థితులు ఏర్పడి ఇండియా, పాకిస్థానములు కలిసిపోవచ్చునని, రష్యా దేశములో నిరంకుశ ప్రభుత్వమునకు మారుగా ఏదో రీతిలో, ప్రజాసత్తాక ప్రభుత్వము ఏర్పడునని, (కోరికలు మంచివే) అర్ధోలావగ్నాని

అని పాశ్చాత్య దైవజ్ఞుడు సూచించినాడు. సాంక్రామిక వ్యాధులవలన జన నష్టము, సమ్మెల తొందరలు, దేశద్రోహ శక్తుల విజృంభణము, శాంతి భద్రతా భంగములు, విలివంత వ్యాపారాల ద్వారా ప్రభుత్వమునకు ధననష్టము, చట్ట బేరముల వలన దివాలాలు, విద్యాసంస్థలకు కష్టములు మన దేశములో సంభవించునని S.I పాంచజివయ్యరుగారి సూచన. (గ్రహ కూటము లేకనే యివి యున్నవి)· ఇంగ్లండులో రాజ్యాంగమున గొప్ప మార్పులు కచ్చునని,, రష్యాతో వైరము పెరుగునని, అమెరికాలో తుఫానుల బాధ, రైళ్ల ప్రమాదములు, గనుల ప్రేలుళ్లు, జననష్టము సంభవించునని ఈ పండితుని అభిప్రాయము.

ఇంగ్లీషు శాస్త్రవేత్త డి. జే. టిక్కర్‌గారి దృష్టిలో ఈ గ్రహకూటము వలన గొప్ప దుష్టఫలము ఏమీ రాదట. రోము పండితు డొకడు ఈ గ్రహకూటమునకూ ఫలమేమీ లేదనెను. సోవియట్ యూనియన్, పోర్చుగల్కు, సిరియా, గ్రీసు, ఇథియోపియా, ఇరాన్ దేశములకు దెబ్బ తగులగలదని పారశీక శాస్త్రవేత్తలు కొందరు సూచించారు.

ఫిబ్రవరి 3, 4, 5 తేదీలలో నదీప్రవాహముల పొంగులు, భూకంపములు, ఉప్పెనలు, అగ్నిపర్వతముల ప్రేలుళ్లు మున్నగు ఈతిబాధల వలన క్షోభ పశ్చిమ అమెరికా, తూర్పు చైనా, మధ్య ప్రాచ్య దేశములు, పశ్చిమ ఆఫ్రికా, ఇండొనీషియా, ఇటలీ, మెక్సికో, బీహార్, అస్సాం, గ్రీసు ప్రాంతములలో సంభవించగలదని శ్రీ బెంగుళూరు వెంకటరామన్‌గారి అంచనా. భారత మహాప్రధాని తన ఆరోగ్యమును, తన క్షేమమును సహా, చాలా జాగరూకతతో గమనించవలసి యుండునని వీరి సలహా. (సదా విమాన ప్రయాణములు చేయుచుండు వ్యక్తికి ఈ సలహా యుక్తమే). అంతర్జాతీయ కారణములవలన ఎన్నికలు ముందుకు వాయిదా పడవచ్చునని ఇత డూహించెను. (ఇది జరుగలేదు). ఎన్నికలు జరిగినా, కాంగ్రెస్సు పక్షము బాగా దెబ్బతినగలదట. (జనసామాన్యాభిప్రాయ మిది). ప్రస్తుత రాజనీతి దేశాభివృద్ధికి భంగకారి యని ఇతని బోధ్యము. (కాంగ్రెస్సు ప్రతిపక్షుల వాద మిది). ఈ గ్రహకూటపు ఫలము అధమపక్షము రెండున్నర సంవత్సరములు దీర్ఘకాలము వ్యాప్తిలో నుండునని ఇతని అభిప్రాయము. (ఈ కాలావధి ఎంతో ఉపయోగకరము). కాని, ఈ మధ్యకాలములలో వచ్చు గ్రహణములు సంక్రాంతులు మున్నగువానికి ఫలము లేదనుట సాహసము.

ఈ గ్రహకూటపు ఫలము శుభకరమే యని చైనా, ఇండొనీషియా జ్యోతిష్కులు కొందరు ఉద్ఘాటించినారు.

ఈ విధముగా పలువురు పలువిధములగు భావములను ప్రకటించి యున్నారు. వీరిలో కొందరు సాయనవాదులు, మరికొందరు నిరయనవాదులు. వీరు వ్రాసిన వ్రాత లన్నియు ప్రకటించుటకు గొప్ప గ్రంథ మగును. స్థలీపులాకన్యాయముగా ఇంత చాలును. పండిత నెహ్రూ గారి దృష్టిలో బుద్ధిహీనులు, మూఢ విశ్వాసపరులును అగు భారతీయ కార్తాంతికులు మాత్రమే కాక, ఆధునిక విజ్ఞానధనులగు పాశ్చాత్య దేశములందలి శాస్త్రవేత్తలు సంయితము అనేకులు (దాదాపు 30 మందికి పైగా) ఈ గ్రహకూటపు ఫలమును గూర్చి భిన్నభిన్న దృక్పథములతో విమర్శించినారని సూచించుటకై మాత్రమే ప్రముఖుల అభిప్రాయములు కొన్ని యిచట సంగ్రహించుట! వీరి అభిప్రాయములకు ఐకమత్యము లేదనుట వాస్తవము. భిన్న దృక్పథములు, భిన్నాదర్శములు, భిన్న పక్షపాతములు, దానికి హేతువులు— అంతేకాని శాస్త్రము కాదు,.

సనాతన ధర్మముపైన అచంచల విశ్వాసము, దైవభక్తి కలవారు భారతభూమి యందలి సామాన్య ప్రజలు. గ్రహకూట దుష్ఫల నివారణమునకై యాగములు, పూజలు, శాంతులు వారు జరిపించుట దాని ఫలము. శాంతులవలన గ్రహవైషమ్యము తగ్గునని వారి విశ్వాసము. కాని హోమముల పేరుతో, అంత మంచినేయి అన్యాయముగా అగ్నిలో పోసి పాడుచేసినారే యని నెహ్రూ పండితుడు, పాపము, ఎంతో ఆరాటపడినాడు. సువాసనల పూలమాలికలను మణుగుల కొలది ప్రోగుచేసి, బండి చక్రమువలె పెద్దగా చుట్టుచుట్టి, ఎన్నడో చచ్చి మంటపాలైనవారి గోరీల (అథవా, సమాధుల) మీద నిరర్థకముగా పేర్చుటవలన, సుమంగలుల కేశపాశములనో, మహిళల కంఠసీమలనో, అలంకరించవలసినయున్న కోమల సురభిపుష్పజాలము ఎంత పాడై పోవుచున్నదో, పాపము, అతనికి తెలియదు! ఆ పూవుల సువాసనలకు చనిపోయినవారు ఆనందించునట్లు, హోమముల ద్వారా గ్రహాధి దేవతలు తృప్తిపొందకూడదా? ఎవరి పిచ్చి వారి కానందము!

అది యట్లుండనిత్తము.

గ్రహకూట మనగా, ఏదో ఒక రాశిలో, పరస్పరముగా ఎంతెంత దూరముగా నయినా సరే, గ్రహములు చేరుటే అని భావించుట, నా దృష్టిలో శాస్త్రసమ్మతము కాదు. యోగమనగా, ఒకటే భాగ (డిగ్రి) లో గ్రహములు కలియుటే అని ప్రాచీన శాస్త్రకారులు స్పష్టముగా చెప్పినారు.

"ఏకారాశావ స్థితైర్యోగః."

"యోగస్త్వేకాంశ సమాగమోక్తః."

అని మున్నుగా ప్రమాణము లున్నవి. అట్లుకాక, ఆ గ్రహములు పరస్పరముగా దూరమందున్నచో, అట్టి యోగములకు ఇచ్ఛామాత్రమే ఫలమని రల్ల మహాశయుని సూక్తి :—

"యోగా యథోక్తఫలదాః
కలార్థ భాగైక సంస్థితానాంచ
అప్రాప్తితానాం
ఇచ్ఛామాత్రం ఫలం భవతి"

ఇదే సందర్భమున ఆచార్య వరాహమిహిరుడు సంయితము యిట్టి నియమమునే విధించియున్నాడు. చూడుడు :—

"ఏకర్క్ష కలాంశగతో,
యథోక్త ఫలద కృత్ గ్రహవశేన,
అన్యర్క్షగత స్పృస్నే,
మనసా, భావనం కురుతే" (అ 2.)

ఖగోళములో సంచరించు తారాగ్రహములకు, భూమినుండ చూచినచో అట్టి అత్యంతిక సంయోగము చూపట్టినప్పుడు, దానికి "గ్రహయుద్ధ" మను సాంకేతిక నామమును శాస్త్రకారులు అనుగ్రహించిరి. ఇట్టి గ్రహయుద్ధములు వృష్టినాశనము, శస్త్రాగ్నిభయము, కలహములు మొదలగు క్లేశములను సూచించునట! ఆకాశరంగమునందు ఏకకాలమున అనేక గ్రహములకు అట్టి యుద్ధము కలిగెనేని, భూమిపైన ఘోర సంగ్రామములు, భూకంపములు, క్షామములు, మొదలగు ఈతి బాధలు చెలరేగుట వింతకాదు.

మరి, ఇప్పటి అష్టగ్రహకూట మెట్టిదో, పాఠక మహాశయులు గమనించగలరు. రవి, చంద్రులకు ఒక భాగ అంతరములో బుధుడు, రెండు భాగలు దాటి శుక్రుడు మూడుభాగలదూరములో గురువు, నిలిచి యున్నారు. మరియొకవైపున శని, కుజులు 12, 13 భాగల దూరములో నున్నారు. సాయనముగా చూచినా, నిరయనముగా గమనించినా, ఈ అంతరములలో ఏమియు వ్యత్యాసము రానేరదు. కనుక, దీనిని అష్టగ్రహకూటమనుట నిర్హేతుకము. ఈ గ్రహము లన్నియు ఒకటేరాశిలో నున్నవనుట సత్యమే. కాని, అంతమాత్రమున గ్రహకూటము కాదు. ఆలోచించిచూడుడు. శ్రీకాకుళములో ఆంధ్రు లున్నారు. చిత్తూరులో ఆంధ్రు లున్నారు. సరి కదా? వీరందరు ఆంధ్రప్రదేశవాసులే. అంతమాత్రపు ఉపపత్తితో ఆంధ్ర మహాజనసభ సమావేశమై కార్యక్రమము జరుపుచున్నట్లు భావించుట ఏమి న్యాయము? ప్రశంసలోనున్న గ్రహకూటము సంయితము ఇట్టిదే. స్థూలముగా చెప్పినచో, రవి, చంద్ర, బుధ, శుక్ర, గురువుల కూట మనవచ్చును.

పంచగ్రహకూటమయినా, సమ ఫలప్రదమే కదా అందురేమో? కాని సర్వకాలములో గ్రహములు యుద్ధమునకు దిగినపుడే, వాని కూటము ప్రపంచమునకు అహితమును సూచించగలదు. గ్రహయుద్ధము లేని కేవల సంయోగము—అందులో శుభగ్రహముల కూటము— దోషకారి కాజాలదు. అయినా రవితో చేరిన కారణమున ఈ చంద్ర, బుధ, శుక్ర, గురువులు తమ సహజ సౌమ్యత్వమును కోలుపోయి పాపులయినారని పూర్వ పక్షము రావచ్చును. కాని, రవి, చంద్ర, బుధ, శుక్ర, గురువుల సమాజమునకు ప్రాచీన శాస్త్రకర్తలు చెప్పిన ఫలము ఇట్లున్నది :—

"యంత్రజ్ఞో, బహువిత్తవాన్,
సువచనో, దండనాయకోవా, స్యాత్,
ఖ్యాత, శ్శుభకీర్తియుతో,
బుధేందు రవి జీవ శుక్రైశ్చ." (సారావళి)

"రాజమంత్రీ, భూరివిత్తో,
యంత్రజ్ఞో, దండనాయకః,
ఖ్యాతో జనే, యశస్వీచ,
జీవార్కేందుజ్ఞ భార్గవైః." (మానసాగరి)

ఈ ఫలములు వ్రాసిన శాస్త్రజ్ఞులకు చంద్ర, బుధ, శుక్ర గురువులకు రవి సంయోగ మున్నదని తెలియదనుకొనుట మహాసాహసము, ఈ ఫలములలో దుష్ఫలము లనదగినవి ఏవియు చూపట్టవు. యంత్రజ్ఞుడు, దండనాయకుడు, రాజమంత్రి, యశస్వి, ప్రఖ్యాతుడు, అను విశేషణములు గమనింపదగినవి. ఈ ఫలములు వ్యక్తిజాతక పరములయినా, ప్రపంచమునకు సయితము అన్వయించవచ్చును. ఏ భూభాగమున ఈ గ్రహకూటఫల మన్వయించునో, అచటి నాయకులు యంత్రసహాయ్యములతో, ఆర్థిక సౌకర్యములతో, సైనిక సన్నాహములతో, నేతృత్వ శక్తితో, కార్యశూరులై, విజయపతాకములెత్తి ఖ్యాతి నార్జించగలరని అర్థము చెప్పవచ్చును. ఈ గ్రహకూటము శుభఫలప్రదమే అని చైనా, ఇండొనీషియా దేశముల జ్యోతిష్కులు చెప్పుటకు కారణమిదే కాబోలు? పోతే, ఇప్పుడు అగ్రరాజ్యముల వారి రాజనీతిలో, సన్నాహములలో, వాదోపవాదములలో, స్పష్టముగా కనిపించునవి ఇట్టి భావములే కదా?

చెప్పవచ్చిన దేమన, ప్రశంసలో నున్న గ్రహకూటమువలన భయంకరమగు గొప్ప దుష్ఫలము ప్రపంచమునకు కలుగు ననుటకు కారణము కాదనుట.

ఇటీవల వెలువడిన వార్తలలో, జబ్బల్పూరు, భోపాల్ ప్రాంతములలో ఫిబ్రవరి 5, 6 తేదీలలో వాతావరణమునందు ఒక్కసారి హఠాత్తుగా మార్పు వచ్చెనట! 4 వ తేదీ మధ్యాహ్నమునుండి భూవలయము చుట్టు అయస్కాంత శక్తి చాలాఉధృతముగా ఉండినదట! ఇది ఈ గ్రహకూట ఫలమేల కారాదు? కాని, భారతీయ వాతావరణ శాఖోద్యోగులు ఈ మార్పులకు సామాన్య కారణములే చాలునని సెలవిచ్చిరట! అనగా, గ్రహకూటముతో దీనికి నిమిత్తము లేదనుట! మరి, వారి సామాన్యకారణములు ఎట్టివో? గ్రహ

కూట ఫలమని యొప్పుకొన్నచో, తమ శాస్త్రమునకు న్యూనత కల్గునని యో, రాజకీయ ప్రముఖవ్యక్తుల ఆగ్రహమునకు గురి అగుదు మని యో వారి భయమను టే ఆ సామాన్య కారణ మగునేమో ?

మరియొక వింతవిమడు. విమానములలో ప్రయాణము చేయుచు గ్రహములకు దగ్గరగా ఎంతో ఎత్తున అమదినమును ఎగురుచుండినా, గ్రహకూట ప్రభావము తనపైన ఏమియు కానరాలేదనియు, ఇది అంతా వట్టి మోసమనియు, శ్రీ నెహ్రూ పండితుని సుభాషితములు. గ్రహములలో అతి సమీపములో నుండు బుధుడే భూమికి 8 కోట్ల, 80 లక్షల కిలోమీటర్ల దూరములో నుండెనని ఖగోళశాస్త్ర పండితులు తెలుపుచున్నారు. ఇట్టి పరిస్థితులలో అతని విమానము 8 వేలు, అథవా 80 వేలు, అడుగుల ఎత్తునకు ఎగిరి యుండినా, "ఉట్టికీ, స్వర్గమునకూ" ఉన్నంత అంతర మగును కదా ? ఇంత దూరవ్యాప్తి గల ఊహలు అంతర్జాతీయ రాజనీతిలో పనికి వచ్చునేమో తెలియదు.

జ్యోతిశ్శాస్త్రమునకు సంబంధించిన పండితనెహ్రూగారి పరిహాసములు, ఎగతాళి మాటలు, ఎత్తిపొడుపులు, ఆక్రోశములు అన్నియు అతని రాజనీతి ప్రభావమయినచో, కొంత మట్టుకు సహేతుకములు కావచ్చును. అనేక సమయములలో జ్యోతిష్కులు కొందరు ప్రకృత సందర్భమునకు అనవసరములు, శాంతిభద్రతలకు భంగకరములు, అరాజక విద్రోహశక్తుల విజృంభణమున కనుకూలములు అగు అభిప్రాయములను జ్యోతిష్యము పేరుతో ప్రకటించుచున్నారు. ప్రజల శాంతిభద్రతలను సంరక్షించు బాధ్యత వహించి యున్న రాజకీయప్రముఖ వ్యక్తుల యోగక్షేమములకు, వారి కార్య కలాపములకు, ఇట్టి ప్రకటనలు ఎంతో హానికరములు కావచ్చునని సులభముగా మనము ఊహించగలము. పాకిస్థానముతో యుద్ధము రాగలదని, ప్రముఖ రాజకీయ వ్యక్తులపైన హత్యా ప్రయత్నములు జరుగునని, చైనా సేనలు దండెత్తి వచ్చునని, మొదలుగా జ్యోతిషఫలములని వ్రాసి వార్తాపత్రికలలో ప్రచారము చేయుట రాజనీతి దృష్టిలో క్షంతవ్యముకాని మహాపరాధ మగుట వింతకాదు. మేరువుపూసవంటి ఉదాహరణ మొకటి, మచ్చునకు చిత్తగింపుడు. 1962 వ సంవత్సరము ఫిబ్రవరినెలకు ముందే నెహ్రూ పండితునికి రాజకీయముగా అధఃపతనము పరిపూర్తి యగునని ఒకానొక జ్యోతిష్కుడు 26—7—1957 వ తేదీన నాటి "భారతజ్యోతి' పత్రికలో ప్రకటించెను. ఇట్టి పిచ్చి వ్రాతలు శాస్త్రమునకు అపకీర్తిని సంపాదించుటకు మాత్రమే పనికివచ్చుచున్నవి కదా ? ఎంత రాజనీతి దురంధరుడైనా, ఎంతటి సహన శక్తి కలవాడైనా, నెహ్రూ పండితుడు మానవమాత్రుడే ! అతనికి మాత్రము కోపతాపము లుండవా ? ఒకవేళ జాతకసూచనలు అట్టివే అని ఆ కార్తాంతికుడు పొరబాటున నమ్మి యుండినా, అవి ప్రకటించుట మాత్రము వివేకమనజాలము. వాస్తవ స్థితిలో రాజకీయ రంగమునందు మన మహా ప్రధాని ప్రభావము అత్యున్నతి స్థాయి నందుకొనుచున్న కాలమిది. లోకసభ మొత్తము అతని అరచేతిలోనున్నది. అతని బలమును తగ్గించు ఆశతో సర్వసన్నాహములు చేసిన ప్రతిపక్ష నాయకప్రముఖులు ఎన్నికలలో రూపనామక్రియలు లేకుండునట్లుగా అణగిపోయినారు. రాష్ట్రములలో అతని ఆదేశమునకు ఎదురులేదు. సత్యమును విచారించితిమేని దేశపరిపాలనలో అతని నిరంకుశాధికారము పరాకాష్ఠ నధిరోహించిన కాల మిదే అనవచ్చును. అతని జాతకమునకు దేవమానవశిలో చరితలగ్నము పరాక్రమస్థాన మందలి వరుణుని సంయోగమునకు వచ్చియున్న సమయ మిది. అధికారమును సంపాదించుకొని యున్నవారికి ఈ దశ అప్రతిద్వంద్వమగు పౌరుషమును అనుగ్రహించగలదు. ఆ ఫలమే చూపట్టు చుండుట !

ఇటీవల అనర్థకరములగు జాతకఫల ప్రకటనల సంఖ్య చాలా పెరిగిపోయినదని పాఠక మహాశయులు ఎరుగుదురు. మహాప్రధాని వీనిని గూర్చి అసహ్యపడుట యుక్తమే ! అయినా, అట్టి ఫలాదేశములు చేసినవారిని ప్రత్యేకముగా తగు రీతి మందలించుట కర్తవ్యము అగును. కాని, జ్యోతిశ్శాస్త్రమునే మోసమనుట, జ్యోతిష్కులను మోసగాండ్రనుట మాత్రము అసంగత మనక తీరదు.

ప్రకృత మనుసరింతము. రవిచంద్ర సంయోగముతో (అనగా పర్వముతో) సంబంధించనిదే గ్రహకూటము గొప్ప ఫలము నీయజాలదు. అందులో పర్వశక్తితో గ్రహయుద్ధజనిత విషమశక్తి చేరినపుడే, భూమండలమున గొప్ప క్షోభ జనించగలదు. ఆ పర్వము ఏ రాశిలో వచ్చునో, ఆ రాశి భూమండలమున ఏ దేశమునకు సంబంధించునో, అందుమాత్రమే ఫలము వ్యక్తము కావలసి యుండును. సాయనపద్ధతిలో, ఇంగ్లండు, జర్మనీలకు మేషమని, రష్యాకు కుంభమని, అమెరికా సంయుక్తరాష్ట్రములకు మిథునమని, ఇండియాకు మకరమని, మొదలుగా పాశ్చాత్యులు నిర్ణయించిరి. మన జ్యోతిష్కులు, నిరయనముగా, కన్యారాశి హిందూదేశమునకు సంబంధించినదని భావించుచున్నారు. ఇందు ఎవరి మతము సాధువో ? ఏ రాశి అయినా దానియందలి ముప్పది భాగల ప్రదేశ మంతయు ఆ దేశమునకు ఫలము నిచ్చునని విశ్వసించుట కష్టము. ఇది గొప్ప అవ్యవస్థ ! ఈ విషయమై ఎంతో పరిశోధన జరుగవలసి యున్నది.

కనుక, ప్రపంచ ఫలితములట్లుంచి, వ్యక్తి జీవితములకు గ్రహకూటము ఎట్లు అన్వయించునో, కొంత పరిశీలింతము. గ్రహకూటము ఎంత దుష్టమయినా, ఏ దేశమున కది వ్యాపించినా, అచటి జను లందరికిని అది విషమ ఫలము నిచ్చు ననుకొనుట అవిచారరమణీయము. పర్వము ఏ ప్రత్యేక బాగలో ఏర్పడునో, ఆ భాగకు, దాని సమసప్తమ బాగకు, గ్రహకూట ఫలము వ్యాపించుట సహేతుకము కాగలదు. ఆ విశిష్ట భాగలలో ఏ వ్యక్తి జాతకమందలి గ్రహములు ఉండునో, ఆ గ్రహ భావ ధర్మముల ననుసరించి, ప్రస్తుత దశానుగుణముగా, అతని జీవితములో, మంచిదో, చెడ్డదో, ఫలము సంభవించును. కాని ఆ వేధ నికరముగా లేనిచో ఫలము కలుగదని ప్రాచీనులు చాటి చెప్పిరి.

"వాలాగ్రేణాపి యథా
దృశ్యంతే వేధకస్య లక్ష్యగ్రాత్,
ఖలు సిద్ధ్యతే న సార్థః,
తద్వద్వే ధోపి విభ్రష్టః." (కల్పలత

లక్ష్యశుద్ధి వెంట్రుక మందము తప్పినా, వేధకు ఫలము లేదనుట ! వేధభాగ మాత్రమునకైనా నికరముగా నున్నచో, రెండు, అథవా నాల్గు, వారముల లోపలనే ఫలానుభవము కల్గును. నెలలు, సంవత్సరములు, కాచుకొని యుండునని యుండదు.

ఈ క్రింది ఉదాహరణములు కొన్ని చూడుడు:—

(1) శ్రీయుత వి. కే. కృష్ణమీనన్ గారికి ఎన్నికల పోటీలో బొంబాయి నగరమున మహోత్తర విజయము కలిగినది కదా ? అతని జాతకములో ఇపుడు చలిత రవి శుక్ర సంయోగము కర్కాటకరాశిలో 16½° లో అతని పుణ్యసహమమునకు (కన్యారాశిలో 16½°) నికరముగా గుప్తమిత్ర దృష్టిలో నున్నది. ఈ రెండును ప్రశంసలో నున్న పర్వస్థానము (కుంభము 16°) మీద తులాభారము తూగుచున్నవని పాఠక మహాశయులు గుర్తించగలరు. మీనన్‌గారికి ఉపచయ స్థానమందే ఇప్పటి గ్రహకూటము సమావేశ మగుట ! అఖండ విజయలక్ష్మి అతని వేలవరించదు ? మరియొక్క విశేషము ! పైన వివరించిన తులాభారమునకు ఆధార స్థానము సింహములో 16½° కదా ? మహాప్రధానిగారి జన్మలగ్న జన్మ చంద్రుల మధ్య బిందుస్థాన మదే యని మనము గమనించితిమేని, మీనన్‌గారి విజయమునకు ఆధార మెందున్నదో కరతలామలకముగా బోధపడగలదు.

(2) హిందూదేశమునకు రాజకీయ స్వాతంత్ర్యము లభించిన ముహూర్తపు జాతకమున రాజ్యస్థాన (దశమ) కేంద్రము కుంభరాశిలో 15½° లలో నుండినది. అప్పటి చతుర్థ భావము (సింహము)లో బుధ, యమ, శని, శుక్ర, రవులతో చిన్న గ్రహకూట మొకటి ఏర్పడి ప్రజాసత్తాక రాజ్యమునకు అంకురార్పణమును సూచించెను. ప్రశంసలో నున్న గ్రహకూటము అనాటి

గ్రహకూటమునకు సమసప్తక వేళలో నుండగా, ఇప్పటి సర్పము ఆనాటి రాజ్య స్థానములో (ఉపచయ స్థానము) పడినది. గ్రహకూటానంతరము జరిగిన ఎన్నికల ఫలముగా, రాజ్యాంగము పటిష్ఠమై నిరంకుశ ప్రభుత్వముగా అభివృద్ధికి వచ్చుటకు, భూస్వాముల యొక్కయు, కృషీవలుర యొక్కయు, అతృప్తి హెచ్చుటకును, బీజావాపము జరిగినదని సూచన.

(3) ఒకానొక వృశ్చికలగ్నపు బాలిక జాతకములో సింహమందలి బుధునికి (15° —8') సమసప్తకవేళ ఈ సర్పము వలన ఏర్పడినది. అప్పటినుండి ఆ బాలికకు జ్వరము, కోరింతదగ్గు.

(4) మరియొక వృశ్చిక లగ్నపు బాలికకు జన్మ చంద్రునికి (సింహములో (16° —8') సమసప్తకవేళ ఈ సర్పము వలన కలిగినది. అప్పటి నుండి ఆ బాలిక జ్వరబాధతో నలిగినది.

(5) లోకసభా సభ్యత్వమును సంపాదించిన ఒకానొక మానవీయునికి జన్మ లగ్నము సింహము. లగ్నాధిపతి రవి, కుంభములో 16°—43' లో నుండుట ! ప్రశంసలో నున్న సర్పము ఆ రవి స్థానమునకు ఉత్తేజనము నిచ్చినది. అభివృద్ధికరమగు మహదాశ్రయము లభించునని సూచన.

(6) శ్రీయుత నీలం సంజీవరెడ్డిగారి జాతకములో 'అభివృద్ధి' సహమము కుంభములో 16°—15' లో నున్నది. ప్రశంసలో నున్న గ్రహకూటపు సర్పమువలన ఆ సహమమునకు అపూర్వమయిన ఉత్తేజనము లభించెను. అంతఃకలహముల భారముచే అల్లాడుచున్న ఆంధ్రప్రదేశ రాజ్యాంగ నౌకను అపాయములపాలు కాకుండునట్లుగా గడుపుటకు తగిన కర్ణధారుడితడేయని భారతమహాప్రధాని నిర్ణయించినాడు. ఎవరికి రుచించినా, ఎవరికి రుచించకపోయినా, అతని ఆజ్ఞకు ప్రతిలేదు. అనాయాసముగా శ్రీ సంజీవరెడ్డి నాయకపట్టమును సంపాదించగలిగెను. ఆంధ్రప్రదేశ పరిపాలనము అభివృద్ధికరముగా కొనసాగగలదు.

(7) ఒకానొక ధమర్లగ్నపు రాజకీయోద్యోగినైన కొన్ని యేండ్ల క్రింద ఏదో నేరము ఆరోపించబడి, అతని ఉద్యోగము వూడిపోయినది. నెమ్మదిగా నాలుగయిదు సంవత్సరములు అభియోగము విచారణ జరిగి, తుదకు వ్యాయస్థానములో అతనికి కారాగార శిక్ష విధించబడెను. జీవనోపాయము కోలుపోయి నానాబాధలకు లోనై, అతడు అప్పీలు చేయగా, ఈ సర్పము వచ్చిన వారములోనే, అతడు నిర్దోషి యని ఉన్నత న్యాయస్థానములో తీర్మానమైనది. ఆ వ్యక్తి జాతకములో ఉపచయ స్థానములో నున్న రవి (కుంభములో 16°) పైన ఈ సర్పము వచ్చుటవలన కలిగిన ఫలమిది.

(8) ఒకానొక వృషభలగ్నపు తరుణికి దేవమాన దశలో ఇపుడు చలిత దశమకేంద్రము కుంభములో 16¼° లో నున్నది. అది ఆమెకు ఉపచయ స్థానము. ప్రశంసితసర్పము ఆ కేంద్రమునకు ప్రోద్బలము నిచ్చినది. గ్రహకూట మందలి బుధుడు ఆమెకు పంచమాధిపతి. శుక్రుడు లగ్నాధిపతి. గురువు లాభాధిపతి. వారము తిరుగక పూర్వమే ఆత్రముగా ఆమెకు వివాహము జరిగెను. విధిలేని పరిస్థితులు ఏర్పడుటవలన, పెద్దలు ఆకస్మికముగా ఆమెకు రహస్యవివాహము జరిపినారు.

గమనించినచో సమృద్ధిగా ఉదాహరణములు లభించగలవు. కాని, మనకు ఇవి చాలు.

సారాంశ మేమన, గ్రహకూట సర్పముతో జాతకమందలి విలువగల స్థానములకు స్పర్శరానిదే, శుభమయినా, అశుభ మయినా, దాని ఫలముండదు. కాక, సర్పములవాడే ఫలమునకు ఎదురు చూడరాదు. సర్పానంతరము అయినా వ్యక్తుల ద్వైవిక జాతక కేంద్రములు ఫలప్రద స్థానములను చేరుకున్నవాడే వారికి ఫలప్రాప్తి. సాధారణముగా ఇది మరల సర్పము వచ్చులోపల జరుగగలదు. వ్యాసము పెరిగిపోవునని, పై ఉదాహరణములకు జాతకములను కాని, ద్వైవిక కేంద్రచలనసమన్వయమును కాని, ఇచట చూపనైతిని. క్షంతవ్యుడను.

ఒక్కమాట ! ఈ గ్రహకూటపు ఫలము తనకు ఏమీ తగులలేదని నెహ్రూ పండితుడు సెలవిచ్చినాడు. వాస్తవమే. అతని జాతక గ్రహములకు ఈ సర్పస్పర్శ రాలేదు. మరి, అతనికి ఫల మెట్లు వచ్చును ? అతని జన్మ చంద్రుడు సింహములో 10° లో నుండుట. గ్రహకూటసర్పము కుంభములో 16° లో. ఏమి సంబంధము ? పృష్టతాడనదంతభంగన్యాయమగును గదా ? కాని, తనకు ఫలములేదను కారణమున ఇతరు లెవరికీ ఫలము ఉండదని అతడు భావించు నట్లు, అది శాస్త్రీయ దృక్పథము కాదనిమనవి.

"సర్వాయ యోగా ద్విహితం విధాత్రా,
కాలేన సర్వం లభతే మనుష్యః."
—(మహాభారతము.)



# ధనుర్దాసు

శ్రీ బొడ్డు బాపిరాజు

ఇల్లాలి వాలుగనుల సోయగం వసివాడకుండా గొడుగుపట్టి శ్రీరంగని తిర్నాళ్ళలో తిరిగే మల్లవీరుడు ధనుర్దాసుని ఏకాగ్రత ఆచార్య రామానుజుల ఆసక్తినీ అనుగ్రహాన్నీ ఆర్జించుకున్నది. 'భాగ్యశ్రీ' హేమాంగి కన్నులకన్నా చక్కని వీ జగత్తులో లేవన్న ఆ సౌందర్య పిపాసికి శ్రీరంగనాథుని దివ్యలోచన సందర్శనం ప్రసాదిస్తారు ఆచార్యులు. ఆ దివ్యదర్శనానంద పరవశుడు ధనుర్దాసు—

ఊరిపాలిగ సౌందర్య<br>
స్నేహ సుధా సాగరములు; నిర్మల జగ<br>
న్మోహన కాంతి స్ఫారము<br>
లోహో! శ్రీరంగ విభుని లోచన శోభల్!

ఎంత నెయ్యపుమాపు లెల్ల సౌందర్యముల్<br>
కొలువున్న పసిడి చెంగలువ పూవు;<br>
లివి జన్మజన్మల తృష్ణలార్చెడు సుధల్<br>
తొలకించు కారుణ్య జలధరములు;<br>
కోటి పున్నమి రేలు గుండె చల్లదనాలు<br>
నిండించుకొన్న వెన్నెల మడుంగు;<br>
లీ కొండ గుహను వెల్గించి మోహపు గాఢ<br>
తిమిరముల్ పోకార్చు దీపశిఖలు;

మానినీ మత్త దృగ్వ్యాలమాన మాన<br>
సాంబు నిధి తరంగాంత రంగంబు నందు<br>
వెలువడిన క్రొత్త మీనులు పేయి పేయి<br>
జన్మ లలరించు నీ రంగశాయి కనులు

ఎన్నాళ్ళన్ వృథచేసుకొంటి నిటు తండ్రీ! అభ్ర గంగా భ్రమ<br>
చ్ఛన్న స్వాంతుండ—క్షుద్ర పల్వల జల స్నానాను రక్తుండ; నా<br>
కన్నన్ లేడు దరిద్రు డెవ్వడు, భవత్కల్యాణ నేత్ర ద్వయిన్<br>
కన్నారం గనజాల నీ యవిరళానందా శ్రుపాతమ్ములన్!

స్వామీ! జన్మసహస్ర సంచిత తపస్సంప్రాప్త పుణ్యోదయం<br>
బీ మాధుర్యము నెట్లు దాచుకొనుటో యీ చిన్ని డెందాన తం<br>
డ్రీ! మన్నింపు మెరుంగజాలను, కృపాస్నిగ్ధంబు నేకాద్భుత<br>
శ్రీ మద్దృగ్విభవంబు పాడుకొను టెట్లీ రుద్ధకంఠమ్మునన్?

నవనీలోత్పల దళముల
నవరించు సుధాంశు కిరణ సౌందర్యమ్ముల్
నవి ప్రభుని బడద కన్నుల
రవణించు దరస్మితాంకు రమ్ములు దలతున్ !

అంగనచూడ్కు లుత్పలములంచు, నవాంబుజ ఖంజరీట సా
రంగములంచు, మన్మథ తురంగములంచు, విలాస వీచికా
రింగణలోల బాలశఫరీ భ్రమరీకులమంచు మెచ్చు ను
ద్యంగ వచోధనుం డితడపత్రప పల్కనులేడు, సామి శ్రీ
రంగని దివ్యలోచన హిరణ్మయ దీధితి నోలగించుచున్.

మరు మరీచిక కొరకు ముమ్మరపు తృష్ణ
పరచు నజ్ఞాన హరిణశాబకము బట్టి
చేర్చితివి చల్లనగు నర స్తీర భూమి
ఆరని పిపాసలెల్ల చల్లార్చుకొనగ.

గడపితివో ప్రియానమున కౌముదిలో సొగసున్-వయస్సు, మా
కుడుగనిపంట, లవ్వలపు టూయెల పాయని జంటలంచు; ఇ
ప్పుడు విలపింతు నిన్ను గని, పోయినకాలము కూడిరాని ది
య్యెడ నని, పంకజాక్షి! క్షమియింపుము నా యవివేకమాంద్యమున్ !

దేవ! త్వదీయ దృగ్గగ దధీనుడు వీడొకడంచు నేమి? బృం
దావన గోపికాజనమనః ప్రణయ ప్రకటైక భోగలీ
లా వివశంబు లిట్టి నయనాంబుజ రేఖలలో ద్రవించియున్
బోవని రాతిగుండియలునున్ గలవొక్కొ? సిరంగనాయకా !

నత్యం బాత్మ వెలింగె నేడు; తరుణీ సౌందర్య సంసేవనా
జాత్యంధత్వము లారె; తీరిన వభీష్టస్వప్న సంచారముల్
నిత్యానందరసప్రవర్ధనము లీ నీరేజ పత్రాక్షి సాం
గత్యంబుల్ గలిగెన్, మనోమధుపకాంక్షా సుప్రభాతంబులై !

కావేరీ లహరీ పరీమళము లంగ్రశ్రేణికిన్ నిత్యమున్
పావిత్ర్యమ్ము ఘటింప, మీ భవనభాస్వద్గోపురం బాత్మలో
సౌవర్ణచ్ఛవినింప, పూర్వకృతమత్ సర్వాఘముల్ ప్రత్యుషః
శ్రీ వారమ్ము లడంపగా ప్రభుకటాక్ష శ్రీల జీవింపనో !

కడలిరాయనిపట్టి కరము పట్టిన నాడు
ఎలనవ్వులను ప్రేమజిలుకు కనులు
పగవాని తమ్ముని తెగువ నేలిన నాడు
నిండువాత్సల్య మందించు కనులు

కొలువులో మగువ కొండలము మాన్పిన నాడు
అభయ ముద్రాంకము లయిన కనులు
ములుకునాటిన యంచ యళుకు తీర్చిననాడు
జీవకారుణ్యముల్ చిందు కనులు

తేబవల్లను పూలుపూయించు కనులు
తెప్పలార్పక శ్రితుల పాలించుకనులు
ప్రథిత సౌందర్యధునులు, కృపా ప్రకాశ
ఖనులు, మత్తపోవనులు, రంగయ్య కనులు

రమణీ చంచల లోచనాంచల చలద్రాగ స్మితం బాతప
శ్రమకున్ వాడకయుండనెత్తె మును ఛత్రం బే ధనుర్దాసు, వా
డమరించున్ ప్రభు సుందరాక్షి జలజాగ్రక్షోణి ముక్తాత ప
త్రము కాగా తన జీవితం బిపుడు శ్రీరంగా! జగన్మంగళా!

ప్రవహించెన్ కొరగాని యీ చవిటిపట్టున్ దివ్యగంగాఝరీ
నివహమ్ముల్, చిటిముత్తెపున్సరులు పండింపంగ; కానిమ్ము, నీ
వవలోకించెదు గాక! దాసునికృషి ప్రావీణ్య, మప్పంట పై
భవమెల్లన్ వెలకట్టి నాగౌమును దెల్పన్ సార్థవాహుల్ ప్రభూ!

నవశృంగారతరంగరాసరతిధన్యమ్మన్య, మిచ్ఛావిహా
రవిధా మత్తగజేంద్ర మియ్యది; యదల్పన్ జాలు భవ్యాంకుశం
బవు నీ దివ్య కటాక్ష వీక్షణము; రంగా! త్వత్పదాలాన బం
ధవమున్ పట్టవు లెస్స చేసుకొనగా నర్థింతు నీదాసుడన్

శ్రీరామానుజ కరుణా
పారసమాలబ్ధ రంగశాయిస్మితద్వ
త్సారస సౌరభములు వి
శ్వారద మత్ప్రాణ పథములం దయిదింటన్!



# సంస్కృత రాఘవ పాండవీయములు

శ్రీ ఈయుణ్ణి వెంకట వీరరాఘవాచార్యులు

"రమ్యా రామాయణీ సైషా భారతీ సైవ భారతీ,
అర్ధనారీశ్వరమయీ మూర్తి రేకత్ర శోభతామ్."
(కవిరాజసూరి: రా. పా. I–42)

మానవ ప్రతిభ యూహింపగల కవితా చమత్కారములన్నియు సంస్కృత కావ్యోద్యానమున లభించును. ఇవి వృత్తద్వయమును అర్ధనారీశ్వర శరీరన్యాయమున క్షీరనీర న్యాయమున, ఏకనాళావలంబియగు ఫలద్వయమువలె, కావ్యమునఆమూలాగ్రవ్యాప్తముగా పెనవేసి రచింపబడిన కావ్యము ద్వ్యర్థికావ్యము, ద్విసంధానకావ్యము అని వ్యవహరింపబడును. ద్వ్యర్థికావ్యము పఠించి,ఆనందించుటకు పర్యాప్తమగు సాహిత్యసంస్కార మవసరము. వ్యుత్పన్నుడగువట్టి యధికారి రామాయణ కథాజిజ్ఞాసతో రాఘవ పాండవీయము వంటి యుత్తమ ద్వ్యర్థి కావ్యమును పఠించినచో మనఃక్లేశము నంతగా కల్గింపక, ఆ కావ్య మంతయు తదనుగుణముగా నన్వయించును. భారతకథ నెరుగు సంకల్పముతో పఠించిన నా కావ్య మంతయు నట్లే విశదమగును. ఇది ద్విసంధాన కవుల పరమ లక్ష్యము. కాని ఈ కావ్యము లెంతటి వ్యుత్పన్నుల కైనను వ్యాఖ్యాన సాహాయ్యము లేనిచో మనఃక్లేశ జనకములే యని చెప్పవచ్చును. ఉత్పన్నములు, అజ్ఞాతములు, కించిద్విస్మృతములు అగు రాఘవపాండవీయములను గూర్చి యిట కొంత వ్రాయబడును.

## 1

ద్వి సంధానము—(ఆచార్యదండి—క్రీ. 6 వ శతాబ్ది):

భోజుడు శృంగార ప్రకాశమున (9వ ప్రకాశము)
'దండినో ధనంజయస్య వా ద్విసంధానస్య
"ఉదార మహిమా రామః ప్రజానాం హర్షవర్ధనః
ధర్మప్రభవ ఇత్యాసీత్ ఖ్యాతో భరత పూర్వజః" '1

అనుచు దండిదియో, ధనంజయునిదియో 'ద్విసంధానము'ను పేర్కొనుట యేకాక, యందలి శ్లోకమొకటి యుదాహరించెను. ధనంజయుని 'ద్విసంధానము'న నీ పద్యము కానరాదు. కావున నిది లుప్త మవుదగు దండి 'ద్వి సంధానము'లోని దనియు నీ కృతియందలి యితి వృత్తము రాఘవ పాండవీయ కథయే యనియు నూహింప జనును. కావ్యాదర్శము(దశకుమార చరితము) అవంతి సుందరీ కథయు దండి యితర కృతులు.

## 2

రాఘవ పాండవీయము (కవిరాజ సూరి—11 వ శతాబ్ది)

కవిరాజసూరి, తత్కృతులు, కాలములను గూర్చి నేను విపులముగ రచించిన ఆంగ్లాంధ్రవ్యాసములు రెండు పుష్కరములకు, పూర్వమునవే ప్రకటింపబడినవి.2 కుతూహలముగల పాఠకు లా వ్యాసములను చూచెదరు గాక. 'కామదేవాంక' మగు కవిరాజసూరి 'రాఘవ పాండవీయము'న 13 సర్గములును, మొత్తము 672 శ్లోకములును కలవు. కవి రాజును, ద్విసంధాన కావ్యమును నిర్మించిన జైన ధనంజయుడు నించు మించుగా సమకాలికులు కావచ్చును. సంస్కృతమున ద్వ్యర్థి కావ్యమును రచించిన వారిలో కవిరాజు రెండవవాడు కావొచ్చును. ఈతని మఱియొక కృతి 'పారిజాతహరణ'మను పది సర్గల మహా కావ్యము.3 ఇది యింకను ముద్రితము కాలేదు. కవిరాజు 'రాఘవ పాండవీయము'పై వ్యాఖ్యలు రచించినవారు.

1. చారిత్రవర్ధనుడు
2. పద్మనంది.
3. పుష్పదంతుడు.
4. ప్రేమచంద్ర తర్కవాగీశ భట్టాచార్యుని 'కపాట' విపాటిక (ముద్రితము)4
5. రామభద్రుడు.
6. లక్ష్మణపండితుని 'సార చంద్రిక' (ముద్రిత)5
7. విశ్వనాథుడు.
8. శశధరుని 'ప్రకాశము' (ముద్రితము)6

---

1. Sri M. Ramakrishna Kavi's Introduction (p. 6) to Sri Avvari Subrahmanya sastri's Telugu Trans. of Dandin's Kavyadarsa. (1929).

2. (a) Dvyarthi & Tryarthi Kavyas in Sanskrit Literature – in the K. B. Pathak Cammemoration Volume – p p. 367—81–Poona. (1934).

(b) 'కవి రాజసూరి కాలనిర్ణయము'(ఆంధ్ర పత్రిక—'ఉగాది సంచిక' విభవ సంవత్సరము 1928)

(c) 'కవి రాజసూరి కాలనిర్ణయము'—ఆంధ్ర సాహిత్యపరిషత్పత్రిక—ప్రభవ, మార్గశిర—ఫాల్గున మాసములు; సంపుటః 16. సంచిక: 5—6. డిసెంబరు 1927—మార్చి 1928)—పుటలు: 247—55.

(d) 'సంస్కృత రాఘవపాండవీయ విమర్శనము'—)ఆం. సా.ప. పత్రిక సంపుటః 17. సంచిక 2. పుటలు 65—72. సంచిక 3. పుటలు 127—137)—1927 ఏప్రిల్—జులై.

(e) 'సంస్కృత సారస్వత చరిత్రము—ద్వ్యర్థి త్ర్యర్థి కావ్యములు'—(ఆం. సా. ప. పత్రిక. సంపుట: 23. సంచిక : 5. పుటలు : 193—200. భావ, మార్గశిర పుష్యములు—డిసెంబరు 1934—జాన్యువరి—1935)

(f) ఆం. సా. ప. ప. సంపు 24, సంచిక2. పుట 49—64. (జూన్—జూలై 1935)

3. A Triennial Catalogue of Mss.—Vol. IV.

4. (1) Bibliotheca Indicae d-pp.4+435+2. Sanskrit Press, Calcutta. -(1854A.D.)

(2) Reprint of the above ed. by Bhavadeva Chatterji (B. I. ed)-Calcutta (1892).

(3) In Telugu tye.-Demy. pp. 2+1+1—286. Sriniketana Press, Madras (1892)

5. Grantharatna-mala ed., with the Sarachandrika-com. by Laksmana Pandita-Bombay. (1889)

6. Kavyamala No. 62. with the com. Prakasa by Sasadhara N. S. Press, Bombay-(1897)

9. (మరాళ శ్రేణి కృత 'ప్రకాశ' వ్యాఖ్య)

పై వ్యాఖ్యలనుబట్టి కవిరాజ కృతి వాఙ్మయ ప్రపంచమున నెంతటి ఖ్యాతి నందెనో యూహింపఁదగును. కవిరాజ కావ్యమునుండి మచ్చునకు—

1. 'నిశ్శ్రేణ్యో బ్రహ్మలోకస్య, వాగ్దేవ్యాః కర్ణకుణ్డలే
ధర్మద్రుమ మహామూలే వాల్మీకి వ్యాసయోః కృతీ'
2. 'పురాణ రామాయణ—భారతాది—
క్షీరాణి సంయోజిత భక్తి వత్సైః
పురాతనైర్యా దుదుహే కవీంద్రైః
సా భారతీ కామదుఘా మమాస్తు' (రా. పాండవీయ I, II; 12)

## 3

ద్విసంధానము7 (—రాఘవ పాండవీయము) జైన ధనంజయుడు:

ఈ ధనంజయుడు 'నామమాల'యను ధనంజయ నిఘంటువును కూర్చుటచే నితనిని నైఘంటుక ధనంజయు డనవచ్చును. ఈతని తల్లి శ్రీదేవి; తండ్రి వాసుదేవుడు.9 ధనంజయుని 'ద్విసంధానమును' 'శృంగార ప్రకాశము'న భోజుడు (క్రీ. 1005—62) పేర్కొనుటచే నితనికంటె ధనంజయుడించుకపూర్వుడో సమకాలికుడో కావచ్చును.

ముంజుని సభను (క్రీ. 975—95) అలంకరించిన ధనంజయుడు బ్రాహ్మణుడు, విష్ణుని కుమారుడు, దశరూపక నిర్మాత; నైఘంటుక ధనంజయునికంటె భిన్నుడగు నితనిని దశ రూపక ధనంజయుడనవచ్చును.

డాక్టర్ కాశీనాథ బాపూ పాఠక పండితుడు 10—

కొన్ని గ్రంథస్థ ప్రమాణములనుబట్టి, కొన్ని కన్నడ శాసనములను బట్టియు జైనధనంజయుడు క్రీ. 1123—40 నడుమ ద్విసంధానమును నిర్మించి యుండుననియు, ఈతనికి శ్రుతకీర్తి యను ఉపనామము కలదనియు వ్రాసియుండెను. డాక్టర్ వింటర్నిట్జ్11 డాక్టర్ ఎ. బి. కీత్12 యం. డఫ్. పండితులు13 తమ సంస్కృత వాఙ్మయ చరిత్రలయందును, భారతీయ గ్రంథ గ్రంథకారుల కాలవిచారమునందును పాఠకపండితుని మతమునే ప్రమాణీకరించుకొనిరి.

కాని, జైన ధనంజయుడు, శ్రుతకీర్తియు, భిన్న వ్యక్తులనియు, ధనంజయుడు క్రీ. 960—1000 నడుమ ద్విసంధానమును రచించియుండెననియు, శ్రుతకీర్తి త్రైవిద్యుడు గత ప్రత్యాగత విధానమున రాఘవ పాండవీయమను నొక మహా కావ్యమును నిర్మించియుండెననియు, ప్రమాణ పురస్సరముగ సిద్ధాంతీకరించి, వింటర్నిట్జ్, పాఠకపండితుల యభిప్రాయమును

7. కావ్యమాల—49. వ్యాఖ్యతో (1895)—బొంబాయి.
8. వావిళ్ళవారి ప్రతి—తెనుగు లిపి, తెనుగుటీకతో (మద్రాసు)
9. ద్విసంధానము VIII. 146. (పై కావ్యమాలా ప్రచురణము)
10. Dr. K. B. Pathak : ' Journal of the Bombay Branch of the Royal Asiatic Society-Vol.XXI.pp. 1 ff.
11. Dr. M. Winternitz : History of Indian Literature - Vol. III. p. 75 (In German)
12. Dr. A. B. Keith : 'History of Sanskrit Literature · p. 137 (1928 A. D.)
13. M. Duff : Chronology of India.

ఖండించుచు, డాక్టర్ వి. వెంకట సుబ్బయ్యగారు 35 సంవత్సరముల క్రిందట నొక వ్యాసమును ప్రకటించియున్నారు.[14] నేనును, వెంకటసుబ్బయ్యగారును భిన్న మార్గముల ననుసరించి, వడసిన జైన ధనంజయుని కాల మేకీభవించు చున్నది.

ధనంజయుని ద్విసంధానమున 18 సర్గములు, 1105 శ్లోకములును కలవు. కవిరాజు "రాఘవ పాండవీయము' కామదేవ పదాంకమగుచో, ధనంజయుని 'ద్విసంధానము' ధనంజయ పదాంకము. ఇట్టి కావ్యచిహ్నములను గూర్చియు, ఈ ద్విసంధానమును గూర్చియు నా రచించిన 'సంస్కృత ద్వ్యర్థి—త్ర్యర్థి కావ్యములు'—అను వ్యాసమును పరిశీలింపవచ్చును.[14]

సంస్కృత కవులు కొందఱు తమ కావ్యముల కాద్యంతములందుకాని, అంతమున కాని స్వనామమునో, అందలి యాద్యక్షరములనో, స్వపోషక నామమునో, తమ కిష్టములగు శ్రీ,లక్ష్మ్యాది శబ్దములనో, అనురాగ—ఆనంద—కర్ణికాకర—కామదేవ—జిన—ధనంజయ—రత్న—రామ—లక్ష్మీ—విజయ—శ్రీ—సంపదానంద – సారస్వతశ్రీ — హరిచరణ సరోజ — ఇత్యాది శబ్దములనో కావ్యలాంఛనములనుగా వాడి యుండిరి. అందు స్వనామాంకత కుదాహరణములు

1. జినరత్నసూరి—నిర్వాణ లీలావతి జినాంకము.
2. ధనంజయుని ద్విసంధానము.
   ధనంజయాంకము.
3. రత్నాకరుని—హరి విజయము.
   రత్నాంకము.
4. రాజశేఖరుని—హరివిలాసము
   (ఉత్పన్నము) రాజశేఖరాంకము.
5. విజయ (విజయాంక) కృతి
   విజయాంకము.

ద్విసంధానముపై వ్యాఖ్యలు:

1. కవిదేవర—వ్యాఖ్య[15]. రామభట్టు తనయు డగు నీతడు అరలు శ్రేష్ఠి ప్రోత్సాహమున పై వ్యాఖ్యను నిర్మించెను (అముద్రితము)

2. నేమి చంద్రుని—'పదకౌముది'. ఈతడు దేవనంది, వినయ చంద్రుల శిష్యుడు. పద కౌముది—9000 గ్రంథాగ్ర పరిమితిగల విపుల వ్యాఖ్య. దీనిని సంగ్రహించి, బదరీ నాథపండితుడు 'కావ్యమాల' యం దీకావ్యము ప్రకటింప జేసెను.

3. పుష్పసేన శిష్యుని వ్యాఖ్య. [16] (అముద్రితము)

ఇతి వృత్త భేదము గల యీ క్రింది ద్విసంధాన కావ్యములను కూడ నిట పేర్కొనదగును.

(1) ద్విసంధానము (లేక నేమినాథ చరిత్ర) మారాచార్య కవి.[17]

ధారాధినాథు డగు భోజుని సంస్థానమున ద్రోణాచార్యుని శిష్యుడగు మారాచార్యుడు పై కావ్యమును క్రీ. శ. 1034 (సంవత్—1090) వ వత్సరమున పూర్తి చేసెను. నేమి—ఋషభ దేవుల వృత్తాంతము శ్లేషరీతిన్యాయమున నీ కావ్యమున సంధానింపబడెను. రాఘవ పాండవీయ కర్తయగు కవిరాజసూరి, ద్విసంధాన నిర్మాతయగు నైఘంటుక—ధనంజయుడును, పై మారాచార్యుడు నించుమించుగా సమకాలికులని చెప్పవచ్చును.

(2) ద్విసంధానము (నేమి ద్విసంధానము లేక నాభేయనేమి కావ్యము)[18]

కర్త హేమచంద్రుడు. ఈతని గురువు అజిత దేవుడు. పరమగురువు బృహద్గచ్ఛకు చెందిన మునిచంద్రుడు. పై కావ్యమునందునకూడ ఇందలి యితివృత్తము కూడ నేమి—ఋషభదేవుల కథయే. ఈ కావ్యమును కవిచక్రవర్తి యగు శ్రీపాలకవిరాజు పరిష్కరించెను.

3

రాజశేఖర మహాకవి ద్విసంధాన—ధనంజయుని ప్రశంసించుచు కవించిన యీ క్రింది శ్లోకము జల్హణుడు కూర్చిన సూక్తిముక్తావళియందును, హరికవి సంధానించిన సుభాషితహారావళియందును ఉల్లేఖింపబడి యున్నది:

(1) "ద్విసన్ధానే నిపుణతాం సతాం చక్రే ధనంజయః
యయా జాతం ఫలం తస్య న తాం చక్రే ధనంజయః"

ధనంజయుని ప్రతిభా పాండిత్యములను, కవిత్వ మహత్త్వములను సూచించు నీ క్రింది మూడు పద్యములును ఆ కవిశేఖరుని నిఘంటువున(=నామమాలలో) ఉప సంహార పద్యములుగా కన్పట్టుచున్నవి.

2. 'ప్రమాణ—మకలంకస్య, పూజ్య పాదస్య లక్షణమ్
ద్వి సంధాన కవేః కావ్యం రత్నత్రయ—మపశ్చిమమ్
3. జాతే జగతి వాల్మీకే శబ్దః కవి రితి స్మృతః
కవీ ఇతి తతో వ్యాసే కవయశ్చేతి దండిని
4. కవయః కవయ శ్చేతి బహుత్వం దూర మాగతమ్
వివిచ్యత్తం చిరా దేత త్కలౌ జాతే ధనంజయే"

—(II—48—50)

పై శ్లోకములు మూడును ధనంజయుడే స్వయముగా రచించెనో లేక ఏ కవియో రచించినవానిని, నామమాలా పరిష్కర్తలా నిఘంటువున చేర్చిరో విమర్శింపవలసి యున్నది.

4

రాఘవపాండవీయము (నేమి చంద్రకృతము)[19]

ఈ కావ్యము బరోడా నగరమున కాంతి విజయ భాండారమున వ్రాత ప్రతిగా నున్నది. నేమి చంద్రుడు పై ద్విసంధాన కావ్యమునే కాక, జైన ధనంజయకవి రచించిన ద్విసంధాన మనబడు రాఘవపాండవీయమునకు 'పదకౌముది' యను టీకను రచించెను.

౫

రాఘవ పాండవీయము (కర్త—అరలశ్రేష్ఠి)[20]

జైన కవియగు అరలశ్రేష్ఠి రచించిన పై కావ్య మముద్రితము. దీని 'గ్రంథాగ్రము' 12,000 శ్లోకములు (అనగా నీ కావ్యమునం గల అక్షరముల సంఖ్య 38,400). కన్నడ లిపిలో వ్రాయబడిన యీ కావ్యము 'ఆరా' పట్టణమున (Arrah) 'జైన సిద్ధాంత భవన'మను దిగంబర భాండారమున కంఠగత ప్రాణముతో నున్నది. ధనంజయుని ద్విసంధానముపై కవిదేవర పండితుడు, అరలుశ్రేష్ఠి ప్రోత్సాహమున నొక వ్యాఖ్య నిర్మించెను. ఈ అరలు శ్రేష్ఠియు రాఘవ పాండవీయకర్తయగు అరలశ్రేష్ఠియు ఒక్క వ్యక్తి యనియే తోచుచున్నది.

రాఘవ పాండవీయము (కవిపేరు తెలియదు)[21]

అముద్రితమగు దీని వ్రాతప్రతులు రెండు కలవు. కన్నడ లిపిలోనున్న ప్రతి 'జైన సిద్ధాంత భవన' మను దిగంబరభాండారమున కలదు. నాగరీ

14. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక—సంపుటం—24. సంచిక: 2 (పుటలు 50—54) జూన్—జూలై, 1935.

14. J. B. B. R. A. S. (New Series) Vol. III. P. P. 134-47. (1927.)

15-17. Prof. H. D. Velankar: Jina - Ratnakosa Page 185. (1944 A. D.) Poona.

18. Jina - Ratnakosa. p. 185.

19-20. జిన రత్నకోశము.

21. Jina - ratna - ko'sa

లిపిలో నున్న ప్రతి శ్రీహంసవిజయిజీమహారాజ గ్రంథ సంచయములోనిది. ప్రకృతము బరోడాలోని 'కాంతి విజయ భాండారము'న కలదు.

పై కావ్యమునకు 3 వ్యాఖ్యలు కలవు.

1. మరాలశ్రేణి కూర్చిన 'ప్రకాశ' వ్యాఖ్య 'జైనసిద్ధాంత భవనము'న నున్నది.
2. పద్మనంది రచించిన వ్యాఖ్య 7,500 శ్లోకముల పరిమితి కలది. రైస్ (Rice) పండితుని—లిఖిత సంస్కృత గ్రంథ సూచికలో నిది పేర్కొనబడెను.
3. పుష్పదంతుని వ్యాఖ్య. దీని గ్రంథాగ్రము 3000. ఇదియు రైస్ పండితుని సూచికలో నుల్లేఖింపబడియున్నది.

కవిరాజసూరి రచించిన రాఘవ పాండవీయమునకు పద్మనంది, పుష్పదంతుడును రచించిన వ్యాఖ్యలు రెండు కలవు. ఈ యిరువురును పైని పేర్కొనబడిన యిరువురును అభిన్నులే కావొవు. అట్లే యగుచో కవి నామరహితమగు పై 'రాఘవ పాండవీయము' కవిరాజకృతమే కావచ్చును. అట్టియెడ కవిరాజసూరి రచించిన 'రాఘవ పాండవీయము'పై మరల శ్రేణి కూర్చిన 'ప్రకాశ' వ్యాఖ్య (శశధరుని 'ప్రకాశ' వ్యాఖ్యకాక) ఒకటి కలదని తెలియుచున్నది. ఈ విషయము పరిశీలింపవలసి యున్నది.

## 7

రాఘవ పాండవీయము: (ఇట్టికేల—లేక—ఇష్టకల కృష్ణ పండిత కృతము)

కృష్ణ పండితుని రాఘవ పాండవీయ మింతవఱకు నసూర్యంపశ్యవలె అడయార్ గ్రంథాలయమున తాళీదళసంపుటములలో అజ్ఞాతవాసము చేయుచున్నది. సంస్కృత సారస్వత గవేషణపరులలో నే కొలదిమందికో తప్ప దీని సంగతియే యెవరికిని తెలిసినట్లులు లేదు. రామాయణ, భారత కథలు రెండును పెనవేయబడిన యీ ద్విసంధాన కావ్యమున 8 సర్గలు కలవు. కవి ఆనంద తీర్థులనబడు మధ్వాచార్యులవారి శిష్యుడని గద్యమునుబట్టి తెలియుచున్నది. మధ్వాచార్యులవారి కాలము క్రీ. శ. 1199—1278—79 (మతాంతరమునుబట్టి క్రీ. శ. 1237—1318) కనుక మన కవి క్రీ. 13 వ శతాబ్దమునకు చెందియుండునన వచ్చును. ఈయన జనకుడు అనంత పండితుడు; జనని లక్ష్మీదేవి. గృహనామము ఇటికేల, ఇష్టకల లేక ఇటికల. కవి 'శ్రీ హయగ్రీవాను గ్రహ సుగ్రహ సమగ్ర కవితా వైభవుడు.' ఇంటిపేరునుబట్టి యీత డాంధ్రుడనే దగును. మతమునుబట్టి వైష్ణవుడు. ఈ కావ్యమునకు 'కల్పవల్లి' యను వ్యాఖ్య కలదు. దీనిని రచించిన పండితుడు డేగరమూడి రామసూరి. ఈయన నందద (వ?) రాన్వాయతిలకుడని, శ్రీవత్స గోత్రజుడనియు వ్యాఖ్యారంభ శ్లోకములనుబట్టి తెలియుచున్నది. కవివలెనే వ్యాఖ్యాతయు (ఇంటిపేరునుబట్టి) ఆంధ్రుడనియే చెప్పవచ్చును. వ్యాఖ్యాత తండ్రి సింగయ్య. పితామహుడు మాధవార్యుడు. ప్రపితామహుడు. భైరవుడు.

పై యంశము లీ క్రింది గద్యాదులనుబట్టి విశదమగును.

౧. "ఇతి శ్రీ హయగ్రీవానుగ్రహ సుగ్రహ సమగ్ర కవితా వైభవస్య
ఇటికిల కుల మండితయో ర్లక్ష్మీదేవ్యనన్త పండితయో
ర్తనూభవస్య శ్రీమదానన్ద తీర్థ గురు కరుణాలబ్ధ
వైష్ణవ కలావితానస్య, కృష్ణ పండితాభిధానస్య
కృతౌ సకలసుకవి సమ్భావ్యే రాఘవపాండవీయే
మహాకావ్యే అష్టమ స్సర్గః"22

౨. వ్యాఖ్యాతృ గద్యము:
"ఇతి డేగరమూడి—రామసూరి విరచితాయాం రాఘవపాండవీయ
వ్యాఖ్యాయాం కల్పవల్లీ సమాఖ్యాయా మష్టమః సర్గః'23

3. వ్యాఖ్యా భూమికా పద్యములు: 24

(1) 'అధిగత శరచాపో రామభూపాల మేఘో
మహితమహితమాజావిద్యుతాలిజ్గితాజ్గః
వివవతు హృదయే మే వర్ధయన్నఙ్కురాణి
ప్రవిమల కరుణామ్భోధారయా చిన్మయాని.

(2) రామాయణ భారత......శేషః కథితః పు రేతి వార్తా
ఇట్టికేల వంశతిలకః ప్ర(స?)త్కావ్యం కృష్ణపణ్డితః కృతవాన్.

(3) శ్రీమన్నన్దరాన్వయతిలకః శ్రీవత్స గోత్రోద్భవః
ఖ్యాతో డేగరమూడి భైరవసుతః శ్రీ మాధవార్యః ప్రభుః
వన్మాన్యం మనువే సుతం గుణనిధిం శి(పి?) ఙ్గాభిధానం చ యం
సోఽహం రామకవిః కరోమి.....తాం తస్యాః కృతే ర్వ్యాక్రియామ్

(4) పూర్వం పద్యే కథా వృత్తా యా సా సా ద్వయ ముచ్యతే
వేదానాం సర్వశో వృత్తా శ్రోతౄణాం సుఖబుద్ధయే.

(5) అత్ర పూర్వకథా భాగాద్ వక్తవ్యం యది విద్యతే
ద్వితీయస్మిన్ వివేకోఽస్మి తేషి మన్వాప్త పూర్వవత్

4. మచ్చునకు కావ్యమునందలి పద్యములు కొన్ని చూపఁబడును.

(6) 'కల్యాణం మే విధత్తాం కమలజజనకః
సృష్టి సంస్థాన పాతుః (హేతుః?)
కాన్త గౌర్యాఙ్గ కాన్త్యద్భుతతరకమలా
వాసతాసుప్రసిద్ధః
విశ్వేషామ్నాయవాహః శుచిపతద్వృషభా
రోహ..........త్త యా సః
సత్యా వాణ్యా శ్రియా వా పతిరభినువతాం
సర్వ సంపత్ ప్రదాయాః

(7) ఉన్మనోరథహారిద్విరదోగ్రైః
స్వర్బలైః (పరబలైః) న సమగ్రైః
యుద్ధ మాకలయతే స్మ విశఙ్కం
పార్థివో ధృతివిముక్తకలఙ్కః

(8) ఈ క్రిందిది ఉపసంహార శ్లోకముః
"శ్రీ ధాన్యై రాప్తమాశ్పుత్సకలభువి తదా
వర్ష దబ్దో యథేష్టం
గానస్యాద్యై ర్ర్వజస్పై క్షితిరరవితతి
ర్నామ శేషి బభూవ,
నాస్త్రం రోగావమృత్యూ శ్రుతిమలభత నో
జారచోర ప్రవృత్తిః
వృత్తి ర్వర్ణాశ్రమాణాం వ్యజయత చరణై
రాన్త ధర్మ శ్చతుర్భిః'

ఆంధ్రులు రచించిన రాఘవ పాండవీయములు మూడింటిలో రెండాంధ్ర ప్రబంధములు, ఒకటి సంస్కృత కావ్యము. ఆంధ్ర రాఘవ పాండవీయ

---

22-23. A Triennial Catalogue of Manuscripts—Vol. V. Part I, Sanskit A–R. No. 4282. b—Pages 6312–13 (1932.) Govt. O. Mss. Library, Madras.

24. Descriptive Catalogue of Sanskrit Mss. in the Adyar Library Vol. V.No. 292; pp101–02-(1951) Madras.

ములు రెంటింటిలో వేములవాడ భీమకవి రచించినది ఉత్పన్నమైనది. రెండవదియగు పింగళి సూరన్నది మాత్రమే సజీవమై పఠన పాఠముల నున్నది. పై రెంటికి మధ్య కాలమున రచింపబడిన కృష్ణ పండితుని కృతి మాత్రము కొనయూపిరితో చెన్నపురి యందలి రెండు లిఖిత గ్రంథాలయములయందు తాళితళ సంపుటములయందు గాఢ నిద్రయందున్నది. దీనిని మేలుకొల్పి, వాఙ్మయ ప్రపంచమున విహరించునట్లు చేయు బాధ్యత ఆంధ్ర సాహిత్య సంస్థలది.

రాఘవ పాండవీయము : శ్రుతకీర్తి త్రైవిద్యకవి [25].

పై కావ్యము గత ప్రత్యాగత విధానమున రచింపబడెను. ఇట్టి వానిని ప్రతిలోమకావ్యము లనియు, విలోమ కావ్యము లనియు వ్యవహరింతురు. సామాన్య ద్వి సంధాన (లేక ద్వ్యర్థి) కావ్యములందు పదము లనులోమపద్ధతినే పఠింపబడి, శ్లేషాది మహిమచే ఇతివృత్తద్వయమున కన్వయింపబడును. విలోమ కావ్యములందు. పద్యము లను లోమ క్రమమున నొక కథకును, ప్రతి లోమ క్రమమున రెండవ కథకు నన్వయించును.

ఈ ప్రతిలోమ కావ్య ముత్పన్న కల్పము. సంస్కృత వాఙ్మయమున గల గతప్రత్యాగత కావ్యముల నామముల నిట పేర్కొన దగును.

(1) సం హరిశ్చంద్రీయము : కవి పేరు తెలియదు (అముద్రితము)
(2) యాదవ రాఘవీయము : వేంకటాధ్వరి (విశ్వ గుణాదర్శకర్త)
(3) రసిక రంజనము [26] : రామచంద్రకవి (క్రీ 1524)
(4) రాఘవ పాండవీయము : [27] శ్రుతకీర్తి.
(5) రాఘవ యాదవీయము : వింజమూరి [28] సోమేశ్వర కవి.
(6) రామకృష్ణ విలోమ కావ్యము[29] : దైవజ్ఞ సూర్యసూరి.

రాఘవపాండవీయము—(వాసుదేవకవి)

వాసుదేవకవి కేరళ దేశవాసి. పై కావ్యము (వ్రాతప్రతి) గంజాం మండలమున లభించెనట. వి. రాజరాజవర్మ మళయాళ భాషయందు రచించిన 'కేరళీయ సంస్కృత చరిత్ర' [30] మను గ్రంథమున దీనిని గూర్చి కొన్ని యంశముల వివరించెను. కాలాంతరమున నీ యంశములు విశదీకరింపబడును.

సంస్కృతమున గల తక్కిన ద్విసంధాన, త్రిసంధాన, చతుస్సంధాన— పంచసంధాన, సప్తసంధాన—శత సంధాన కావ్యములనుగూర్చి వేరొక వ్యాసమున కాలాంతరమున వివరింపబడును.

'కతి కవయః, కతి కృతయః కతి లుప్తాః
కతి చరన్తి, కతి శిథిలాః' (నీలకంఠ దీక్షితులు)

25. E. V. V. Raghavacharya's "Dvyarthi and Tryarthi Kavyas in Sanskrit—(Pathak Commemoration Volume—1934) p. 380—81
26. Kavyamala— Part IV.No.5.—R. Schmidt's ed. with German Trans. (1896)
27. J. B. B. R. A. S. (N. Series) Vol. III pp. 134—47. (Dr. A. V. Subbiah's Paper)
28. Printed in Telugu type, at Kakinada (adout 1938.)
29. Jnanasagara Press, Bommay, — 1905 A.D. (Samvat 1962).
30. Keraliya-Samskrta Sahitya-Caritram. - Vol. I. p. 552 ff. Also-Vide: Dr. K. K. Raja's 'The Contribution of Kerala to Sanskrit Literature-published by the Sanskrit Department of the University of Madras. (1958).





# అభిసరణము

శ్రీ వేదాంతం గోపాలకృష్ణమాచార్యులు

గందము కప్పురంబుమెయికందువ లందునలంది గోపికల్
చిందములన్ హసించు గళసీమల ముత్తెపుఁ బేర్లు దాల్చి యిం
దిందిర నీలదేహుని బ్రదీప్త తమాల వనాంత వీథు లం
దందు రతి ప్రసంగములయందున జ్యోత్స్నికలందుఁ గూడరే!

పసిఁడిసలాక లొక్కపరి ప్రాయపుమేలిమి సిగ్గునిగ్గులం
దోసపరి కర్బురాంబరు సముజ్జ్వల నీలశరీరుఁ గాంచి త్రో
క్కస పడినారు కామునకు గీమునకుం దొలగంగలట్టి వా
రసలుకు వడ్డి పాటు వలపాగని వారు త్రపన్ హసింపఁగన్

మేలిపసిండి తీవలు నిమీలిత నేత్ర సరోజయుగ్మ ల
వ్వేళఁ జరింప శైవలిని వేడుక వారి పదాబ్జనూపు రో
ద్వేల విరావభంగులను దేలిచి పైచె సమీరపోత క
ల్లోలిత భంగ నృత్యముల లోలవిలోచన లెల్ల మెచ్చఁగన్

శారదవేళా విషణ్ణ కేకికుల పిం
ఛచ్ఛవుల్ నెఱులలో సాగిపోవ
తత్కాల సముపాత్త ధావళ్య కుల్యా జ
లమ్ముల నొరయు హాసంబుతోడ

తత్కాల మాంసల తరుణరథాంగాహ్వ
యములఁ ద్రోసెడి యురోజములతోడ
తత్కాల సమధికోత్సాహ భరిత వరా
టీ నృత్తభంగుల టెక్కుతోడ

దశ దిశార్పిత మంద గంధవహ చలిత
క్రమ వక్షోజ స్రస్తాంశుకమ్ముతోడ
కటకజితమారచాపటంకార యగుచు
అభిసరించెను రాధ బర్హావతంసు

అశలు కన్నుకొనల ముదశ్రు ప్రపాతముగాఁగ రాధ, దూ
ర్వాశయనంబుపై నిదురరాని నిశల్ కలిగించినట్టి ర

అందానికి, ఆనందానికి
అగ్రస్థానం

# 1962

# ఫిలిప్స్
# నోవోసోనిక్
# రేడియోలు

నాదములో ఒక
నూతన ప్రపంచము



ఫిలిప్స్ ఫిలిటినా B2CA99U
ఎసి/డిసి: ధర రు. 187/-



ఫిలిప్స్ ఇంటర్నేషనల్
B4CA97A-6 వాల్వులు-4 బ్యాండ్లు
ధర రు. 551/-



ఫిలిప్స్ ఫిలిటా B3CA07U
3 బ్యాండులు, 5 వాల్వ్సు
ధర రు. 308/-



ఫిలిప్స్ మేజరు డబుల్ స్పీకర్సు
B5CA86A - 7 వాల్వ్సు
ధర రు. 645/-






ఫిలిప్స్ మయినరు B4CA07A
4 బ్యాండులు-6 వాల్వ్సు
ధర రు. 405/-

9 ట్రాన్‌సిస్టరు రేడియో B4CA07T
రు. 510/-



ఫిలిప్స్ మాస్ట్రో B6CA86A
8 వాల్వ్సు - డబుల్ స్పీకర్సు
ధర రు. 957/-



ఫిలిప్స్ ట్రాన్‌సిస్టరు రేడియో
ఫిలిప్స్ B5CA06T
ధర రు 690/-

పన్నులు అదనము

గుంటూరు జిల్లాకు అథరైజుడు ఫిలిప్స్ రేడియో డీలరు:

టెలిగ్రాం: వికోస్

## విజయ & కంపెని,

ఫోన్: 356

మెయిన్ రోడ్డు - గుంటూరు.

శ్యామల తళ్కుబెళ్కులు త్వదర్థమురా యని యల్లుగుట్టి భో
గశ్రమందీర్చి స్విన్నమృదుగండ యుగంబును దుడ్చిపయ్యెదన్

ఓ హరినీలరత్నకళలోజ్జ్వలకైశిక! నాప్రభూ! జగ
న్మోహనమూర్తి నీవయిన ముద్దులు మామక గండభాగ భా
క్ఛ్రీ హవణిల్లు పత్రముల క్రేవల స్ఫారిత దంతరోచులై
కోహటిలన్ వలెన్ గములకోరకమయ్యె నదేమి మోమురా

ప్రేయస! నీ ముఖమ్ముపయిపెట్టిన కస్తురిబొట్టు శీర్ణమై
సోయగముల్ వెలార్చు నినుజూచిన పూచను ప్రోడువాలు నా
యీ యెద నా విలాసముల యిక్కకు నీకు శ్రమంబు తీరఁగాఁ
దోయద నీలదేహ! పరితుష్ట వ్రజాంగన! వీతుపయ్యెదన్

మారపృషత్కభిన్న సుకుమారశరీరలు గోపికాంగనా
వారము స్రోదినీతటవిభాస్వర శాద్వలశయ్యమీఁద నా
చేరువ నిన్ను గాంచెదరు చిక్కణగల్ల విలోచనాంచల
స్ఫారిత హాసరోచులయి శ్యామలమూర్తి యొకింత పల్కరా.

పలుకరాదో? ముక్తామణులొలుకఁబోవు
యాదవక్షీరజలధి శుభ్రాంశుబింబ!
చిలుకరాదో! గానామృతశీకరముల
వల్లవవధూ లతిల్లరా వారిదంబ!



# అరవయ్యేళ్ల ఆంధ్రసాహిత్యం

శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు

## 1

ఇరవయ్యో శతాబ్దప్రారంభంనుండీ నవీనాంధ్ర సాహిత్యం సువిశాలమై, ఎన్నో పాయలు పోయినది. ఈనాడే యర్థంలో విమర్శయందు సాహిత్యమనే పదం వాడబడుతూవుందో అదే యర్థంలోనే ఈ వ్యాసంలో ఆపదం వాడబడినది. సారస్వత వాఙ్మయ పదాలకున్న అర్థంకంటె భిన్నమయిన అర్థంలో సాహిత్యపదం ఇట సంభావింపబడినది. ఆ అర్థాన్ని ఆధారంగా తీసికొని నవీనాంధ్ర సాహిత్యాన్ని, బహుముఖాలుగా విస్తరించినదాన్ని, సింహావలోకనం చేయాలనే ప్రయత్నం—సమగ్రంగా కాకపోయినా, ఇందు గోచరిస్తుంది. అరవై యేండ్లు పండిన సాహిత్యాన్ని ఒక్క యూవులో, పరిమిత పరిధిలో క్షోదక్షమంగా పరిశీలించి, తక్కెడలో పెట్టి తూచి మంచి సెబ్బరలను ఎంచటం దుశ్శకమన్న విషయం సహృదయులకు వేరుగా చెప్పవలసిన పనిలేదు. వారికి తెలియనిదీగాదు. కేవలం నూతన భావోద్యమాలు ప్రతిబింబించిన సాహిత్యమే ఈ వ్యాసంలో పరామర్శింపబడుతుంది. ప్రాచీనాంధ్ర సాహిత్యంకంటె ఏ యే భావోద్యమాల మూలంగా నవీనాంధ్ర సాహిత్యం భిన్న స్వరూపంలో కనబడుతూ వున్నదో ఆ భావాల పోకడలు చూపబడునని సారాంశం. అందుచే ఈ అరవై యేండ్లలో సుగృహీత నామధేయులయిన గ్రంథకర్తలందరనూ గూర్చి ప్రత్యేకంగా చెప్పటం కుదరదు. అవసరమూలేదు. ఆ యా గ్రంథ కర్తలనుగూర్చి సమర్థులైన వారెందరో ప్రత్యేకంగా విమర్శలు వ్రాశారు. అవసరమయిన దానికంటె ఎక్కువగా భూషించారు! దూషించారు కూడ! నూతన భావ పథంలో విహరించినవారు మాత్రమే ఈ వ్యాసంలో కన్పిస్తారు. కాని ఉదాహృతులయినవారు కొలదిమందే యుంటారు.

అయితే ప్రాచీనాంధ్ర సాహిత్యంకంటె నవీనాంధ్రసాహిత్యం భిన్న రూపంలో కన్పడుతూందా యను ప్రశ్న కల్గవచ్చు. భిన్నరూపంలోవుందనే సమాధానం. సాహిత్య ప్రపంచంలో ఒకానొక నవయుగం ప్రారంభమయినదనే చెప్పాలి. శ్రీ విద్వాన్ విశ్వం ఈ యుగాన్ని గూర్చి ఏమన్నారో చూడండి.

"ఏ జాతి చరిత్రలోనూ, ఏటేటా వసంతం విరియదు. ఒక్కొక్క తరంలో అఖండప్రతిభానమున్మేషం జాతి జాతినీ సమగ్రంగా సర్వతోముఖంగా సముత్తేజితంచేసి నవయుగానికి నాందీవాచకమవుతుంది.

అలాంటి తరుణాన్నే మనం స్వర్ణయుగమనీ, నవయుగమనీ భావిస్తాము. ఎందులోనో ఒకందులో ఏ కొంతో మార్పు వచ్చినప్పుడెల్లా నవశకోదయం అనకోము. ఏ ఒక కొత్త ఉద్యమమో ఆరంభమైనప్పుడెల్లా దానిని నవయుగ ప్రాదుర్భావమని తలంపము.

ఆ మార్పేదో అంతదాకా నడుస్తున్న జీవన గతిని కొత్తదారుల్లోనికి గబాలున కొంపోయినప్పుడూ, ఆ మార్పేదో ఒక రంగానికి పరిమితంగాక సర్వతోముఖమయినప్పుడూ, ఆ పరిణతి ప్రభావం ఆనాటికే పర్యాప్తంగాక, కొన్నేండ్లదాకా జాతి ప్రగతి పథ ప్రయాణానికి పాథేయమివ్వగలిగినప్పుడూ అదే నవయుగంగా నవశకంగా సంభావిస్తాము.

తెనుగుజాతి మునుగడనే మాన్యం చేసిన మహాత్మకాలం గనుకనే ఇరవయ్యో శతాబ్ది ఆరంభ కాలంలో అటూ, ఇటూ ఉన్న సమయాన్ని మనమెంతో అపురూపంగా అంగీకరిస్తున్నాము." (తెలుగు వాఙ్మయము, పుటలు 196—197.)

ఇతి వృత్త స్వీకారంలో, దాన్ని తీర్చి దిద్దటంలో గ్రంథ పరిమాణంలో గ్రంథకర్తల లక్ష్యంలో ప్రక్రియాభేదంలో నవీనాంధ్రసాహిత్యం ఎన్నో గడుసరి తీరులను ప్రదర్శించినది. స్వాతంత్ర్య శుభావతార సమయాన్ని హద్దుగా భావించి, ఆ తీరు తెన్నుల వన్నెలూ, చిన్నెలూ చూపటం జరుగుతుంది. సౌలభ్యాన్నిబట్టే స్వాతంత్ర్యసిద్ధి వేళనుహద్దుగా భావించటం జరిగినదే కాని అన్యథాకాదు. ఏ వాణి తెలుగు మాగాణం నాలుగు చెరగులా ప్రతిధ్వనించి ఉర్రూతలూగించినదో ఆ వాణీ ప్రతిధ్వనుల ప్రతిధ్వనులు ఇంకా వినిపిస్తూనే వున్నవి. దానినింకా కొందరు ఆలాపించుతూనే వున్నారు. ప్రాచీన సాహితీ సంప్రదాయాలు పల్లవించటం కూడా జరిగినది. జరుగుతూనే వున్నది.

ఇరవయ్యో శతాబ్ద ప్రారంభంనుండీ నూతన రీతుల్లో నడిచిన సాహిత్యానికి దోహదం పందొమ్మిదవ శతాబ్దం చివరి రెండు దశాబ్దాల్లో జరిగినదనే చెప్పాలి. ఆ శతాబ్దం చివరి నాళ్లలో వున్నవారే ఇరవయ్యో శతాబ్దంలో గూడా జీవించారు. వారు మూలల్లో కుంటు కుంటూ, నడిచిపోయే ఆంధ్ర సరస్వతిని చేరదీసి, లాలించి, పాలించి నలుగురిలో తలయెత్తుకొని తిరిగేటట్లు చేశారు. కొందరు శక కర్తలు. సర్వసతీదేవికి నూతనాలంకారాల్ని సమకూర్చారు వారు. రాబోయే రెండు మూడు తరాల గ్రంథకర్తలమీదా అశేషప్రాభవాన్ని చూపారు వారు. ఆ మహా మనీషులు కందుకూరి వీరేశలింగముపంతులు, గురజాడ అప్పారావు, తిరుపతి వేంకటేశ్వర కవులు, గిడుగు వేంకట రామమూర్తి, కాశీనాథుని నాగేశ్వరరావు, కొమర్రాజు లక్ష్మణరావు, కట్టమంచి రామలింగారెడ్డిగారలు. నూతన సాహిత్య ప్రక్రియలు సృష్టించి, కావ్య తత్త్వచ్ఛందోరీతుల్లో కొత్తదనాన్ని చూపి, కవితా కన్యను పూరూరా త్రిప్పి, "అద్యత నాంధ్రకవి ప్రపంచ నిర్మాత"లై, భాషా పరిణామ ప్రాగల్భ్యాన్నిచాటి, ఆంధ్రదేశంలో సాంస్కృతిక పునరుజ్జీవనానికి బీజావాపం చేయుటమేగాక, అండగా నిలబడి, తెలుగు వారికి విజ్ఞాన పీయూష ధారాపాత్ర లందించి, సాహిత్యానుభవ శక్తి సంపాదనమునకు బాటలు చూపిన విరాణ్మూర్తులు వీరు. తెలుగువారు ఇలువేల్పులుగా ఆరాధింపదగినవారు వీరు. ఈ శేముషీసంపన్నుల అపార వాగ్వైభవాన్ని పుణికి పుచ్చుకొని స్వసంస్కార పరిపాకంతో తరువాత వచ్చినవారు నవీనాంధ్ర సాహితీ మందిరంలో నూతనప్రతిష్ఠలు గావించారు.

## 2

"సామాన్యముగా జాతీయ జీవనము తద్వాఙ్మయమున ప్రతిబింబితంబై యుండునను విషయము నితర భాషా వాఙ్మయ పరిచితిలేని కేవల హైందవ విజ్ఞాన దురంధరులగు మనవారు కొందరు పాటింపరేమోకాని, పాశ్చాత్య వాఙ్మయములను నచ్చటి విమర్శకాభిప్రాయములను పరిశీలించిన వారి కెల్లరకును నది వాఙ్మయ విషయమున నొక ముఖ్య తత్త్వముగ గోచరింపక మానదు. ఏ తత్తత్త్వావగాహనకు దేశ చరిత్ర జ్ఞానము కూడ కొంచె మవసరమని తోచెడిని. దేశమున నొక్కొక్క కాలమున గల్గు వివిధ రూపంబులగు విప్లవములు జాతీయ జీవనము నెట్లు మార్పు చుండునో యట్లే భాషా వాఙ్మయములను గూడ మార్ప గలిగి యుండును. ఒకవేళ మన వారీ విషయము నంతగా గమనింపకున్నను, దేశచరిత్ర రచనా విషయమున నాదినుండియు దూష్ణీంభావము వహించి, యెల్లప్పుడును బరమార్థ చింతా తత్పరులయిన వీరి యెడల నిది యంత యాశ్చర్య జనకము కా"దని కోరాడ రామకృష్ణయ్యగారన్నారు. నవీనాంధ్ర సాహిత్యాన్ని అర్థం జేసుకోవాలంటే ఈ శతాబ్ద ప్రారంభంనుండీ తెలుగువాట తెలివికి పాదులు కట్టిన ఆ యా ఉద్యమాల్ని పరిశీలించాలి.

ఆంధ్రదేశంలో క్రమ్మిన కారుచీకట్లను పంచబంగాళంచేసి, సాంస్కృతిక పునరుజ్జీవన రోచిస్సులను ప్రసరింప జేసిన భావభానూదయాన్ని గూర్చి తెలుసుకోవాలి.

రాజకీయంగా తెల్లదొరల ఏల్బడి నిలువరం సంపాదించుకొన్న తర్వాత భారతదేశంలో సాంస్కృతికంగా వికాసరేఖలు మోసులెత్తటం మొదలైనది. దేశంలో విశ్వవిద్యాలయాలు స్థాపించబడ్డాయి. వర్ణవివక్షణత లేకుండా ఎల్లరూ చదువుకోవటానికి అవకాశం ఏర్పడినది. రాజభాషయైన ఆంగ్లభాష జీవనోపాధికైతేనేమి, నాగరికతా లక్షణంగా నైతేనేమి, భారతీయులకు అవశ్య పఠనీయమయినది. ఆంగ్లసాహితీ వాఙ్మయ సౌధంలో వున్న నూతనోదారభావకోశాల్ని దేశీయులు వేయి చేతులా దోచుకున్నారు. ఏదో ఒక నూతన ప్రపంచ దేవత విరాడ్రూపంతో భారతీయుల కనులముందు సాక్షాత్కరించినది. ఆ సాక్షాత్కార వేళలో విశ్వమోహనంగా సాహితీ గానం చేయుటానికి పల్లవి అందుకొన్నారు భారతీయులు. ఇదే సమయంలో జాతి భేద ద్వేష దూషిత బుద్ధులుగాని పాశ్చాత్య పండితుల నిర్విరామకృషిమూలంగా ప్రాపకం కోల్పోయిన సంస్కృతసాహిత్యం సర్వాంగీణ వైభవ పదాన్ని సంతరించుకొన్నది. సంస్కృత సాహితీ పఠనం పాలీ ప్రాకృత సాహితీపఠనం శరవేగంతో కొనసాగినవి. కె. వి. గోపాలస్వామిగారు చెప్పినట్లు "అటు ఆంగ్ల సాహిత్యం ఇటు సంస్కృత సాహిత్యం—ఈ రెండిటి అధ్యయనంవల్ల భారతీయుల ఆధునిక వాఙ్మయానికి అంకురార్పణజరిగింది'

ఈ యుగంలో పెద్ద ఉప్పెనలాగా నింగి ముట్టి దేశాన్ని ముంచెత్తిన—కొందరను కలవరపెట్టిన—ఉద్యమం సాంఘిక సంస్కారోద్యమం. భారతదేశం మహమ్మదీయుల రాకతో తన సంఘం చుట్టూ అభేద్య దుర్గాల్ని నిర్మించుకొన్నది. బాహ్యప్రపంచంతో సర్వ సంబంధాల్ని తెగతెంపులు చేసుకొన్నది. అల్పేరూనీ వ్రాతలే మనకు తార్కాణాలు. తత్ఫలితంగా భారతీయ సమాజం ఉదార దృక్పథాన్ని ఉజ్జగించినది. అనర్థకములయిన దారుణాచారాల్ని, శ్రేయోదూరములయిన సిద్ధాంతాల్ని సృష్టించుకొన్నది. విజ్ఞాన వ్యాప్తి శూన్యం. చైతన్యంలేదు. పురోగమనం హుళక్కి. ఆంగ్లేయుల ఆగమనంతో బిగ్రబిగిసి మునుగుదన్ని పండుకొన్న—నిద్రపోవటమే సుఖదాయకమనుకొన్న—భారతీయ సంఘం జాగృతమైనది. ప్రాక్ప్రతీచీ సభ్యతా సమ్యక్సమ్మేళనమూర్తిగా నిలిచిన రాజారామమోహనరాయలు ఈ సాంఘిక సంస్కారోద్యమానికి ఆదిమ తీర్థంగా అవతరించాడు. బ్రహ్మ సమాజాన్ని నెలకొల్పాడు. దూరదృష్టిగల ఆ పండిత ప్రకాండుని అడుగు జాడల్లో నడిచి, సర్వ శక్తులా కృషి చేసిన ఆంధ్రులు కందుకూరి వీరేశలింగంపంతులు, రఘుపతి వేంకటరత్నం నాయుడూ. పంతులుగారూ, నాయుడూ తమ తర్వాతితరం పడుచువాండ్రమీద ప్రబల ప్రభావాన్ని చూపారు.

సాంఘిక సంస్కారోద్యమంతోపాటు హైందవ జాతీయోద్యమం కూడా అప్పుడే ప్రారంభమైనది. ఈ ఉద్యమాన్నిగూర్చి దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు చక్కగా చెప్పారు. "ఈ మానవోద్యమం గాక, నవభారతంలో ఈ యుగంలో మరో మహోద్యమం బ్రహ్మాండంగా విజృంభించిఁది, హైందవ జాతీయోద్యమం. ఇది దయానంద రామకృష్ణ—వివేకానందులతో ఉజ్జ్వలంగా ప్రారంభమై, లోకమాన్యునితో ఉన్నత శిఖరా లందుకొంది. చిరదాస్య నిద్రనుంచి మేల్కొన్న భారతీయుని దృష్టి ఒక్కసారి పూర్వకాలంలోకి చొచ్చుకొనిపోయింది. అభిమానంవల్ల, ఆత్మ విశ్వాసంవల్ల ఈ దృష్టి మరీ విశితమై ధగధగా తొందర తొందరగా మెరసి పోతూ పరుగులెత్తింది. కవికి ఆత్మీయానుభవం కలిగించినంత ఆవేశమూ, వేడీ యీ జాతీయోద్యమం కలిగించింది. ఎంతో ఆప్తంగా అయిపోయాయి మన పూర్వ గాథలూ, విజ్ఞాన సంస్కృతులున్నూ. ఏ లోపమూ లేక సమగ్ర సుందరంగా శాశ్వత సత్యాలుగా కనపడ్డాయివి. "ప్రాత కొత్తల మేలికలయిక" అని అనడంకన్న, "ప్రాత వాటికన్న నీవు పాడిచే దేముంది? వాటిని మళ్లీ శుభ్రపరచి సుస్థాపితం చేసి కొమ్మం"టుంది ఈ ఉద్యమం.

ఈ ఉద్యమానికి ఉత్తమ ప్రతినిధులు వంగ సాహిత్య క్షేత్రంలో బంకించంద్ర, ద్విజేంద్రలాల్ రాయలు; ఈ ఉద్యమానికి చెందిన నవ్యాంధ్ర కవిత్వ క్షేత్రంలో ఉన్నత శిఖరంగా సాక్షాత్కరించేవాడు విశ్వనాథ సత్యనారాయణ."

(భారతి రజతోత్సవ సంచిక )

మహాశక్తి సంపన్నమయిన జాతీయోద్యమం గూడా సాంఘిక మతోద్యమాల వరసనే బయలు దేరినది. ఆంగ్లేయులు భారత దేశాన్ని రాజకీయంగా దాస్య గ్రహణామగుండంగా చేశారు. భారతదేశ సంపత్తి అంతా బకింగ్‌హామ్ రాజప్రాసాదంలోవున్న ఏలికసాని లేక ఏలిక పాదాల ముంగలకప్పం మాదిరిగా సమర్పింపబడినది. పారిశ్రామికంగా దేశం అభివృద్ధి పొందక పోవటంగాక, భారత పవిత్రికి వెన్నెముక అయిన రైతు ప్రత్యక్ష రౌరవనరకాన్ని అనుభవించాడు. అట్టి పరిస్థితుల్లో కొందరు విద్యావంతులు ఉత్తమ ప్రభుత్వం కొరకు మాత్రమే పందొమ్మిదవ శతాబ్దం ఉత్తరార్ధంలో రాజకీయోద్యమాన్ని ప్రారంభించారు. 1905 వ సంవత్సరం వచ్చేసరికి జాతీయోద్యమం మరొక ఘట్టంలో పడింది. 1905 వ సం. లో వంగ రాష్ట్ర విభజనం జరిగింది. 1913 వ సంవత్సరంలో ఆంధ్ర రాష్ట్రోద్యమం ఆవిర్భవించినది. గాంధీగారి రాకతో జాతీయోద్యమం సమగ్రస్వరూపాన్ని ధరించినది. ఆనాటి భారతదేశంలో అనేక విధాలుగావున్న జాతీయ శక్తుల నన్నిటినీ సమన్వయించిన మహాత్ము డాయన. సత్యాహింసాశ్వాలను పూంచిన జాతీయోద్యమ స్యందనానికి సారథి ఆయన. బాపూజీవిశ్వవాణి దివ్య సందేశం నవ్యాంధ్ర సాహిత్యాన్ని సమున్మిషితం చేసినది.

ఆ సమయంలోనే రవీంద్రుని అవ్యక్తమధురవాక్కు వంగదేశంనుండి విన్పించినది. ఆవాక్కులో విశ్వమానవతావాదం దోబూచులాడింది. విశ్వసౌందర్యదేవతా సౌభాగ్యం పిసాళించినది. తరతరాలుగా చెల్లుతూవున్న భారతీయోపనిషత్సారం, తథాగతుని సర్వజనతా సమతావాదం, కాళిదాస కవితారామణీయకం, పాశ్చాత్య సభ్యతా చైతన్యం సర్వమూ రాశీభూతమై రవీంద్ర భారతిగా ఆవిష్కరింపబడినది. ఆ గురుదేవుని సాన్నిధ్యసుఖాన్ని లనుభవించినవారు, ఆ మహాకవి సాహిత్యామృతాన్ని ఆస్వాదించినవారు తదితర భాషాసాహిత్యాలలో నూతన శకాలను సృష్టించారు.

ఇంత యెందుకూ? ఇరవయ్యో శతాబ్దానికి ముందువెనుకలుగా భారతదేశంలో వచ్చిన యావద్భావపరిమాణామంతా ఏదో ఒకరూపంలో నవీనాంధ్ర సాహిత్యంలో ప్రతిబింబించినది.

## 3

ఒకవైపు సంస్కృతాంగ్ల సాహిత్యాధ్యయనమూ, మరొకవైపు జాతీయోద్యమాదులూ విద్యావంతుల దృక్పథంలో విపరీత పరిమాణాన్ని తీసుకొని వచ్చాయి. అంతకుముందు కనీవిని ఎరుగని భావప్రవంతులు విద్యావంతుల హృదయ క్షేత్రాల్లో ప్రవహింపసాగాయి. తత్ఫలితంగావారు నూతన సాహితీ ప్రక్రియాసస్యసంపదను సరస్వతీదేవికి సమర్పించారు. నవీనాంధ్ర సాహిత్యంలో ఈ నూతన ప్రక్రియా వైవిధ్యమే బృహద్రూపంలో కొట్ట వచ్చినట్లు కన్పట్టుతూ వున్నది. ఒకనాడు సంస్కృత సాహిత్యంమాదిరిగా ఈనాడాంగ్ల సాహిత్యం అనుకార్యమయినది. ఆంధ్రసాహిత్యంలో ఈనూతన ప్రక్రియావతరణం ద్విముఖంగా కొనసాగినది. ప్రాచీనులచే ఉపేక్షితములయిన సాహిత్యప్రక్రియలను ఆంధ్రసాహిత్యంలో సృష్టించటం ఒక పద్ధతి. ఆంగ్లసాహిత్య ప్రభావితులై ఆంధ్ర సాహిత్యంలో ఇంతవరకూ అచుంబితములైన ప్రక్రియలను సృష్టించటం రెండవపద్ధతి. మొదటి పద్ధతులవల్ల—ఇతర హేతువులవల్ల—ఆంధ్రరూపకావతారం, వచనసృష్టి, హాస్య రచనలు ప్రారంభమైనవి. రెండవ పద్ధతివల్ల నవల ఖండకావ్యం, ఏకాంకిక, కథానిక, వ్యాసము, విమర్శ మున్నగునవి చోటుచేసుకొన్నవి. ఈ రెండు పద్ధతులవల్లా ఆంధ్రసాహిత్యం సువిశాలమూ, పరిపుష్టమూ అయినది. ఇక్కడ ఒకవిషయం చెప్పాలి. ఏకాంకికలు, కథానికలు, ఖండకావ్యాలు మనకు కొత్తవిగావని కొందరంటున్నారు. అగ్నిపురాణంలో కథానికవంటిది పేర్కొనబడినదనీ, పురాణేతిహాసాలలోవున్న ఆఖ్యానాలన్నీ కథానికలవంటివేనని, భానుడు ఏకాంకికులు ఏనాడో రచించాడనీ, ప్రబంధాలలోవున్న వర్ణనలన్నీ ఖండ కావ్యాలవంటివేననీ, కాదంబరి కళాపూర్ణోదయంలాంటివి—ఏకావ్య

భేదం అయితేనేమి—నవలలేనని, ఇకపోతే ఆంగ్లసాహిత్యంవల్ల భారతీయ సంస్కృతి కలుషితమైపోవటంతప్ప ఒరిగిందేమీ లేదనీ—ఆత్మసంతృప్తి కొఱకూ—వారు వొక్కి వక్కాణిస్తున్నారు. ఏకాంకికాదులు క్రీస్తు పూర్వం కొన్నివేల సంవత్సరాలనుండీ మనదేవభాషలో వర్ధిల్లిన వర్ధిల్ల వచ్చుగాక. ఆసాహిత్య ప్రక్రియలన్నీ ఆంధ్ర సాహిత్యంలో అవతరించటానికి ఆంగ్ల సాహిత్యమే దోహదం చేసినది. ఆంగ్లవాఙ్మయ ప్రభావితులైనవారే తత్పృష్టికి పూనుకొన్నారు. ప్రతిసాహిత్య ప్రక్రియనూ సంస్కృతానికి ముడి పెట్టటం తగదు. ఈ సిద్ధాంతం వివిధ సాహిత్యప్రక్రియోపాధులను—వైదేశికములుగా అంగీకరించటానికి అంతరాత్మ మారాం చేయటంచేత—సంస్కృత సాహిత్యంలో అన్వేషించటంవలన పుట్టినదేతప్ప నవీనాంధ్ర సాహిత్యపరిణామాన్ని గమనించి చెప్పినదిగాదని వ్రాస్తున్నందుకు పరిణత బుద్ధులు మన్నించాలి.

ప్రాచీనకాలం నుండీ చెల్లుతూవున్న సాహిత్య సంప్రదాయాల విచ్ఛేదం ఈ శతాబ్దంలో ఎక్కువగా గోచరిస్తున్నది. ఈ సంప్రదాయ విచ్ఛేదానికి ఆంగ్లసాహిత్య పఠనం—దానితోపాటు మారుతూవున్న జీవనగతీ—బాగా వుసికొల్పినది. అయితే సంప్రదాయ విచ్ఛేదం అన్నది పెట్టితలలు వేసిందన్న విషయంకూడా మనం విస్మరింపరాదు. సంప్రదాయ విచ్ఛేదానికి వుదాహరణంగా పద్యకావ్యగతిని తీసికొందాం. సంస్కృతభాషలో అలంకారశాస్త్రం బహుముఖాలుగా విస్తరిల్లినది. దానిలో కావ్యహేతువులు, కావ్య భేదాలు, కావ్యాత్మలు, నాయికా నాయక భేదాలు, రసమీమాంస, కావ్యకర్త్రాధికారము, శబ్దార్థాలంకారాలు, శబ్దార్థ దోషాలు చక్కగా నిరూపింపబడ్డాయి. అలంకారశాస్త్రం ప్రోక్త లక్షణాలతో వ్రాస్తేనే కావ్యనామం సార్థక మవుతుందని తచ్ఛాస్త్రవేత్తలు వాదించిన రోజులుకూడా వున్నాయి. కాని నవీనాంధ్రకావ్యకర్తల్లో ఎక్కువమంది ఆ సాహిత్యశాస్త్రనియమ చోదితులు కాలేదు. ఇదియొకముఖ్య భావ పరివర్తనం. ఈభావ పరివర్తనానికి పెట్టనికోటగా నిలబడినది కట్టమంచి రామలింగారెడ్డిగారి కవిత్వ తత్త్వవిచారం. దానిలో రెడ్డిగారు ప్రబంధ దుర్గుణాల్ని ఎలుగెత్తి చాటారు. నవీనకవులందరు ఆప్రబంధావగుణాల్ని పరిహరించటానికి ప్రయత్నించారు. కావ్యరసపరిపాలనం విషయంలో కూడా మార్పు వచ్చినది. శృంగార రసంతోపాటు తదితరసాలకూ సమప్రాధాన్యం లభించినది. నవీనకావ్యాల్లో చమత్కారం రసమనిపించేటంతగా ప్రబలినది కావ్యహేతువుల్లో వ్యుత్పత్తికంటే ప్రతిభాభ్యాసాలకే ప్రాచుర్యం లభించినది. ఇతివృత్త వైవిధ్యం వున్నది. అది వ్యల్ప విస్మృతి పొందినది. ఈ మార్పువల్ల లఘు కావ్యాలు అసంఖ్యాకంగా ఆవిర్భవించాయి. ఈ మార్పునుచూచి శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారిలాంటి వారే మహాకావ్యాలు రచించేకాలం నిష్క్రమించిందని భావించటం జరిగినది. కొత్తకొత్త నాయికా నాయకులు కన్పించారు. లొడారిబుచ్చిగాడు మొదలు లోకోత్తరపురుషుని వరకువున్న నాయకులు, అక్కమ్మ, ఎంకి మొదలు అరుంధతి వరకూ వున్న నాయికలూ కావ్యాలో సాక్షాత్కరించారు. అంతేగాక ఆదర్శవాదం కంటే వాస్తవికవాదం కళారంగంలో గజ్జకట్టినది. ప్రతిసాహిత్య ప్రక్రియలోనూ ఈ మార్పు కన్పడుతున్నది. మహాకావ్యాలు లేవనిగాని, సంప్రదాయ పరిపాలనం చేసినవారు లేరనిగానీ ఎవరూ ఈవాక్యాలు చదివి భావింపరాదు. ముఖ్య లక్షణాన్నే ఇక్కడ వివరించటం జరిగినది.

ఈ సంప్రదాయ విచ్ఛేదానికి సంబంధించినదే వ్యావహారిక భాషోద్యమం. దీని ప్రభావం నవీనాంధ్ర సాహిత్య ప్రపంచంలోబాగా ద్యోతకమవుతుంది. ఈ వుద్యమ పితామహులు గిడుగు రామమూర్తి పంతులుగారు. ప్రాచీనకాలంనుండి సాహిత్యనామాంకితమైన దంతా గ్రాంధిక భాషనకుంత వాన్నే ధరించినది. చిన్నయసూరి బాలవ్యాకరణము, బహుజనపల్లి సీతా రామచార్యులవారి శబ్దరత్నాకరము మనపండితుల పాలిటికి ఆపౌరుషేయములయిన లక్షణ శాస్త్రమూ, నిఘంటువూ అయినాయి. బాలవ్యాకరణం అంగీకరింపని శబ్దరూపము, శబ్దరత్నాకరం స్వీకరింపని పదమూ

అసాధువులని వెలివేయబడ్డాయి. ఎంత ప్రాచీనగ్రంథస్థ ప్రయోగాన్నయినా చిన్నయ్యసూరి బాలవ్యాకరణావరణంలో వున్నదాలేదా, శబ్దరత్నాకరానికి అంగీకార్యమా, కాదా అని మన మహామహోపాధ్యాయులు ఆలోచించి బహిష్కరించటమో, నిరాకరించటమో జరిగేది. వారు సూరిగారినీ, ఆచార్యులుగారిని విశ్వసించినంతగా శ్రీనాథాది కవులను—వారి గ్రంథాలలోని ప్రయోగాల విషయంలో కూడా—విశ్వసింపలేదు. ఎందరో పూర్వకవులు తమ కావ్యాల్లో వాడిన మాటలను బాలవ్యాకరణానికనుకూలంగా తిద్దటంలో మనపండితులు ఎంతో సాహసమూ, సామర్థ్యమూ ప్రదర్శించారు. జీవద్భాష మారిపోతూ వుంటుందనీ, పదాలు అర్థశబ్దపరిమాణాన్ని పొందుతాయని ఆమార్పులన్నింటినీ శాస్త్రకర్త నియమబద్ధం చేస్తాడనీ అంగీకరించటానికి మాత్రం మనపండితులకు సాహసం లేక పోయినది. తత్వాన్ని దర్శించే సామర్థ్యమూ కొఱవడిపోయినది. భాషావిషయంలో అవక్రవిక్రమాన్ని, సత్యదర్శనాసక్తినీ ప్రదర్శించినవారు గిడుగు రామమూర్తి పంతులుగారు. ఆ ప్రజ్ఞామూర్తి పాండిత్యపాటవం వల్ల గ్రామ్యపదాలుగా ఖండింపబడిన పదాలెన్నో పురాణ వైభవాన్ని, పరమప్రామాణ్యాన్ని సంధించుకొన్నాయి. నవీన సాహితీ పదస్వరూపము మారినది. కావ్యకర్తలు, తదితరులూ శిష్ట వ్యావహారిక రూపాలను అంగీకరించారు. సకలసాహిత్య ప్రక్రియలూ వ్యావహారిక భాషలో వెలువడ్డాయి. ఈ వాదం రామమూర్తిగారి కాలంలోనే ఆయనకూడా గుర్తుపట్టలేనంత వ్యావహారిక భాషావాదంగా రూపాంతరప్రకృతిని అలవరచుకొన్నది.

సంప్రదాయ విచ్ఛేదంతోపాటు వ్యక్తి స్వాతంత్ర్యమూ మానవతా వాదమూ అనురెండు సిద్ధాంతాలూకూడా నవీనసాహిత్య గతిని నిర్ణయించాయి. ఆంగ్లసాహిత్య పరిచయంవల్ల ఈరెండుసిద్ధాంతాలను అంగీకరించి ప్రచారం చేసినవారి సంఖ్య బహుళమయినది. వ్యక్తి, అతని అంతరాత్మ, అతనిసుఖదుఃఖాలు, అతడు పుట్టిపెరిగిన చుట్టుపట్టులు—వీని పరిశీలనం ఎక్కువైనది. వ్యక్తిత్వమను తత్త్వం మన్ననీకం చేయసాగినది. ఆత్మాశ్రమయిన సర్వసాహిత్య ప్రక్రియలకూ ఇదే మూలం. మానవతావాదం విజయయాత్ర సాగించినది. ఈవాదం ప్రకారం వ్యక్తికీ వ్యక్తికీ, సంఘానికీ సంఘానికీ, జాతికీ జాతికీ మధ్యవున్న భేదాలు అనుచితాలు, అర్థరహితములునూ. ఏవిషయాన్నయినా సరే దేశకాల పరిస్థితులనుబట్టి ఈవాదం పరిశీలిస్తుంది. "తూర్పు తూర్పే పడమర పడమరే ఈరెండు ఏనాడూ కలిసికోవు" అని కిప్లింగ్ వంటి వారు చేసే వితండవాదాలు ఈమానవతావాదాను యాయులకు గిట్టవు. ప్రతిజాతీ స్వకీయ సంస్కృతి వైశిష్ట్యాన్ని భంగపరచుకోకుండా బ్రతకాలనీ ఆనాడే భూమిమీద దివి అవతరిస్తుందని ఈ వాదం నేర్పుతుంది.

## 4

నవీనాంధ్రసాహిత్యంలో ప్రక్రియా వైవిధ్యాన్ని పరిశీలించేముందు దానికి విత్తునాటిన వారినిగూర్చి కొంతయినా వ్రాయాలి. ఈసాహిత్యగతిని మార్చిన ముగ్గురు వ్యక్తులు హిమవత్పర్వత శృంగాల్లాగా వుంటారు. కందుకూరి వీరేశలింగముగారు, గురజాడ అప్పారావుగారు, రాయప్రోలు సుబ్బారావుగారు ఆముగ్గురు వ్యక్తులు. కందుకూరి వీరేశలింగంగారు నవలకూ, స్వీయచరిత్రకూ, వ్యాసమునకూ, ప్రహసనాలకూ, ఇంకా ఇతరములయిన వానికీ శ్రీకారం చుట్టారు. వారేది వ్రాసినా సంఘ సంస్కారం ప్రధానం. తదితర సాహిత్య గుణాలు గౌణం. రసానందంకంటే ప్రక్రియలో ఉపదేశం చాలా ముఖ్యమన్నరీతి వీరివల్ల బలపడింది.

కావ్య తత్త్వచ్ఛందోరీతుల్లో విప్లవకములయిన పోకడలు పోయిన వారు గురజాడ అప్పారావుగారు. నిర్మలమయిన హాస్యాన్ని తెలుగువారి కందివ్వటానికి ప్రయత్నించి కృతకృత్యులయినవారు వారు. అప్పారావుగారు లక్ష్యశుద్ధితో కథానికలు వ్రాసిరి. "ప్రబోధ కావ్యము, ఆత్మ పరకావ్యము ప్రేమగీతము, కథాకావ్యము—అన్నీ తరువాత తరంవారికి మచ్చున కందించినట్లు ఆయన వ్రాశారు." గురజాడవారి రచనల్లో మానవతావాదము గూడుకట్టుకొన్నది. అప్పారావుగారి "కన్యాశుల్కం" ఇతి వృత్తసమ్మానంలో పాత్రచిత్రణంలో, పాత్రోచిత సజీవభాషలో ఎన్నో ఒయ్యారాలు ఒలికించినది.

ఆదేసమయంలో ఆంధ్రసాహితీ రంగస్థలంమీద రాయప్రోలు సుబ్బారావుగారు కన్పించారు. సుబ్బారావుగారి మార్గం అప్పారావుగారిమార్గం కంటే భిన్నమయినది. రాయప్రోలు సుబ్బారావుగారు రవీంద్రుని అంతేవాసి. వారిని దిద్దితీర్చినది శాంతినికేతనం. రవీంద్రుని ఛాయలు రాయప్రోలు గ్రంథాల్లో, వెంకట పార్వతీశ్వర కవుల "ఏకాంతసేవ" లో రూపొందాయి. గురజాడ వ్యక్తిత్వంలోకంటే రాయప్రోలు వ్యక్తిత్వంలో భారతీయ సంస్కృతి ముద్ర ఎక్కువ. "పాశ్చాత్య సాహిత్యపరిచయ పాండిత్యాలూ వంగకవితా భంగిమలు, మననాట ముమ్మరంగా అలముకొన్న రాష్ట్రాభిమానమూ వర్తమాన సాంఘికసమస్యలూ, ఇవే రాయప్రోలునూ కదిపినదివి. గురజాడవారి మానవప్రేమనూ, తోడివారిని బాగుపరచవలెనన్న మహోద్యత్నాన్నీ, మనసున ఉంచుకొని తనకవితను కేవల ప్రాచీనపద్ధతికి భిన్నంగా జానపదకవిత అంత నిరాడంబరం, నిర్మలంగాకున్నా, అంత సులభ సుందరమైన పద్ధతిని మలుచుకున్నాడు. ప్రబంధశిల్పాన్ని, వస్తువునూ కాదన్నా, భాషాచ్ఛందో రీతులలో పూర్వమర్యాదను మన్నించినాడు. ప్రేమను తన మూసలో పోసుకొని, నిష్కామప్రేమరూపులయిన పాత్రలను పోతపోసుకుని, ఆనాటి స్త్రీ దుస్థితిని—మరొకతీరున ఆమెను దివ్యనుగా చూపుటద్వారా—తీర్చుటకై యత్నించినాడు. (విద్వాన్ విశ్వం. తెలుగు వాఙ్మయము. పుట. 217). ఆచార్య లక్ష్మీరంజనం గారన్నట్లుగా "మధ్యతరగతి సంసారుల జీవితవృత్తము కథావస్తువుగా ఆంగ్లభాషాపరిచితిచే సమాసన్నమైన ప్రకృతి తత్త్వ కథన ప్రీతితో హృద్యమయిన స్వభావోక్తితో ఖండకావ్యమని క్రొత్త ప్రక్రియ సుబ్బారాయకవి ప్రచారమునకు తెచ్చి "తృణకంకణము" మొదలగు లఘుకావ్యములను సృష్టించెను." (తెలుగు సంస్కృతి. పుట. 622)

సాహిత్య ప్రక్రియా వైవిధ్యం నవీనాంధ్రసాహిత్యంలో బాగా కన్పడుతుందని ముందే మనవిచేశాను. అన్నిటి ఆవిర్భావమూ, పరిణామమూ సర్వతోముఖంగా నిరూపించటం సాధ్యంకానిపని. ఆయాభావోద్యమాల రీతులను వర్ణించేటప్పుడు కొన్నిటి ప్రస్తావనవుంటుంది. 1947 వ సంవత్సరం తర్వాత వెలసిన సాహిత్యాన్ని సమీక్షించేటప్పుడు కొన్నింటిని స్థూలంగా పరిశీలించటం జరుగుతుంది. అన్ని ప్రక్రియలను మించి సర్వవ్యాప్తమైవున్న ఆంధ్ర వచనపద్ధతిని వివరించటం సాధ్యంగాదు. ప్రస్తుతానికి రూపక పరిణామం, నవలతీరులు, కవితారీతులు, హాస్యరచనాభంగిమలు చూపటంతో సంతృప్తి చెందకతప్పదు.

(క) ప్రాచీనాంధ్రసాహిత్యంలో రూపకాలులేవు. సంస్కృతంలోవున్న నాటకాలు కావ్యాలుగా రచింపబడ్డాయి. కాని యక్షగానమనే ప్రక్రియమాత్రం పామరుల్లో మెలుగుతునే వున్నది. పందొమ్మిదవ శతాబ్దం ఉత్తరార్థంలో నాటకరచన జరిగినప్పటికీ, ఆనాటకాలకు బహుళప్రచారం లభించినది ఇరవయ్యో శతాబ్దంలోనే. ఉద్దండులయిన పండితులచే సంస్కృతాంగ్ల నాటకాలు పరివర్తింపబడ్డాయి. ఆ తర్వాతగాని స్వతంత్ర నాటకాలు రచింపబడలేదు. ధర్మవరం కృష్ణమాచార్యులుగారు, కోలాచలం శ్రీనివాసరావుగారు నాటకకళలను ఉన్నత స్థానంలో అధిష్ఠింపజేశారు. వీరిరువురూ పౌరాణిక చరిత్రాత్మక నాటకాలు సృష్టించి వాటిని స్వయంగా ప్రదర్శించారు. "విషాదసారంగధర" తొలి విషాదాంత నాటకం. శ్రీమంతులు సైతమూ ఈనాటక కళను ఎంతో అభివృద్ధికి కొంపోయారు. "గయోపాఖ్యానం" "హరిశ్చంద్ర" "తారాశశాంకం" పానుగంటి వారి నాటకాలు ఆంధ్రదేశంలో బహువారాలు ప్రదర్శింపబడి ప్రేక్షకుల ప్రశంసలు అందుకొన్నాయి. పౌరాణిక రూపకరచన తిరుపతి వేంకటకవుల పాండవజనన—ప్రవాస—ఉద్యోగ—విజయ—అశ్వమేధములతో శిఖరాగ్రాన్ని చేరుకొన్నది. పౌరాణిక నాటకాలలోని పద్యాలు నిరక్షరాస్యులనాల్కలపై నాట్యంచేశాయి. చరిత్రాత్మక రూపకాలుకూడా

రచింపబడ్డాయి. కోలాచలం శ్రీనివాసరావుగారి "రామరాజు", చారిత్రాభాస రూపకమయిన "ప్రతాపరుద్రీయం", శ్రీపాదవారి "బొబ్బిలి" గుండిమెడ వేంకట సుబ్బారావుగారి "ఖిల్జీరాజ్యపతనం", కొప్పరపు సుబ్బారావుగారి "రోషనార" అతి ప్రశస్తి పొందాయి. "రోషనార" వల్ల ఆంగ్లప్రభుత్వం చారిత్రక నాటకాలను నిషేధించటంకూడా జరిగినది. సాంఘిక సంస్కారం ప్రతిబింబించిన రూపకాలు "కన్యాశుల్కం" "కంఠాభరణం" "చింతామణి" "వరవిక్రయం" "మధుసేవ" "రంగూన్ రౌడి" మున్నగునవి.

ఈ రూపక రచన ఎన్నో మార్పులకు లోనయినది. ప్రాచీన సంస్కృత నాటకాలను అనుసరించి కొందరూ, ఆంగ్లరూపక ప్రభావితులై కొందరు రూపక రచన చేశారు. రాగతాళయుక్తము అయిన పాటలు, పద్యములు, గ్రాంథికభాష, కొన్ని రూపకాల్లో ప్రధానస్థానం వహించాయి. క్రమక్రమంగా కేవల వచనరూపకాలూ, వ్యావహారిక పాత్రోచితభాషతో కూడినవి రాసాగాయి. అంకాల విభజనంతో పాటు రంగవిభజనం జరగటం ఒక మంచి మార్పు. ఈ రూపక రచనతోపాటు ప్రదర్శన సంఘాలు కూడా అభివృద్ధి పొందాయి.

1929వ సంవత్సరంలో ఆంధ్రనాటక కళాపరిషత్తు స్థాపింపబడినది. అయినా అది 1933వ సంవత్సరంలోనే ప్రాముఖ్యానికి వచ్చినది. ఈ పరిషత్తు 1941వ సంవత్సరం నుండీ నాటక ప్రదర్శనంలో పోటీలు నిర్వహించినది. దీనితో ఆంధ్ర రూపక రచన వినూత్న స్వరూపాన్ని ధరించినది. "పాలేరు" "కులంలేనిపిల్ల" "ఎదురీత" మొదలైన రూపకాలు చాలా రచింపబడ్డాయి. సాంఘిక సమస్యలు ప్రబలంగా ఇట్టి రూపక గతిని నిర్ణయించాయి. 1949వ సంవత్సరం తర్వాత ఆంధ్రనాటక కళాపరిషత్తు గౌరవాన్ని వాంఛించటం వల్లగానీ, స్థానిక ప్రదర్శనార్థంగానీ శతాధికంగా రూపకాలు రచింపబడ్డాయి. డి. వి. నరసరాజు, పినిశెట్టి, ప్రఖ్య శ్రీరామమూర్తి, కొర్రపాటి మున్నగువారు రూపక రచనలో తమ నైపుణ్యాన్ని చాటారు. "బెల్లంకొండ" ప్రభృతులు రచించిన రూపకాలు ఆంధ్రదేశ సంఘాన్ని ప్రతిబింబించుతున్నాయని చెప్పటం కష్టం. నావిలాల సోమయాజులుగారి "నాయకురాలు" ప్రసిద్ధిపొందిన చరిత్రాత్మకరూపకం. ఎన్నో సంగీత రూపకాలు కూడా ఈ సమయంలో విన్పించాయి. "తెనుగుగడ్డ" మున్నగునవట్టివి. "నాగసేన" "రాగమంజరి" "ఉషోరాగం" మొదలైనవి నృత్యగీత రూపకాలు. రేడియోకోసం శ్రీ రజని "చండీదాసు" మున్నగునవి రచించారు. సందర్భాన్ని బట్టి 1947 తర్వాత వచ్చిన రూపకా లుదాహృతాలైనాయి.

నవీనాంధ్ర సాహిత్యంలో నవలఅవతరించటం ఒక మహాపరిణామం. ఆంగ్ల సాహిత్యప్రభావం మనసాహిత్యంమీద ఎట్లా పనిచేసినదో నవలే మూదలగా ఉన్నది. వీరేశలింగం పంతులుగారి రాజశేఖరచరిత్రం నవలకు నాంది పాడినది. వారి తరువాత ఈసాహిత్య ప్రక్రియకు మెరుగుపెట్టినవారు చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు. కొమర్రాజు లక్ష్మణరావుగారు విజ్ఞాన చంద్రికామండలి స్థాపించి ఈ ప్రక్రియను ఎంతో ప్రచారంచేశారు. వంగభాష నుండి వచ్చిన నవలలు తెలుగువారికి సుధాభాండికలయ్యాయి. చక్రపాణిగారివల్ల తెలుగు దేశాన్ని చూచిన శరత్ బాబు తెలుగువాడే ఐపోయాడు. భోగరాజు నారాయణమూర్తి చారిత్రకనవలలు, కేతవరపు వేంకటశాస్త్రి సాంఘిక నవలలూ ఆంధ్ర దేశాన్ని ఆహ్లాదపరచాయి. కాని బాల్యదశలో వున్న ఈ ప్రక్రియను పెంచి పెద్దచేసినవారు ఉన్నలక్ష్మీనారాయణ, విశ్వనాథ సత్యనారాయణ, అడవి బాపిరాజుగారలు. ప్రస్తుతానికి "మాలపల్లి"ని గూర్చి వ్రాయటం విరమిస్తాను.

సత్యనారాయణగారూ, బాపిరాజుగారూ మహాప్రజ్ఞాన ధురీణులు. అసాధారణ కల్పనాచాతురీ మూర్తులు. విక్టోరియా మహారాణి కాలములో రచింపబడ్డ నవలల పోలికలు వీరువురి నవలల్లో స్పష్టంగా కన్పట్టుతూ వున్నాయి. "థాకరే" "హార్డీ" "గాల్స్‌వర్థీ" ప్రభావానికి అడవి బాపిరాజుగారూ, విశ్వనాథ సత్యనారాయణగారూ లోనైనవారే. కానివీరిరువురి మార్గాలకుఎక్కడా అందికా పొందికాలేదు. దానికి కారణం ఇరువురి వ్యక్తిత్వభేదం. సత్యనారాయణ బాపిరాజులు సాంఘిక నవలలూ, చారిత్రక నవలలూ చిన్నవీపెద్దవీ రచించారు. "నారాయణరావు" "హిమబిందు" వంటినవలలను బాపిరాజుగారే వ్రాయగల్గుతారు. సమకాలీన సంఘాన్ని, చారిత్రకయుగాల్నీ, యధార్థమయిన భావుక దృష్టితో రసమయంగా దర్శిస్తారు బాపిరాజుగారు. ఏయుగం సంఘమయినా దానిజీవనశక్తి బాపిరాజుగారి నవలల్లో సత్యసుందరంగా సాక్షాత్కరిస్తుంది. ఆజీవనశక్తిని వ్యక్తిత్వభేదంతో వారు సృష్టించిన పాత్రలు ప్రదర్శిస్తాయి. బాపిరాజుగారిదృష్టి ఋషి దృష్టి. ఆదృష్టికి ప్రపంచంలో సామరస్యం తప్ప మరొకటి కన్పించదు. సత్యనారాయణగారి దృష్టి అట్లాంటిదికాదు. సనాతన ధర్మ మమకారమూ, తదన్యధర్మనికారమూ, సత్యనారాయణగారి నవలల్లో మూర్తీభవించినవి. సనాతనధర్మ దృక్కోణమునుండి వారు ప్రపంచాన్ని పరిశీలిస్తారు. పాశ్చాత్య సభ్యతా సంబంధం వల్ల బహుధా పతనమైపోయినదని గ్రంథకర్త భావించిన ఆంధ్రదేశాన్ని "వేయిపడగలు" చూపిస్తున్నది. జమీందారీవ్యవస్థ, వర్ణాశ్రమధర్మవ్యవస్థ, దేవదాసీ విధానము—ఇవియే భారత జాతికి తరుణోపాయాన్ని ప్రసాదిస్తాయని విశ్వనాథ విశ్వాసం. వారి నవలలన్నీ సమస్యా ప్రధానములయిన నవలలు. సాంఘికంగానవచ్చు, చారిత్రకంగానవచ్చు ఏనవల్లో అయినాసరే విశ్వనాథ సృష్టించిన పాత్రలు ఆర్షధర్మాభిముఖంగా ప్రయాణం చేస్తాయి. అందుచేత అవి సజీవములుగా వుండవు. మరి గ్రంథకర్త చేతికీలు బొమ్మలులాగా వుంటాయి. ఆర్షధర్మాన్ని అపౌరుషేయంగా నిరూపించటంకోసం సత్యనారాయణగారు బౌద్ధాదిమతదూషణం చేయటానికి వెనుకంజవేయరు. "ధర్మచక్రం", ఆదినుండి ఎంతో మనోహరంగా నడచిన "ఏకవీర" వారి యీ నిరసనదృష్టిని తేటతెల్లంగా చాటుతున్నాయి. బాపిరాజుగారి నవలల్లోకంటె సత్యనారాయణగారి నవల్లో బంధమెక్కువ. కావ్యగుణాలు ఎక్కువ. బెర్నార్డ్‌షా వంటివారు సమస్యా ప్రధానములయిన ప్రక్రియలు సృష్టించారు. కాని వారిరచనల్లో కన్పడే సహజసౌందర్యమూ, సరసచతురోక్తీ సత్యనారాయణగారి రచనల్లో మనకు కన్పించవు. సత్యనారాయణగారి వంటివారు బహువిధ ప్రక్రియాస్రష్ట మరెవరూ మనకు కన్పించరు.

(ట) ఈ యుగంలో కవితా విలాసిని ఎంతో సోయగాలు చాటినది. ఇది లేతివృత్త వర్ణికావనవాల్ని ధరించి ఎంతో నాజూకుతనం చూపినది. ఈయుగం ఖండకావ్యయుగము, లఘుకావ్య యుగమూ ఐపోయినది. ప్రతికవీ లఘుకావ్యాలనూ, ఖండకావ్యాలనూ రచించాడు. కట్టమంచివారి "ముసలమ్మమరణము" "రాయప్రోలు" వారి కృతులు ఆదర్శలఘుకావ్యాలైనాయి. ఖండకావ్యాలంటే లఘు కావ్యాలంటే నవయుగ కవిచక్రవర్తి "జాషువా" పేరు ఠక్కున జ్ఞాపకం వస్తున్నది. పిపీలికాది బ్రహ్మపర్యంతమూ వ్యాప్తమై ఉన్న జంగమస్థావర ప్రపంచం ఈ ఖండకావ్యాల్లో లలితాతి లలితరూపంలో కన్పట్టుతూంది. పురాణేతిహాస చారిత్రక సన్నివేశాలకు నవయుగ భావస్ఫోరకంగా లఘుకావ్యాల్లో వ్యాఖ్యానాలు చేయబడ్డాయి. తిరుపతి వేంకట కవుల కవితా సౌలభ్యమాధుర్యాలు ఈ ఖండకావ్యాల్లోనూ, లఘుకావ్యాల్లోనూ నెలకొని వున్నాయి. కృషీవలుని జీవనగతిని వర్ణించటం ఈ యుగవిశేషం. రామిరెడ్డిగారి "కృషీవలుఁడు"తో ప్రారంభమైన ఈసరణి ఏటుకూరు వేంకట నరసయ్యగారి "క్షేత్రలక్ష్మి"లో చరమస్థాయి పొందినది. రాధాకృష్ణుల ప్రణయ వృత్తాంతం, ఉమర్‌ఖయ్యామ్ తత్త్వం నవీనకవుల్ని బాగా ఆకర్షించినవి. "శృంగారవీథి" "పానశాల" విలక్షణమైన కావ్యాలు.

గురజాడ అప్పారావుగారు వృత్తాల్నివదలి, జాతులను వదలి "అంతవరకూవున్న జానపద గీతచ్ఛాయలో, కన్నడంలోని షట్పది "పార్శీలోని ఒక విధమయిన గజల్" కలయికతో, ఒకనిరాడంబరమైన రీతిని" గేయకవిత్వం సృష్టించారు. ఈ రీతి కవులకు అనుసరణీయమైనది. ఝుటితిమ్యాఫ్టర్తిగల గేయాలను బసవరాజు అప్పారావు రచించారు. తలిసిపళ్లజంట ముద్దులొలుకు సంపును నండూరి సుబ్బారావుగారు "ఎంకిపాటలు"లో విన్పించారు. భాషా భావాలలో నిరాడంబరత వీరిరువురి గేయాల లక్షణం. భావరామణీయకమంతా

కొలువుచేసిన పాటలు "కిన్నెరసానిపాటలు." తల్లావజ్ఝల శివశంకర శాస్త్రిగారు ఎన్నోగేయనాటికలు కావ్యవైభవంతో రచించారు.

(త) హాస్యరసం అనేది నవరసాల్లో ఒక్కటిగా పరిగణింపబడినా ప్రాచీన సంస్కృతాంధ్ర సాహిత్యాల్లో అది ముఖ్య స్థానాన్ని పొందలేకపోయింది. "మృచ్ఛకటిక"లో అనేకమార్గాలవల్ల జనించిన హాస్యం గోచరిస్తున్నది. సంస్కృత వీధీ భాణప్రహసనాల్లో వుండేహాస్యం శుద్ధంగా వుంటుందని చెప్పజాలము. ప్రాచీనాంధ్ర సాహిత్యంలో ఎడనెడా చాటువుల్లో, యక్షగానాల్లో కావ్యాల్లో హాస్యం కన్పిస్తున్నది. వీరేశలింగంగారి రచనల్లో, చిలకమర్తివారి రచనల్లో సాంఘిక సంస్కారానికి లోపడిన హాస్యము, చమత్కార ప్రధానమయిన హాస్యమూ వుంటాయి. కేవలం హాస్యరసాన్ని ఆరాధించినవారు నవ్వులు. గురజాడ అప్పారావుగారు స్వచ్ఛమయిన హాస్యరసాన్ని తెలుగువారికి రుచి చూపించారు. "కన్యాశుల్కం"లోని పాత్రలు ఎటువంటి సన్నివేశంలో ఎట్లా మాట్లాడినా హాస్యరసం పొంగి పొర్లుతుంది. పానుగంటివారి "సాక్షి" సంపుటాలు హాస్యరస నిలయాలు. హాస్యరస ప్రయోజనాన్ని—దోషాల్ని బాహిరపుచ్చి సంస్కరించటం—గమనించి లక్ష్యసిద్ధి పడసినవారు పానుగంటివారు. హాస్యరస ప్రధానంగా నవలలూ, నాటికలూ రచింపబడ్డాయి. మొక్కపాటివారి "బారిష్టరు పార్వతీశం", "మోలియర్" ప్రభావంగల, మోతాదుమించిన హాస్యంతో నిండిన భమిడిపాటి కామేశ్వరరావుగారి నాటికలూ, చదివిన—చూచిన తెలుగువారు ఎంతగా కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వారో! సామాన్య సంభాషణల్లో, లేకపోతే వేళల్లో నిక్షిప్తమయిన హాస్యరసాన్నిచూపే "మునిమాణిక్యం" గ్రంథాలు చిరస్మరణీయాలు. విమర్శలో తీవ్రతతో కూడిన హాస్యాన్ని చూపినవారు కట్టమంచివారుకాగా, అతిమృదువు, సాదుపూఅయిన హాస్యాన్ని చూపినవారు చూపినవారు రాళ్లపల్లివారు.



## 5

నవీనాంధ్ర సాహిత్యంలో నాలుగు భావోద్యమాలు బాగా పాతుకొని పోయాయి. అవి భావకవితోద్యమమూ, జాతీయ రాష్ట్రోద్యమములూ, హేతువాదోద్యమమూ, అభ్యుదయకవితోద్యమమూ. ఈ నాలుగుద్యమాలూ రెండు తరాలవారిని ఆకట్టుకొన్నాయి. వానిలో ఒక్కొక్కదాన్ని సమీక్షించుదాము.

(క) ఆత్మాశ్రయ కవిత్వం అనబడే ఈ భావ కవిత్వానికి ప్రథమాచార్యుడు రాయప్రోలు సుబ్బారావుగారు. "సాహితీ సమితి" ఈ కవితాశాఖను బాగా ప్రచారం చేసినది. ప్రతి వ్యక్తిలో ఏదో ఒక సార్వకాలికమైన, సార్వజనీనమయిన అమూల్యానుభవం వుంటుంది. ఆ అనుభవాలను ఆశ్రయించి పెరిగినది భావ కవిత్వం. షెల్లీ, కీట్సు మొదలయిన ఆంగ్ల కవులూ, రవీంద్రుడూ ఈ భావ కవులకు ఉద్దీప్తి కల్గించారు. రాయప్రోలువారు మోహేతరమయిన దివ్యప్రేమను అభిలషించారు. ఎన్నో పాత మాటలు వారి కావ్యాల్లో మాతవార్తలను విరజిమ్ముతూ వుంటాయి. నాయని సుబ్బారావు ప్రభృతుల భావ కవిత్వంలో ప్రకృతి ప్రవేశించినది. ఈ శాఖలో నాటికి నూరుపాళ్ళ భావకవి అయినవారు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు. భావోద్వేగంతో, అక్షర రమ్యతతో, వినూత్నోపమానాలతో కృష్ణశాస్త్రిగారి కవనం వికాసం చెందినది. ఆయన సృష్టి ఒక గంధర్వగానం. ఈ రీతిగా ఇంకా కొంతదూరంపోయిన వారు వేదుల సత్యనారాయణశాస్త్రిగారు. ఈ భావ కవిత్వంవల్ల కోకిలలూ, సెలయేరులూ మలయమారుతాలూ, అందరకూ ప్రియాతిప్రియమైనాయి. నూతన పద సంపుటులూ పద చిత్రాలు భాషలో బయలుదేరాయి. కన్నె గులాబులూ, వెన్నెలదారులూ, మొయిలు దోనెలూ, పదాల గుసగుసలూ, భావాల పరిమళాలూ—ఒక్కటేమిటి ఈ విధమయిన వెన్నో భాషలో స్థిరపడిపోయాయి. ఈ భావ కవితా లోకంలో పువ్వులు నవ్వుతాయి. మూగ గుండెలు మాట్లాడుతాయి. భావ కవులెంతోమంది యున్నారు. "కానీ వారిలో ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి, పిలకా గణపతిశాస్త్రి వంటివారి కొక స్థానం ఉన్నది. వీరిలో ప్రాచీనతా సంస్కారం బలంగా కానవస్తూ, కొత్త పద చిత్రాలు అవి తక్కువైనా అందంగా వ్రాయడం అరోకస్థితికి గొంపోబడినది." (తెలుగు వాఙ్మయము పుట. 233) ఈ పద్ధతికి తల్లావజ్ఝల శివశంకరశాస్త్రిగారు మూల పురుషులుగా కన్పిస్తారు.

అక్కిరాజు ఉమాకాంతంగారు ఆంధ్ర సాహిత్యంపట్ల మమతలేనివారు "నేటి కాలపు కవిత్వం" అనే విమర్శ గ్రంథంలో ఈ భావ కవితాశాఖను చీల్చి చెండాడారు. వారి గ్రంథంలో పక్షపాత దృష్టి, సత్యమూ రెండూ కన్పడుతూ వున్నాయి. భావ కవులందరూ సంఘాన్ని ఆడిపోసుకున్నవారే. తమ వలపుమ అర్థం జేసుకోలేని లోకాన్ని ఈసడించిన ఈ కవులు రాను రానూ లోకంచేత ఈసడింపబడ్డారు. ప్రజలకూ, భావ కవులకూ ఏమాత్రం పొత్తు లేకుండా పోయినది. ఈ కవులు ఎటుట్టా గోడలు కట్టుకున్నారు. భావ కవిత్వంలో రామణీయతకంటె అశక్తత అధికమైనది. యతిప్రాసలు నేర్చిన ప్రతివ్యక్తి అప్రాప్త మనోహారినిగూర్చి కవిత్వం వ్రాశాడు. కాని, ఆమె కాలం గడిచినకొద్దీ దూర భూములకు తరలిపోయినది. తీపి ఎక్కువైతే మొగం మొత్తినట్లు భావకవిత్వాన్ని అఖండంగా చదివిన ఆంధ్రజాతికి రోయింపు కల్గినది. ఒకనాడు భావకవుల మూగగుండెలే మాటాడాయి. కాని తర్వాత వారు నోరె విప్పలేకపోయారు.

(చ) జాతీయోద్యమంవల్లా, ఆంధ్రరాష్ట్రోద్యమంవల్లా దేశమంతా అట్టుడికి వట్టుడికిపోయిన రోజులవి. పృథ్వీతలంపైన అణువణువునా వీరతాగుణం వెల్లివిరిసిన నాళ్లవి. ఆనాడు కవి వీరులెందరో—కవిత్వమనే పదార్థం తక్కువైనా—పాటలు వ్రాసి, ప్రజలను ప్రబోధించి—కర్తవ్యోన్ముఖులను చేశారు. గరిమెళ్ల సత్యనారాయణరావుగారి పాటలు వాడవాడలా మారుమ్రోగాయి. వర్తమాన ప్రభుత్వ విమర్శతోపాటు, ప్రాచీన భారత వైభవాన్ని నవీన కవులు వేనోళ్ల చాటారు. చరిత్ర సృష్టించిన వీరుల యశస్సునకు అక్షర యానం కల్పించారు.

మహాత్మాగాంధి రాకతో భారత స్వాతంత్ర్యోద్యమంలో నూతనాధ్యాయం ప్రారంభమైనది. ఆయన "అసిలేని సేన"తో సత్యాహింసలను అస్త్ర శస్త్రాలుగా అంగీకరించి, రవి యస్తమించని మహా సామ్రాజ్యాన్ని వణకించాడు. బాపూజీ అమరవాణిని ఆంధ్ర రచయితలు పాడారు. జాతీయోద్యమ ప్రభావంతో బయలుదేరిన నవలల్లో వేలూరి శివరామశాస్త్రిగారి "ఆహోబలీయం" ఉన్నవ లక్ష్మీనారాయణగారి "మాలపల్లి" చాలా ముఖ్యమైనవి. గాంధిగారి సిద్ధాంతాల్ని తూ. చా. తప్పకుండా ఆచరించుచూ చూపాలని ఆహోబలీయ కథా నాయకుడు నోబయ్య ప్రయత్నించాడు. "మాలపల్లి" హింసాహింసా సంగ్రామమూ, భక్తియోగమూ హరిజన పాత్రల ద్వారా చాటినది. ఈ నవలలోవున్న ఇతివృత్తమంతా ఒక యెత్తూ, అందలి భాష మరొక యెత్తూను. కండగల తెలుగు నుడికారానికి విడిది పట్టైనది "మాలపల్లి."

బాపూజీ దీనజన సేవానురక్తి, సత్యాహింసలూ తెలుగు కైసరులను పులకరింపజేశాయి. బుద్ధ ధర్మోపదేశ గాథతో, గాంధీయ ధర్మావిష్కరణం ప్రాతిపదికగాగల మహాకావ్యం "సౌందరనందము". తద్రచయితలు పింగళి లక్ష్మీకాంతముగారు, కాటూరి వేంకటేశ్వరరావుగారు. "కాటూరి" వారి "గుడిగంటలు" గాంధీయ ధర్మాన్ని వేంకటేశ్వరస్వామికే ప్రబోధించుతూ, గణగణ మ్రోగాయి. మరి గాంధీ సందేశాన్ని త్రికరణశుద్ధిగా నమ్మి, వ్రాసిన కవిత్వాన్నంతా దానితో నింపినవారు తుమ్మల సీతారామమూర్తిగారు. వారు "బాపూజీ—ఆత్మకథ"ను తెనుగుగా చేశారు. సీతారామమూర్తిగారు భారతదేశంలో గాంధీయుగాన్ని తమ కవిత్వంలో ప్రతిబింబింపజేశారు. సర్వోదయరంగంలో గాంధీజీకి జోడుగావున్న వినోబావాణి కూడా సీతారామమూర్తిగారిని కదిలించినది. తత్ఫలంగా వారి "సర్వోదయగానము" ఇటీవల వెలువడినది.

ఆంధ్ర రాష్ట్రోద్యమమూ, తెలుగుకవులచేత కంఠాల కదిలేటట్లు పాడించినది. ప్రథమంగా దేశభక్తిని ప్రబోధించినవారు గురజాడవారుకాగా, ఆంధ్రాభిమానాన్ని చాటినవారు రాయప్రోలు సుబ్బారావుగారు. "ఆంధ్రజాతి పూర్వోన్నత్యము, తరువాతి తెనుగు పడుచుల ప్రణయాలు, నగలు, నోములు క్రీడలు" రాయప్రోలు అభిమాన కావ్య వస్తువులైనాయి. కొడాలి సుబ్బారావుగారి "హంపీ క్షేత్రము" విశ్వనాథ "ఆంధ్రప్రశస్తి" ప్రబంధచ్ఛాయల్లో నడిచాయి. ఒక తుమ్మల సీతారామమూర్తిగారు ప్రాచీనాంధ్రత్వాన్ని ఒకవంక చాటుతూ, మరొకవంక ఆంధ్రోద్యమచరిత్రనంతా కావ్యగతం చేశారు. రాళ్లపల్లివారి పెనుగొండపాట తేనెవాక. పుట్టపర్తివారి "పెనుగొండలక్ష్మి" గజ్జల రవళి తెలుగు నాడంతటా విన్పించినది.

జాతీయరాష్ట్రోద్యమాలు ముమ్మరంగా సాగేసమయంలో ప్రాచీన వీరుల జీవన యశోగానం చేశారు తెలుగు కవులు. రాయలసీమనుండి యిరువురు మహాకవుల కావ్యాల్లో చారిత్రకవాణి వీణ మ్రోగించినది. గడియారం శేషశాస్త్రిగారి "శివభారతము", దుర్భా రాజశేఖర శతావధాని "రాణా ప్రతాపసింహచరిత్రము" "అమరసింహచరిత్రము" వీరరస పరిపూర్ణ శైలితో సాగినవి. అభినవభారతంగా ఆంధ్రులహృదయాల్లో స్పందనం గలిగించే పల్నాటివీరుల చరిత్రను "వీరభారతము", "నాయకురాలు", "బాలచంద్రుడు" "మగువ మాంచాల" మొదలయినకావ్యాల్లో ఏటుకూరి వేంకట నరసయ్యగారు చిత్రించారు.

(ట) పాశ్చాత్య నాగరకతా సంపర్కంవల్ల ఆంగ్ల సాహిత్య పఠనం వల్ల భారతీయ సంస్కృతిని నూతన దృక్కోణంనుండి సహేతుకంగా పరిశీలించటానికి ప్రయత్నించారు ఆంధ్ర రచయితలు. ఈ ప్రయత్నంవల్ల భారతీయ సంఘం మూఢాచార కశ్మలభూయిష్ఠంగా, మానవతా గుణదూరంగా వారికి కన్పించినది. సాంఘిక సంస్కారోద్యమం కూడ దీన్ని బాగా ప్రోది చేసినది. భారత దేశ చరిత్ర కూడా అనిదం పూర్వహేతుదృష్టితో పఠింపబడినది. భారతీయ సంస్కృతి సౌధనిర్మాణంలో ఆర్యులనబడేవారేకాక, అనార్యులూ, శకయవనాది విదేశీయులూ తోడ్పడ్డారనే రహస్యం భూగర్భంనుండి బయట పడినది. ఆ సాంఘిక దృష్టితో, ఈ చారిత్రక దృష్టితో దేశంలో పెద్ద దుమారాన్ని లేపిన రచనలు చేశారు కొందరు. అట్టివారిలో త్రిపురనేని రామస్వామిచౌదరి, గుడిపాటి వేంకటచలం ముఖ్యులు.

రామస్వామిచౌదరిగారు ఆర్యానార్యద్విజాతి సిద్ధాంతంలో శ్రవహేతు దృష్టితో భారతీయ పురాణేతిహాసాల్ని విమర్శించారు. వారి "సూత పురాణము", "శంబుకవధ", "ఖూనీ", "భగవద్గీత", తెలుగువారి మనఃప్రపంచంలో భావవిప్లవాన్ని రేకెత్తించాయి. శ్రీ ముద్దుకృష్ణ "అశోకము", చలం "హరిశ్చంద్ర", ఆమంచర్ల గోపాలరావు "హిరణ్యకశిపుడు" జి. వి. కృష్ణారావు "భిక్షాపాత్ర" కొటగిరి వేంకట కృష్ణారావుగారి "వేదవతి" ప్రాచీన కథలకు నూతన వ్యాఖ్యానాలు. పి. వి. రాజమన్నారు నాటికలు కూడా భారతీయ సాంఘిక సూత్రాల్ని త్రెంచివేశాయి. వారు రచించిన "తప్పెవరిది" పరంపరాగతంగా వచ్చిన ధర్మ ప్రవచనాల్ని అంగీకరింపలేదు.

వేంకటచలంగారు తెలుగు దేశాన్ని ఒక్క వూపు వూపారు. చలంగారి రచనలన్నీ స్త్రీ పురుష సంబంధం కేంద్రం చుట్టూ తిరుగుతాయి. స్త్రీ విలాస వస్తువు కాదని నిరూపించటానికి వారెంతో కృషి చేశారు. కాని ఆంధ్ర దేశం వారి ధైర్యాన్ని ప్రశంసించినంతగా, రచనలను హర్షింపలేకపోయినది. అవినీతిని వర్ణించటంలో నీతి సంపద బహిర్గతమౌతుందన్న సూత్రాన్ని సంఘం అంగీకరించాలంటే కొంతకాలం గడవాలి. సజీవమయిన వ్యావహారిక భాష, భావ శబలతా, రచనా కళా, శిల్పదృష్టి, చలంగారి రచనల్లో ఎత్తువుగా తెచ్చిన సొమ్ములు గావు.

(త) అభ్యుదయ కవిత్వమూ, దానితోపాటు వచ్చిన అధి వాస్తవిక కవిత్వమూ రెండూ తెలుగు దేశంలో కొత్తగా అడుగు మోపాయి. ఈ రెండు ఉద్యమాలకూ, ఆదికవి శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావు. 1930—1935 సంవత్సరాల మధ్యకాలంలో ప్రపంచమంతా ఆర్థిక సంక్షోభవంతో హాహాకారాలు చేసినది. ధనికవాద రాజ్యాలూ, వాటి వలసలైన భారతదేశంవంటి దేశాలూ ఈ సంక్షోభ భద్రకాళికి బలియైపోయాయి. సోవియెట్ రష్యా సర్వోపద్రవాలకూ, అతీతంగావుండి, శరవేగంతో అభివృద్ధి సాధిస్తూ, ప్రపంచ పీడిత ప్రజాహృదయ క్షేత్రాల్లో ఆశాబీజాలు నాటినది. దుర్భర జీవిత రథచక్రాలక్రింద జనం నలిగిపోతూవుంటే కవుల గుండెలూ నలిగిపోయాయి. సోవియెట్ రష్యా సామ్యవాద భావాలు తెలుగు కవులను—ఈనాటికీ బయట పడకుండా వుండేటట్లు—తమ గుప్పిట్లోనికి లాక్కున్నాయి. భావ కవిత్వం అభావ కవిత్వంగా పరిణమించిన ఆ రోజుల్లో అభ్యుదయ కవిత్వం ఆవిర్భవించింది. ఆంధ్ర సాహితీ ప్రపంచానికి, "మరో ప్రపంచం" కన్పడినది. ఆ మరో ప్రపంచానికి "మహా ప్రస్థానం" సాగించినవారు శ్రీ. శ్రీ. శ్రీ.

"శ్మశానాలవంటి నిఘంటువులు దాటి, వ్యాకరణాల సంకెళ్లు విడిచి, ఛందస్సుల సర్ప పరిష్వంగం వదలి, వడిగా, వడి వడిగా" "వెలుగుల రవ్వల జడిగా" "నాలో కదిలే నవ్య కవిత్వం కార్మిక లోకపు కల్యాణానికి" అంటూ శ్రీ శ్రీ అభ్యుదయ కవిత్వం వ్రాశారు. శ్రీ శ్రీ వాక్కు నూతనాతి నూతనమయిన వాక్కు. మహా శక్తివంతమైన భాష ఆయనది. ఆ వాక్కులో, ఆ భావంలో ప్రతిభా, ప్రత్యేకతా గోచరిస్తాయి. ఒక ప్రత్యేక నూతన భావోద్యమానికి ప్రవక్త శ్రీ శ్రీ. ఇంతే గాక, అధి వాస్తవిక కవిత్వం అనే ఒక నూతన కవితోద్యమాన్ని వారు ప్రవేశపెట్టారు. సాహిత్యలోకంలో ఈ రెండు పద్ధతుల్లో కవిత్వం వ్రాసినవాడు శ్రీరంగం నారాయణబాబు. "తెలుగు దేశంలో శ్రీరంగం శ్రీనివాసరావు నారాయణబాబుగార్లు అధి వాస్తవిక రచనలు సాగించారు. కాని, యివి ప్రజామోదాన్ని పొందటంలేదు. "మరో ప్రపంచం"లాంటి శ్రీ శ్రీ గేయాలను మెచ్చుకొన్న ప్రజలే ఆ శ్రీ శ్రీ వ్రాసిన అధివాస్తవిక రచనలను మెచ్చుకోదంలేదు. వాటి భావా లేమిటో నాకు బోధపడలేదు. అధి వాస్తవికత పేరుతో మళ్లీ భావ రహితమైన శబ్దాడంబరంకొరకు ప్రయత్నాలు—డిల్లు జరుగుతున్నాయి" అని వ్రాసిన మద్దుకూరి చంద్రశేఖరరావుగారి వాక్యాలు సత్యములే. (ఆంధ్ర సాహిత్య పునర్వికాసం. పుట. 58).

"అందాము ప్రహ్లాద కవిత్వ మిది అని, అందాము అందుకొని ఆదరిద్దాము" అని అన్నాడు శ్రీశ్రీ. ఇక అక్కడనుండి అభ్యుదయ కవి పరంపర బయలుదేరినది. రామదాసు, "వచ్చాను వచ్చాను వ్యాస సంతతివాణ్ణి" అని అన్న అనిసెట్టి మొదలు రమణారెడ్డి వరకు ఎంతోమంది ధారాళంగా అభ్యుదయ కవిత్వం వ్రాసి, వ్యాప్తి చేశారు. శ్రీ శ్రీ కున్న సంప్రదాయజ్ఞత, భాషాధికారమూ వీరిలో ఎంతో మందికి లేవు. ప్రజా కవిత్వం అన్న వినాదాన్ని ఎక్కువగా చేసిన వీరు అభ్యుదయ భావాలను, కవితా స్ఫూర్తితో చెప్పలేకపోయారు. నానాటికీ వీరు రాజకీయంగా సంకుచిత పరిధుల్లో విహరించారు. అందుచే తర్వాత తర్వాత అభ్యుదయ కవిత్వంలో శ్రీ శ్రీ ప్రతిధ్వనులూ, వచన గుణమూ ఎక్కువైపోయాయి. అది ప్రచార సాహిత్యంగా పరిణమించినది. "ఆరుద్ర", "బైరాగి" మాత్రము అభ్యుదయ కవిత్వంలో బలపడిపోయిన వలుచదనాన్ని పరిహరించటానికి పాటుబడ్డారు. రమణారెడ్డిగారి "భువనఘోష" సాహిత్య భువనంలో ఒక ఘోషగానే మిగిలిపోయినది.

అభ్యుదయ భావాలతో రూపక రచన ఉదాత్త రీతుల్లో జరిగినది. దేశంలో అలజడి గలిగించిన రూపకాల్లో సుంకర, వాసిరెడ్డిగారలు రచించిన "ముందడుగు" "మా భూమి" ప్రత్యేకంగా పేర్కొనవలసినవి. అనేక విధాలుగా ప్రజలను సతమతపరచే ఆర్థిక సమస్యల్ని, కళాత్మకంగా చూపాయి ఈ రూపకాలు. కొన్నిచోట్ల వీటిలో కూడా రాజకీయ వివాదాలు లేకపోలేదు. శ్రీ ఆత్రేయ సుప్రసిద్ధ—అభ్యుదయ రూపక రచయిత. ఆయన రచించిన "ఎన్. జీ. వో." నవీన రూపకాలలో అగ్రగణ్యమయినది. ఎటువంటి ఆర్థిక సమస్యనైనా ఎంత కళాత్మకంగా చిత్రించవచ్చో ఋజువు చేసినదీ నాటకం. "పరివర్తన, విశ్వ శాంతి, భయం" అనే రూపకాలను ఆత్రేయ రచించారు. వీటిమీద ప్రపంచ సాహిత్య ప్రభావం బాగా వున్నది.

## 6

## 1947 వ సంవత్సరం తర్వాత

1947 వ సంవత్సరం తర్వాత అని వ్రాశానేగాని, ఆ యా నూతన ప్రక్రియలను, వాని లక్షణాలనువివరించే సందర్భంలో, ఆయా భావోద్యమాలగతులను గుర్తించే సందర్భంలో సౌలభ్యం కొరకు స్వాతంత్ర్యానంతరం వెలువడిన సాహిత్యం కొంతకుకొంత పరామర్శింపబడినది. ఆ పరామర్శను బట్టి చూస్తే, ఆయా భావోద్యమాలు ఇంకా తెలుగువారి మనస్సుల్లో పని చేస్తూ వున్నట్లు ద్యోతకమవుతుంది. వ్యావహారిక భాష గ్రాంథిక భాష అనే చర్చలకు అవకాశం లేకుండా పోయినది. రెండు రీతుల్లోనూ రచనలు సాగుతున్నాయి. అయితే ఒకటి మాత్రం జరుగుతూ వున్నది. వ్యావహారిక భాషను వ్రాసేవారు దానిలో కృత్రిమ గ్రాంథిక భాషా లక్షణాల్ని జొనుపుతున్నారు. గ్రాంథిక భాషలోనేమో, వ్యావహారిక భాషా లక్షణాలను అనుసరించుతున్నారు. రచయితలు రెండు వాదలనూ మేళగించి సామరస్యం కల్గించుదామనుకుంటూన్నారో యేమో తెలియదు. రచనల్లో వ్యక్తి స్వాతంత్ర్యము మరీ యెక్కువయినది. ఏ నియమమూ కాలానుకూలంగా పాలింపబడుతూ వున్నట్లు కానరాదు. మానవతావాదం అనేది కూడా అపమార్గాల్లో పడినది. మానవతావాదం అని వాక్పూరత ప్రదర్శించటం జరుగుతున్నదే తప్ప, దానిని కళాత్మకంగా దర్శించే ధోరణి మృగ్యమైనది. ఏదైనా ఒక నూతన భావోద్యమం బయలుదేరినదంటే దానిపట్ల విసుగింపు కల్గేంతవరకూ దానిని పాడిగిస్తూ, పాడినదే పాడటం మన కలవాటైనది. ప్రబంధ ప్రక్రియ, భావ కవిత్వోద్యమం, అభ్యుదయ కవిత్వం దీనికి తార్కాణాలు. ఒకతరంవారు భావ కవిత్వం, అభ్యుదయ కవిత్వం వ్రాయటం మానివేశారు. వారి తర్వాత వారు మరలా పాడటం మొదలు పెట్టారు. వానిని అనుసరింపగూడదని అనడంలేదు. కాని ఒకతరంవారు ఏ యే రీతుల్లో అయితేపోయారో మరలా అదే రీతుల్లో ఆ కోకిలలనూ, ఆ మలయమారుతాలనూ, ఆరాబందులనూ అలోహ్యాలనూ పరివారంగా చేసుకొని, ప్రయాణం సాగిస్తే ఏమంత బావుంటుంది. ఏదైనా ఒక నూతన లక్షణం ఆపాదించి పూర్వ పూర్వ మార్గాలకు మెరుగులు దిద్దుకుంటూ, నూతన పదాలను అన్వేషించటం అభ్యుదయానికి చిహ్నం. శ్రీ ధర్మారావునాయుడుగారు, "కొత్తపాళి"లో అన్నట్లు ఆంధ్ర రాష్ట్రంకంటె చిన్నదైన ఐరోపాదేశాల్లో నోబెల్ బహుమాన మందుకునే వారుంటే, మనలో—నోబెల్ బహుమానం సంగతి దేవునికి తెలుసు—తుదకు అఖిల భారత స్థాయిని గూడా పొందినవారు కరవయ్యారు. ఈ వాక్యం వ్రాస్తూ, ప్రపంచ కథానికల పోటీలో ప్రథమ బహుమానం పొందిన పాలగుమ్మి పద్మరాజులు ఈ తెలుగు గడ్డమీద వున్నారు అనే ప్రశ్న కూడా వెన్వెంటనే పుట్టుతున్నది. జాతీయ రాష్ట్రోదయ పర్వదినాలను పురస్కరించుకొని ఎంతోమంది కవికుమారులు ప్రాచీన వైభవాన్ని చాటుతూ, పద్యాలల్లుతూ వున్నారు. నవ్యాంధ్ర సాహిత్యంలో ఈ శతాబ్దం రెండు మూడు దశాబ్దాల్లో సుప్రసిద్ధులయిన వారియందు—ఏ యిద్దరనో, ముగ్గురనో మినహాయించితే—మిగిలిన వారందరూ అస్త్ర సంన్యాసం చేశారు. ఆ యా నూతన భావోద్యమాలు బయలు దేరటానికి ఏ చైతన్యం శక్తి ఆ యా రచయితలను ప్రేరేపించినదో ఆ శక్తి నానాడూ కొరవడుతూ వున్నట్లు ద్యోతకమవుతున్నది. అయితే సాహిత్య విస్తృతి జరుగలేదా అంటే జరిగినదనే సమాధానం చెప్పాలి. దానికి కారణం చైతన్యశక్తిగాదు. మరి భిన్నమైనది.

ఈ కారణాలను వెదకటంలో మనకు ముందుగా కన్పించేవి పత్రికలు. ఈనా డాంధ్రదేశంలో దిన, వార, పక్ష, మాస పత్రికలు చాలా వున్నాయి. విద్యావ్యాప్తివల్ల కొన్ని లక్షలమంది ఆ పత్రికలు చదువుతూ వున్నారు. ఆ పత్రికలు నిత్యమూ ఎన్నో నవలలను, ఖండ కావ్యాలను, ఏకాంకికలను, రూపకాలనూ, కథానికలను ప్రచురిస్తున్నాయి. మాసం గడిచేటప్పటికి అన్ని సాహిత్య ప్రక్రియలూ వందకుపైగా కొత్తవి వెలువడుతున్నాయి. ఈవిధంగా చూస్తే, గతించిన పదిహేనేండ్లలో ఆంధ్ర సాహిత్యం ఎంతగా విస్తృతి పొందినదో, ఎంతగా వైవిధ్యం సంతరించుకున్నదో అంతు లేకుండా వున్నది. వస్తువును ఆధారంగా తీసికొని, సమీక్షించటంకంటె ఆ యా భావోద్యమాలను ఆధారంగా చేసికొనే ఈ సాహిత్యాలను సమీక్షచేయవలసి వున్నది. ఆశాజనకమైన గొప్ప మార్పు గోచరిస్తున్నది. అనేకులు నూతన రచయితలు నవ్యాంధ్ర సాహిత్య వీధుల్లో విహరించుతున్నారు. పుష్కలంగా సాహితీ సేవ చేస్తున్నారు. కాని, "ఇదిగో వీరు ఈ నూతన భావోద్యమాన్ని ప్రారంభించారు" అని మనం సగర్వంగా చెప్పుకోటానికి ఎంతమంది లభించుతారు? అని కూడా మనం ప్రశ్నించుకోవాలి. గతం అంతా మంచిదనే ధోరణిలో ఈ వాక్యాలు వ్రాయటంలేదు. కొత్త పుస్తకాలతోపాటు, కొత్త భావాలూ, సాహిత్యంలో ప్రవేశిస్తే అది బలపవుతుంది. లేకపోతేనాసవుతుంది. రచయితలకు సన్మానాలెంత యెక్కువగా జరుగుతున్నాయో, ఆ నిష్పత్తిలో వారి గ్రంథాల్లో కొత్తదనం కన్పించటంలేదు. ఇప్పుడు ఒకా నొక సంధి దశ గోచరిస్తూ వున్నది. దీనిలోనుండి ఒక నూతన భావోద్యమం రాక తప్పదు. సాహిత్యం ఎక్కువగా పెరిగిపోవటానికి, "ఆకాశవాణి" చాలా దోహదం చేస్తున్నది. "ఆకాశవాణి"లో వివిధ ప్రత్యేక కార్యక్రమాలు అనుదినమూ నిర్వహింపబడుతున్నాయి. ఆ 'కార్యక్రమాల కొరకు ఎందరో రచయితలు ఎన్నో సాహిత్య ప్రక్రియలు సృష్టించుతున్నారు. ఇక మూడవ కారణం పుస్తక ప్రచురణ సంస్థలు. ఇవి తెలుగునాట చాలా వున్నాయి. అవి చాలా గ్రంథాలను ప్రచురించుతున్నాయి. స్వదేశ విదేశాల్లోని ఉత్తమ రచనలను అందిస్తున్నాయి. అయితే మిగుల దారుణమైన విషయమేమిటంటే ఆ పుస్తకాల ఖరీదులు నానాడు ఆకాశాన్నంటుతున్నాయి. ఏదైనాపుస్తకం ఖరీదుని నయా పైసల్లోకి మారిస్తే, ఆ నయా పైసల మొత్తంలో మూడోవంతో, నాలుగోవంతో పేజీలు మాత్రమే ఆ పుస్తకంలో మనకు కన్పిస్తాయి. పరిశోధనా గ్రంథాలకు—కొనేవారూ, అవసరమైనవారూ తక్కువమంది కాబట్టి—అధిక మూల్యం నిర్ణయించటంలో ధర్మం గోచరిస్తుంది. కాని ఈ పుస్తకాల ధరలు అట్లాగాదు. చదివే వారెక్కువయిన కొలదీ ఈధరలూ ఎక్కువవుతాయి. ప్రభుత్వ వైయక్తిక ప్రయత్నాలవల్ల మూడు పూలూ, ఆరు కాయలుగా గ్రంథాలయోద్యమం అభివృద్ధి చెందుతున్నది. తత్ఫలితంగా పుస్తకాలధర లెంతగా మిన్నంటినా చెల్లుబడి అవుతున్నది.

స్వాతంత్ర్యానంతరం నవీన సాహిత్యంలో అనువాద సాహిత్యం త్రివిక్రమ రూపం దాల్చినది. ఈ శతాబ్దినుండి అనువాద సాహిత్యం లేకపోలేదు. వేంకట పార్వతీశ్వర కవులూ, వేలూరి శివరామశాస్త్రిగారివంటి పెద్దలూ, తదితరులూ వంగభాషనుండి పాశ్చాత్య భాషలనుండి ఉత్తమ సాహిత్యాన్ని జాను దెనుగులో అనువాదం చేశారు. 1947 వ సంవత్సరం తర్వాత ఈ అనువాద సాహిత్యం పెరిగి

పించటానికి పత్రికలూ, ప్రచురణ సంస్థలూ తోడ్పడ్డాయి. తెన్నేటి సూరి, వండూరి రామమోహనరావు, విద్వాన్ విశ్వం, బెల్లంకొండ రామదాసు మున్నగు వారు ప్రపంచ భాషలలోని గొప్ప గ్రంథాల్ని అనువదించి, ఈ సాహిత్యాన్ని ఎంతో పెంపొందింపజేశారు. నవలలేకాక, ఏకాంకికలు, కథానికలు, రూపకాలు, ఆ యా ప్రపంచ సాహిత్యాలనుండి వచ్చాయి. క్రమ క్రమంగా ఒక మార్పు గోచరిస్తున్నది. ప్రాచీన భారతీయేతర పోసాదులను, కావ్యాలను సులభమయిన వచనంలోనికి అనువదించటానికి రచయితలు ప్రారంభించారు. దీనికి నాంది పాడినది "ఆంధ్రపత్రిక" దిన పత్రిక. శ్రీనివాస శిరోమణి వాల్మీకి రామాయణాన్ని అనువదించారు. భారత భాగవతాలు అనువదింపబడుతున్నాయి. కిరాతార్జునీయం, కాదంబరి, దశకుమార చరిత్రలు అనువదింపబడినవి. కొంతకాలం నడిచిన "పరిశోధన" పత్రికలో రామచంద్ర వేంకట రమణయ్యల "లలిత విస్తరం" అనువాదం ప్రచురింపబడింది. పై చెప్పిన గ్రంథాలలో కొన్నింటికి పూర్వకాలంలోను, నవీన కాలంలోను అనువాదాలు వుండవచ్చుగాక! కాని అక్షరాస్యుడైన వానికి విజ్ఞాన భాండాగార ద్వారకవాటాలను తెరచుదామనే ప్రయత్నం ఆ గ్రంథాల్లో కన్పించదు. మరి నేటి అనువాదాలు శిష్ట వ్యావహారిక భాషలో నడుస్తూ, నలుగురకూ అర్థం కావాలనే ధోరణిలో వున్నాయి.

మనకు పాశ్చాత్య భాషా సాహిత్యాలతో, పరిచయమున్నంతగా ఆంధ్రేతర భారతీయ సాహిత్యాలతో పరిచయంలేదు. ఇరుగుపొరుగు భాషలతోడి పొత్తు ఇప్పుడిప్పుడే నెలకొంటూ వున్నది. ఆంధ్ర భాష ద్రావిడ భాషా కుటుంబానికి చెందినప్పటికీ, తులనాత్మక సాహిత్యాధ్యయనం కుంటుపడింది. దత్తమండలానికి చెందిన రచయితలు రామచంద్రవంటివారలు తులనాత్మక పరిశీలనం చేస్తూ వున్నారు. తమిళ భాషలో అగ్రశ్రేణికి చెందిన కావ్యం "కంబ రామాయణం", "తిరుక్కురల్" సుబ్రహ్మణ్యభారతి కృతులు, రాజగోపాలాచారి గ్రంథాలు అనువదింపబడ్డాయి. దక్షిణ భారత పుస్తక ప్రచురణ సంస్థవల్ల ద్రావిడ భాషల్లోని సాహిత్యం అనువదింపబడుతూ వున్నది. ఈ ప్రచురణసంస్థ ప్రపంచ భాషల్లోని ఆ యా ప్రక్రియలను అందిస్తున్నది. ద్రావిడ భాషా తులనాత్మక పరిశీలనా రంగంలో చల్లా రాధాకృష్ణశర్మగారు ప్రశంసనీయమయిన కృషిచేస్తున్నారు. మరుపూరు కోదండరామిరెడ్డిగారు శిలప్పదిగారాన్ని "మంజీర గాథ"గా సంతరించారు. ఇక హిందీ మొదలయిన ఆర్యావర్త భాషల సాహిత్యం గూడా ఎక్కువైనది. ప్రేమచందు జైనేంద్రకుమార్ల నవలలు తెలుగువారిని శరత్‌బాబు నవలల్లాగా లోగొన్నాయి. పూర్దూభాషనుండి "గాలిబ్ గీతాలు" వచ్చాయి. బుద్ధ జయంతి వలన బౌద్ధ సాహిత్యం రూపొందినది. శత వార్షిక జయంతివలన రవీంద్రుడు సజీవుడయ్యాడు. ఒక వ్యక్తిగాదు. ఒక ప్రచురణ సంస్థగాదు—ఎందరో వ్యక్తులు, ఎన్నో సంస్థలు రవీంద్ర సాహిత్యాన్ని ప్రబలంగా ప్రచారం చేయుటానికి ప్రయత్నించటం జరిగినది. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు దీనికి బాగా దోహదం చేశాయి. ఇదే సమయంలో రవీంద్ర సాహిత్యానువాదాల్లో రవీంద్రుని మూర్తి ఏ రూపంలో గోచరించుతూ వున్నదని మనం ఆత్మ పరిశోధనం జేసికొనటం గూడ మంచిది.

తెలంగాణాలో జరిగిన సాహిత్య సృష్టిని ప్రస్తావించి, యీ భాగానికి భరత వాక్యం పలుకుతాము. తగినంత ప్రచారం లేక, యితరులకు తెలియదుగాని, ఈ శతాబ్ద ప్రారంభంనుండి అచట ఎంతో గొప్ప సాహిత్య వ్యవసాయం జరుగుతూనే వున్నది. భారత ప్రభుత్వ సైనిక చర్యతో, ఆంధ్ర ప్రదేశావతరణముతో తెలంగాణమునకు, సాగరాంధ్ర దత్తమండలములకూ ప్రగాఢ సంబంధం ఏర్పడినది. తెలంగాణములో నవ్య యుగ శంఖమెత్తినవారు కొమర్రాజు లక్ష్మణరావుగారు. వారి ప్రోత్సాహంతో నెలకొన్న శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయమూ, రాజ నరేంద్ర భాషా నిలయమూ, విజ్ఞాన వ్యాప్తికి ఎంతో దోహదం చేశాయి. తెలంగాణా సాహితీ పునరుజ్జీవనంలో నేడు దేవులపల్లి రామానుజరావుగారు సారథ్యం వహించిన "ఆంధ్ర సారస్వత పరిషత్తు" మహా పాత్ర నిర్వహించినది.

పేరు తెలంగాణమయినా, ఆ ప్రాంతంలో కొలువు సింగారమై కూర్చున్నవాడు ఉస్మాన్ అలీఖాన్. మహమ్మదీయేతరుల చిరువేడి నెత్తురులను వన్నిటి

ఖిల్జీగా పరిగణించిన విలాస పురుషుడై ప్రముక్కడి యేలుబడిని కత్తులతో సాగించిన కుబేరు డాయన. భారతదేశంలో సౌరభ్యాలను జిమ్ముతూవున్న సాంస్కృతిక పునరుజ్జీవన కుసుమం నైజాము నవాబు అర్ధచంద్ర ధ్వజంక్రింద ముకుళించుకొని పోయినది. ఉర్దూను రాజభాషగాచేసి, తెలుగుపట్ల సవతితల్లి వలపును చూపిన వాడా ప్రభువు. తెలంగాణమునకు, శేషాంధ్ర దేశమునకు నెయ్యము బిగియకుండా నిరోధించినాడు. అయినా కొందరు విజ్ఞానమూర్తుల నిర్విరామకృషి ఫలితంగా అంధకార బంధురమైన ఆ ప్రదేశంలో జ్ఞానద్యుతులు ప్రసరించాయి. ఈ సందర్భంలో ప్రాతః సంస్మరణీయులయినవారు సురవరం ప్రతాపరెడ్డిగారు, మాడపాటి హనుమంతరావుగారు. ఈ సంఖ్యావన్మణుల నిరంతర ప్రయత్నాలవల్ల తెలంగాణములో సారస్వతోద్యమమూ, ఆంధ్రోద్యమమూ, గ్రంథాలయోద్యమమూ, దిన దినాభివృద్ధిని పొందాయి. ఇతరాంధ్ర దేశంలో సాహిత్యాభివృద్ధి వ్యక్తులను ఆశ్రయించితే, తెలంగాణంలో అది సంస్థలను ఆశ్రయించినది. అది అక్కడ ఒక నిర్మాణాత్మకోద్యమంగా భాసించినది. గద్వాల మున్నగు సంస్థానాల్లో సంస్కృతాంధ్ర భాషా పండితసింహాలెందరో వున్నారు.

తెలంగాణంలో కూడా నూతన సాహిత్య ప్రక్రియలను తెలుగులో సృష్టించవలెననే ఉద్యమం బాగా వేరు దన్నినది. ఈ ఉద్యమం ప్రారంభించినవారు మాడపాటి హనుమంతరావు. సిద్ధహస్తులు. కృష్ణా పత్రికలో వీ రెన్నో కథలు ప్రకటించారు. సురవరం ప్రతాపరెడ్డిగారు ఒక జంగమ విజ్ఞాన సంస్థ. వీరూ కథానికలు రచించారు. ప్రతాపరెడ్డిగారు రచించిన "ఆంధ్రుల సాంఘిక చరిత్ర", "రామాయణ విశేషములు" సమస్తాంధ్ర దేశ విద్యావంతుల దృష్టిలో గొప్ప మార్పును తీసికొని వచ్చాయి. లక్ష్మణరావుగారి అడుగుజాడల్లో నడుస్తూ, విశిష్ట చరిత్ర రచనలు గావించి, నిష్కామ సాహితీ సేవ గావించువారు ఆదిరాజు వీరభద్రరావుగారు. బూర్గుల రామకృష్ణారావుగారు సారస్వత వ్యాసములను రచించుటేకాక, ఉమర్ ఖయ్యామ్ రుబాయితులనూ, పండితరాయకృతులనూ అనువదించారు. తెలంగాణములో ఆ యా ఉద్యమాల ప్రభావం కాలక్రమానగాని, స్పష్టంగా కన్పడదు. కావ్యాలు, ఖండ కావ్యాలు, కథానికలు ఎన్నో నూతన పద్ధతుల్లో వెలువడినాయి. కథకులలో మిగుల ప్రఖ్యాతిగాంచినవారు భాస్కరభట్ల కృష్ణారావుగారు. కథానికను ఒక మనోహర ప్రక్రియగా వీరారాధించుతున్నారు. సమాజమందలి ఒడుదుడుకులను చిత్రించి, సాంఘికాభ్యుదయమును బోధించు కథానికలను, కావ్యఖండాలను పొట్లపల్లి రామారావుగారు రచించారు. ధరణికోట శ్రీనివాసులుగారు "ముని మాణిక్యం" ప్రభావంతో సాంసారిక సంఘటనలతో కూడిన కథలు రచించుతున్నారు. ఇల్లిందల సరస్వతీదేవిగారు ఉత్తమ కథకులు రచించువారిలో ఒకరు.

అన్ని రకాల భావోద్యమాలనూ, జీర్ణము చేసికొన్నవారు దాశరథి కృష్ణమాచార్యులుగారు. "నా తెలంగాణ కోటి రత్నాల వీణ" అంటూ, "కింగ్ కోఠీ" ప్రాకారం బ్రద్దలయ్యేటట్లు నాయెత్తి పాడినవారు దాశరథిగారు. శ్రీ దాశరథి కవిత్వం చెప్పనేర్చిన కాపయ్య నాయకుడు. అభ్యుదయ కవిత్వధోరణి జాతీయ రాష్ట్రోద్యమాల గమనములూ, "అగ్నిధార", "రుద్రవీణ" "మహాంధ్రోదయం" కావ్యాల్లో కన్పించుతాయి. బుద్ధ జయంతి సందర్భంలోవారు, "మహాబోధి" రచించారు. మరి నారాయణరెడ్డిగారిలో భావ కవితాభిమానం స్పష్టంగా కన్పడుతున్నది. స్వాతంత్ర్యానంతరం గేయ కవిత్వాన్ని శక్తివంతంగా సృష్టించిన వారిలో సర్వాంధ్రదేశంలోనూ నారాయణరెడ్డిగారగ్రగణ్యులు. మాత్రానియతిని పాటించి, పాదాదియతిని నేముకుంటూ, భావ బలోచితంగా నడక మార్చుకొంటూ, వీరి గేయ కవిత్వం రాణ కెక్కినది. ఆయన కవితా శక్తి "నాగార్జున సాగరము"లో కంటె, "కర్పూర వసంతరాయలు"లో బహుళంగా కన్పడుతున్నది. ఏకాలంనాటి యితివృత్తమైనా, మొదట నారాయణరెడ్డిగారు శృంగార రసప్రధానంగా రచన సాగించారు. "విశ్వనాథ నాయకుడు", "సమ దర్శనం" పై మాత్రానికి భిన్నంగా నడిచాయి. తెలంగాణాలో వుంటూ, అధి వాస్తవిక కవితా ప్రభావంతో వచన పద్య రచన సాగించేవారు కుందుర్తి ఆంజనేయులుగారు. గేయకవులలో ఉక్తి వైచిత్రి, భావోద్రేకముగల ప్రజా కవి కాళోజీ నారాయణరావుగారు. సమకాలిక పరిపాలనా పద్ధతిని వ్యంగ్య రచనల ద్వారా వారు తూర్పార బట్టారు. వానమామలై వరదాచార్యుల రచనల్లో శ్రీనివాస సోదరుల రచనల్లో ప్రాచీన, నవీన కవితా సంప్రదాయ సమ్మేళనం కన్పడుతున్నది. పల్లా దుర్గయ్యగారు "గంగిరెద్దు" అనే సాంఘిక కావ్యం రచించారు. పద్యాలతో, గీతాలతో నిండినవారి "పాలవెల్లి" రమ్యమయిన ఖండ కావ్యము.

## 7

ఈ శతాబ్దంలో ఆంధ్ర భాషా పరిణామాన్ని అవలోకిస్తే ఆశ్చర్యం కల్గుతున్నది. ఆంధ్ర భాషా సరస్వతి నోచిన నోములు తక్కువయ్యో ఏమో కాని, ప్రాచీనకాలంనుండీ ఎందరకో దాని ప్రకృతి అంతు పట్టలేదు. తెలుగులో కావ్యాలు రచించినవారు గీర్వాణ వైదగ్ధ్యాన్ని చూపించి, జోహారులందుకొన్నారు. ఇట్లాంటి వారిని జూచే కాబోలు మొల్ల

"మును సంస్కృతముల దేటగ
దెనిగించెడి చోటనేమి దెలియకయుండన్
దన విద్య మెరయ గ్రుమ్మర
ఘనమగు సంస్కృతము చెప్పగా రుచి యగునే"

అని చెప్పినది. శిల్పావిష్కరణానుకూలంగా సంస్కృత భాషను ఆదరించవచ్చు. కాని, సంస్కృత శ్లోకమా? తెలుగు పద్యమా? అని అనుమానం కల్గేంతవఱకూ పోయారు ప్రాచీనులలో కొంతమంది. మఱి ఇప్పుడు మనతలపై తాండవం జేస్తున్నది ఆంగ్ల భాష. ఆంగ్ల భాషా ప్రభావం ఎంతవరకు వచ్చిందంటే, "మనం ఇంగ్లీషు రచనచేస్తే తెలుగు మర్యాదలూ, తెలుగు రచనచేస్తే ఆంగ్ల మర్యాదలూ దొరులుతూ వుంటవి." తత్ఫలితంగా ఒక విధమైన "ఆంగ్లో—ఆంధ్రభాష" ఈ కాలంలో ఏర్పడినది. ఒకనాడు దేవభాష తెలుగులో వున్న కొన్ని కొన్ని పదాలనే మాయం జేసినది. ఈనాడు ఆంగ్లభాష సార్వభౌమాధికారాన్ని—రాజకీయంగా కాకపోయినా—రచనల్లో చలాయిస్తున్నది. ఇది చాలదేమో అన్నట్లు ఇప్పుడు హిందీ త్రుళ్ళు ఎక్కువైనది. చూస్తూ, చూస్తూ వుండగానే తెనుగు నుడికారానికి సజీవ సమాధి ప్రాప్తిస్తున్నది. అన్య భాషా సంబంధం అక్కరలేదనిగాని, మడికట్టుకోవాలనిగాని నేననటంలేదు. అన్య భాషా మైత్రివలన ఏ భాషకైనా పుష్టి కల్గుతుందేకాని, నష్టిరాదు. కాని, ఆంధ్ర భాషా సంప్రదాయం అదృశ్యమైపోయేటంతగా ఇతర భాషల చుట్టరికాన్ని ఇచ్చగించటం నాగరక లక్షణమేమోకాని, విజ్ఞతకు తార్కాణంగాదు.

ప్రతి భాషకూ, ఒక ప్రత్యేక స్వభావం వుంటుంది. దానిలోవుండే నుడికారం, నానుడులూ, పదబంధాలూ తదన్యభాషల్లో కన్పడేవానికంటె భిన్నంగా వుంటాయి. ఆ యా భాషల్లో వాక్య నిర్మాణం వివిధ విన్యాసాలు చూపుతూంది. జీవద్భాషఅయిన ఆంధ్ర భాషలో కూడ అంతే. తెలుగు భాషలోని కారకం, వాక్య నిర్మాణం, జాతీయాలు, నుడికారం తత్స్వభావాన్ని తేట తెల్లం చేస్తాయి. ఇవి మన భాషకు ప్రాణం వంటివి. ఈ ప్రాణం పోయేటంతగా భాషా శరీరానికి ఎన్ని అన్య భాషా సంప్రదాయాలంకారాలు తగిలించినా వ్యర్థమే. వ్యావహారిక భాష పేరుతో ఈనాడు మనం జేస్తున్నదంతా ఇదే. ఏనాడో ఈ విషయాన్ని గుర్తించిన కాటూరి వేంకటేశ్వరరావుగారు ఇట్లా చెప్పారు. "వ్యవహార భాషా వాదానికి సౌలభ్యము జీవగఱ్ఱ. భాషా సౌలభ్యం ప్రాజాపత్యమునకు జెలిమికత్తె అయ్యు, మన పూర్వాంధ్ర సాహిత్యము ఏ వ్యవహార భాష మన బాల బాలికలకు దూర మొనర్చునేని, దాని సౌలభ్యానికి వేయి నమస్కారాలు. పోనీ భాషా స్వభావానికి తిలోదకాలు విడిచియైనా సౌలభ్యం సాధించగలిగామూ అంటే అదీ సందేహమే. ఆంగ్ల భాషావేత్తలకేగాని, మన రచనలు పూర్తిగా బోధపడవేమో అనుకుంటాను. వ్యవహారంలోవున్న కొన్ని క్రియా రూపాలూ, కొన్ని అపభ్రంశాలూ వాడినంత మాత్రంచేత భాషకు సౌలభ్యమూ లభించదు. వాటిని విడిచిపెట్టితే కాఠిన్యమూ ఏర్పడదు. ఆంగ్లభాష విదులుగాని జానపదులకు సులభంగా గ్రాహ్యమయ్యే భాషను గ్రంథకర్తలు నేర్చుకోవలసి వుంటుందని తోస్తుంది" (తెలుగు వ్యాసములు, పుటలు 155, 156). ఆంగ్లభాషే అని అనుకుంటామేగాని, మన విడరాని నెయ్యమైన దేవ

భాషకూడా నేడేమీ తక్కువ అపకారం చేయటంలేదు. కొందరి రచనలు చదివితే ఆంధ్ర వాక్య నిర్మాణం ఎంత గీర్వాణ స్వభావాన్ని అలవరచుకున్నదో తెలుస్తుంది. ఈనాటి విద్యార్థుల పాఠ్య గ్రంథాల్లో సంస్కృతాంగ్ల భాషా సంప్రదాయ ప్రయుక్తమైన ఆంధ్ర భాష సాక్షాత్కరించుతున్నది.

ఈనాటి రచనల్లో సభ్యత అనేది కూడా మందుకైనా కానరావటంలేదు. మనస్తత్వచిత్రణం పేర ఎంతో అనాహూతం జరుగుతూ వున్నది. ఫ్రాయిడ్, యూంగ్ చెప్పిన మనస్తత్వ శాస్త్ర లక్షణాలపేర ఇతివృత్త గ్రహణంలో, పాత్ర పోషణంలో సన్నివేశ కల్పనంలో ఒక విధమయిన కృత్రిమగుణం ఎక్కువైనది. కామము, ప్రేమా, ప్రణయం అన్న మూడు పదాలూ ఒకదానికొకటి పర్యాయ పదాలు కావు. ప్రథమ తత్వానికి పట్టంగట్టే రచనలు ఉద్వేగాన్ని పెంపొందించి, క్షుద్రాభిరుచులను ప్రకోపింపజేయటంతప్ప సాధించేదేమీ లేదు. అట్లా చేయటం ఉత్తమ సాహిత్య లక్షణమూకాదు. కామాన్ని, సాహిత్యావరణంనుండి వెలి వేయమని ఎవరూ అనరు. మానవుడు సాధింపదగిన పురుషార్థాల్లో కామార్థం ముఖ్యమైనది. బలీయమైనదీనూ. అట్లాంటప్పుడు మానవుడు సృష్టించే సాహిత్యంలో దానికి అగ్రాసనం లేకుండా వుంటుందా? కాని ఆ మానవుడే సభ్యతలనే సత్సంప్రదాయాన్ని కూడా నెలకొల్పుకొన్నాడు. ఈ సంప్రదాయంవలన ఉపకారమే కాని అపకారం ఏ మాత్రమూ జరగదు. కాబట్టి దీన్ని త్యజింపరాదు. దైనందిన వ్యవహార వేష భాషల్లో ఎంతో సభ్యతను—అవసరాన్ని మించి కూడా పాటించే మనం సాహిత్యంలో మాత్రం ఎందుకు దూరంగా వుండాలి? ఈ సందర్భంలో చాల మంది గుడిపాటి వెంకటచలంగారిని వుదాహరించుతారు. బాగానే వున్నది. వెంకటచలంగారి రచనల్లో పాత్ర పోషణమూ, శిల్పదృష్టి లుప్తమైపోయి, కేవలం ప్రత్యక్ష కామ వర్ణనలు మాత్రమేవున్న రచనలు ఎన్ని వున్నాయో వాటిని ఉదాహరించేవారు పరిశీలించటం మంచిది. సాహిత్యం కూడా మానవ జీవితం లాంటిదే. మానవుని శరీరంలోగాని, గుణగణాల్లోగాని, ఏక దేశాభివృద్ధిని ఎవ్వరూ హర్షించరు. సర్వ విషయతుల్యాభివృద్ధిని మానవుడు వాంఛించుతాడు. ఆతత్త్వం సాహిత్యంలో కూడా ప్రతిబింబించటం సహజము. సుందరమూనూ. ముఖ్యంగా "సెంటిమెంట్" అనేది నానాటికీ రచనల్లో వికృతరూపం ధరిస్తున్నది. ఏ జాతికయినా, తాత్కాలికాభిరుచులతోపాటు, కొన్ని ముఖ్య ధర్మాలూ వుంటవి. ఈ ధర్మాలను చిత్రించుతూ, రచనలు సాగిస్తే, అవి సాహిత్యంలో శాశ్వతంగా నిలుస్తాయి. అంతేగాని, మనస్తత్వంపేర, కొత్తదనంపేర, కేవల క్షుద్రాభిరుచి వర్ణనాలు విచ్చలవిడిగా పెచ్చుపెరిగిపోవటం ఏమంత మంచిదిగాదు.

ఈ యుగం పద్య కవిత్వానికి స్వస్తిచెప్పినదని అనుకుంటున్నామేగాని, ఆ సాహిత్య ప్రక్రియ కూడా ఎంతో పెరిగిపోతున్నది. తెనుగుదనం మాత్రం తగ్గిపోతూ వున్నది. కవిత్వానికి ఆత్మ అనేది ఒకటి వున్నదనీ, అక్షర రమ్యతవల్ల మాత్రమే అది కన్పడదనీ, ఎవ్వరూ గుర్తించుకోవటంలేదు. ఖండంగాకావచ్చు, అఖండంగా కావచ్చు. కవిత్వంలో రస భావములు, వూహ, ప్రతిభ విస్తరిల్లాలి. ఇవిలేనినాడది గణబద్ధమయిన శుష్క వచనం మాత్రమే అవుతుంది. వచన పద్యాలనే నూత్న ప్రక్రియ ఈనాడు బహుళంగా కన్పిస్తున్నది. ప్రాచీనాంధ్ర సాహిత్యంలో భక్తి భావోప బృంహితములైన "గద్య" లున్నాయి. వానిలో భావ శబలత గోచరించుతున్నది. అదే ఈనాటి వచన, పద్యాలలో కానరావటంలేదు. తేలికగా వుండాలని పేలవమైన వచనపద్యాలను వ్రాస్తే ప్రయోజనం శూన్యం.

రచనల్లో వైయక్తిక రాగ ద్వేషాలు దట్టంగా నెలకొంటున్నాయి. జీవితంలో ఏవో ఒక సందర్భంలో ఇతరుల తంత్రాలవల్ల ప్రతి వ్యక్తీ దెబ్బతినటం జరుగుతుంది. ఎవరు మంచివారనే చర్చ చేయటం దుశ్శకం. ఆ సందర్భంలో అశక్తత ప్రదర్శించిన ఆ వ్యక్తి లౌకికంగా ఏమీ చేయలేక పగబూని సాహిత్య ప్రపంచంలో కలం అనే కటారిని ధరించి, ప్రతీకారం చేయటానికి ప్రయత్నించుతాడు. పేరు పొందినవారే ఈ విషయంలో పెడక్రంతలు పట్టారు. ఇతర వ్యక్తుల పట్ల, ఇతర సంస్కృతులపట్లవుండే అసూయా ద్వేషాలతో, స్వసంస్కృతి దురభిమానంతో ఆ యా ప్రక్రియలు వ్రాయబడటం గర్హింపదగినది.

## 8

(క) నవీన సాహిత్యంలో అనన్య ప్రచారం పొందిన సాహిత్య ప్రక్రియ కథానిక. పాశ్చాత్య కథానికా నిర్మాణ సూత్రాలను అనుసరించి వస్తు వైవిధ్యంతో బహువిధ కథన నైపుణ్యంతో ఆంధ్ర కథానిక ఆకృతి వహించుతున్నది. వేలూరి శివరామశాస్త్రి మొదలు తాళ్లూరి నాగేశ్వరరావువరకూ వున్న రెండు మూడు తరాలవారు వేలకువేలు కథానికలు సృష్టించారు. "కరుణ కుమార" సంఘంలో వున్న సన్న జీవాల దుస్థితిని కరుణరస భరితంగా చిత్రించారు. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు హైందవాచార దుష్పరితాలను కన్నులకు కట్టినట్లు చూపారు. మల్లాది రామకృష్ణశాస్త్రిగారి కథలు జానుతెనుగు సొయగంతో పరవశింపజేస్తాయి. అడివి బాపిరాజు కథానికల్లో ఆంధ్ర సంస్కృతి రమణీయ భంగిమలతో కన్పట్టుతుంది. త్రిపురనేని గోపీచందుగారు మిక్కిలి చిన్నవైన కథానికలు వ్రాశారు. ఇతరులు పది వాక్యాల్లో చెప్పినదాన్ని గోపీచందుగారు ఒక్క వాక్యంలో చెప్తారు. సమకాలీన రాజకీయార్థిక, సాంఘిక సిద్ధాంతాల శక్తి వారి కథానికలను నడుపుతూ వుంటుంది. మనస్తత్వ సిద్ధాంతములను ఆధారంగా చేసికొని, చిత్త ప్రవృత్తి పరిణామాలన్ని తిన్నగా సూచించే కథలను పాలగుమ్మి పద్మరాజుగారు, బుచ్చిబాబుగారు, హితశ్రీగారు రచించారు. "రాజ తరంగిణి" ఆధారంగా గణపతిశాస్త్రిగారు భావ బంధురమైన కథలు రచించారు. "భరద్వాజ" గారు చలంగారిని అనుసరించాలని ప్రయత్నిస్తున్నారు. పత్రికలు, కథా రచనకు ఎంతో ప్రోత్సాహం కల్గిస్తున్నాయి. కథానికల్లో ఆదర్శంకంటె వాస్తవికత ఎక్కువ. ఇతివృత్త నాయికా నాయకుల విషయాల్లో ఏ భేదమూ పాటింపబడటంలేదు. అభూత కల్పనలూ, అలౌకిక వర్ణనలూ నేటి కథానికల్లో కన్పింపవు. సమస్యా పరిష్కారం ప్రధానంగా కొన్నిటిలో కన్పిస్తున్నది. జరిగిన సంఘటనలో, జరుగబోయే సంఘటనలో కథానికల్లో వర్ణింపబడుతున్నాయి.

(చ) పై వాక్యాలు ఏకాంకికలకు కూడా అన్వయించుతాయి. 1943వ సంవత్సరం తర్వాత ఏకాంకికలు పుంఖానుపుంఖంగా బయలు దేరాయి. ముద్దుకృష్ణగారీ రంగంలో ఎంతో కృషి చేశారు. ఏకాంకికా పరిమాణంలో నార్ల వెంకటేశ్వరరావుగారి "కొత్త గడ్డ" ఒక మహా ప్రస్థానప్రాయమైనది. ఇది అన్ని విధాలా అచ్చమయిన తెలుగు రచన. నవీన నాగరికతవల్ల గ్రామ జీవితం ఎన్ని మార్పులకు లోనైనదో, విద్యావంతుల దృక్పథంలో క్రమక్రమంగా ఎట్లా పరిణామం వస్తున్నదో "కొత్తగడ్డ" అద్దంలో చూపినట్లు చూపుతున్నది. "కాల వర్షి"లో మాదిరిగా, దీనిలో జానుతెనుగు ఎన్నో సొగసులు చిమ్ముతున్నది. మల్లాది అవధాని, విశ్వనాథ కవిరాజు, గోరాశాస్త్రి ఎన్నో ఏకాంకికలు రచించారు. మరి తర్వాతి వారిలో అంగర సూర్యారావు, రావికొండలరావు, కొండముది శ్రీరామచంద్రమూర్తి మున్నగువారు ఏకాంకికలు సృష్టించుతున్నారు. పాశ్చాత్య భాషల్లో వెలువడిన ఏకాంకికలు మనవారికి ఉత్తేజాన్ని కల్గిస్తున్నాయి. తదుత్తేజభూయిష్ఠములై, ఎన్నో ఏకాంకికలు వెలువడుతున్నాయి. పాత్ర సృష్టిలో, రస భావ వర్ణనలో, సంవిధానంలో ఇంకా అభారతీయ ఫక్కిక గోచరించుతూనే వున్నది. అయితే దీన్ని త్యజించాలనే ఆరాటమూ కన్పించుతూనే వున్నది.

(ట) స్వాతంత్ర్యానంతరం ఎన్నో నవలలు రచింపబడ్డాయి. మొదట విక్టోరియా మహారాణి కాలమునాటి నవలల ప్రభావం గోచరిస్తే తర్వాత హక్స్లీ, సోమర్సెట్‌మామ్స్, బాల్జాక్, జాయిస్, జాన్‌పాల్ సార్త్రే, ఆల్బర్ట్ మురేవియా, డి. హెచ్. లారెన్స్ మున్నగువారు రచించిన నవలల తత్త్వానుసరణం కన్పిస్తున్నది. నవలల్లో ఎక్కువ సాంఘికమైనవి. చంఘిజ్ ఖాన్, ప్రతాపరుద్రీయం వంటి చారిత్రాత్మక నవలలు రాకపోలేదు. సాంఘికనవలలు, సాంఘికరంగంలో వచ్చిన, వస్తూవున్న మార్పులను ఎక్కువగా చూపుతున్నాయి. గ్రామాలలో సాంఘికంగా, రాజకీయంగా వచ్చే మార్పులు, మధ్యమ తరగతికుటుంబాల దుర్భర పరిస్థితులు, స్త్రీ పురుషసంబంధ పర్యవసానమూ, వ్యక్తిగత జీవితంలో మహాపద సంభవించినపుడు తట్టుకొన్న—తట్టుకోలేని చిత్తప్రవృత్తి, కుల జాతి సామరస్యమూ, విద్యార్థి జీవన విధానమూ—ఇంకా ఎన్నో ఆయా నవలల్లో కథా బీజాలుగా వున్నాయి. కొడవటిగంటి కుటుంబరావుగారు చలంగారి పోకడలుగల,

మనస్తత్వ విరూపణం నిండిన నవలలు రచించారు. వారి "చదువు" కె. ఎ. అబ్బాస్ "ఇంక్విలాబ్"లాగా నేటి భారతదేశ చరిత్రను తెలుపుతుంది. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత దేశంలో వచ్చిన మార్పులను, గ్రామసీమ రంగపీఠంలా—ఫ్రాయిడ్ సృష్టశాస్త్రం, నవీన విద్యార్థిమనస్తత్వం మేళవించి—జి. వి. కృష్ణారావు గారు "కీలు బొమ్మలు" రచించారు. శిల్పమూ, తెలుగు పలుకుబడి సొంకమూ ఈ నవలలో రాటుదేలాయి. ఉప్పల లక్ష్మణరావుగారు రచించిన "అతడు—ఆమె" స్త్రీ పురుష సంబంధాన్ని చిత్రించే నవల. బుచ్చిబాబుగారి "చివరకు మిగిలేది" ఆంధ్ర రాష్ట్రోద్యమచ్ఛాయలు, నిశిత మనస్తత్వ పరిశీలనమూ కలది. "అసమర్థుని జీవయాత్ర" రచించిన గోపీచందుగారు ధారాళంగా నవలలు రచించుతున్నారు. గోపీచందుగారి భావపరిణామం—మార్క్సిజంనుండి, భౌతికాధ్యాత్మిక వాదాల సమన్వయంవరకూ—వారి నవలల్లో ద్యోతకమవుతున్నది. పి. శ్రీదేవి రచించిన "కాలాతీత వ్యక్తులు" పాత్ర చిత్రణంలో నూతన మార్గాలు అవలంబించినది. రావూరి సత్యనారాయణరావుగారి "నెలవంక" సమరసదృష్టిని బోధిస్తున్నది. పురాణం సూర్యప్రకాశరావు, పోతుకూచి సాంబశివరావు "జీవనగంగ", "అన్వేషణ" లలో కుటుంబవ్యవస్థప్రాతిపదికగా కథ స్వీకరింపబడినది. కొమ్మూరి వేణుగోపాలరావుగారి నవలలో సర్వ సుఖాలు కలిగియుండీ, ఏదో వెలితో బాధపడే పాత్రలు, ఒకానొక చిన్న సంఘటనవల్ల విపరీతానుభవాల్ని ఆకాంక్షించే పాత్రలు కన్పిస్తున్నాయి. మధ్యతరగతి కుటుంబాన్ని కేంద్రంగా తీసికొని, పల్లెపట్టుల నడవడికలు నాగరాజుగారి "రజనీప్రియ"లో వర్ణింపబడ్డాయి. పి. సుబ్బరామయ్యగారి "ధృవతార"లో ఒక వ్యక్తి జీవితం అనాథ శిశువువల్ల ఎట్లా మారిపోతుందో నిరూపింపబడినది. రసదృష్టి, లక్ష్యశుద్ధి లేక కామాచారవర్ణనం మాత్రమే వున్న నవలలు గూడా కొన్ని ఈమధ్య వస్తున్నాయి.విశ్వనాథ సత్యనారాయణగారు కొన్ని నవలలు ఎందుకు రచిస్తున్నారో ఎవరికీ అర్థంగావటంలేదు. వారి నవలలు రానురాను ప్రచార సాహిత్యంగా పరిణమించుతున్నాయి."వీరాజీ" విద్యార్థి జీవితాన్ని చిత్రిస్తారు. గంగినేని వేంకటేశ్వరరావుగారు కూడా అంతే. మహీధర రామమోహనరావుగారి "కత్తుల వంతెన" మధ్యమ తరగతి కుటుంబానికి సంబంధించినది. నేటి నవలల్లో అన్నిటినిగూర్చి వ్రాయటం సాధ్యంగానందుకు చింతిస్తున్నాను.

కాలక్రమాన నవలలు రచించటంలో వ్యాపారదృష్టి విజృంభించుచున్నది. ఏదో వ్రాసి, పేజీలు నింపితే అమ్ముడుపోయే రోజులివి. కొన్ని నవలల్లో నూరు—నూటయేభై పేజీల్లో పూర్తిగావలసిన కథ అనవసర—అనుచిత సన్నివేశాలతో పేజీలకొద్దీ పెంచబడుతున్నది. ఎన్నో నవలల్లో ప్రకృష్టమయిన బంధం కానరావటంలేదు. భాషా విపర్యయమూ, హద్దు మీరుతున్నది. మన రచయితలలో స్వతంత్ర శైలిగలవారు ఎంతోమంది లేరు. ఆంగ్ల భాషాదుల్లో నవలలు రచించిన ప్రతి రచయిత శిల్పంకోసమేకాక, ప్రత్యేక శైలి కోసంకు ఎంతో శ్రమించుతాడు. సోమర్సెట్‌మామ్ నవలలు చదివితే మనకీ రహస్యం తెలుస్తుంది. భావాలలో పాశ్చాత్య పద్ధతులు ఎక్కువైనంతగా కళాసృష్టిలో ఎక్కువ కావటంలేదు. "నేటి నవలా కర్తలుగాని, కథకులుగాని తెలుగుదేశంలో నగరాలు, భారతదేశంలో దృశ్యాలు వర్ణించేటప్పుడు యథార్థాన్ని చూడరు. రాజమహేంద్రవరంలో మెడికల్ కాలేజి పెట్టించిన ప్రబుద్ధులు, బెజవాడలో టీచీ షికార్లు చేయించిన రచయితలు, మద్రాసులో పర్వతాలు మొలిపించిన మేధావులు లేకపోలే"దని శ్రీ "శ్రీవాత్సవ" వ్రాసిన వాక్యాలలోని యథార్థ్యాన్ని మన రచయితలు గుర్తించటం మంచిదనుకుంటాను. (1962—జనవరి భారతి. పుట 67.)

(త) ఆయా నూతనకవితోద్యమాల ప్రభావం ఇంకా గోచరిస్తూనే వున్నది. ముద్దుకృష్ణగారి "వైతాళికులు" మాదిరిగా "ఉదయ ఘంటలు", "కల్పన", "నవ్య సాహితి" శతాబ్దప్రారంభంనుండీ ఈనాటిదాకా వెల్వడిన ఆ యా కవుల కావ్య ఖండాలను ఒకచో చేర్చాయి. స్వీయ చరిత్రలు, పద్య కావ్యాలుగా వ్రాయటం జరుగుతూనేవున్నది. బాలగంగాధరతిలక్, మాదిరాజు రంగారావు మున్నగువారు నవయుగసిద్ధికోసంకు ఆవేదనతో కవితాగానం జేస్తున్నారు. "ఆంధ్ర పురాణము" "కృష్ణకథావివంచి", "అశోకచరిత్రము" చారిత్రకేతివృత్తాన్ని స్వీకరించాయి. నారాయణాచార్యులుగారి "మేఘదూతము" జాషువా కవి "గబ్బిలము" మాదిరిగా ఆంధ్రచరిత్ర వైభవాన్ని చాటుతున్నది. వారి

"శివతాండవం" ఆవేశమూ నాట్య కళా పెనగొన్న విలక్షణ గేయకావ్యం. వేమన పద్ధతిలో నార్ల వెంకటేశ్వరరావుగారు నవయుగభావస్ఫోరకంగా "నార్లవారి మాట" రచించారు. వారు ఏ కవితోద్యమానికీ, సన్నిహితులు కాకుండా, "జగన్నాటకం" వ్రాశారు. కొత్త సత్యనారాయణచౌదరిగారు పురాణేతిహాసకథలను "కలి పురాణము"లో వ్యాఖ్యానించుతున్నారు. కొండవీటి వేంకటకవిగారు "నెహ్రూ చరిత్ర"ను పద్య కావ్యంగా చేశారు. బాలాంత్రపు రజనీకాంతారావుగారి "శత పత్రసుందరి" మంజుల భావ మరంద విన్యాసంతో కూడివున్నది. కొనకళ్ల వేంకటరత్నంగారి "బంగారిమామ పాటలు", "ఎంకిపాట"లతో తులతూగుతున్నాయి.

విద్వాన్ విశ్వంగారు రచించిన "పెన్నేటిపాట", బోయి భీమన్నగారి "దీవనభ" వినూతనమైన కావ్యాలు. రెండూ వాస్తవ సమాజాన్ని చిత్రిస్తున్నాయి. "పెన్నేటిపాట" రాయలసీమ దుస్థితిని చాటుతున్నది. దీనిలో ప్రాచీన నవీన కవితాసంప్రదాయసమ్మేళనం జరిగినది. అభ్యుదయ కవులు అందుకోలేని కవితాస్ఫోరకశక్తి "పెన్నేటిపాట"లో వున్నది. సందర్భోచితంగా ఛందస్సును మార్చటం ఉచిత శబ్దార్థాలంకారా లుపయోగించటం దీనిలో కన్పట్టుతున్నవి. భీమన్నగారి "దీవనభ" కథా కథనంలో నవ్యత ఆపాదించుకొన్నది. ఈ కావ్యం జాతీయ భావ బంధురమగుటయేగాక, దీన మానవావస్థను చిత్రిస్తున్నది. పద్యాలు సరళంగా ఝటితిస్ఫూర్తి కలిగివుంటాయి. భీమన్నగారు "పైరుపాట" అనే సంగీత నృత్య రూపకాన్ని రచించారు.

(స) బాల సాహిత్యం కూడా నవీన కాలంలో అభివృద్ధి చెందినది. దీనికి శ్రీకారం చుట్టినవారు చింతాదీక్షితులుగారు. వారు రచించిన కథలు చిన్న పిల్లల మనస్తత్వాన్ని చూపుతున్నాయి. దీక్షితులుగారి సూరి, సీత, శంపాలత, లీలాసుందరి మొదలయిన కథలు ఇందు కుదాహరణాలు. శ్రీ గిడుగు సీతాపతి ఈ రంగంలో కృషి చేసి, ప్రభుత్వ బహుమానమందుకొన్నారు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రాచీన బాలగేయ సాహిత్యాన్ని ప్రకటించారు. నవీన కాలంలో బాల సాహిత్యం సర్వతోముఖంగా అభివృద్ధికావటానికి చక్రపాణి నాగిరెడ్డిగారలు స్థాపించిన "చందమామ" ఎంతో తోడ్పడినది. ఆ పత్రికవల్ల కథలేమి, గేయాలేమి అసంఖ్యాకంగా పిల్లల కొఱకు రచింపబడ్డాయి. "ఆంధ్రపత్రిక" వారపత్రికలో బాలల కొరకు బొమ్మల పంచతంత్రం ప్రచురింపబడినది. ఈనాడు ప్రతి పత్రికా బాల సాహిత్యాన్ని ఎంతో ప్రచారం చేస్తున్నాయి. ఎన్నో పుస్తక ప్రచురణ సంస్థలు బాల సాహిత్యాన్ని ప్రకటిస్తున్నాయి. ప్రభుత్వమూ పాటుబడుతున్నది. ఈ సాహిత్య క్షేత్రంలో విశేషించి కృషి చేసినవారు బి. వి. నరసింహారావుగారు. ఆయనకు అధీనమైనట్లుగా బాల భాష ఎవరికీ అధీనం కాలేదు. శిశు మనస్తత్వాన్ని చిత్రించే కావ్యం వడ్డమూడి గోపాలకృష్ణయ్యగారి "మానవుడు". "కవిరావు" నార్ల చిరంజీవి, దాశరథి బాల సాహిత్యాభివృద్ధికై ప్రశంసనీయమైన కృషి చేశారు.

## 9

స్వాతంత్ర్యసిద్ధికి పిదప భారతదేశం సర్వ సత్తాక రాజ్యమయినది. కుల జాతి మత భేదాతీతమయిన రాజ్యాంగం కుదురుకొన్నది. సాంఘికంగా ఎన్నో అభ్యుదయకరమైన శాసనాలు చేయబడినాయి. తత్ఫలితంగా కొన్ని కొన్ని ప్రాచీన విశ్వాసాలకు స్వస్తిచెప్పవలసి వచ్చినది. ఈ సమయంలో సంప్రదాయాభిమాన శక్తులు విజృంభించుతున్నాయి. హైందవ జాతీయోద్యమం ఈశక్తులను పోషిస్తూ వున్నది. పాశ్చాత్య భావకలుషితబుద్ధులూ, అభారతీయ సంప్రదాయ వ్యామోహోన్మాదచిత్తులూ భారతీయసంస్కృతి పరమరహస్యాలను అవగాహనంజేసుకోలేకపోతున్నారని ఈ యుద్యమానుయాయులు ఎలుగెత్తి చాటుతున్నారు. వీరి సిద్ధాంతాల ప్రకారం భారతదేశంకంటె గొప్ప దేశంగాని, భారతీయ సంస్కృతి కంటె పరమోత్తమమయిన సంస్కృతిగాని ఎక్కడాలేవు. అట్లా వుండగూడదనే దైవనిర్ణయం. సమస్త భాషలకూ, సంస్కృతం మూలం. సమస్త దేశాలకూ సభ్యత పంచిపెట్టినది భారతదేశం—ఇదీ వీరి బడి. అయితే దీనికి ప్రతిద్వంద్వమైన ఉద్యమము కూడా లేకపోలేదు. దీని సిద్ధాంతాలప్రకారం ప్రపంచ మహా సంస్కృతుల్లో భారతీయ సంస్కృతి ఒకటి. ఇతర సంస్కృతుల మహా వైభవాన్ని కూడా మనం గమనించాలి. భారతీయ సంస్కృతికి సామరస్య సాధన ప్రాణభూతం. ఒకనాడు భారతీయ సంస్కృతి ఉత్తమంగావచ్చు. భారతదేశ పునర్నిర్మాణానికి, పునరుజ్జీవనానికి అది ప్రబలాంతరాయాలు కల్గించేటప్పుడు దానిని త్రోసి రాజనటంకంటె గత్యంతరమేమీ లేదు. ఒకనాడు సంస్కృత భాష విజ్ఞానాన్ని ప్రసాదిస్తే నేడా గురుతర కార్యాన్ని ఆంగ్లభాష నిర్వహిస్తున్నది. భారతీయ సంస్కృతి ఆర్య సంస్కృతి మాత్రమేగాదు. మొదటి యుద్యమ భావాలను ప్రచారం చేసేవారు విశ్వనాథ సత్యనారాయణగారు. రెండవ యుద్యమ భావాలను నార్ల వెంకటేశ్వరరావుగారు "సంస్కృతము—సంస్కృతి"లో ప్రచారం చేశారు. గోపీచందుగారి "పోస్టు చెయ్యని యుత్తరా"ల్లో తుమ్మల సీతారామమూర్తిగారి కావ్యాల్లో సమన్వయ దృక్పథం గోచరిస్తున్నది.

## 10

విశ్వనాథ సత్యనారాయణగారు ప్రతిభావ్యుత్పత్తులుగల కవి. రసధ్వని సిద్ధాంతాభిముఖంగా కావ్యరచన సాగించేవారాయన. కావ్యం అంటే లలితకాంత పదావళీమయపద్యసమూహం కాదని, అది అనంతముఖ శిల్ప సమన్వితమని సత్యనారాయణగారు గుర్తించారు. ఇట్లా గుర్తించిన నవీనకవు లింకెవరూలేరు. శ్రీమద్రామాయణ కల్పవృక్షాన్ని వాల్మీకి రామాయణభాష్యంగా రచించాలని సత్యనారాయణగారి సంకల్పం. విశ్వనాథలో నాన్యతోదర్శనీయమయిన భావుకత వున్నది. తెలుగు మాటలను ఎక్కువగా వాడటం తెనుగుదనానికి గుర్తు కాదను సిద్ధాంతం ఒప్పుకుంటే, విశ్వనాథగ్రంథాల్లో తెనుగుదనం లేదనే చెప్పవచ్చు. నన్నయ, తిక్కనల కవితాకళకంటె, వారి కావ్యాల్లో ప్రబంధ కవితాపద్ధతులే బహుళంగా వుంటాయి. విశ్వనాథ కావ్యగత శిల్ప రహస్యాలను మిగిలిన కవులకంటె ఎక్కువగా తెలుసుకొన్నారేగాని, వానిని తనకావ్యాల్లో నిన్పష్ట రీతులతో చూపటంలో అంతగా విజయం పొందలేదు. అట్టి విజయం పొందినవారు నన్నయ, తిక్కనలు. నిశ్శ్రేయసమయిన, వర్ణాశ్రమధర్మమూలమైన భారతీయ సంస్కృతి విశ్వనాథగ్రంథాలలో మనకు ప్రత్యక్షమవుతున్నది. సామాన్య పాఠకుడు గ్రహింపగల్గిన సాంఘికపరిణామాన్ని విశ్వనాథ గ్రహించటంలేదు. భారతీయ సంస్కృతి పరిణామబద్ధంగాదు. అది దైవచోదితం అని సత్యనారాయణగారి ప్రగాఢ విశ్వాసం. కాని చరిత్రవారి విశ్వాసానికి భిన్నంగా సాక్ష్యమిస్తున్నది. ఆ సాక్ష్యాన్ని తీవ్రదురాక్రమణదృష్టితో ఖండించటానికి విశ్వనాథ వెనుకంజ వేయరు. దానికి సాక్ష్యం పురాణవైరగ్రంథమాల ప్రచురణలు.

మిల్టన్ "పారడైజ్ లాస్టు"లో, షేక్స్పియర్ "మర్చంట్ ఆవ్‌వెనిస్"లో క్రైస్తవ మతసంస్కృతిని బోధించినట్లుగా భారతీయరచయిత భారతీయ సంస్కృతిని బోధింపవలసినదే. మరి ఏది భారతీయసంస్కృతి ? అని వెంటనే ఎదురు ప్రశ్నించాల్సిన ఆగత్యమున్నది. భారతీయ సంస్కృతి అంటే రాజారామమోహనరాయలు, రామకృష్ణ, వివేకానందులు, మహర్షి అరవిందుడు చాటినదా? లేక కోటవేంకటాచలంగారు చాటినదా? విశ్వనాథ సత్యనారాయణగారు త్రికరణ శుద్ధిగా నమ్మినది కోటవేంకటాచలంగారు చాటిన దాన్నే. భారతీయ సంస్కృతి అంటే హైందవసంస్కృతి అని విశ్వనాథ సిద్ధాంతం. ఈ సిద్ధాంతం తప్పు. అది చారిత్రక సత్యాన్ని గుర్తించటంలేదు. భారతీయసంస్కృతి అంటే హైందవ సంస్కృతిగాదు. మరి అది భారతీయసంస్కృతే. దాని స్వరూపాన్ని రవీంద్రుడు చక్కగా చెప్పాడు. రవీంద్రునికంటె గొప్పవారమనుకొనేవారు ఏమంటారో యేమో నాకు తెలియదు. కాని ఆయన వాక్యాలు వేదవాక్యాల్లాంటివే. రవీంద్రుడు భారతీయ సంస్కృతినిగూర్చి యిట్లా వ్రాశాడు:—

## 11

"The main river of Indian Culture has flowed in four streams-the Vedic, the Puranic, the Buddhist, and the Jain. It had its source in the heights of the Indian Consciousness.

But a river belonging to a country is not fed by its own waters alone. The Tibetan Brambputra is a tributory to the Indian Ganges. Contributions have similarly found their way to India's original culture. The Muhammadan, for example, has repeatedly come into India from outside, laden with his own store of knowledge and feeling and his wonderful religious democracy bringing freshet after freshet to swell the current. In our music, our architecture, our pictorial art, our literature, the Muhammadans have made their permanent and precious contribution. Those who have studied the lives and writings of our medieval saints, and all the great religious movements that sprang up in the time of the Muhammadan rule, know how deep is our debt to this foreign current that has so intimately mingled with our life."

"The European culture has come to us not only with its knowledge but with its velocity. Though our assimilation of it is imperfect and the consequent aberrations numerous, still it is rousing our intellectual life from its inertia of formal habits into glowing consciousness by the very contradiction it offers to our own mental traditions."

(The Centre of Indian Culture. Page 34.35)

రవీంద్రుడు మ్లేచ్ఛబుద్ధితో, పరప్రత్యయనేయబుద్ధితో ఈ వాక్యాలు వ్రాశాడనటం సాహసమేకాగలదు.

హైందవసంప్రదాయైకదృష్టితో చారిత్రకనవలలు రచించే వారు శ్రీ నరసింహశాస్త్రిగారు. కవిత్రయంవారిని కథానాయకులనుజేసి, వారు కూడు పెద్ద నవలలు రచించారు. శ్రీ నరసింహశాస్త్రిగారి నవలలలో సదా శారవర్ణన కథాకాలచేతనశక్తిని మ్రింగివేస్తున్నది. నవల ధర్మశాస్త్రగ్రంథము కాదుగదా! కవులను, నాయకులనుజేసి, నవలలు వ్రాయుటంమంచిదే. కాని, చారిత్రక సత్యాలు తారుమారుకాకూడదు. అదే "మల్లారెడ్డి"లో జరిగినది. జైనుల కష్టాలు శ్రీ నరసింహశాస్త్రిగారికి ఏమాత్రమూ సానుభూతి లేనట్లు వారి "నారాయణభట్టు", "రుద్రమదేవి" నిరూపించుచున్నవి. శాస్త్రిగా రూహించినంతగా జైనులు ఆంధ్రదేశానికి ద్రోహంచేయలేదని కొమర్రాజు లక్ష్మణరావుగారి వ్రాతలూ, మల్లంపల్లి సోమశేఖరశర్మగారి వ్రాతలూ ఋజువు చేస్తున్నాయి. అంతేగాదు. ప్రతాపచరిత్ర, పాల్కురికి సోమనాథుని గ్రంథాలు, జైనసంహార గాథలనే చాటుతున్నాయి.

## 12

మనదేశచరిత్రలో సంగమయుగంలోతప్ప నేటి "ఏకాడమీ"ల వంటివి సాహిత్యాభివృద్ధికి కృషిచేసినట్లు తార్కాణాలేమీలేవు. ఫ్రాన్సుదేశంలో ఈ "ఏకాడమీ"లు సాహిత్యాభివృద్ధికి విశేషంగా దోహదంచేశాయి. ఈనాడు ప్రతి దేశంలో, ప్రతిరంగమందూ ఒక "ఏకాడమీ" వున్నది. స్వాతంత్ర్యానంతరం భారతదేశంలో ఏకాడమీలు స్థాపింపబడ్డాయి. అఖిలభారతసాహిత్య—ఏకాడమీ భారతదేశ భాషల్లోని ఉత్తమసాహిత్యాన్ని ప్రపంచ భాషల్లోని ఉత్తమగ్రంథాలను అనువాదాలద్వారా అన్నిరాష్ట్రాలవారికీ అందిస్తున్నది. ఆంధ్రరాష్ట్రంలో కూడా సాహిత్య—ఏకాడమీ నెలకొల్పబడినది. రచయితలకు ద్రవ్యసహాయము చేయుట, పోటీలు నిర్వహించి, ఉత్తమగ్రంథాలకు బహుమానాలిచ్చుట మన ఏకాడమీ చేస్తున్న గొప్ప పనులు. ఆంధ్రదేశంలో సాంస్కృతిక పునరుజ్జీవనానికి శక్తియుక్తులు ధారపోసిన కాశీనాథుని నాగేశ్వరరావు, కట్టమంచి రామలింగారెడ్డిగారల జీవనగాథకు అక్షరరూపం కల్పించాలని సాహిత్య—ఏకాడమీ ప్రయత్నిస్తున్నది. "పదబంధపారిజాతము", "తెనుగుసామెతలు", "సన్నయ పద ప్రయోగసూచిక" ఆంధ్రసాహిత్య—ఏకాడమీచేత ప్రచురింపబడ్డాయి. బ్రౌన్ దొర నిఘంటువును, పోతనభాగవతాన్ని ప్రకటించాలని, అది నిర్ణయించినది. మనసాహిత్య—ఏకాడమీ ఆంధ్రమహాభారతం వైపు చూపుసారిస్తే మంచిది. ఈనాడు మనకు లభించుతూన్న ముద్రిత మహాభారతం ఎన్నో పాఠాంతరాలతో తప్పుల కుప్పయై వున్నది. సమర్థులైన—కవిత్రయ హృదయాన్ని గుర్తింపగల పండితులను నలుగు రైదుగురను ఒక సంఘంగా ఏర్పరచి తాళపత్ర గ్రంథాల సాయంతో మహా భారత శుద్ధప్రతిని తయారు చేయించటానికి ఏకాడమీయే పూనుకోవాలి. ఆంధ్రసంస్కృతి పరిణామాన్ని—సాంఘిక చరిత్ర, వేష భాషలు, ఆచారవ్యవహారాలు మున్నగువానిలో వచ్చిన పరిణామమును—వివరించే చరిత్రగ్రంథాలను కూడా ఏకాడమీ వ్రాయించటం మంచిది.

## 13

ఆంధ్రవిశ్వవిద్యాలయంవారు చారిత్రక నవలల పోటీలు నిర్వహించి, ఉత్తమ గ్రంథాలకు ఉడుగరలు పెట్టుతున్నారు. వారు మన్నించిన అన్ని నవలలూ ప్రశస్తములయినవని చెప్పటం కష్టము. ధూళిపాళ శ్రీరామమూర్తిగారు రచించిన "భువన విజయము", "గృహరాజు మేడ" ఉత్తమంగా వున్నాయి. పాత్ర పోషణము, కథా కథన నైపుణ్యమూ, లక్ష్యశుద్ధి వారి నవలల్లో ముఖ్య గుణాలు. "రాజశిల్పి"లో భావుకత పాత్రపోషణాదులకంటె బలంగా వున్నది. "చిత్రశాల" "రఘునాథ విలాసము"లలో కథాబంధమున్నది. "సప్తపర్ణి", "తంజావూరు పతనము"—ఇవి రెండూ చరిత్రను పక్షపాత సులోచనాంతో చూచాయి. "సప్తపర్ణి" లో ప్రతి విషయమునకు వక్ర భాష్యం చెప్పుట బాగా గోచరిస్తున్నది. కాకతీయ సామ్రాజ్య పతనమునకు మూలం అయిన యథార్థ హేతువులను చరిత్రకారులు చెప్పుచున్నవానిని త్రోసిరాజని వైయుక్తిక రాగద్వేషాలు పేరు కొన్న కారణాలను వెతకటం దీనిలో కన్పట్టుతున్నది. ఈనాడు ఆంధ్రదేశాన్ని పట్టి పల్లార్చుతున్న కులభేదాలను కాకతీయచరిత్రకు అంటగట్టడం "సప్తపర్ణి"లో జరిగినది. ఆ నవలలో ఒకచోట ఒకపాత్ర "దేశమున ఏమంచిన శిల్పాభిమానము గాని, విద్యాభిమానముగాని యున్నచో నారెడ్లకే యున్నది. కాని ప్రభుత్వము కమ్మ వెలమల చేతిలో నున్నది. వీరిలో వీ కమ్మవారికి కావలసినది అధికారము. వెలమలకు నెత్తురు. అంతియ కానివారికీ శిల్ప విద్యాభిమానములు లేవు" అని పలుకుతుంది. కథా కాలాన్ని, సందర్భాన్ని ఎంతగా గమనించినా ఇట్లాంటి వాక్యాలు వ్రాయబడటం అనుచితం అనిపిస్తున్నది. "సప్తపర్ణి"లో పాత్రలు మాటి మాటికీ కులాల ప్రస్తావన తెస్తాయి. ఈ గ్రంథంలో చిత్రింపబడినంతగా కుల ద్వేషం గుడారాలెత్తి, కాకతీయ సామ్రాజ్యపతనానికి త్రోవదీయలేదు. మరి ఇతర కారణాలవల్ల ఆ సామ్రాజ్య పతనం జరిగినది. ఆ కారణాలు వివరించటానికిది అదనుగాదు. మరొకసారి వానిని వివరిస్తాను. ఇట్టి గ్రంథాన్ని ఆంధ్ర విశ్వవిద్యాలయం, "తేజస్వినావధీతమస్తు" అను వాక్యాన్ని తన చిహ్నంలో ఉట్టంకించిన కళాపరిషత్తు మూడుసారులు ఉపవాచకంగా నిర్ణయించినది. ఇట్లాంటి నవలను పాఠ్య గ్రంథంగా నిర్ణయించటంవల్ల విద్యార్థులకు కలిగే మేలు శూన్యం. వారి సంస్కారం ఏమాత్రమూ పెరగదు. ఇట్టివానిని బోధించేటప్పుడు విద్యార్థు లిట్లాంటి ప్రశ్నలు వేస్తారో కళాశాలోపన్యాసకులకు అనుభవైకవేద్యం. కథ చారిత్రాత్మకంగావచ్చు. సాంఘికం గావచ్చు. దానిలో కుల ప్రస్తావన మితిమీరిపోకుండా చూడటం శివేతరములను తొలగించే సాహిత్యాన్ని ఆరాధించువారి కర్తవ్యం. జాతీయ సమైక్యం కావాలని అందరు ఆరాట పడే ఈ రోజులో "సప్తపర్ణి" పాఠ్య గ్రంథంగా నిర్ణయింపబడటం అతిమాత్ర శోచనీయం.

ప్రపంచం మొత్తమూ ఏక కుటుంబం గావాలని ప్రయత్నించే రోజులివి. ప్రపంచ దేశాలన్నీ ఇరుగు పొరుగు ఇండ్లైపోయాయి. ఎంతో భావ వినిమయము జరుగుతున్నది. అయితే ప్రపంచం ఒక క్లిష్టఘట్టంలో పడినది. బహువిధభావ సంఘర్షణ తారసిల్లుతున్నది. మానవుని బుద్ధి హృదయాన్నిమించి వికసించు తున్నది. మనోవేగాన్ని మించిన వేగంతో శాస్త్రవిజ్ఞానం ఉరకలు పెట్టుతూ వున్నది. మన కనులముందే సాంఘిక తాత్త్వికరంగాలలో అమోఘ పరిణామం కలుగుతున్నది. త్రికాలాబాధితాలని ఒకనాడు నమ్మిన సిద్ధాంతాలు సడలిపోతున్నాయి. "పుడమి తల్లికి పురిటి నొప్పులు" వస్తున్నాయి. ప్రపంచమంతా మరొక పరిణామాన్ని పొందటానికి సిద్ధంగా వున్నది. సమరస దృష్టితో రచనలుచేసి, మానవునకు దివ్య సందేశాలను వినిపించాల్సిన ధర్మం రచయితలది. ఈ ధర్మం అనుసరించాలంటే సంప్రదాయవిచ్ఛేదం విధిగా జరగాల్సిన అవసరమేమీలేదు. ప్రాచీన భారతీయాలంకారశాస్త్రాన్ని, పాశ్చాత్యసాహిత్యశాస్త్రాన్ని ఉదాహరణకు తీసుకొందాం. ఇవి రెండూ శతాబ్దాలు వెళ్లిన కొలదీ పూర్వ పూర్వ సాహిత్య సిద్ధాంతాలకు మెరుగులు పెట్టుతూ, పురోగమించినవి. ఇటు భారతీయాలంకార శాస్త్రాన్ని అటు పాశ్చాత్య సాహిత్య శాస్త్రాన్ని చక్కగా సమన్వయం చేసికొని, తరితర భాషా సాహిత్య ప్రక్రియా సౌందర్యాన్ని చూరలాడి, భాషాసంప్రదాయాలను కాపాడుకొంటూ, ఎంతైనా నూతన సృష్టిచేయవచ్చు. ఆంధ్రరచయితలు తమ ధర్మాన్ని గుర్తిస్తారని పోయిన అరవైయేండ్లసాహిత్యమూ, సాక్ష్యం చెప్పుతున్నది. ఈ దృష్టితో చూస్తే ఈనాడు సాహితీలోకంలో కన్పడే అవ్యవస్థ తొలగిపోక తప్పదేమో అని ఎవరికైనా పరిశీలనమీద తెలుస్తుంది.

# * గోలి ★

ఉరుదూమూలం: కీ. శే. సాదత్ హసన్ మింటో
అనువాదం: శ్రీ దాశరథి

షఫ్కత్ మధ్యాహ్నం ఆఫీసునుంచి ఇంటికి వచ్చేసరికి ఇంటినిండా బంధువులు వచ్చిఉన్నారు. కుడివైపు పెద్దగదిలో ఆడవాళ్ళు కూచున్నారు. షఫ్కత్ భార్య ఆయుషా వాళ్ళకు అతిథిసత్కారాలు చేస్తున్నది.

"అజీజుగారి భార్యా, వాళ్ళ కూతుళ్ళూ వచ్చారు" అంది ఆయుషా అతనితో.

హ్యాటు తలమీదినుంచి తీసి, ముఖంమీద చెమటను తుడుచుకుంటూ "అజీజుగా రెవరూ ?" అని అడిగాడు షఫ్కత్.

"మీ నాన్నగారి స్నేహితుడండీ !" అంది ఆయుషా మెల్లగా.

"ఓహ్హో అజీజ చిన్నాయనా ?"

"అవునవును. ఆయనే."

"అయితే మరి ఆయన ఆఫ్రికాలో ఉంటున్నారుగా ?" అన్నాడు కొంచెం ఆశ్చర్యంగా షఫ్కత్.

"కొంచెం మెల్లగా మాట్లాడండి. మీరు ఊరికే గొంతు చించుకు మాట్లాడతా రెందుకూ ? అన్నట్టు ఆఫ్రికా వెళ్ళినవాడు తిరిగి రానేరాడా ? ఇందులో ఆశ్చర్యం ఏముంది ?" అంది నోటికి చేయి అడ్డుపెట్టుకుంటూ ఆయుషా.

"అదిగో, నువ్వు మాత్రం మెల్లగా మాట్లాడుతుంటేగా."

"సరే. ఇక పోట్లాడకండి. అజీజుగారు ఆఫ్రికాలోనే ఉన్నారు. ఆయన భార్య తన కూతురుకి పెళ్ళివ్యవహారం చూడ్డానికి వచ్చింది. మంచి సంబంధం కోసం వెతుకుతున్నారు."

ఇంతలో లోపల్నుంచి అజీజు భార్య అంది—"అమ్మాయ్ ఆయుషా ! అబ్బాయిని దారిలో ఆపి మాట్లాడుతున్నావేమే ! లోపలికి రానీ ! రా నాయనా షఫ్కత్ ! ఎన్నాళ్ళయింది, ఎన్నాళ్ళయింది నిన్ను చూడక !"

"వస్తున్నా పిన్నీ !" అంటూ షఫ్కత్ తన హ్యాటు మేకుకి తగిలించి గదిలోకి వెళ్ళాడు. "నమస్కారం పిన్నీ !" అన్నాడు. అజీజు భార్య కుర్చీలోంచి లేచి అతన్ని దీవించింది. తల నిమిరి కూర్చుంది. షఫ్కత్ కూడా కూచున్నాడు. కూచుంటుండగా ఎదట యిద్దరు చక్కని అమ్మాయిలు కనిపించారు. ఒకతి చిన్నది, ఇంకొకతి పెద్దది. ఇద్దరి రూపూ ఇంచుమించు కలుస్తున్నది. అసలు అజీజు చాలా భారీ మనిషి. ఆయన భారీతనం ఈ ఇద్దరమ్మాయిలలో బలే చక్కగా విభజించినట్టు కనపడుతున్నది. కళ్ళు తళ్ళని. నల్లగా పొడుగ్గాటి జడలు. చిన్నమ్మాయి ముఖం పెద్దదాని కంటె ఎక్కువ కళకళ్ళాడుతున్నది. పెద్దది మౌనంగా, గంభీరంగా కూర్చుని ఉంది.

"అన్నయ్యకు నమస్తే చేయండి" అంది తల్లి వాళ్ళ వైపు తిరిగి చిన్నమ్మాయి లేచి మంచిని నమస్కరించింది. పెద్దది కూర్చునే 'నమస్తే' అన్నది సన్నగా. షఫ్కత్ వాళ్ళకు మళ్ళీ నమస్కరించాడు. ఆఫ్రికాలో అజీజు వ్యవహారాల్ని గూర్చి ముచ్చట్లు మొదలైనై. టాంగన్యీకా, ఉగాండా, దారుస్సలాం వగైరా ప్రాంతాల్ని గూర్చి మాట్లాడారు. గాలీ, నీరూ ఎక్కడ బావుంటుంది, ఎండ ఎక్కువగా ఎక్కడ ఉంటుంది, పూలూ, పళ్ళూ పుష్కలంగా ఎక్కడ దొరుకుతాయి, ఇవన్నీ మాట్లాడుకున్నారు. పండ్లమాటొచ్చేసరికి—

"ఇండియాలో చెత్త పండ్లు దొరుకుతాయి" అంది చిన్నమ్మాయ్.

"లేదండీ ! సీజన్‌లో చాలా మంచిపళ్ళు దొరుకుతాయి" అన్నాడు షఫ్కత్ ఇండియా గౌరవాన్ని కాపాడుతూ,

"అబద్ధం" అంది చిన్నమ్మాయ్ కోపంగా. "అమ్మా, నిన్న మార్కెటునుంచి నువ్వు తెచ్చిన మాల్టా పళ్ళు ఆఫ్రికాలోని 'మచింగా' పళ్ళతో పోలగలవా ?" అంది తల్లితో.

"అబ్బాయి ! అది అనేమాట నిజమే. ఇక్కడి మాల్టా అక్కడి 'మచింగా' మీదికి రావు" అంది వాళ్ళ తల్లి.

ఆయుషా అడిగింది చిన్నమ్మాయిని—"అమ్మాయ్ తలత్ ! ఈ మచింగా ఏమిటే—తమాషా పేరే ?"

తలత్ నవ్వి అంది—"వదినా ! అదోరకం పండు. ఎంత రుచిగా ఉంటుందంటే, చెప్పలేము. ఇక దాని రసం, ఒక్క పండు పిండితే, అదుగో! ఆ పెద్దగ్లాసులేదూ, దాన్నిండా వస్తుంది."

షఫ్కత్ గ్లాసువేపు చూశాడు. ఆ పండు ఎంతలావుంటుందో అంచనా కట్టడానికి ప్రయత్నించాడు.

"ఒక్క 'మచింగా' పండులోంచి అంత పెద్ద గ్లాసు నిండా రసం వెళ్ళుతుందా ?" అనడిగాడు.

తలత్‌గర్వంగా జవాబిచ్చింది "అవునండీ"—అని.

"అయితే పండు చాలా పెద్దగా ఉండి ఉండాలి !" అన్నాడు షఫ్కత్

తలత్ తల అడ్డంగా తిప్పి "లేదు, లేదు. అంత పెద్దగా ఉండదు, అంత చిన్నగా ఉండదు. ఒక మోస్తరుగా ఉంటుంది. అయినా అంత రసం వస్తుంది. అదే దానిలోని గొప్పతనం. ఇంకా అక్కడి పైనాపిల్—కోస్తే ఒక్కొక్క ముక్క పెద్ద రొట్టెంత ఉంటుంది" అంది.

చాలాసేపు పైనాపిల్ పండును గూర్చి చర్చ జరిగింది. తలత్ అతిగా వాగుతుంది. ఆమెకు ఆఫ్రికా అంటే చాలా అభిమానం. అక్కడి ఏ వస్తువైనా ఎంతో ఇష్టం. ఇంత చర్చ జరుగుతున్నా పెద్దమ్మాయి నిగ్హత్, మాట్లాడకుండా నిశ్శబ్దంగా కూచుంది. నిగ్హత్ మాట్లాడదెందుకు చెప్మా అనుకున్నాడు షఫ్కత్.

"మీకు ఈ వాగుడు గిట్టదల్లే ఉందే ?" అని అడిగాడు ఆమెను.

"లేదు లేదు—అలా అనకండి. చాలా యిష్టంతో మీ మాటలు వింటూ కూచున్నాను" అంది నిగ్హత్.

"మరి మీరు మాట్లాడరేం ?" అనడిగాడు షఫ్కత్.

"దాని స్వభావమే అంత, నాయనా ?" అంది నిగ్హత్ తల్లి.

షఫ్కత్ అన్నాడు—"పిన్నీ ! ఈ వయసు పిల్లలు మాట్లాడకుండా కూచుంటే ఎట్లా ! నోటికి తాళం వేసుకు కూచుంటారా ?" అంటూ ఆ అమ్మాయి వైపు తిరిగాడు.

"ఏమండీ ! మీరు మాట్లాడక తప్పదు" అన్నాడు.

నిగ్హత్ పెదవులమీద సిగ్గు కలగలిసిన చిరునవ్వు తొణికింది.

"మాట్లాడుతున్నాగా అన్నయ్యా !" అంది.

షఫ్కత్ నవ్వాడు—"మీకు ఫోటోలు చూడ్డం అంటే ఇష్టమేనా ?" అని అడిగాడు.

"ఇష్టమే" అంది నిగ్హత్, కళ్ళు నేలకు దించి.

"అయితే పదండి, నా ఆల్బం చూపిస్తాను. పక్క గదిలో ఉంది" అంటూ లేచాడు షఫ్కత్.

---

* తుపాకీగుండు.

"రండి" అన్నాడు ఆమెతో.

ఆయుషా అతని చేతిని నొక్కింది. భార్యవైపు చూచాడు షఫ్కత్ ఆమె తన చేతిని ఎందుకు నొక్కిందో అతనికి అర్థంకాలేదు. ఆయుషా ఏదో సంజ్ఞ చేసింది కళ్లతో. అదీ తెలియలే దతనికి. ఇంతలో చిన్నమ్మాయి తలత్ గబగబా వచ్చి, "పదండి అన్నయ్యా! నాకు ఆల్బం చూడాలంటే చాలా సరదాగా ఉంటుంది. నా దగ్గర గూడా ఒక మంచి కలెక్షన్ ఉంది" అంది.

తలత్‌తో కలిసి షఫ్కత్ పక్క గదిలోకి వెళ్లాడు.

నిగ్హత్ నిశ్శబ్దంగా కూచునివుంది. తలత్‌కు తాను తీసిన ఫోటోలు చూపించాడు, షఫ్కత్. ఆమె తనకు తోచిన కామెంట్స్ చేస్తూ పోయింది. కాని షఫ్కత్ మనస్సు మరోచోట ఉంది. అతను నిగ్హత్‌నుగురించి ఆలోచిస్తున్నాడు. ఎందు కావిడ అలా నిశ్శబ్దంగా కూచుంది? ఫోటోలు చూడ్డానికి తనవెంట గదిలోనికి ఎందుకు రాలేదు? ఫోటోలు చూడ్డానికి రమ్మని తాను ఆమెను పిలిస్తే తనభార్య తనచేతిని ఎందుకు నొక్కినట్లు? కళ్లతో తన భార్య చేసిన సంజ్ఞకు అర్థం ఏమిటి?

ఫోటోలన్నీ చూపించడం అయిపోయింది. తలత్ ఆల్బం తీసుకుంది. "అక్కయ్యకు చూపిస్తా పిటిని. దానికి ఫోటోలు కూడబెట్టడం అంటే చాలా యిష్టం." అంది తలత్. అంత ఇష్టం అయితే ఆల్బం చూడ్డానికి ఆమె ఎందుకు రాలేదని అడుగుదా మనుకున్నాడు. ఇంతలో తలత్ ఆల్బం తీసుకుని పక్క గదిలోకి పరిగెత్తింది. అక్కా చెల్లెళ్లు ఆల్బం చూస్తున్నారు. ప్రతి ఫోటో నిగ్హత్‌కు నచ్చింది. కిటికీలోంచి షఫ్కత్, వాళ్లను చూస్తున్నాడు. అంతవరకూ ఎంతో చింతగా కనపడ్డ నిగ్హత్ ముఖం ఆల్బం చూస్తూంటే మెరిసిపోతున్నది. కళాస్వరూపాలైన ఆ ఫోటోలు ఆమె మనస్సుకు ఉల్లాసాన్ని కలిగిస్తున్నాయి. ఆమె కళ్లల్లో కొత్తకాంతి కనిపించింది. ఒక గుర్రం పక్కన ఒక ఆరోగ్యవంతమైన అమ్మాయి ఉన్న బొమ్మ ఆల్బంలో కనపడే సరికి ఆమె ముఖంలో మళ్లీ నిరాశ అలముకుంది. నిరాశతో పెద్దగా నిట్టూర్చింది అమ్మాయి. బొమ్మలన్నీ చూడడం అయిపోయింది. నిగ్హత్, షఫ్కత్ వైపు చూసింది. ఎంతో కమ్మగా "థ్యాంక్స్ అన్నయ్యా!" అంది. నిగ్హత్ చేతులోంచి ఆల్బం తీసుకొని మేంటల్ పీస్ మీద పెట్టాడు షఫ్కత్. మనసులో ఏదో కలత పెట్టసాగింది. ఆ అమ్మాయి జీవితంలో ఏదో విషాద ఘటన జరిగివుండా లనుకున్నాడు. లేక విఫలమైన ప్రేమ ఘట్టం ఏదైనా ఉండి ఉండాలి.

ఇంతలో టీ వచ్చింది. "లెండి. కాస్త టీ కలిపి ఇవ్వండి. ఆ ప్రివిలీజ్ లేడీస్‌దేగా" అన్నాడు షఫ్కత్ నిగ్హత్‌తో.

నిగ్హత్ మాట్లాడలేదు. తలత్ చటుక్కున లేచింది.

"నేను టీ కలుపుతా నన్నయ్యా!" అంది. నిగ్హత్ ముఖంలో నీలి మబ్బులు కమ్ముకొచ్చాయి. కారణం తెలియలేదు అతనికి. ఆమెముఖంలోకి దీక్షగా చూచా డతను. ఆమె కళ్లు దించేసుకుని పక్కకు తిరిగింది. ఎందుకలా చేసిందో అతనికి అర్థం కాలేదు.

టీ తాగుతూ తలత్ ఏమేమో మాట్లాడింది. టెన్నిస్‌ను గూర్చిన ప్రసంగం వచ్చింది. నైరోబీలో తాను నెంబర్ వన్ టెన్నిస్ ప్లేయర్ నని చెప్పుకుంది. పదిహేను, ఇరవై కప్పులు గెల్చుకున్నదట కూడా! నిగ్హత్ మాట్లాడకుండా కూచుంది. తాను మాట్లాడడం లేదని అందరు అనుకుంటున్నారని ఆమెకు తెలుసు కూడా.

ఇద్ద రమ్మాయిల్లో నిగ్హత్ అంటే ఆమె తల్లికి ఎక్కువ యిష్టమని గమనించాడు షఫ్కత్. ఎంతో ప్రేమతో స్వయంగా తల్లి, నిగ్హత్‌కు టీ అందించింది. మూతి తుడుచుకోడానికి తన టవల్ అందించింది. ఎంతో ఆప్యాయతతో తల నిమిరింది.

టీ అయిన తరువాత వెళ్లిపోవడానికి లేచారు తల్లీ కూతుళ్లూ. ముసుగు వేసుకుంది తల్లి. 'ఆయుషా'ను కావిలించుకుంది. షఫ్కత్‌ను దీవించింది. పెద్ద కూతురు వద్దకు వెళ్లి కళ్ల నీళ్లు పెట్టుకుంటూ "పద అమ్మాయి పోదాం" అంది. తల్లి ఒక చేయిపట్టుకుంది, చెల్లె లొక చేయి పట్టుకుంది. మెల్లగా కదిలింది నిగ్హత్. శరీరంలో కింది భాగం చచ్చుపడ్డట్టుంది. అది గమనించాడు షఫ్కత్. కాళ్లు చచ్చుపడినట్లున్నాయి. అది చూచి షఫ్కత్ గుండె జల్లుమన్నది. తనలో తాను సర్దుకున్నాడు.

తల్లినీ, చెల్లెల్నీ ఊతగా పట్టుకుంటూ, వణుకుతున్న కాళ్లను ఈడ్చుకుంటూ, షఫ్కత్‌కూ, అతని భార్య ఆయుషాకూ నమస్కారం పెట్టి మొహం కుడిచేత్తో దాచుకుంటూ నిగ్హత్ వెళ్లిపోయింది. ఎంత అందంగా, ఎంత ఒయ్యారంగా నమస్కారం పెట్టింది! ఆమె తనకు నమస్కరించడానికి ఎత్తిన చేయి తన గుండెల్లో బలంగా గుద్దినట్లు బాధ కలిగింది. ఎంత వింత? దైవం ఆమెపట్ల ఎంత నిర్దయగా ప్రవర్తించాడు! అంత చక్కని అమ్మాయికి దైవం ఎంత ఘోరమైన అపకారం చేశాడు! ఆ అమాయకురాలు ఏం తప్పు చేసిందని ఈ ఘోరమైన శిక్ష!

అంతా వెళ్లిపోయారు. వాళ్లను పంపించడానికి గుమ్మందాకా వెళ్లింది షఫ్కత్ భార్య ఆయుషా. వేదాంతిలా ఏదో ఆలోచిస్తూ నుంచున్నా డతను. ఇంతలో మిత్రులు వచ్చారు. నిగ్హత్‌ను గూర్చి భార్యతో మాట్లాడటానికి అప్పుడు అవకాశం దొరకలేదు. మిత్రులతో పేకాటలో పడ్డాడు. రాత్రయింది. పనివాడు భోజనానికి పిలిచాడు. భోజనం చేస్తూ నిగ్హత్ ప్రసక్తి ఎత్తా డతను. "మొదట భోంచేయండి. తరువాత మాట్లాడుదాం" అంది ఆయుషా.

ఆయెషా, షఫ్కత్‌లకు పెళ్లయి ఆరేళ్లయింది. పిల్లలు కలుగలేదు. ఇద్దరు ఎప్పుడూ వేరువేరే పడుకోలేదు. అసలు వాళ్ల గదిలో ఒకటే మంచం ఉంది. పిల్లలు కలగడానికి ఆమె ఆపరేషన్ చేయించుకోవలసి ఉంటుందని డాక్టర్లు అభిప్రాయపడ్డారు. కాని ఆయెషాకు ఆపరేషన్ అంటే తగని భయం. వాళ్లిద్దరూ ఎంతో అన్యోన్యంగా ఉంటారు. వాళ్ల మధ్య ఎట్టి కలతలూ లేవు.

ఆరోజు కూడా కలిసి పడుకున్నారు. ఆ రాత్రి అతనికి నిగ్హత్ జ్ఞాపకం వచ్చింది. నిట్టూర్పు విడిచాడు. "ఆయెషా! పాపం నిగ్హత్‌కు ఏమిటీ జబ్బు ?" అనడిగాడు.

ఆయెషా కూడా బాధగా నిట్టూర్చి—

"నిగ్హత్‌కు మూడోయేట పోలియో వ్యాధి సోకింది. కాళ్ళు పడిపోయినవి" అంది విచారంగా. నిగ్హత్ అంటే ఎక్కడలేని సానుభూతి కలిగింది షఫ్కత్‌కు. ఆయెషా వీపుకు తనరొమ్ము ఆనించి అన్నాడు :—

"ఆయెషా! దేవుడు ఎందు కంత క్రూరుడయ్యాడు ?". ఆయెషా జవాబివ్వలేదు. ఆ పగలు జరిగిన ఘటనలన్నీ షఫ్కత్‌కు జ్ఞాపకం వచ్చినవి.

"ఆల్బం చూడ్డానికి రమ్మని నేను నిగ్హత్‌ను పిలిస్తే నీవు నా చేయి నొక్కింది అందుకే కదూ !" అనడిగాడు షఫ్కత్.

"అవును మరి .... అందుకే. మీరేమో పూరికే దాన్ని పిలుస్తూ ...."

"దేవుడితోడు. నాకు తెలీదు."

"పాపం ? దానికి తనలోని లోపం ప్రతి క్షణం జ్ఞాపకం వస్తుంటుంది".

"అది తెలిసి నా గుండెలో బాకు గుచ్చుకున్న ట్లయింది."

"నిగ్హత్ మనింటికి రాగానే దాన్ని చూచి నా మనస్సు చాలా బాధ పడింది. పాపం, దొడ్లోకి వెళ్లలేకపోయింది. తల్లీ, చెల్లెలూ ఇంచుమించు ఎత్తుకు వెళ్లాల్సి వచ్చింది. లాగూ తొడువిప్పారు. మళ్లీ కట్టారు. ఎంత అందంగా ఉంది అమ్మాయి! పాపం!"

"కూచుని ఉంటే పోలియో వ్యాధి సోకిందని అసలు తెలీదు"

"చాలా అభిమానం గల పిల్ల."

"అలాగా ?"

"జీవితాంతం అవివాహితగానే ఉంటా నంటుంది." ఆమాట విని షఫ్కత్ కొంతసేపు నిశ్శబ్దంగా ఉండిపోయాడు. కాసేపు ఆగి అన్నాడు :

"అయితే తనను ఎవరూ పెళ్లి చేసుకోవడానికి అంగీకరించరనే విషయం ఆమెకు బాగా తెలుసునన్నమాట !"

షఫ్కత్ రొమ్ముమీద వేంట్రుకలను వేళ్లతో దువ్వుతూ "వికలాంగిని ఎవరు పెళ్లాడుతారండీ !" అంది ఆయెషా.

"అలా అనకు. అలా అనకు, ఆయెషా !"

"అంత పెద్ద త్యాగం ఎవరు చేయగలరండీ !"

"అవును నిజమే మరి !"

"అందమైన పిల్ల. సంపన్నులైన తల్లిదండ్రుల ముద్దుల కూతురు అంతా బాగానే ఉంది కాని ......"

"నే ననుకుంటాను .... కాని ...."

"మగవాళ్ల హృదయాల్లో దయ ఎక్కడిది ?"

షఫ్కత్ మరోవైపు పొరిలాడు. "అలా అనకు ఆయెషా !" అన్నాడు. ఆయెషా ఇటు పొర్లింది. ఇద్దరు ఎదురు బదురుగా పడుకున్నారు.

"నాకు అంతా తెలుసు. ఆ అమ్మాయిని పెళ్లి చేసుకునే మగవాణ్ణి చూపండి! చూతాం" అంది ఆయెషా.

"అవును, ఎవరు చేసుకుంటారు!"

"పైగా పెద్దది. చిన్నదాని పెళ్లికి ప్రయత్నాలు జరుగుతుంటే తన కెంత బాధ, చెప్పండి !"

"నిజంమాట."

ఆయెషా పెద్దగా నిట్టూర్పు విడిచింది.

"పాపం ఆపిల్ల జీవితాంతం అలా కుమిలిపోవలసిందేనా ?"

"లేదు, లేదు" అంటూ లేచి కూచున్నాడు షఫ్కత్.

"అంటే ?" ప్రశ్నించింది ఆయెషా.

"నీకు ఆ అమ్మాయంటే సానుభూతి ఉందా ?"

"లేకేం ! ఉంది."

"దేవుడిమీద ఒట్టు పెట్టుకొని చెప్పు ?"

"ఇందులో ఒట్టు పెట్టుకోవలసిం దేముంది ? ప్రతి మనిషికీ ఆ పిల్లంటే సానుభూతి ఉంటుంది."

కొన్ని క్షణాలు నిశ్శబ్దం తరువాత—

"అయితే నే నొకటి ఆలోచించాను" అన్నాడు షఫ్కత్.

"ఏమిటది ?" అడిగింది సంతోషంగా ఆయెషా.

"నువ్వు ఉన్నత భావాలు గల దానివనే మాటను రుజువు చేసుకున్నావు ఆయెషా ! నేను .... నేను .... దేవుడు నాకు నా సంకల్పాన్ని నెరవేర్చుకునే శక్తిని ప్రసాదించాలి .... నేను నిగ్హత్‌ను పెళ్లి చేసుకుంటాను. ఆ పుణ్యమంతా నీకే దక్కుతుంది, ఆయెషా !"

ఉలిక్కిపడి లేచి కూచుంది ఆయెషా.

"మీరు దాన్ని పెళ్లి చేసుకుంటే, దాన్ని తుపాకితో కాల్చి చంపేస్తా, తెలిసిందా" అంది ఆయెషా.

తుపాకీగుండు వచ్చి తన గుండెలో బలంగా తగిలినట్లయింది షఫ్కత్‌కు. వచ్చి, తన భార్య ఒడిలో వాలుకుపోయాడు.

# చాళుక్య వంశము: కొన్ని సంశయములు

శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి

బ్రాహ్మి—వేంగి చాళుక్యవంశములో నాకు గోచరించిన కొన్ని సంశయములు సూచించి, తోచిన సవరణలు విన్నవించెదను. అందలి గుణదోషము లను చారిత్రకులు నిర్ణయింప వేడెదను.

బెజవాడ ప్రాంతము ముసినికుండ శాసనములో 'మంగియువరాజ తనయ కుబ్జ విష్ణు వర్ధన' సంబంధము వ్రాయబడియున్నది. దీనిలో "స్వాదిత మార్గశీర్షమాస' కాలము లెక్కప్రకారము వి. శ. 684 తేదికి క్రీ. శ. 627 సమకాలముగుచున్నదని ఆంధ్ర క్రానాలజీ నిశ్చయించుచున్నది. (ఈకాలము ను మొదట తెలిపిన మిత్రులు డాక్టరు శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారికి ధన్యవాదములు). దీనికితోడు విప్పిరాల తెనుగుశాసన విజయరాజ్యసంవత్సరంబుల కాలము కూడ కలదన వీలున్నది.

క్రింది పట్టికలో సామాన్య—విశేషకాలముల వ్యత్యాసము పోల్చి చూపడమైనది.

| | | | |
|---|---|---|---|
| చాళుక్య వల్లభ | | — 6 | 543— 49 |
| పులకేశి | 1 | —30 | 549— 79 |
| కీర్తివర్మ | | —18 | 579— 97 |
| మంగళేశ | | —12 | 597—609 |
| కుబ్జవిష్ణువర్ధన | | —18 | 609— 27 |
| జయసింహ | | 30—33 | 627— 60 |
| ఇంద్రభట్టారక | | —7రో | 660— — |
| విష్ణువర్ధన | 2 | — 9 | 660— 69 |
| మంగియువరాజ | | —25 | 669— 94 |
| జయసింహ | 2 | —13 | 694—707 |
| కొక్కిలి విక్రమ | | —6మా | 707— — |
| విష్ణువర్ధన | 3 | 35—37 | 707—744 |
| విజయాదిత్య | 1 | 18—19 | 744— 63 |
| విష్ణువర్ధన | 4 | 35—36 | 763— 99 |
| విజయాదిత్య | 2 | 40—48 | 799—847 |
| విష్ణువర్ధన | 5 | 1½—1⅔ | 847— 48 |
| విజయాదిత్య | 3 | —44 | 848— 92 |
| చాళుక్య భీమ | 1 | —30 | 892— |

పై పట్టికలో అందరికి అధిక విజయరాజ్యవర్షంబులే లెక్కించబడినవి. తక్కువ కాలము సరిగాలేదు. క్రీ. శ. 543 తేది చాళుక్య వల్లభుని కాలమును విడిచి, క్రీ. శ. 549 మొదటి పులకేశి కాలమునుండి క్రీ. శ. 892 మొదటి చాళుక్య భీముని పట్టాభిషేక కాలము వరకు లెక్కించినచో విప్పిరాల శాసనమందలి 'శ్రీమత్ సకల లోకాశ్రయ జయసింహవల్లభ మహారాజులాకున్ ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరంబుల్ ఎణుంబొది అన్నేణ్ట (629—549 కాలము—80) లెక్కకాలము 627 తేది ముసినికుండ శాసనకాలముతో సమకాలముగుచున్నది.

క్రీ. శ. 543 తేది బాదామికోట శాసనకాలమునుండి క్రీ. శ. 892 తేది నందిసాకశాసనకాలమువరకు తెంపులేని చాళుక్య రాజ్యవర్షంబులు చారిత్రకముగా సరిపడుచున్నవి.

ఈ శాసనకాలము సరియైనదగుట కాక్షేపము లేనిచో, 'మంగి (యువ) రాజతనయ కుబ్జవిష్ణువర్ధనః క్రీ. శ. 600—609 మధ్యకాలము' నాటికే వేంగి రాజ్యారంభము కలదనుటకు వీలున్నది.

మరియు, క్రీ. శ. 627 తేదికి ముందున్న 'మంగి యువరాజ' క్రీ. శ. 669 తేదికి తరువాత ఉన్న 'మంగి యువరాజ' కాబోలనుట కాల దోషము.

మొదటి పులకేశి పుత్రుడు మంగి యువరాజ కాలమును రెండవ విష్ణువర్ధన పుత్రుడు మంగి యువరాజ కాలమును సమకాలములు కానట్లే, తాతల పేర్లుకూడా సరిపోవు.

విష్ణువర్ధన (కీర్తివర్మ) పౌత్రుడు మంగియువరాజ మొదటివాడు కాగా ఇంద్ర భట్టారక పౌత్రుడు మంగి యువరాజ రెండవ వాడగుట కాలక్రమము. ఇందలి 'పౌత్ర' సంబంధమును 'పుత్ర' సంబంధముగా మార్చుట కవకాశము లేదు. పోలికశాసనపట్టికలో పౌత్రసంబంధము తిలకింపుడు.

## ముసినికొండ

విష్ణువర్ధన
|
—
|
పౌత్ర
మంగి యువరాజ
|
తనయ
కుబ్జ విష్ణువర్ధన
(వి. శ.) 684

## కొప్పరము

కీర్తివర్మ
|
—
|
పౌత్ర సత్యాశ్రయ | పృథ్వీయువరాజ
పులకేశి (—) (సత్యాశ్రయ సంతానం) | న్యసుత (—) ప్రతిష్ఠాపిత రాజ్య(o)

## అయిహోలి

—
సత్యాశ్రయ
కీర్తివర్మ | (—)
—
పులకేశి | యువరాజ విష్ణువర్ధన

## నిడుప్రు

కీర్తివర్మ
|
—
|
—
|
నప్త
యుగిన
విష్ణువర్ధన
|
తనయ
జయసింహ

## శాసనవంశక్రమము

కీర్తివర్మ I
|
పులకేశి I
కీర్తివర్మ II | మంగళయువరాజ
పులకేశి II, యువరాజ విష్ణువర్ధన (జయసింహ I ?) | కుబ్జ విష్ణువర్ధన
విక్రమాదిత్య | జయసింహ II

ముషినికుండ శాసనములోను, కొప్పరము శాసనములోను కల- 'పౌత్రో శబ్దము తప్పని అది 'పుత్ర' శబ్దవికారము కాబోలునుట కితరాధారము లేమి కలవో నాకు తెలియదు.

కొప్పరం శాసనమం దస్పష్టముగా పేర్కొన్న 'పృథ్విదు (యు)వరాజాను బిహారం శాసనమందు స్పష్టముగా పేర్కొన్న 'యువరాజ విష్ణువర్ధన' రాజాను భిన్న వ్యక్తులనుటకు పుత్ర-ప్రపౌత్ర సంబంధము తోడుపడుచున్నది. అయి హిహార శాసనములో కీర్తివర్మ (Son) కొడుకు యువరాజవిష్ణువర్ధన- విషమసిద్ధి పేరుండగా, విడువ్రోలు శాసనములో కీర్తివర్మమునిమనుమడు మకర ధ్వజాపరనామ-శ్రీమత్-యుగిన విష్ణువర్ధన పేరు కలదు. ఇందలి 'యుగిన' సంఖ్య 'యుగళ' శబ్ద వికారము కాబోలు. యుగళ (కుబ్జ) విష్ణువర్ధనుడును, యువరాజ విష్ణువర్ధనుడును భిన్న వ్యక్తులగుదురు. కుబ్జ విష్ణువర్ధనుడు ఇమ్మడి విష్ణువర్ధనుడైనట్లే, యువరాజ విష్ణువర్ధనుడు మొదటి విష్ణు వర్ధనుడు కాకపోడు.

ఇతనికి జయసింహుడను మరియొక తమ్ముడు లేడనుట కవకాశమున్నదో లేదో తెలియదు. లేనిచో విషమసిద్ధిని జయసింహుడనుట కవకాశమున్నది.

చీపురుపల్లి శాసనములో పులకేశి కనీయుడు (తమ్ముడు) విషమసిద్ధి పేరు న్నట్లు ఆంధ్ర క్రానాలజీ తెల్పుచున్నది.

తమ పినతండ్రి మంగి యువరాజును (మంగళేశపృథ్వియువరాజును) యుద్ధములో పులకేశియు, తమ్ముడు విషమసిద్ధి యువరాజ విష్ణువర్ధనుడును చంపి, వేంగి రాజ్యమును జయింపనిచో మరలా వేంగి రాజ్యమును మంగి యువ రాజ తనయుడు కుబ్జ విష్ణువర్ధనునకు కారణము లేక యిచ్చినట్లు చెప్పుట సహేతుకముకాదు.

'స్వబాహువా విపక్షమండల(మ్) విర్జిత్య స్వసుతాన్వయే ప్ర(తి) ష్ఠాపిత రాజస్య పృథ్వి దు (యు) వరాజస్ ఆనత్తి........స్వదత్తి రాజ్ఞాప్తి'.

'స్వసుతాన్వ(య)ప్ర (తి) ష్ఠాపితరాజ్య(మ్)' కావింప తలచినతండ్రి(మంగి) పృథ్వి యువరాజును తన యుడు (కుబ్జ) విష్ణు వర్ధనుడు పెద తండ్రి కొడుకు లతో చేరి కుట్రచేసి చంపవలసిన ఆవశ్యకతలేదు. కాబట్టి, కీర్తివర్మ కొడుకు 'విషమసిద్ధి యువరాజ విష్ణువర్ధనుడును, మంగియువరాజతనయుడు మకర ధ్వజ (కుబ్జ) విష్ణు వర్ధనుడును భిన్న వ్యక్తులనుట కవకాశమున్నది. ఈ (యుగిన) యుగళ విష్ణు వర్ధనులను-సమకాలికులను-గుర్తించుటలో పొరపాటు జరిగి నట్లు తోచుచున్నది.

కొప్పరం శాసనదానము'ప్రవర్ధమాన విజయ విజయరాజ్య సంవత్స(రం) ఏక వి (ం)శతి కార్తిక మా(సం) మహా (నవమి) బృహస్పతి వా(ర)ముహూ(ర్తం), కాలము క్రీ. శ. 600 ప్రాంత కాలమై యుండును.

యువరాజ్యకాలము 18 సంవత్సరంబులు, స్వరాజ్య కాలము 3 సంవత్సరంబులు కలిపి మంగి యువరాజ 21 విజయ సంవత్సరంబులు, పరిపాలు చున్నవి. ఇట్లు కానిచో ఏకవింశతి (21) లెక్క కుదరదు. మంగి యువ రాజ 3-విజయ రాజ్య సంవత్సర కాలమునాటి దీ కొప్పరం శాసనమనిపించుచున్నది. అప్పటికేతని యున్న కీర్తివర్మ మరణించి మూడు సంవత్సరములైనది.

ఇందలి 'వల్లభ సమ(స్తా)వప్తి(తి) విధి (వ)త్ సంప్రదత్తస్........ స్వదత్తి-ఆజ్ఞప్తి'-........అను చరిత్ర (మంగి) పృథ్వి (యువరాజ) వల్ల భుని దగునేకాని, పులకేశి పృథ్వివల్లభుని దగుటకు విరోధము కలదు.

క్రీ. శ. 609 లో పినతండ్రి మంగళేశ పృథ్వి వల్లభుని యుద్ధములో చంపిన పిదప పులకేశి రాజై, తన తమ్ముడు విషమసిద్ధి విష్ణు వర్ధనుని యువ రాజ విష్ణు వర్ధను కావించినట్లు కళ్యాణి చాళుక్య వంశ స్థాపన చెప్పుచున్నది.

ఇట్లే క్రీ. శ. 609 లో తన తండ్రిని పెదతండ్రి పుత్రులు చంపిన పిమ్మట మకరధ్వజకుబ్జ (యుగిన-యుగళ) విష్ణు వర్ధను డా కళ్యాణి చాళు క్యులతో యుద్ధము కావించి, సంధిలో వేంగి చాళుక్యవంశ స్థాపన చేసినట్లు తోచు చున్నది.

తన తండ్రి కొప్పరం శాసనములో ఉద్దేశించిన, 'స్వసుతాన్వయ ప్రతి ష్ఠాపిత రాజ్య(మ్)' అను బాదామి చాళుక్య రాజ్యవిభాగ చరిత్ర సమన్వము కుదురు చున్నది.

"In the begining, Kubja Vishnu-Vardhana by the prowess resembling that of Vishnu wrested this earth forcibly from the Durjaya and ruled it for eighteen years."

—(దానార్ణవుని కందాయం శాసనము)

"His (Satyasraya's) younger brother, the renowned lord, named Vishnu Vardhana distroyed the Durjayas and obtained Vengi-Mandala."

—(గుణగ విజయాదిత్యుని కట్లవర్రు శాసనము)

డాక్టరు శ్రీ నేలటూరు వెంకట రమణయ్యగారి వేంగి తూర్పు చాళుక్య రాజుల చరిత్ర (ఆంగ్లము)లో పై శాసన వాక్యము లున్నవి.

"This yield* (*892-274*) A. D. *618* as the date of the establishment of the Eastern Chalukya Power in Vengi" (P. *49*)

ప్రియమిత్రులు శ్రీ నేలటూరు వా రూహించినట్లు, ఇందలి చరిత్ర సమన్వయముగుటలేదు.

విష్ణువర్ధనులు (యుగిన) యుగళ విష్ణువర్ధనులు కాబోలునుట ప్రాచీన శాసన సంశ సమ్మతము.

ఈ విష్ణు వర్ధనుల జంట వేంగి దుర్జయులతో యుద్ధములు చేయుట సంధి తర్వాత చరిత్రగా సమన్వయమగుట కవకాశమున్నదో, లేదో చూడవలసి యున్నది.

క్రీ. శ. 600-609 మధ్య కాలములో కళ్యాణి-వేంగి చాళుక్య వంశముల స్థాపనకుగా యుద్ధములు సాగినట్లు, సంధి కుదిరినట్లు చాళుక్య వంశ చరిత్ర సమన్వయమగునేమో సాధన సంపత్తిగల చారిత్రకులు చర్చించి తీర్మానించుట సంశయ నివారణోపాయము.



# కళావతి

శ్రీ సహదేవ సూర్యప్రకాశరావు

హిమాలయ కేతుఁడాతండు; శ్రీమతి కళావ
తి సతిమూర్తియామె, లేఁదీవపడఁతి
వేదనలవేగు తొలికాన్పువేళ, గలిరు
దారి వాహ్యాళి సేయుచున్నారు వారు.

అభినవామోద జాతిలతాంతపాళి
చాలు చాలుగా విరిసె వసంత వీథి
పరభృతమ్ముల కుహుకుహు స్వరముతోడి
ముద్దురోజాలలోఁ దొలి ప్రొద్దుపొడిచె.

తరుణపత్రాల సందుల నొరిగియొరిగి
విరులకన్నెలు తనకళా గరిమకలర
రచనసేయసాగె విచిత్ర రంగవల్లి
అద్రిసీమల తరుణారుణాంశుమాలి.

* * * *

కాళరాత్రుల కొండకోనలు
గగురు వోవఁగఁ గాల కింకిణి
కాళనాట్యము గరళ గానము
కల ధ్వనించెడినే!

గరళగానము కాళనాట్యము
డమరు ఢక్కా ఘన్నినాదము
వియ్యమందీ విలయమందీ
విరిసి పోయెడినే!

విన్నవారలు కొన్నవారే
కొన్నవారలు విన్నవారే
వన్నెగాంచిన ప్రతిమగాంచీ
కానఁబోవుదురే!

ఇదియె మార్కండేయ లింగం
బిదియె శ్రీ మాహేశ్వరి ప్రభ
యిదియె రాజేశ్వరుని పదము
ముదము గూర్చెడినే!

వారణాశీ వప్రగోపుర
ప్రాకారోచ్చ రమ్యాపాళిక
వన్నెవన్నెలు కన్నుఁగట్టుచు
వలచునే మీకున్.

సందె సొగసుల సవదరించీ
ప్రతిఫలించిన పరమ గంగా
తీర భూములతీరు తీయము
వీక్షించినారటవే

విన్నవారలు కొన్నవారే
కొన్నవారలు విన్నవారే
వన్నెగాంచిన ప్రతిమగాంచి
కానగబోవుదురే!

ఉజ్జ్వలానందోద్యానములు
బిందుమాధవు లీలావనులు
పూయుపూవై పొగుతెత్తై
పొలుపు మీరెడినే!

ఇతడు ఖంప కళాంకభావుడు
ఈతడు ప్రాక్తనరత్నేశ్వరుడు
ఇజ్యాశైలకులేశ్వరుడితడు
వలయునే మీకున్

* * * *

తెనుగురంగోవ జీవులు తీరుతీయ
మొలయ్య వ్రాసిన చిత్రాల లలితకీర్తి
గీతి వర్ణించు కొంచు పొగించుచుండె
బేరసార మానగరి బేహారియొకడు

పాట పదములలో నభివర్ణితమ్ము
కాశికా క్షేత్ర చిత్రాళి కలికిదనము
విని కళావతీసతి ధరావిభునిచూచి
యెఱుకసేసె చిత్రాళి వీక్షించుమనగ
వెలది మదిలోనికోరిక వెదవి విడనో
లేదొ; మరునిమేషాన నాలేఖ్యవరుడు
వచ్చివ్రాలెను రాజదంపతుల యెదుట;
వింతయనురాగ మ్మాప్రియ కాంతమీద
వచ్చి కాశికా చిత్రాళి విచ్చియొక్క-
టొకటి పేరుపేరు వరుస నుజ్జ్వలాంధ్ర
భావనా చిత్రవైదుషీ వైభవమ్ము
వెలువరించె బేహారి వాగ్విభవ మొలయ;

* * * *

చూచితిరా దీని సొబగు; సంధ్యా నటే
శ్వర నగ్న తాండవ సౌష్ఠవమ్ము;
పరికించినారటే; పావనగంగా న
రిత్తటి ప్రత్యూషప్రశస్తి;
తిలకించితిరెమీరు దివ్యవాపీత్రయీ
కలిత వారాణసి కళలరాశి;
వీక్షించినారే విశ్వేశ్వర గోపుర
మంజురేఖా పుంజరంజనమ్ము
కనుల కఱవార మనసారఁగాంచినారె
ఇది మహోమణికర్ణికాపదము! దివ్య
వాహినీ పంచ సంతీర్థపదము లివియె!
"ఇది విధాతృశిరమ్ము వ్రాలిన పదమ్ము"

జ్ఞానవాపిక పుణ్యదీర్ఘిక
జ్ఞానవాపిక కల్పవాటిక
జ్ఞానవాపిక జ్ఞానతీర్థము
జ్ఞానోద మియ్యదియే!

జ్ఞానవాపికపూజ్య సంజ్ఞాంతరమ్ము
వీను విందయ్యెనో లేదొ; కాని రాణి
జవజవాడి పాషాణ పాంచాలి యయ్యె
ఆపునీతాఖ్యలో నే మహస్సుగలదో.

తెలిమొయిలు కౌగిలింతల కలగికలగి
వాలిపోయిన లేనెల బాలవోలె
అకట! పరిచారికా జనాభ్యంతరమున
మూర్ఛమునిగి కళావతి పొలుపుదక్క-
యేమిచేయంగ వలయునో యెఱుకలేక
కువలయాధీశుమది కలగుండు వడియె
యేమిచేయంగవలయునో యెఱుకలేక
వణిజనాథుని మనసు విహ్వలతఁ జెందె

అబ్జపత్రాళి శిశిర హిమాంబుపూర్ణ
కనకపాత్రాళి హిమవాలుకా కరండ
పాళి; చందనగంధాళి; వరుసఁదెచ్చి
చేసె శిశిరోపచారముదాసికాళి

కన్నులరవిచ్చి యలసల్లగదలి హృదయ
దేవుకోసమ్ము దశదిశల్ దివియఁ జూచి
జ్ఞానవాపిక, జ్ఞానోద ఖండమనుచు
తేఱికొను శ్రీమతి కళావతీవధూటి

తేఱికొనిన కాంతను, తఱితిపువోవ
కనులు విస్ఫారితమ్ములుగాఁగఁ జూచి
హృదయ ముద్వేలమై రసోత్సవముగాగ
క్రుంగిపోయిన భూజాని నింగికెగసె

ఇంతికన్నుల సాకూత దృష్టిరేఖ
రాజరాజేశ హృదయసామ్రాజ్యపదవి
వలమి కలగింపువెట్టు; ప్రేయసినిజేరి
నవనవమ్ముగా బతి లాలనమ్ము సేసె

చేసి "ప్రేయసీ! ఇదియేటి చేష్టితమ్ము
కాశికాలేఖ్యపాళిక కలికిదనము;
ప్రతిభ" తిలకించి మెచ్చుకో వలయుగాని
ఇటుల విస్మృతిపాలౌట కేమికతము

జ్ఞానవాసిక జ్ఞానోదఖండమనుచు
బలికినావు ముమ్మాఱుఁ తత్ప్రతిమ విరచ
నాప్రశస్తి మనసునాటినదియొ, కాక
స్మృతికి దట్టెనో పూర్వజీవితపు గాథ?

## 2

"కలఁడొక ధరణీదేవుఁడు కాశికాపు
నీత విశ్వేశ్వరాలయ నికటసీమ;
అతఁడు నిత్యాగ్నిహోత్రి; పుణ్యప్రచారు
డాగమాధ్యాయి, హరిశర్మ నాగ బరగు

నడబెడంగుల నంచల నడబెడంగు
పలుకుదీపుల చిలుకల పలుకుదీపు
మేనిచాయల ముత్యాల మేలిచాయ
దరహసించు సుశీలయాతనికుమారి

వేగుజుక్క వెలికిదోఁప, వేగుబోక
నెచ్చెలులు దానులేచి వినీతమొలయ
పరమపావని గంగాభవాని విమల
సలిలమందు నభ్యంగన స్నానమాడు.

ఆడి, శిరసార్చి, తెలిసరిగంచు చీర
దాల్చి, రత్నాలతాటంక తరళకాంతి
చెక్కుటనటింప, మంజీరశింజమొరయ
నలుపగాఁ బోవు విశ్వేశు చరణసేవ

ఆమెనునువేలికొనలు నాట్యములు సలుప
కలువ, కెందమ్మి, సంపెంగ, కలికిచిలుక,
చిన్నిజాబిల్లిరేక, కాశీపురీశు
దివ్యవీథిక ముగ్గులు దిద్దితీర్చు

పూలజాలుల మాలికల్ పోహళించి
గంధకస్తూరికాగురుకలితధూప
దీపికావాళికల హారతెత్తి; ప్రణవ
భవ్యమంత్రాల సేవించు భవునినతము.

అమెకన్నులలో తరళాబ్జరేఖ
చికిలిబుగ్గల నంజ నజ్జకపుజాఁయ;
చూచి తలయూచి క్రొంగ్రొత్త సొబగుకాంచు
అడుగుచిన్నెల నచ్చింతు రంజలించి

## 3

"అది ప్రశాంతవసంత నిశాంతరమ్మ
పుచ్చ పువ్వుల లేతనవ్వుల పసందు
చిలుకువెన్నెల విరిసి వాసించుచుండె
మల్లియలతోడ; జాజి కుట్మములతోడ
కోటికోటి జాతీసుమ కోరకములు
విరిసిపోయిన వెన్నెల వెలుగులోన
ఇంటి మొగసాల పూఁబొదరింటి నరన
మృదుల శయ్యాసుశీల నిద్రించుచుండె

సరసిలోఁ దెలిగల్వవానసలచాయ
నల్లనిదురవోయెడు రాజహంసివోలె,
స్వచ్ఛ హృదయమ్ము ముఖసీమ ప్రతిఫలింప
మృదుల శయ్య సుశీల నిద్రించుచుండె.

కన్నెపడుచుల స్వప్నలోకమ్ములోన;
భ్రుకుటికుంచించి, ఏ సురలోక లోక
ములకు, ప్రణయరాగము నేకముగ రచించి
కలలదొంతర లెన్నొన్నొ గాంచుచుండె.

అమల చంద్రికాపాండు శయ్యాప్రసుప్త
కోమలామల రాగరేఖా మనోజ్ఞ
మూర్తి నామెను, సూనశరార్తు డగుచు
చూచినాఁడు విద్యాధర ఖేచరుండు.

ఒక్కపరి గాంచినాడో లేదో రవంత
ఎన్ని ప్రేమానుభావము లెగసినవియో,
ఏయలౌకిక సౌందర్యమేచి కొనెనో,
ధారుణీ తలిడిగ్గె విద్యాధరుండు.

చివురు నెత్తమ్మితూడు చందమున దాల్చి
అభ్రవీథికి నెగయురాయంచవోలె
ఆ సుశీల నా విద్యాధరాధినేత
మృదుల హస్తాలదాలిచి మింటికెగసె.

ఎగసి యాకాశమార్గాన నెగసియెగసి
లలిత చంద్రికాస్నపిత మండలము దరిసె,
గుళికమై యదృశ్యమ్ముకా, గోపురాగ్ర
చిత్రరత్న విభ్రాజి కాశీపురమ్ము.

మృదుల హస్తాలలో నిదురించు నాము
ముగ్ధవదన లావణ్యమ్ము; ముకుళితాంబ

కముల చికిలి సోగదనమ్ము; కలయగాంచి
చంద్రుడీసుచే మబ్బుల చాయనొదిగె.
పాలవెన్నెల నుఱుగుల తేలితేలి
చిఱుత మబ్బు తునుకలదొంతరల తరలి,
గాలి తరఁగ పథాల తూగాడియాడి
స్వేచ్ఛ సుఖయింప వ్రాలెను వింధ్యశిఖరి
పాదపాదల వన్నెవన్నెల పొదలుఁబొదల
సితలతాంత శయ్యాంతమ్ము నతివఁజేర్చి
ముగ్ధమాధురీ సౌందర్య ముగ్ధుఁడగుచు
వెలది యరమూతగనుల చుంబింపనుండె.

అంతనొక పిశితాశి దివ్య ప్రసన్న
మృదులమైన యా సౌందర్యమింపునింప
జూచి, కామ తమస్సులఁ జొక్కిచొక్కి
కలికినొక్కట బట్టుకో కడగిమించె.

ఒకడు నక్తంచరుఁడు వేరొకడు దివిజుఁ
డా యిరువు రొక్క మర్త్యలతాంగికొఱకు
కదనమున నేర్చి పేర్చిరి కడిమి మెఱయ
అందమొందైన ప్రాణసుమార్పితంబె.

ఒకరి ముష్టిఘాతముల, వేఱొకరి పాద
తాడనమ్ముల రాయిడిధ్వనుల కులికి
అసదుకొనసిపో లేచి, అదవదపడి
కడల బేడిస చూపుల గాంచెనబల.

ఇది కలయొ నిక్కువమొ వర్ణింపరాక
ఆ చకితవిలోచన యట్టె నిలిచె
వెఱపుతో; నా జగద్వీరు లురలిపడిరి
వికల శీర్షులై నెత్తు రోడికలుగట్ట.

పడిన విద్యాధరేంద్రుడా వనితనరసి
ఏమిరో చెప్పగాఁ బోయి మోమువాల్చె,
"ఇతఁడె కానోపు నన్నీ వనీతలాన
ప్రేమ మైఁ దెచ్చి డించిన వినయమూర్తి.

వనితకోసమ్ము నిందు జీవముల వీడి
నారు నిట్టూర్పు రేకగా వీరు; కోఘోర
భీషణాభీల నీరంధ్ర విపినసీమ
ఇందు హింసారిరంసు లెందేని గలరు.

ఎవడు కరగృహీతము సేయు, నెవడుకనుల
నొత్త నిలువెల్ల పులకించు; నుదయమందు
భావనావాళి; అతడెపో ప్రణయమూర్తి
అతడెపో వడుగడ హైందవాంగనలకు

అనితలచి; తల్లిదండ్రుల నాత్మ నెంచి,
అంబికాపతి హృద్వీధినంజలించి
అమరమూర్తి నాత్మేశుగా మమత నెంచి
అగ్నిరాజించె యతనితో ననుగమించె.

4

ఆమె నేనై జనించితి; నస్మదీయ
హృదయనాథుఁడ విద్యాధరేంద్రమూర్తి;
ఎన్ని జన్మాంతరములైన నెసగకున్న
వారణాశీశు భవ్యసేవాఫలమ్ము.

కాశికాపురీ చిత్రాళి గాంచినంత
స్మృతికి బాఱెను పూర్వజీవితపుగాథ
తరతరమ్ముల రాగబంధమ్ముగాని
ఒక్కనాటి రాగమ్ము గాదోయి నాథ!

